## కవివిచారము.

క. లోకంబునఁ గలవిబుధానీకములో నెవరిఁ బోల నేరుతు నైనన్
నా కిచ్చె [1]నాంధ్రశబ్ద, వ్యాకరణముఁ దెనుఁగుఁ జేయు మని హరి కరుణన్. 88

తే. మహిని వాగనుశాసనమయుఁడొనర్చె, నిమ్మహాగ్రంథ మనునావయొక్క యాంధ్ర
శబ్దజలరాశి తరియించుజనుల కేను, గర్ణధారుఁడ హరియనుగ్రహముదీవి. 89

ఉ. ఎన్నఁగ నన్నయాఖ్యకవి యీకలి కాదిని జెప్ప దాని భీ
మన్న హరించెఁ గ్రమ్మఱ మహాత్ముఁడు రాజనరేంద్రు పట్టి దా
మొన్న నొసంగె విప్రునకు మూల మతం డొనరించెఁ [2]డీక నా
కన్నది మున్ను విన్నదియుఁ గాదు మహాద్భుత మబ్బె నా కిటన్. 90

క. మూలము చెప్పిననన్నయ, భూలోకబ్రహ్మ యతనిబుద్ధి దెలిసి వ్యా
ఖ్యాలక్ష్యంబు లొనర్చిన, బాలసరస్వతులఁ బోలుప్రాజ్ఞులు గలరే. 91

క. ఎక్కడిమతంగపర్వత, మెక్కడికో మెపలి సుకవులీలో లేశే
గ్రక్కున నిది దెనుఁగింపక, దక్కుట నను ధన్యుఁ జేయుతలఁపున నేమో. 92

క. అతికనముఖ్యకవి, వ్రాతముచే నీ తెలుంగువ్యాకరణము ధా
త్రీతలమునఁ గడు నంత్యఖ్యాతం బై తెనుఁగు గాకపోవుట లెల్లన్. 93

వ. మత్పురాతనజననఘనతరతపోవిశేషంబువలనన కదా యని చింతించి నితాంతసంతు
ష్టాంతరంగుండ నై. 94

తే. తనయనుగ్రహమునఁ జెప్పుమనుచు నిన్నఁగలను వచ్చినహరి తానె కలఁడు నాకుఁ
దెలియనిపదంబు లెల్లను దెలుప నింక, శంక సేయంగ వల దని సమ్మతించి. 95

వ. ముందు బృందారకభాష నశేషవిద్యాజలజాసనుం డగుశబ్దానుశాసనుండు సంక్షే
పంబుగాఁ గూర్చిన [3]యాంధ్రవ్యాకరణంబునందలి, సంజ్ఞా, సంధి, తత్సమ, దేశ్య,
క్రియాపరిచ్ఛేదంబు లయిదునుం దెనుఁగుఁబలుకుల నేను విస్తరించి భాషాపరిచ్ఛే
దంబును, వర్ణపరిచ్ఛేదంబును, వళిప్రాసపరిచ్ఛేదంబును, పద్యపరిచ్ఛేదంబును,
సంధిపరిచ్ఛేదంబును, తత్సమపరిచ్ఛేదంబును, దేశ్యపరిచ్ఛేదంబును, క్రియాపరిచ్ఛే
దంబును ననునామంబుల నభిరామంబు లగునాశ్వాసంబు లెనిమిదిగా నెలకూచి
బాలసరస్వతి సకలభాషాకవి'మహోపాధ్యాయ ప్రణీతాంధ్రవ్యాఖ్యానగ్రంథం
బాధారంబుగా రచియింపం బూని. 96

క. దశమీశురగురువాసర, శశితారావజ్రయోగషష్ఠకరణయు
క్తశరాసనలగ్నంబున, శిశిరకరాంశమున మొదలు సేసితిఁ గృతికిన్. 97

1 నంధ్ర. 2 నింకఁ దాఁ గన్నది. 3 యంధ్ర.

వ. ఇట్లు కృతప్రారంభుండ నై మదీయేష్టదేవతం గాంచి నమస్కరించి వినుతించి యత
నిం గుఱించి షష్ఠ్యంతములు విన్నవించెద. 98

## షష్ఠ్యంతములు.

క. సాయపవెంకటపతిభూ, నాయకదత్తాగ్రహారనగరప్రాగ్ది
శాయతదేవాలయమునఁ, బాయక వసియించుగోపభామాపతికిన్. 99

క. శ్రుతశాస్త్రాగమజితగీ, ష్పతి వట్టెము పెద్దనార్యసంపాదితపు
ణ్యాతరాగ్రహారపూర్వ, క్షితిజశమీయామ్యమున వసించినహరికిన్. 100

క. తంగెడసీమను నిర్ఝర, గంగాసమనాగనిమ్నగాపూర్వమునం
బింగళిపురిదక్షిణమున, రంగుగ నెలకొన్నగోపరత్నంబునకున్. 101

క. కేతవరనామపట్టణ, చైతేయాశాసమన్వితనికేతునకున్
వాతాత్మజతార్క్ష్యసమన్వితునకు సమస్తలోకవిఖ్యాతునకున్. 102

క. అలఘుతరశీలునకు మంగళగుణజాలునకు దనుజకాలున కిందో
పలనీలునకును గామే, పలిగోపాలునకు ఘోషపతిబాలునకున్. 108

తే. అంకితము గాఁగ నేఁ జేయునట్టియాంధ్ర, శబ్దచింతామణిగ్రంథసారపాద
పంబునకు నాలవాలంబుపగిది నొప్పు, నట్టిభాషాపరిచ్ఛేద మెట్టి దనిన. 104

# ప్రథమాశ్వాసము.



భోజతనూజాస
త్యాభామాసహిత తార్క్ష్యవాహనుమద్యుత భ
ద్రేభాధిపపోషణ తుల
సీభూషణ కామెపల్లి శ్రీగోపాలా.

క. అవధారు శబ్దశాసను, డవనిం గలియుగమున కొది నారాజమహేం
ద్రవరంబునం జెప్పినయాంధ్రవచోవ్యాకరణసూత్రతతిం దెనుఁగింతుణ్.

క. భాషానిరూపణం బార్యాషట్కమునందుం దొలుత నాంధ్రకవిశిరో
భూషణ మగునన్నయ సవిశేషంబుగం జెప్పె సంకుచితవాక్యములణ్.

## భాషాపరిచ్ఛేదమూలసూత్రంబులు.

### ఆర్యావృత్తశ్లోకంబులు.

విశ్వశ్రేయః కావ్యం తదదోషా పరిష్కృతా చ వాగర్థా
సా వాగ్యా రసవృత్తి స్సాధ్యో హి రసో యథాతథం కవిభి.

స్వస్థానవేషభాషాభిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః
లోకే బహుమన్యన్తే వైకృతకావ్యాని చాన్యదపహాయ.

ఆద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే ఏషా తయో ర్వికృతిః
కేవలతయానుసర్పశ్యతే చ యేయం యథాతథా భాషా

తజ్జా సమా చ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి
ప యజా తజ్జా తుల్యా తు సమా ప్రవాహినీ దేశ్యా

సిద్ధిర్లోకాద్ధృశ్యా లోకా నవ్యాఖ్యాతాశ్చ నిత్యాశ్చ
సంస్కారా ర్లోకనియమా నియమా ద్గ్రామ్యం హి యత్త్వపభ్రంశః

విరళాన్ పేచోషాదికశబ్దాన్ ప్రవ్యాహరంతు శబ్దజ్ఞాః
ఇహ తు ప్రవ్యాహార్యం సజ్జ్యోతితసుప్రసిద్ధమేవ పదమ్.

ఇతి శ్రీసకలభాషావాగనుశాసననన్నయభట్టవిరచితాంధ్రశబ్ద
చిన్తామణౌ భాషాపరిచ్ఛేదః ప్రథమః.

వ. ఈశ్లోకంబు లాఱునుం బండ్రెండు సూత్రంబు లయ్యె నవి యెల్ల నిందు వివరించెద.

## పూర్వగ్రంథనామసంగ్రహము.

తే. సంస్కృతమునకు నాంధ్రభాషకును దొల్లి, లక్షణములు శాకల్యమల్లనసుధీంద్ర
విన్నకోటపెద్దనసుకవిప్రముఖులు, క్షితి నొనర్చిరి లోకోపకృతిగఁ బెక్కు. 4

వ. అవి యెయ్యవి యనినం బ్రతాపరుద్రీయంబును, గువలయానందంబును, చంద్రాలోకంబును, రసమంజరియును, సాహిత్యచంద్రోదయంబును, సాహిత్యరత్నాకరంబును, వృత్తరత్నాకరంబును, జమత్కారచంద్రికయును, షడ్భాషాచంద్రికయును, షడ్భాషావివరణంబును, త్రివిక్రమవృత్తియు, హేమచంద్రఫక్కికయును, గవిభల్లటఫక్కికయును, నధోక్షజఫక్కికయును, శబ్దానుశాసనీయంబును, గవిరాక్షసీయంబును, గవికంఠపాశంబును, గవిమూషికమార్జాలంబును, గవిగజాంకుశంబును, గవిసర్పగారుడంబును, గవిజనాశ్రయంబును, గవిలోకసంజీవనియును, గవికంఠాభరణంబును, గావ్యాలంకారచూడామణియును, గావ్యచింతామణియు, నథర్వణచ్ఛందంబును, గోకర్ణచ్ఛందంబును, శ్రీధరచ్ఛందంబును, ననంతామాత్యచ్ఛందంబును, ఛందోదర్పణంబును, నలంకారసంగ్రహంబును, నలంకారరత్నావళియు, నాంధ్రభాషాభూషణంబును, రేఫఱకారనిర్ణయంబును, లక్షణవిలాసంబును, సులక్షణసారంబును, సర్వలక్షణసారసంగ్రహంబును, లక్షణదీపికయును, శారదాదీపికయును, శారదాముకుటంబును, శారదాతిలకంబును, వాగీంద్రచూడామణియును, నరసభూపాలీయంబును మొదలుగా నీక్షింప లక్షణగ్రంథంబులు లక్ష్యోపలక్షలు గలవందు. 5

క. ఒకదానికంటె మఱి వే, ఱొకటి వి[illegible]బుండుకతమునన్
సకలగ్రంథములును జదువక తెలియునె లక్షణప్రపంచం బెల్లన్. 6

## ప్రబంధమహిమ.

క. ఇది చదివినపిమ్మట మఱి, యెదియేనియుఁ జదువుబుద్ధి యెలా పొడమున్
బడఁపడి గ్రంథము లన్నియు. వెదకి వెదకి సార మెల్ల వివరింపంగన్ 7

తే. పర్వతము లెల్ల నొక్కదర్పణమునందుఁ, జూపఁడు తెలుంగునను గవితోపయోగ
లక్షణములన్నియును సరళంబుగాఁగ, నెఱుఁగఁబడు నిందుఁ దెలియ నూహించి లేని.

తే. సౌరభాషకు శబ్దశాస్త్రంబుపగిది, దెనుఁగు(న)కావశ్యకం బిది దీనిఁ జదివి
చెప్పినప్రబంధము జగత్ప్రసిద్ధి నొందు, నరక రచియించినది యప్రయోజకమగు.

క. రత్నములకు నిల సత్కృతి,రత్నములకు మతి తురంగరత్నములకు స్త్రీ
రత్నములకు లక్షణములె, యత్నంబునఁ జూడవలయు నం(దు) మనీషుల్. 10

క. ఈక్షితిని రాజరాజును, భిక్షునిగాఁ దిట్టఁ గూటిఁ పేదను యక్షా
ధ్యక్షునిగాఁ దీవింపను, లాక్షణికుఁడె యెన్ని భంగుల సమర్థుఁ డగున్. 11

తే. ఉత్తముఁడు లక్ష్యలక్షణవృత్తవేది, పరఁగు మధ్యముఁ డన లక్ష్యపద్యవేది
సారిది నధముఁడు లక్షణశ్లోకవేది, లక్షణజ్ఞుల కివి యు పో లక్షణములు. 12

క. తొలుతను లక్షణసూత్రం,బు లెఱింగి పిఱుంద లక్ష్యములు దెలియంగా
వలయును గావున లక్షణ,ములు లక్ష్యంబులును బాఠముగఁ జేయఁ దగున్. 13

శబ్దానుశాసనమూలసూత్రము:—

విశ్వశ్రేయః కావ్యమ్. 1.

క. ధర్మములలోన నుత్తము, ధర్మము కావ్యము నిజంబు ధర నెవ్వని కా
ధర్మము చేకుఱు నతఁడు సు,ధర్మను వసియించుఁ బెక్కుదైవతయుగముల్. 14

క. తనయుఁడు చెఱువును గావ్యం,బు నిధానము గుడి వనంబు భూదేవస్థా
పనమును ననునిర్యోదును, జను శాస్త్రములందు సప్తసంతతు లనఁగన్. 15

తే. దుష్కృతము లెన్ని చేసినఁ దుదిని సప్త
సంతతులలోన నొక్కటి సలుపునతఁడు
కుతుకమునఁ దననూటొక్కకులము వారి
నరకములఁ బాపి ముక్తికి నడుపు నిజము. 16

క. ఇల సప్తసంతతులలోఁ,పలఁ గావ్యము దక్క ధవళభవనవనాదుల
స్థిరము లగుఁ గొన్నివర్షం,బుల కని చంపువు రచించె భోజుం డెఱుకన్. 17

తే. నిలిపి రెక్కడ నచట నె నిలిచియుండు
నగ్రహారాదిసంతతు లరసి చూడ
నవియుఁ గృతిముఖరచనచే నఖిలదిశల
నెగడుఁ గావునఁ గావ్య మన్నిటికిఁ దొడవు.

క. పురివఱదనీరు గోదావరిఁ గలసిన యోగ్యమైనవడువున గడు దు
శ్చరితుం డైనను గావ్యాం,తరమునఁ జెప్పఁబడి పావనచరిత్రుఁ డగున్. 19

క. క్షితి నెవ్వనినామము సత్కృతి నెన్నిదినంబు లుండు దివి నాపుణ్యా
ప్రతుఁ డంతకాల ముండును, ధృతి నింద్రద్యుమ్ను నునికి దృష్టాంతముగాన్. 20
క. తనకు హితార్థము లెఱిఁగించు నఘంబు లడంచు ధనము శోభనము యశం
బును గూర్చు నఖిలసురలన్, గనఁబడఁ గాఁ జేయు నెపుడుఁ గావ్యము కవికిన్.
తే. మేటిబ్రహ్మర్షి యయ్యె వల్మీకభవుఁడు, గాంచె రవిని మయూరుండు గడియలోన
*హారిణరోగము వాసె శ్రీహర్షణునకుఁ, గావ్యమునఁ జెందరానిసద్గతులు గలవె. 22
చ. అలరఁ బురాణకావ్యముల నార్యులు చెప్పినవారు దక్కఁగాఁ
దెలియఁ జతుర్యుగంబులను దీవుల నేఁడిఁట నెంద ఱందఱో
యిల జననంబు నొంది మని యేఁగిరి పుణ్యచరిత్రు లందులో
పల నిపు డొక్కఁడేనియును బ్రస్తుతి కెక్కఁ డెఱుంగ నెక్కడన్. 23
తే. శ్రీరామకథలోనఁ గపులు వారాశిఁ గట్టి, రనుచు వాల్మీకి చెప్పంగ నఖిలజనులు
సేతు వనుచు నెఱింగిరి చెప్ప కున్న, నదియు నొకసోగ[1]దీవి య టండ్రు గాదె.
క. వివరించె యజుర్వేదము, కవి యగువిప్రుండు శుచి జగంబుల నేత
త్ప్రవిమలకావ్యము మిక్కిలి, పవిత్ర మగుఁ గపిలగోవుపాల తెఱఁగునన్. 25
తే. ఉపమ గలిగిన శయ్యల నొప్పియున్న, నంఘ్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబు గాదు
పాయసం బైన సంస్కారపక్వ మైనఁ, గాకజుష్టంబు హవ్యంబు గానియట్లు. 26

## కావ్యభేదంబులు.

సీ. ఉచ్చారణక్రియ నొప్పారు వర్ణంబు వర్ణసంచయమున వఱలుఁ బదము
పదవితానముచేత భాసిల్లు వాక్యంబు వాక్యభేదమున నివ్వటిలు నర్థ
మర్థవశంబున నమరును భావంబు భావసంగతిఁ గనుపట్టు రసము
రసనుప్రశస్తిచేఁ బొసఁగును బద్యంబు పద్యరాశిని గూర్పఁబడును గావ్య
తే. మట్టికావ్యంబు ద్వివిధ మై యతిశయిల్లుఁ, బరువడిఁ బ్రబంధచాటుప్రబంధము లన
సర్గములసంస్కృతమున నాశ్వాసములను, దెనుఁగునఁ బ్రబంధమనునదితనరుఁ గృష్ణ.
సీ. పురమును బుతుషట్కమును బ్రయాణంబును శైలంబు వేఁటయు సాగరంబు
మహేంద్రపుత్ర్యాశ్రమంబును మంత్రంబు ద్యూతంబు పిదప నద్భుతరణంబు
విజయంబు మద్యపానజవికారంబును వనవిహారంబును వారికేళి
కన్యాంగసౌందర్యకథనంబు హిమకరాభ్యుదయంబు విప్రలంభోదితంబు
తే. పద్మమిత్రోదయంబును బరిణయంబు, సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరువదిరెండు వర్ణనలు గూర్చి, చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనాథా. 28

---

* హారిణ=శ్వేత. హారిణరోగము=శ్వేతరోగము. 1. నెరిగి.

క. కనుఁగొన సంఖ్యాబద్ధంబు నసంఖ్యాకంబు నాఁగ భువి నిరుదెఱఁగై
తనరారుఁ బూర్వకవిమతమున నాచాటుప్రబంధములు జలజాక్షా. 29

తే. నాల్గు దెగలయుదాహరణములును ము క్త, కాదిపంచా*దశమును సంఖ్యాన్వితములు
గద్యరగడద్విపదదండకములు మంజరులును సంఖ్యారహితచాటువులు నృసింహ.

ముక్తకాదిపంచాశ త్తెట్టి దనిన.

సీ. ఒనరు ముక్తక మన నొక్కపద్యము ద్వికం బగు రెండు త్రికము మూఁడైనఁ బంచ
రత్నంబు లైదు వారణమాల యెనిమిది నవరత్నములు పద్యనవక మైన
భాస్కరమాలిక పండ్రెండు శశికళ పదియాఱు నక్షత్రపంక్తి యిరువ
దియు నేడు త్రింశదాహ్వాయము ముప్పది రాగసంఖ్య వెండియు రెండు సాఁగనేని

తే. వరుసఁ బంచా*దశాఖ్య మవ్వల శతకము, నష్టసమధికశతకంబు ననఁగ వెలయు
నేఁబదియు నూఱు నూటిపై నెనిమిదియును, సప్తశతి సప్తశతమైన శార్ఙ్గపాణి. 31

శబ్దానుశాసనమూలసూత్రము.—

త ద్దోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ. 2.

తే. కృతికి [1]నెప్పు శబ్దార్థముల్ రెండు వలయు, నవి యలంకారయుతములు నఖిలదోష
రహితములు నాఁగఁ జూచి కూర్పంగ వలయుఁ, గా మెపలిబాలగోపాల గానలోల.

శబ్దార్థలక్షణాలంకారసీసమాలిక.

సీ. సర్వలక్షణ[2]సారశబ్దార్థయుగళంబు మహితశుద్ధసువర్ణ మణులభంగిఁ
బదపద్యభూషణప్రచయరూపంబులై లలిఁ గావ్యలక్ష్మి నలంకరించు
కారణంబున నలంకారాఖ్యలను జెంది బహుభేదములను జూపట్టుఁ గృతుల;
నఖిలకావ్యములకు నాత్మలు రీతులు ప్రాణముల్ వానికిఁ బ్రాణదశక
మొలి వైదర్భి కౌగాళి కాపాంచాలికాలాటికాఖ్యానకలిత లైన
నాల్గురీతు లెన్నంగ నర్థవ్యక్తి సౌకుమార్యౌజః ప్రసాద[3]కాంతి
† మధురతౌదార్యసమాధిసామ్యశ్లేషములు పదియును బ్రాణములు దలంప
శయ్యాచమత్కారశబ్దస్ఫురణపదావృత్తిరీతి ప్రాణవితతు లెల్ల
శబ్దలక్షణము లై జగతిపైఁ బొగడొందు నుభయవిస్ఫురణంబు నొప్పునట్లు

1 నెందు(వా.పె); మొదల (ప). 2 యుక్తసర్వార్థ (పె). 3 ఫణితి

† ఈశబ్దము కావ్యగుణవాచక మైనయప్పుడు "మాధుర్య" అని యుండ దగు. అట్లున్నచో ఛందోభంగము "ధర్మధర్మిణోరభేదః" అనున్యాయము రస వాచక మైనయప్పుడే చెల్లును. ఇచ్చట చెల్లదు

3

వదలక మును గొన్నవర్ణంబు కృతులను బలుమాఱు నుడివినఁ బ్రాస మయ్యె
నది సుఖకర దుష్కరావసాన ద్వి త్రి చతు రను సంజ్ఞల సప్తవిధము
లయ్యె ననుప్రాస మందులోపల ఛేకవృత్తిలాటము లన ముత్తెఱంగు
లేకార్థశబ్దంబు లేక పద్యంబులోఁ బునరుక్తిదోషంబు పొందకుండ
నుడుగక పేమాఱు [1]నుడువఁగ లాటాఖ్య జను ననుప్రాస మై జరుగుచుండు
లాటంబులో శృంఖలాన్యాయబంధంబు ప్రతిషేధశృంఖలాబంధనంబు
మాలికాదీపసమాఖ్యయు సారంబు నేకావళియు నన నెసఁగు నైదు
పలుమాఱు నొకభంగిపలుకులు వలుకుచో నర్థంబు వే తైన యమక మదియు
నాదిగతంబు మధ్యగతంబు నంతగతాఖ్యంబు నాదిమధ్యమగతంబు
నాద్యంతగతము మధ్యాంతగతంబును జరణత్రయగతంబు సర్వగతము
నుపమానపదగోపనోక్తియు నన నవవిధము లై యమకముల్ విస్తరిల్లు
సరిగమపధను లోష్ఠ్యనిరోష్ఠ్యములు తలకట్లును గుడులు శృంగములు నేక
వర్ణంబులు నభీష్టవచన సంఘట్టనంబులు నాదిగా నిట్లు వొదలు వెల్లఁ
జిత్రకవిత్వప్రసిద్ధనామంబు లై పెం పొంది వీనుల కిం పొనర్చు
సరవి గూఢచతుర్థచరణవర్ణముఁ జతుర్విధకందమును బంచవిధసువృత్త
పద్యంబు సీసరూపద్విపదాఖ్యయుఁ గందగర్భితమణిగణనికరము
మొదలు గా నొకపద్యమునఁ బెక్కుపద్యంబు లిమిడి ఛందోర్థదోషములు లేక
కనుపట్టునవి యెల్ల గర్భకవిత్వవిఖ్యాతిచే శ్రవణసుఖం బొనర్చు
గోమూత్రికాఛత్రగుచ్ఛకుండలినాగకంకణమర్దలఖడ్గచక్ర
పంకజసర్వతోభద్రమాలాక్షురప్రభృతిబంధంబు లేర్పడఁగఁ జెప్పు
వృత్తము ల్బంధకవిత్వవిశ్రుతము లై కవులకుఁ జెవులపండువులు సేయుఁ
బ్రాసాదిగాఁ జెప్పఁ బడిన వన్నియు శబ్దవితతి కలంకారవితతు లయ్యె
ధర నలంకారప్రధానతాసురసప్రధానతావస్తుప్రధానతలును
భాసిల్లు నారభటీసాత్వతీభారతీకైశికీనామధేయవృత్తు
లర్థస్ఫురణసమాఖ్యయు లాంగలీఫలపాకమృద్వీఫలపాకములును
గడు ముఖ్యగౌణలక్ష్యధ్వనివ్యంగ్యముల్ గణుతింప నర్థలక్షణము లయ్యె
జర్చింపఁ గృతులకు జాతిగుణంబులు ద్రవ్యక్రియలు జీవితంబు లగుట
నవి యేతెఱంగున నమరు నట్లన చెప్ప వలయు జాతియు స్వభావంబు ననఁగ
నది మొదల్కొని మూఁడుపదములపై నెనిమిది యొసఁగుతద్భేదంబు తెలుఁగవలయు

1 నుగుఁగఁగ.

జాతియు నుపమయు సద్రూపకంబును భ్రాంతిమంతంబు నపహ్నుతియును
దీపకత్రయము నాక్షేపంబు శ్లిష్టంబు నుత్ప్రేక్షయును దుల్యయోగితయును
వ్యతిరేకమును నుదారతయుఁ బ్రేయస్కంబు నెసఁగ విరోధ మావృత్తివిధము
భావికాఖ్యానంబుఁ బరివృత్తియును సమాహితము నప్రస్తుత స్తుతిపరంబు
వ్యాజస్తుతియును బర్యాయోక్తియును విశేషోక్తి వక్రోక్తి సహోక్తిసంజ్ఞ
లూర్జస్వియును సమాసోక్తి సమాఖ్యయు జగతి విభావనాసంకరములు
రసవంతమును నిదర్శనమును సూక్ష్మంబు లవనామకంబు హేతువుఁ గ్రమంబు
నాశీర్వచనము నర్థాంతరన్యాసంబు నతిశయోక్తియు నుదాత్తాభిధంబు,
నన నొప్పు నిన్నియు నర్థంబులకు నలంకారభేదంబులై కొనఁబడును
దొలుతటిరూపకాదులు తమలోఁ దాము కలసి సంసృష్టిసంకరము లనఁగ
ద్వివిధంబు లగు నందుఁ దిలతండులన్యాయసంసృష్టిఁ గృతులఁ బ్రశస్తమయ్యె
సంకరంబులు రెండు జరగు దుగ్ధోదకన్యాయ నృకేసరిన్యాయములను

తే. క్షితిని శబ్దార్థసంసృష్టిఁ జెందునట్టి, సంకరంబులు మఱియును జాలఁ గలవు
వరుస నవి యెల్లఁ దెలియంగ వలయుఁ బూర్వ, శాస్త్రలక్షణలక్ష్యోక్తసరణివలన.

## శబ్దార్థదోషసీసమాలిక.

సీ. కనుఁగొన దుష్ప్రయోగము వైరివర్గంబు ధరఁ దత్సమాసశబ్దక్రమంబు
నపసంస్కృతాఖ్యంబు నప్రయుక్తంబు విసంధి దుస్సంధి కుసంధిపదము
లవల నకారశూన్యంబు హీనోక్తియుఁ గొఱలుదీర్ఘపుకాకుఁ గుఱుచకాకు
సమసనభంగంబు ఛందోయతిప్రాసభంగంబులు ననంగఁ బదియు నాఱు
శబ్దగతప్రదోషంబులై యొప్పారుఁ గృతులు సాగవు వీని నెఱుఁగకున్న
న్యూనపదోపమయును నధికపదోపమయు నప్రసిద్ధోపమావిధంబు
నసదృశోపమయు మహాధికోపమయును నీచోపమయు వ్యర్థవాచకంబు
దేశసమయలోక దిక్కాలమైత్రీవిరోధాగమకళావిరోధములును
వ్యాకీర్ణకము నసమర్థ మపార్థంబు విరసంబు నతిమాత్రవిశ్రుతంబు
నశుభలజ్జాజుగుప్సాశ్లీలములు సంశయంబు సందిగ్ధనేయార్థములును
బ్రక్రమభంగం బపక్రమంబును గ్రమభంగంబు శ్రుతికటుపరుషములును
క్లిష్టగూఢార్థం బపుష్టార్థకము నసంగతదోషము పదప్రకర్షణంబు
నధికపదంబు సమాప్తపు*నరాత్తంబు హీనపదంబు నిర్హేతుకంబు
నవిమృష్టకవిధేయకాంశ మ్మన్యార్థంబు నప్రతీతికము ననర్థకంబు
భిన్నసంబంధంబు భిన్నలింగము భిన్నవచన మలంకారవర్జితంబు

క్షితి నప్రయోజకక్లిష్టంబు నేకార్థకంబును బునరుక్తకంబు ననఁగఁ
దొడరు నేఁబడి యపార్థదోషంబు లివి ముందు దెలియక కృతి [1]సేయ నలవి గాదు
పదపడి మును బల్కు ప్రాసాదులను గూర్చి చెవులకు [2]నింపుగాఁ జెప్పి రేని
ధీరులు సద్గుణాధికతచే నవియ చేపట్టుదు రొక్కొక్కపట్టునందు
శ్రుతిసంస్కృతియు మధురతయు నస్పష్టార్థమునకు నర్థవ్యక్తియును బదప్ర
కర్షంబునకు ధాత్రి హర్షవాక్యము సూక్తితంత్ర మశ్లిష్టాభిధానమునకు
గ్రామ్యంబునకు నెల్లఁ గాంతియు ననుచితార్థంబుల కెల్ల నుదాత్తతయును
సంధిదోషముల కూర్జస్వియు శ్రుతిపరుషంబుల కెల్లను సౌకుమార్య
మప్రతీతికమున కాప్రసాదంబుఁ బ్రేయస్కంబు బరుష సమాఖ్యమునకుఁ
గ్రమభంగమునకు సంక్రమతయు న్యూనాధికపదంబులకు సామ్యకల్పనంబు
వెండియు నిబ్బంగి వెదకి గుణాధిక్యమును గూర్చి దోషముల్ దొలఁగఁ జేసి
తే. రచన గావించుకృతి బుధరచనలందుఁ, దనరు నాచంద్రభాస్కరతార మగుచుఁ
గావున నలంక్రియాశాస్త్రకథితఫణితి, నరయఁ దగు వీని నెల్ల భూసురపురీశ. 34

## వాక్యలక్షణము.

### మూ. సూ:—సా వాగ్యారసవృత్తిః. 3.

క. రసమునకు [3]నాశ్రయం బై, యసదృశ మగు నెద్ది యది గదా శబ్దము రా
జసదనమున రసికు లనఁగా, వసుమతిఁ దద్విధ మెఱుంగువారలు సుమ్మీ. 35

## రసవివేకము.

### మూ. సూ:—సాధ్యో హి రసో యథాతథం కవిభిః. 4.

తే. తగ రసాశ్రయవాక్యసంతతులు గూర్చి, కావ్యము లొనర్చువార లా కవు లనంగ
నట్లు గావున నేభాష నైనఁ గవిత, పలుకువారికి సాధింపవలయు రసము. 36

## పంచవిధభావసీసమాలిక.

సీ. రమణ మనోవికారము బహిర్వ్యాప్త మై భాసిల్లు నది సుమీ భావ మనఁగ;
నది య విజ్ఞానసమాఖ్యచేఁ జె న్నొందు, నాత్మకు మనసుచే నబ్బుచుండు;
నామనంబున కింద్రియములచే నగు వాని కై దింటికిని విషయములవలనఁ
గలుగు నావిజ్ఞానకలిత మా భావంబు తరుణులయందును బురుషులందు
నాత్మసముద్భూత మై నవరసముల [4]నమరఁ జేయుచు, విభావానుభావ
సాత్త్వికవ్యభిచారిసంజ్ఞలచే నాల్గుచందంబు లగు నందుఁ జను విభావ

1 చెప్ప (పె). 2 విందు (పె). 3 నాస్పదంబై (పె). 4 నదర (శా.పె).

మాలంబనోద్దీపనాహ్వయంబులు రెండు తెఱఁగుల ధాత్రి నుద్దీపనాఖ్య
మాలంబనోక్తగుణాలంబనవిచేష్టితాలంక్రియాత్మ విహారలీల
లనఁ జతుర్విధములఁ దనరారు ననుభావ సంగచేష్టోద్భూత మగుచు వెలయు
ధర మనోవృత్తి సత్త్వం బనఁబడు నందు సంభవించినయది సాత్త్వికంబు
గణుతింప నా సాత్త్వికము కంపఘర్మసంస్తంభ వైవర్ణ్యవైస్వర్యబాష్ప
విలయరోమాంచసంజ్ఞల నష్టవిధముల జరుగు నవ్వాల వ్యభిచారికంబు
స్థాయిభావమున నిత్యత్వంబు నొందక వ్యభిచరించుచు సాగరాంతరమునఁ
బొదలుభంగము భంగిఁ బొడముచు నడఁగుచు సంచారిభావసంజ్ఞయును దాల్చి
వ్యాధ్యసూయావేగహర్షలజ్జామర్షదైన్యావహిత్థనిద్రావిషాద
శంకామదగ్లానిచపలతాపస్మారసుప్తిచింతాశ్రమౌత్సుక్యమరణ
గర్వమోహాలస్యనిర్వేదసంత్రాసధృతిజడతోగ్రతాస్మృతివితర్క
మతిసుసంబోధనోన్మాదనామంబులఁ బేర్చు ముప్పదిమూఁడుభేదములను.
ప్రకటంబులై స్థాయిభావంబు లన రోషశమజుగుప్సాభయోత్సాహశోక
హాసవిస్మయరతు లనఁగ దొమ్మిది యొప్పు నవరసోదయకారణంబు లగుచుఁ
బంచవిధంబులై పరఁగు భావంబులు స్థాయిభావసమన్వితమ్ము లగుచు
తే. వీని నన్నింటి నెఱిఁగిన[1] వెనుకఁ గాని, నవరసంబులు పుట్టుచందములు వాని
భేదములు లక్షణంబులు నాదిగాఁగఁ, దెలియఁ బోలదు తంగెడదేశవాస. 37

## శృంగారరససీసమాలిక.

సీ. వెన్నముద్దకుఁ బాకవిధిచే ఘృతత్వంబు దనరుభంగిని నవస్థాయిభావ
ములకు విభావప్రముఖ్యభావంబులవలన రసత్వంబు గలుగుచుండుఁ
దద్రసం బంతయుఁ దనరుఁ గావ్యములందు నాట్యంబులందు ననారతంబు
వినుతార్యులకుఁ గావ్యవృత్తంబులును గనుఁగొనురసజ్ఞులకు నర్తనములందుఁ
గలుగుఁ గాని రసంబు గలుగ దారోప్యంబు గావున నటియించుకాంతలందు
గరిమ నారసము శృంగారంబు హాస్యంబు రౌద్రంబు కరుణ వీరంబు నద్భు
తంబు భీభత్సంబు భారుణంబును శాంతమును నాఁగ నవవిధంబుల వెలుఁగు
వరనవస్థాయిభావములలోఁ జెప్పినరతియె విభావాదిరంజనముల
నయ్యెను శృంగార మది నీలవర్ణంబు వెన్నుని మొదవ సామవేదవ
పర్యంబు గడు సౌకుమార్యంబు కైశికీవృత్తిని మధురతావిధమునందు
సుప్రసాదాభిధానప్రాణఫణితిని[2] విలసిల్ల నొప్పు కవిత్వమునను

1 వెనక (ప. వా. పె). ఇట్లే ఈమాట వ్రాఁతపుస్తకములలో నున్నది. 2 భణితి.

బెనుదాయ భీభత్సమున కది సంభోగభవమును విప్రలంభజము ననఁగ
ద్వివిధ మయ్యెను బంచవిధభావకథితప్రపంచకపోష్య మై పరఁగునట్టి
సందర్శనాలాపసంస్పర్శనాశ్లేషనఖరదక్షతచుంబనక్రియాద్య
మవనిపై సంభోగభవము తద్విప్రలంభజ మనునది మూఁడుభంగు లయ్యె
నంగప్రభూతం బయత్నసంభవమును నైసర్గికంబు ననంగ నందు
[1]వింశతింగితములై వెలఁదుల కొప్పారు యౌవనగుణచేష్ట లందులోన
దనరారు నంగజాతము మూఁడుభేదంబు లై హావభావహేలాహ్వయములు
నప్రయత్నజ మనునది సుశోభాకాంతిదీప్తిప్రగల్భతాధీరతలును
మధురతోదారతాభిధములు నన నేడుచందంబు లయ్యె నైసర్గికమ్ము
కిలికించితవిలాసలలితలీలాఖ్యలు విచ్ఛిత్తిబిబ్బోకవిభ్రమములు
కుట్టమితంబును మోట్టాయితంబును విహృతంబు నన దశవిధము లయ్యె
భావంబు మొదలుగా భావోదయక్రియావింశతి యన నవి వినుతి కెక్క-
కుంభినిపై విప్రలంభశృంగారోపకరణంబు లై రసాకరము లగుచు
శ్రవణసందర్శనప్రణయవిరోధప్రవాసాదికలనలవలనఁ బొడమి
వెలఁదులకును బురుషులకును వరుసతో నొదవునవస్థలు పదియు రెండు
నయనసంప్రీతిమనస్సంగసతతసంకల్పప్రతాపజాగరకృశత్వ
విషయానుభవపరిద్వేషలజ్జాత్యాగసంజ్వరోన్మాదమూర్ఛామృతాహ్వ
యంబుల రతిరహస్యకళాప్రవీణులు జగతిఁ బ్రతాపంబు సంజ్వరంబు
నను రెండుదశలును గొనక యవస్థలు పది యకా నెంతు రేపట్టునందుఁ
బ్రకృతికథాసమాప్తికరంబు నహితంబు నశుభప్రసంగంబు నగుటఁజేసి
ద్వాదశదశ పురాతనకథాక్రమమునఁ గాని వర్ణింపరు కావ్యములను

తే. గవులు దీని నెఱింగి శృంగారరసము, గులుకునట్లుగఁ గావ్యముల్ గూర్చుచున్న
ఖ్యాతి కెక్కెనె రసికసభాంతరముల, సర్వతటినీపురందరరాజానివేశ. 38

## అష్టరససీసమాలిక.

సీ. రసపోషణము లన నెసఁగువిభావముఖ్యంబులవలన సువ్యక్తభంగిఁ
బడయు నవస్థాయిభావముల్ నిజగుణాసత్త్వంబు లగుచు రసత్వ మొందు
నందు శృంగారరసాంతరభేదసంతతు లెల్ల మున్ను భాషితము లయ్యె
నింక హాస్యాదుల నెనిమిదింటను గల్గుభేదముల్ చెప్పెద వేఱువేఱఁ
బూర్వోక్తహాసంబు భువిని హాస్యం బయ్యె నది యల్పమృదువు సామాన్యవాయ

1 వింశతిగీతముల్ (అచ్చుప్రతి).

మర్జనచ్ఛవి కుంజరాననుచేరువఁ గరుణాభియాతి శృంగారభవము
సొం పొందు మధురతాసుప్రసాదములను భారతీవృత్తిని బద్యములను
మూఁడుభేదంబులు మొలచె నుత్తమమధ్యమాధమంబు లనంగ నందులోన
హసితస్మితము లుత్తమాఖ్యలు విహసితప్రహసితంబులు మధ్యభావితములు
క్షితి నపహసితంబు నతిహసితంబును జనుఁ గావ్యములఁ గనినను బ్రశస్తిఁ
బంచమభావసంభవమహాక్రోధంబు రౌద్రరూపము దాల్చె రక్తనిభము
హరుని[1]యూడిగ మధర్వాన్వయప్రభవంబు భ్రుకుటిప్రయుక్త మద్భుతవిపంథి
యుద్ధృతార్థము ప్రసాదౌజంబులను గూర్చి యారభటీవృత్తి నమరఁ జెప్పి
[2]వెనుకఁ జెప్పినశోకమున కయ్యెఁ గరుణ దా మహి నధర్వామ్నాయవిహితకులజ
సమవర్తిదాసి కౌషాయసన్నిభకాంతి హాస్యాదికార్ద్రిరసాత్మజాత
సౌకుమార్యమునఁ బ్రసాదమాధుర్యంబులను గైశికీవృత్తిఁ జను రచింప
స్థాయిభావోదితోత్సాహంబు దా వీరరస మయ్యె నెఱుపు సాధ్వసవిరోధి
కించిత్ప్రగల్భితోదంచిత మోజఃప్రసాదసాత్వతులను జరుగుఁ గవిత
ప్రథమవేది సుపర్వభర్తృరాణువ మూఁడువిధము లై యది ధాత్రి వెలయు సమర
వీరంబు వితరణవీరంబు గారుణ్యవీరంబు నన భావవేద్య మగుచు
విస్మయాహ్వయమున వెలయుభావము విభావాదులచే నద్భుతాభిధాన
మున నొప్పు నాశ్వలాయనసూత్రజము కమలాసను[3]దళవాయి యరుణకాంతి
రౌద్రరసాదివీరరసప్రసూతంబు స్వల్పమృదుత్వ మోజఃప్రసాద
విధముల భారతీవృత్తిఁ గావ్యంబులయందుఁ జెప్పఁగ నొప్పుఁ బొందుగాను
నవభావభేదమధ్యవిభాషితజుగుప్సభీభత్స మనఁగ నొప్పిదముఁ గాంచు
నారభటీప్రసాదౌజసవిధముల నొప్పుపద్యముల నత్యుద్ధృతంబు
సన్నుతాపస్తంభసంతతి శృంగారశత్రువు నందికేశ్వరునిబంటు
కాలవర్ణము ద్విప్రకార మై యది చెప్పఁబడు జుగుప్సాఖ్యభీభత్సరసము
పెను పొంద వైరాగ్యభీభత్సరసమును ననఁగ నీభేదంబు లరయవలయు
మునుపు తొమ్మిదిభేదములలోన నెన్నినభయము భయానకాహ్వయముచేతఁ
బరఁగు యాజుషము బీభత్సంబుపట్టి ధూమ్రాభంబు వీరరసాహితంబు
ధర మహాకాలునిదళవాయి సాత్వతి నోజఃప్రసాదసంయుక్తి నమరుఁ
గవితల నీషత్ప్రగల్భంబు సర్వాంగకంపనవైస్వర్యకారణంబు
శమము శాంతం బయ్యెఁ జంద్రసన్నిభము నిర్వైర మొందును బరబ్రహ్మలెంక

1 యూడిగె (వా. పె). 2 వెనక (ప. వా. పె). 3 బడవాలు (పె); పడివారి వా); దళవాయి, (ప); బడివారి, (అచ్చు).

క్రమమున ధర్మార్థకామమోక్షము లనుపూరుషార్థములను బొందఁ జేయు
నల్పమార్దవము కావ్యములఁ బ్రసాదమాధుర్యభాషాఖ్యవృత్తులఁ బొసంగు
తే. నీరసాంతరభేదంబు లెల్ల వరుస, నెఱిఁగి సమయోచితములుగా హృదయములకు
నింపు పుట్టంగఁ గృతుల వర్ణింపవలయు, శ్రీగిరీశాన్యభాగధాత్రీనివేశ. 39

## నాయకనిర్ణయసీసమాలిక.

సీ. నవరసంబులకు జన్మస్థానములు నలుగురు ముఖ్యు లగునాయకులు దనర్తు
రొగిఁ ధీరలలితధీరోద్ధతధీరప్రశాంతధీరోదాత్తసంజ్ఞకు లనఁ
గలరు వెండియు నొకనలుగురు శృంగారరససంభవాస్పదప్రథితగుణులు
ధారుణి ననుకూలదక్షిణశఠధృష్టు లనఁగ వీరలకు సహాయపరులు
మహిఁ(ని) నలువురు పీఠమర్దవిదూషకవిటచేటకు లనంగ వెలయువారు
మదనకళాశాస్త్రవిమలచేఁ బూరుషజాతులు నాలు గెంచంగఁ బడియెఁ
బాంచాలదత్తకభద్రకకూచిమారాభిధానంబుల నవియుఁ గాక
నుపజాతు లన వెండియును మూఁడు శశవృషహయనామకములఁ జెన్నారుచుండు
వసుధ నాయకుఁ డెంత రసికుఁ డైనను గాంత వెలి గాఁగ రసము సంధిలదు గాన
నాయికాభేద మంతయు విస్తరంబుగాఁ దెలిపెద నవరసాధీన లైన
యంగనలకు స్వకీయయుఁ బరకీయయు సాధారణియు ననఁ జనుఁ ద్రివిధము
లందులోన స్వకీయ యనుభామినికి గుణభేదములను మూఁడు భేదము లగు
నుర్వి ముగ్ధయు మధ్యయును బ్రగల్భయు నన నొక్కచందంబున నుండు ముగ్ధ
మధ్యాఖ్యఁ జనుతనుమధ్య ధీరయును ధీరాధీరయును నధీరాభిధయును
ననుమూఁడుదెఱఁగుల వినుతి గాంచుఁ బ్రగల్భ యనునదియును నట్ల నతిశయిల్లు
ధృతివిశేషములచే ధీరాదికామినీమణులు జ్యేష్ఠామధ్యమాకనిష్ఠ
లగుదురు వరుసతో నవని సాపరకీయ ద్విప్రకారంబులై తేజరిల్లుఁ
గరపరిణీతయుఁ గన్యకయును ననఁ బరిణీత వర్ణింపఁబడదు కృతులఁ
గన్యక పురుషాభికాంక్షిత గాన నంగరసంబులను బరికల్పిత యగు
శృంగారరసనిధానాంగన లెనమండ్రు చర్చింప వాసకసజ్జికయును
నభిసారికయు ఖండితాఖ్యయు స్వాధీనపతికయుఁ బ్రోషితభర్తృకయును
విగ్రహాంతరితయు విగ్రహోత్కలితయు విప్రలబ్ధయు నన వీరలకును
దూతిక లాగ్గురు ప్రాతివేశినియు శిల్పినియుఁ గారువును లింగినియు సఖియు
ధాత్రితనుప్రజాతయు వీరు లేవన్నఁ నేర్పు మైఁ బ్రియతంత్రములకుఁ
దమకుఁ దా మైనను దగ దూతిభావంబు గైకొని నడపుట కార్యసరణి

గామశాస్త్రమునందుఁ గామినీమణులకు వెలయు జాతులు నాల్గువిధము లగుచుఁ
జింతింపఁ బద్మినీ చిత్తిని శంఖినీ హస్తిని యన వీరి కందఱకును
నలు వొందఁ ముత్తెఱంగుల నుపజాతులు హరిణియుఁ బడబయుఁ గరిణియు నన
లలి భావరసనాయకులయందుఁ గలిగినభేదంబు లెల్లఁ దెల్పితి పరుసను
గ్రంథవిస్తారశంకను వానిలక్షణంబులు లక్ష్యములు నిందుఁ బలుకనైతి

తే. నట్లగుట భావరసనాయకాదిభేద, సంచయమున కలంకారశాస్త్రవితతి
వలన లక్షణలక్ష్యముల్ దెలిసి పిదప, రసము వర్ణింపఁ దగుఁ గవిరాజులకును. 40

## సుకవిమాహాత్మ్యము.

తే. మణివలనఁ గంకణమును గంకణమువలన
మణియును బ్రకాశ మగునట్లు మదిఁ దలంప
సుకవివలన నాయకుఁడు నాయకునివలన
సుకవియుఁ బ్రసిద్ధిఁ గాంతురు సకలదిశల. 41

తే. నాకుజాతునిచే రఘునాయకుండు, వ్యాసుచేఁ బాండవులు కాళిదాసుచేత
భోజుఁడు ప్రసిద్ధినొందిరి భువిని దమము, నడక లెల్లను గథలుగా నుడువుకతన. 42

క. ఇమ్మహిని మునులచే వెలసె మ్మను గావ్యములు "నానృషిః కురుతే కా
వ్య" మ్మనువచనార్థం బే, సమ్మతి గలిగెఁ సుకవిజనులే మానుల్. 43

## సత్కవిలక్షణము.

క. ధరణీసురుఁడు ప్రశాంతుఁడు, గురుభక్తుఁడు శుచియుఁ గల్పకుఁడు పూర్వకవీ
శ్వరవాక్ప్రయోగదక్షుఁడు, గరుణామతి యెవ్వఁ డతఁడు కవియనఁ బరఁగున్. 44

క. శ్రుతిశాస్త్రాంగపురాణ, ప్రతతియు నితిహాసకావ్యభరతాగమముల్
స్మృతిసంగీతరతికళా, గతుల నలంకృతుల నెఱుఁగఁగాఁ దగుఁ గవికిన్. 45

## సప్తవిధకవులు.

ఆ. వినుతిఁ గాంతు రిల వివేకివాచకరాచి, కార్థశిల్పభూషణార్థు లనఁగ
మార్దవానుగతసమాహ్వయుఁడు ననంగఁ, గవులు సప్తనామకములతోడ. 46

సీ. గణవర్ణశబ్దార్థగుణదోషనికరంబుఁ బరికించి కూర్చుఁ గబ్బము వివేకి
బహుతరానుప్రాసపదబంధనియమంబు వదలక కృతిసేయు వాచకుండు
మృదుమధురోక్తులు వెదకి కావ్యం బెల్ల రచియించుఁ బదపడి రాచికుండు
మితశబ్దములలోన నతివిపులార్థంబు నిమిడించు నర్థాఖ్య నెసఁగునతఁడు

తే. చెప్ప యమకంబు లెప్పట్ల శిల్పకుండు, పొందుపఱుచు నలంకృతుల్ భూపణార్థి
సరళపదవిరళార్థవిస్ఫురణముగను, జూపు రస మెంగు మార్దవస్ఫుటకరుండు. 47

## కుకవినిరసనము.

తే. జల్లిపదములు నాలుగు సంతరించి, గురువు లిడుచోట లఘువులు గొన్ని గూర్చి
విరతి గూడక మీఁదులు వెతకికొనుచు, నచ్చు పొల్లులపై నుంచునతఁడు కవియె. 48

తే. వ్రణము గని నిర్మలాంగంబు వదలునీఁగ
యనఁ గుకవి తప్పఁ గని యొప్ప నడఁచిపుచ్చు
జల ముడిగి పాలు ద్రావుహంసంబుకరణిఁ
దప్ప విడనాడి యొప్ప సత్కవి గ్రహించు. 49

తే. తనకుఁ దెలియని పన్నియుఁ దప్ప లనుచుఁ
గుకవి హాస్యంబు గావించు సుకవివరుఁడు
దడవు యోజించి తెలియు నంతటను దెలియ
కున్నఁ దద్దయుఁ బెద్దలయొద్దఁ దెలియు. 50

క. ధరఁ దమరు సత్కవుల మని, పరులు కుకవు లనుచుఁ గృతులఁ బరిహాస మొన
ర్తురు గర్వమతు "లయోగ్యః, పురుషో నాస్తి" యనుమాట బుద్ధిఁ దెలిసియుఁ జా.

క. భ్రష్టులు తామే సర్వో, త్కృష్టకవుల మనుచు సభఁ జరింతురు "బాణో
చ్ఛిష్టం జగత్త్రయ" మ్మను, నష్టాక్షరమునను గాదె యడఁకువ మదికిన్. 52

## కవితాప్రశంస.

తే. విబుధలోకంబు"కవితైవవిద్య"యనుచుఁ,జదువువచనార్థమునను సంశయముగల దె
విద్యలకు నెల్ల నుత్తమవిద్య కవిత, దానిఁ దెలియుట విశ్వ మంతయును గనుట.

క. ధారుణి నాకుజమారుతి, పారాశర్యులు చరించుభావుకశిష్టా
చార మవశ్యక మని కవి, తారతమతు లైరి కాళిదాసప్రముఖుల్. 54

మ. జననాథాగ్రణి యాత్మరాజ్యమున నిచ్చల్ పూజ్యుఁ డానీమఁ బా
సినఁ దా గవ్వయుఁ జేయఁ డన్నికడలన్ శ్రేష్ఠుండు విద్వాంసుఁ డా
యనేకన్నుం గవి మేటి యౌ "సుకవితా య ద్యస్తి రాజ్యేన కిం"
మ్మనువాక్యంబు నిజంబు దీనిఁ గని కావ్యంబుల్ రచింపం దగున్ 55

క. వనితయుఁ గవితయుఁ దా నై, చను దెంచుట గలుగు నేని సరసం బగు ధా
త్రిని బల్మికోలు గావించిన విరసం బగు నటంచుఁ జెప్పిరి విబుధుల్. 56

క. ఛందోలంకారాదుల, యందలిపాటింపఁ దుదిని వ్యర్థము గావే
సుందర మగువాక్యంబుల, పొం దెఱిఁగి రచించుబుద్ధి పుట్టక యున్నన్. 57

క. విరచించుశక్తి పుట్టని, పురుషునిచదువులు ప్రకాశములు గావు వసుం
ధరదీపరహితసదనాం,తరమున రేయిఁ బడియున్నద్రవ్యముల క్రియన్. 58

తే. అసుధారాకవిత్వంబులందు శయ్య, లుపమ లుత్ప్రేక్షలును లేక యుండుఁ గాన
నెంత యోజించినను బద్య మంత సార,నంత మగుఁ గాన నిలుకడ వలయుఁ గృతికి.

## దేశభాషావిశేషంబులు.

మూ. సూ.—స్వస్థానవేషభాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధధియః,
లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చాన్య దపహాయ. 5

మ. నిజదేశంబులవేషభాషలపయి న్నిత్యాభిమానస్థులై
ప్రజ మెచ్చు న్రసలుబ్ధబుద్ధు లగుచుం బ్రాజ్ఞుల్ స్వదేశ్యంబులే
నిజ మంచుం గొని యన్యదేశములవాని న్మెచ్చ రేపట్టునన్
గజరాజావన ప్రస్ఫుటార్థరసముల్ గా వంచు నెల్లప్పుడున్. 60

క. తమతమబాసలకవితలు, దమతమదేశముల కొప్పిదము లగుఁ బరదే
శములకుఁ గూడ వాకింతయు, నమరోక్తులు సకలభూములందును వెలయున్. 61

క. తలఁపఁగ సంస్కృతకావ్యం,బులు దమయర్థములు సకలభూజనములకున్
దెలిసినను దెలియకున్నను, బొలు పొందఁగ నిచ్చు నాల్గుపురుషార్థంబుల్. 62

క. హరికథ యైనను దమక,ర్థరసానుభవంబు లేనిరసవద్దేశాం
తరభాషాకావ్యంబులు, దొరకొని పఠియింప ముక్తి దొరకునె దానన్. 63

క. ఆయాదేశమువారికి, నాయాదేశంబుభాష నమరినకావ్యం
బాయతపురుషార్థంబులఁ, బాయక సమకూర్చు దేవభాషయ పోలెన్. 64

క. సురభాషార్థము దెలియని, తరుణులకును శూద్రులకును దమతమసీమం
బరఁగినమాటలఁ జెప్పిన, వరకావ్యము పఠనమున కవశ్యక మయ్యెన్. 65

క. క్షితి మ్లేచ్ఛభాష శ్రుతిగ,ర్హిత మగు నట్లైన నాధరిత్రిని దానిన్
మతి గోసి విడువఁ గూడదు, సతతము వ్యవహారహాని సంధిలుకతనన్ 66

క. హితం బని దేశీయము, జాతియంబును వచించుసమయమున నిజ
త్వాతలభాషాకృతులను, ఖ్యాతిగ మ్లేచ్ఛోక్తు లాదిగాఁ గూర్తు రజా. 67

ఆంధ్రకవితాపితామహునిచాటుధార:—

మ. సమరక్షోణిని గృష్ణరాయలభుజాశాతాసిచేఁ బడ్డదు
ర్దమదోర్దండబెడందకోట యవనవ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునం గాంచి "శబా సహో హరిహరంగా [1]ఖూబు ఖోడాకితే
తుముకీభాయిలభాయిదేములికి" యందు ర్మింటికిం బోవుచున్. 68

నందితిమ్మనచాటుధార:—

శా. రాయగ్రామణి కృష్ణరాయ భవదుగ్రక్రూరఖడ్గాహిచేఁ
గాయంబు బూడ్చి కళింగదేశనృపతుల్ [2]"కానిర్ఝురీఘోషణీ
మాయాభీకముటూకులోటుకుహుటూమాయాసటాజాహరే
మాయాగ్గేయమడే" యటంద్రు దివి రంభాజారునిన్ యక్షునిన్. 69

కాళహస్తిమాహాత్మ్యమునందు:—

సీ. బిజ్జ మాడుదేవర నిజకృపామహిమఁ జె న్నారు నాయిల్లు బిడారు నీకు
నాకు నీపాదార్చనము సేయ నడలింగమూర్తి సేకు ఱై వచ్చి మూర్త మాడి
దొడయచిత్తేశ నాయునికి నీమజ్జన మాడు శివార్చన మాడు బేకు
విచ్చేయుం డిది బూది వీడియం బందుకో జంగమస్వామి నాసదనమునకు
తే. నోగిరంబులు మంచి మే లోగిరములు, నావటించెదఁ బదుఁడు మీ [3]రారగింపఁ
బ్రతిదినంబును జంగమార్చనము లేక, తనువు వడ నొల్ల రూపకందర్ప యనఁగ. 70

## భాషాష్ట తివివరణము.

తే. భాష రెండుదెఱంగులఁ బరఁగుచుండు
సంస్కృతము ప్రాకృతము నన సంస్కృతంబు
ప్రకృతి యన నొప్పు దానికిఁ బ్రాకృతంబు
వికృతి యగుఁ దంగెడావ్యయవిషయవాస. 71
తే. భారతీదేవి శైశవభాషితంబు, ప్రాకృతము పంచవిధ మయ్యెఁ బ్రాకృతంబు

---

1 ఖూజు ఖోదాకితే (ప); ఖూబు ఖోడాకతే (వా); ఖూబుఘోడాకతే (పె).

2 కానిర్ఝురీపోఫణీ, మాయాభీకముటూకులోటుకుహుటూమాయాసటాజాహరే, మాయోగ్గేయమటా (వా); కానిర్ఝురీపోష ణీ మాయాభీకముమీకులోమికుహుమీ మాయాసటాజాహరే, మాయాగ్గేయమడే (ప); కానిర్ఝురీఘోఫణీ, మాయాభీకముటూకుటోటికుహుటీ మాయాసటాజోహరే, మాయాగ్గేయమటా (పె).

3 రారగించ.

శౌరసేనియు మాగధీసంజ్ఞికయును, గ్రమతఁ బైశాచికయు నపభ్రంశ మనఁగ. 72

క. నామ మపభ్రంశం బని, సామాన్యముగాఁ దలంపఁ జన దది భాషా
భామాశిశుత్వభాషిత, మై మెలఁగుటచే సుశబ్ద మగు నెల్లెడలన్. 73

ఆ. పద్మపత్రనేత్ర పైశాచికాభాష, యందు భేద మించుకంత గలిగి
సొంపు మీఱుచుండు చూళికా పైశాచి, లెక్కలోనఁ దాను నొక్క టగుచు.

తే. ప్రాకృతాదులు చెడి తజ్జపదము లగుచుఁ
బలు తెఱంగులఁ దనలోనఁ గలసియుండు
కతన నీయాంధ్రభాషయుఁ గవిమతంబు
నందుఁ బ్రాకృతభేదంబె యనఁగ నొప్పు. 75

క. క్షితి భాష సంస్కృతప్రా, కృతసంజ్ఞల ద్వివిధ మయ్యె నెంచఁగఁ దత్ప్రా
కృతము వెస నేడు తెఱఁగుల, వితత మగుట నెల్ల నష్టవిధభాష లగున్. 76

తే. సంస్కృతము ప్రాకృతంబును శౌరసేని
జగతిపై మాగధియును బైశాచికయును
చూళికయు నపభ్రంశంబు సొరిది నాంధ్ర
భాషయును నివి చను నష్టభాష లనఁగ. 77

ఆ. వరరుచిప్రణీతవాక్యంబులను బతంజలికృతోరుభాష్యములను వెలయు
పాణినీయసూత్రఫక్కిని జనియించు, శబ్దజాల మెల్ల సంస్కృతంబు. 78

తే. ఇలఁ ద్రివిక్రమరచితవృత్తులను హేమ, చంద్రసూరిప్రణీతభాష్యంబుచేతఁ
దనరువాల్మీకిమూలసూత్రములవలనఁ, బ్రాకృతాదిషడ్భాష లుద్భవముఁ జెందె. 79

క. తెలుఁగునకుఁ బోడము లక్షణ, ములు బాలసరస్వతిప్రముఖబుధకృతటీ
కలవలనను దెల్లం బై, చెలు వగు నీయాంధ్రశబ్దచింతామణిచేన్. 80

సీ. స్వర్గలోకప్రశస్తము సంస్కృతము మహారాష్ట్రిదేశీయంబు ప్రాకృతంబు
శూరసేనాఖ్యఁ బ్రస్తుతి కెక్కు నాటను జను లాడునదియె పో శౌరసేని
మగధదేశోక్తులు మాగధీభాష పిశాచసంజ్ఞికము లై జగతిఁ బొదలుఁ
[1]బాండ్యకేకయసాల్వబాహ్లీకకౌనూపగాంధారనేపాళకుంతలసుదేష్ణ

తే. భోజకన్నోజకంబులఁ బొసఁగుమాట, లరయఁ బైశాచికాచూళికాహ్వయములు
వెస నపభ్రంశ మాభీరవిషయజాత, మాంధ్రభూమిభవం బాంధ్ర మయ్యె శౌరి.

తే. దేవభూసురమునిధరిత్రీతలేంద్ర, సచివకంచుకివిటవిదూషకవిరక్త
వారయోషిన్నృపామాత్యవనితలకును, జెప్పఁదగు సంస్కృతము సుధాసింధుశయన.

1 బాండ్యకేకయ హేవబాహ్లీకసుహ్మగాంధార.

సీ. క్షపణకజైనాదికర్మహీనులకును భామాజనులకును బ్రాకృతంబు
క్షితి వైశ్యశూద్రప్రభృతిమధ్యమాధమజాతుల కెల్లను శౌరసేని
ధీవరలుబ్ధకాదివినీచజాతులమానవులకు నెల్ల మగధభాష
మొగిఁ బిశాచాసురముఖ్యుల కెల్లఁ బైశాచికానామభాషాద్వయంబు
తే. పతితచండాలయవనాదిపరమనీచ, జాతినరుల కపభ్రంశ మీ తెలుంగు
సీమవారికి నాంధ్రంబుఁ జెప్పవలయుఁ, గావ్యనాటకముల గోపికాభుజంగ 83

ప్రకృతివికృతిభేదంబులు.

మూ. సూ:— ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే* త్వేషాత యోర్భవేద్వికృతిః. 6

తే. క్రమమునను సంస్కృతప్రాకృతములు రెండుఁ
బరఁగు నాద్యప్రకృతియును బ్రకృతి యనఁగ
వెలయు నీరెంటికిని దెల్గు వికృతి యనఁగ
నందగోపాంగనాపుత్ర నలిననేత్ర. 84

తద్భవస్వరూపము.

మూ. సూ:— కేవలతయానుసర్ప త్యుభే చ యేయం యథాతథా భాషా.

తే. ప్రకృతులను రెంట రెండురూపముల నమరు
తద్భవములు ప్రత్యేక మాంధ్రంబు లగుచుఁ
జంద్రునకుఁ జందురుం డని సంస్కృతమునఁ
జందుఁ డని ప్రాకృతమున నీచందమునను. 85

ఇందునకు తెలివిడి. శబ్దసూత్రము:— ప్రయోగమూలం వ్యాకరణమ్.

దీని అర్థము:—శబ్దశాస్త్రము లోకమునందు ప్రవర్తించు ప్రయోగములే మూలముగా కలది. ఇటన్నందుచేతను వ్యాకరణశాస్త్రము లోకవ్యవహారము నను సరించి చెప్పుచున్నది అనుట. అటుగాన లోకవ్యవహారసిద్ధములైనను తద్భవములకు లక్షణము తెలియవలెను. అది యెట్టు లనిన: తెలుఁగునకుం బ్రాకృతభాష ప్రకృతి అనిపించుకొనును. ఆప్రాకృతమునకు సంస్కృతభాష ప్రకృతి అనిపించుకొనును. అటుగాన ప్రకృతు లనఁగా సంస్కృతప్రాకృతముల రెంటికినిపేరు. ఆ రెంటియందును కొన్ని తద్భవములు, ప్రత్యేకముగా ఒక్కొక్కదానను ఒక్కొక్కవిధమున పుట్టి రెండురూపములను తెలుఁగులలో గలసి యున్నవి. కనుక వాని కన్నిటికిని దెలి యునట్లుగా అందులోపల నొకచంద్రశబ్దమునకుఁ జెప్పుచున్నాము. సంస్కృతము

* 13-వ పేజీలో ఈశ్లోకక్రమము మారియున్నది.

నందుఁ గల ద్విత్వాక్షరమునందు క్రిందను జడ్డయై యుండెడు రేఫము ప్రాకృతభాషగాఁ బలుకునప్పుడు లోపముగాను అవునుగనుక ఆరేఫము లోపము గాక ప్రత్యేకముగా [1]ముందర ఒకయక్షరమై నిలుచుటచేతను దకారమునకుఁ బ్రాకృతమందు రాని కొమ్ము వచ్చుటచేతను జందురుశబ్దము శుద్ధసంస్కృతశబ్దముననే అయినతద్భవము గాని సంస్కృతము చెడి అయిన ప్రాకృతమువలనను అయినది గాదు.

చజౌ తజ్జే ప్రాకృతే చ దంత్యా వేవ న సంశయః.

టీ. తజ్జే=తద్భవమునందును, ప్రాకృతే చ=ప్రాకృతమునందును, చజౌ=చకారజకారములు రెండును, దంత్యావేవ=దంత్యవర్ణములే అవును. తాలవ్యములు గావనుట. సంశయః=సందేహము, న=లేదు. ఇటను అథోక్షజఫక్కికావచనముచేత ఇదియు సంస్కృతజాతమైనతద్భవము గనుక మొదల నున్న చకారము దంత్యమయి తెలుఁగు తత్సమము చేయఁగా చందురుండు అని అయినది. ప్రాకృతమునె అయినట్లాయెనా దకారము క్రిందటి రేఫము లోప మౌనుగాని, ప్రత్యేకాక్షరమై యుండదు. దకారమునకుఁ బొల్లును రాదు. అది యెట్లంటేని.

## ప్రాకృతవ్యాకరణసూత్రంబులు.

కగచజటడతదపబమునకగపశో రుపర్యద్రే.

వృ. ఉపరి స్థితానాం స్పర్శవర్గాద్యతృతీయానాం మవర్గజిహ్వామూలీయోపధ్మానీయానాం శషసానా మేతేషాం సంయుక్తోపరివర్తే లోపఃస్యాత్ నతు ద్రశబ్దే.

టీ. ఉపరిస్థితానాం=మీఁదనున్న ద్విత్వాక్షరములందు, స్పర్శవర్గాద్యతృతీయానాం=కచటతపగజడదబలకు, మవర్గజిహ్వామూలీయోపధ్మానీయానాం (ꣳక–ꣳప–అని–కపలకు ముందర్థవిసర్గసదృశము లయినవర్ణములు జిహ్వామూలీయోపధ్మానీయంబులనంబడు).మకారꣳకꣳపవర్ణములకు,శషసానాంచ=శష సలకును, లోపః=అదర్శనము, స్యాత్=అగును. ఇందుచేతను జంద్రశబ్దమునందు రేఫమునకు మీఁద నుండెడిదవర్ణమునకు లోపమురాఁగా 'నతు ద్రశబ్దే' ద్రకారము గలశబ్దమునందు లోపము లేదు. ఇటన్నందువలన దవర్ణము లోపము కాదాయెను.

సూ:—రవలా మధశ్చ.

వృ. అధస్థితానాం రవలానాం లోప స్స్యాత్.

టీ. అధస్థితానాం=జడ్డలు గలయక్షరములయందుఁ గ్రింద నున్న, రవలానాం=రేఫవకారలకారములకు మూఁటికిని, లోపః స్యాత్=లోప మౌను, ఈసూత్రముచేతను దకారము క్రిందనున్న రేఫము లోపముకాఁగా చంద అనియుండెను

1 ముంగల (వా).

సూ. శేషాదేశస్యాహ్రోచోఖోః.

వృ. హాకారరేఫవర్జితస్యానాదేః శేషస్యాదేశస్య చాచఃపరస్య ద్విత్వంస్యాత్.

టీ. హాకారరేఫవర్జితస్య=హాకారమును రేఫమునుగాక తక్కినటువంటి, అనాదేః=మొదలిదిగానటువంటి, శేషస్య=లోపముకాఁగాచిక్కినదానికిని, ఆదేశస్య చ=ఆదేశమైనదానికిని, అచః పరస్య=అచ్చుకంటె పరమైనదానికిని, ద్విత్వం=జడ్డ, స్యాత్=అవును. ఇందువలనను హావర్ణము రవర్ణముగాదు గనుకను శబ్దాద్యక్షర దకారమును రేఫమును సంయుక్తమైనటువంటి ద్రవర్ణమునం దధస్స్థితమైన రేఫము లోపముకాఁగాను చిక్కినవి గనుకను జకారముమీఁద నున్న అకారమచ్చు గనుక దానిమీఁద నున్నది గనుకను దకారమునకు జడ్డ వచ్చెనుగనుక చంద ఆయెను. ఇది ప్రాకృతభాష గనుక మునుపు చెప్పినయథోక్తవచనమునను ఆది నున్నచకారము దంత్యవర్ణమాయెను. అది తత్సమము చేయఁగా చందుఁడని నిలిచెను. కాఁబట్టి యీమాట సంస్కృతమునఁ బుట్టినప్రాకృతముననే అయినతద్భవముగాని శుద్ధసంస్కృతమున నైనది గాదు. ఈరెండుశబ్దములును ఆదిమకవిప్రయోగప్రసిద్ధములై కనుక ఇటువంటివన్నియుఁ బ్రకృతులను రెంటను రెండువిధములను బుట్టిన వని తెలిసికొనునది. ఇందునకుఁ బ్రయోగము.

నరసింహాపురాణమునందు:—

చ. సురుచిరపానపాత్రమున సుందరి యొక్కతె కేల నిండుచం
దురుఁడు ప్రకంపితాంగములతోఁ దిలకించెఁ దదాననాంబుజ
స్ఫురితవికాసవైభవము సొంపు లడంకువ ముచ్చిలింపఁ జె
చ్చెరఁ జనుదెంచి కట్టువడి చేడ్పడి భీతి వడంకు[1]చాడ్పునన్. (ఆ. ప. 97) ౨౬

నైషధమునందు:—

చ. కెరలి మహాసివేమసహకృత్వరి తద్భటకోటిచాతురీ
తురి సమరాంగణంబులఁ జతుర్వారిధావరణంబులన్ యశోం
బరముల [2]నేయుచుండు బహుభంగులఁ బున్నమనాఁటినిండుచం
దురునునుసోగవెన్నెలలతోఁ దులఁ దూగెడుతద్గుణంబులన్. (ఆ. ప. 50) ౨౭

ఆ. తెలుఁగు లొక్కకొన్ని దేవతాభాషనె, తద్భవంబు లగుచుఁ దనరుచుండు
ధరణిఁ గొన్ని ప్రాకృతముననె యగుచుండుఁ, దెలియవలయు [3]దాని తెలుఁగులెల్ల.

తే. ప్రాకృతము నంటక నిలింపభాషనయ్యెఁ, దజ్జము సముద్రమునకు సంద్రంబటంచు
నాకసద్భాష నంటక ప్రాకృతమున, నైనచో దానిని సముద్ద మనఁగ వలదె. ౨౮

1 కైవడిన్ (పె). 2 నేచు (ప. పె). 3 దాని (వా. పె).

ఇందునకు తెలివిడి. కొన్ని తద్భవములు లోకమునం దాద్యప్రకృతివలననే యయినవి గాని ద్వితీయప్రకృతి నయినవి గావు. అవియెటువంటివనఁగా: అందు లోపల సముద్రశబ్దమున కొక్కటికిఁ జెప్పుచున్నాము. మొదలిప్రకృతియందు లోప మయ్యెడుదకారము క్రిందటి రేఫము లోపము గాక నిలిచినందుచేతను, సంద్రశబ్దము ప్రథమప్రకృతి నైనతద్భవముగాని ద్వితీయప్రకృతి నైనది గాదు అది తత్సమముచేయఁగా సంద్ర మయినది. రెండవప్రకృతినేలయిన "కగచ జటడతదపబయుల్లకౢ్లపశోరుపర్యద్రే" అన్నందునఁ జంద్రశబ్దమునకువలెనే సము ద్రశబ్దమునందలిదకారమునకు లోపముగా రాఁగా "నతు ద్రశబ్దే" అనుటవలన లోపము రా దాయెను. "రవలా మధశ్చ" అని మునుపు చెప్పినసూత్రముచేత దకారముక్రింది రేఫము లోపముగాఁగా సముద అని నిలువఁగా "శేషాదేశస్యా హోఽచోఖోః" అనుదానివలనను మునుపటివలెనే దకారమునకు జడ్డ వచ్చెఁ గనుక సముద్దయాయెను. అది తత్సమము చేసిన సముద్దము అని యుండవలెను. ఈమాట ఆదిమకవులు ప్రబంధములను వాడినవారు కారు సంద్ర మనియేచెప్పి కొన్నారు. అటుగనుక నిటువంటి వెల్లను శుద్ధసంస్కృతమున నైనతద్భవము లని తెలిసికొనునది.

లక్ష్మీశబ్దమునకు:—

క. నాకులభాషను మట్టక, ప్రాకృతమున లచ్చి దాఁ బరఁగు లచ్చి యనఁగ
నాకోక్తి నైన లక్ష్మికిఁ, బ్రాకటముగ లక్ష్మిమి యని పలుకఁగ వలదే. 90

దీనికిం దెలివిడి. లోకమునందుఁ దద్భవములు కొన్ని ప్రాకృతభాషవలన నైనవే కాని దేవతాభాష నైనవి గావు. అవి యె ట్లనః లక్ష్మీశబ్దమునకుం జెప్పుచున్నాము.

సూ. మనయానాం.

వృ. అధస్స్థితానాం మనయానాం లోప స్స్యాత్.

టీ. అధస్స్థితానాం=ద్విత్వాక్షరములయందుఁ గ్రిందనున్న, మనయానాం= మకార నకార యకారములకు, లోపః=లోపము, స్యాత్=అగును. ఇందువలన క్షకారముక్రింద నున్నమకారమునకు లోపము గాఁగా లక్షియని యుండెను.

సూ. క్షః.

వృ. క్షస్య ఛస్స్యాత్

టీ. క్షస్య=క్షకారమునకు, ఛః=ఛకారము, స్యాత్=అగును. దీనిచేత క్షకా రమునకు ఛకారము రాఁగా లఛి యనురూపము సిద్ధించెను. తెలుఁగునందు స్పర్శ వర్గద్వితీయవర్ణములు లేవు గనుక లచ్చి యని నిలిచెను. ఇది ప్రాకృతంబున నైనతద్భ

వము గాని, దేవభాష నైనతద్భవము గాదు. సంస్కృతమున నయ్యేనేని క్రింద నున్నమకారము ప్రత్యేకము స్పర్శవర్గద్వితీయము ముంగల నొకయక్షర మై నిలిచె నేని లక్షిమి యవును. ఆంధ్రమునందు షకారము లేదు గనుక అది లోప మై కకారమునకు ద్విత్వము రాఁగా లక్కిమి, వికల్పమున జడ్డ లోప మైన లకిమి యాయెను. ఈ రెండువిధములతద్భవములలోను బూర్వకవులు ప్రబంధములయందు లచ్చి యని ప్రయోగించినారు గాని లకిమి యని ప్రయోగించినవారు కారు గనుక నిట్టిశబ్దములెల్లను తీయప్రకృతి నైన వని యెఱుంగునది. దీనికి బ్రయోగము:—

విరాటపర్వమునందు:—

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికి నై పెనంగినబలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగుఁ గుం దగుఁ దొడరు టెల్లవిధంబుల నోర్చునట్లు గా
కిచ్చఁ దలంచి యొక్కమెయి నిత్తఱి బొం దగు నేతయుం దగున్. 91

(ఆ. 4. ప. 234)

రామాభ్యుదయమునందు:—

(తే. రాచపాఱునిజన్నంబు గాచినాఁడు, లచ్చిపుట్టిల్లు కోలకుఁ దెచ్చినాఁడు
చాలుపేరింటితొయ్యలి నేలినాఁడు, పుడమి [1]నునుమించు ప్రొద్దువంగడమునందు.)

తే. శౌరసేన్యాదిపంచభాషలును బ్రాకృ, తంబులో భేదములు గానఁ దద్భవములు
వానియందును బుట్టును వర్ణభేద, ములును బంచవిధంబు లై తెలుఁగునందు. 93

తే. శౌరసేని జూదంబు పైశాచియందు, సాన మాళిక యనియెడుదాన రాచ
కొల మపభ్రంశభాషోక్తివలన మాఁగ, దనరు మాగధి జక్కులు తద్భవములు.

ఇందునకు తెలివిడి ద్యాతశబ్దమునకు:—

సూ. ద్యర్యోర్జః.

వృ. ద్యకారస్య ర్యకారస్య చానయో ర్జకారాదేశ స్స్యాత్.

టీ. ద్యకారస్య=ద్య అనుఅక్షరమునకు, ర్యకారస్య చ=ర్య అను అక్షరమునకును, అనయోః=ఈరెంటికిని, జకారాదేశ స్స్యాత్=జవర్ణ మాదేశ మవును. ఇందున ద్యకారమునకు జకారము రాఁగా జూత మని యుండెను.

1 నన,

సూ. ద స్తస్య శౌరసేన్యా మఖావచో స్తాః.

వృ. అనాదే రచః పర స్యాసంయుక్తతకారస్య దః స్యా చ్ఛౌరసేన్యాం.

టీ. అనాదేః=ముందటియక్షరము కానటువంటి, అచః పరస్య = అచ్చునకుం బెం బరమైయున్న, అసంయుక్త=సంయుక్తము కానటువంటి, తకారస్య=తవర్ణమునకు, ద స్స్యాత్=దవర్ణ మౌను, శౌరసేన్యాం=శౌరసేనియందు. దీనిచేత తకారమునకు దవర్ణము రాఁగా జూద మాయెను. ఇది శౌరసేనిభాష సైనతద్భవము.

ఇందునకుం బ్రయోగము సభాపర్వమునందు:—

క. జూద మిది యేల యడుగుము, భేదము దమలోనఁ బుట్టుఁ బెలుచన యొప్పి

ద్భేదమునఁజేసి యెగ్గు, ల్పాదిల్లు ధరిత్రిఁ బ్రజకు [1]భయజననం బై.(అ. 2. 135)

నైషధమునందు:—

క. కాదంబరి ద్రావింతును, జూదం బాడింతుఁ గతల జొక్కులఁ బెట్టన్

బైదలుల నియోగింతును; వైదర్భతనూజమీఁదివల పుడిగింతున్.(అ. 7. 120)౯౯

శాణశబ్దమునకు:—

సూ. శషసాః శుః.

వృ. శషసాః శుసంజ్ఞాః స్యుః.

టీ. శషసాః=శకారషకారసకారములు, శుసంజ్ఞాః=శు అనుసంజ్ఞ గలవి, స్యుః=అగును.

సూ. శో స్సత్.

వృ. శషసానాం సకార స్స్యా న్నిత్యమ్.

టీ. శషసానాం=శకారషకారసకారములకు, సకార స్స్యాత్=సవర్ణ మవును, నిత్యం = నిత్యముగా. ఈసూత్రమువలన శకారమునకు సకారము రాఁగా సాణ అని యుండెను.

సూ. నో ణనోః పైశాచ్యామ్.

వృ. ణకారనకారయోః నకార స్స్యాత్ పైశాచ్యామ్.

టీ. ణకారనకారయోః=ణవర్ణ నవర్ణములకు రెంటికిని, నకారః స్యాత్=నవర్ణ మవును, పైశాచ్యామ్=పైశాచియందు. ఇప్పుడు చెప్పినదానను ణకారమునకు నవర్ణము రాఁగా సానఅయెను. ఇది పైశాచకభాష సైనతద్భవము.

---

1 భయజనకం బె (పె).

రాజకులశబ్దమునకు:—

సూ. గజడదబధఘఝఢధభాం కచటతపాః ఖఛఠథఫాః.

వృ. స్పర్శవర్గతృతీయచతుర్థానాం తత్తత్ప్రథమద్వితీయాః క్రమేణ స్యుః.

టీ. స్పర్శవర్గతృతీయచతుర్థానామ్=స్పర్శవర్గములయందు మూఁడవ యక్షరములకును నాలవవానికిని, తత్తత్ప్రథమ ద్వితీయాః = ఆయావర్గములయొక్క మొదలివర్ణములును రెండవవర్ణములును, క్రమేణ=వరుసగా, స్యుః=అవును. ఈసూత్రమున జకారమునకు చకారము రాఁగా రాచ యాయెను. కులమునకు కొలము ఆయెను. అది సమము చేసిన రాచకొలము. ఇది చూళికాపైశాచికాభాష యైనతద్భవము.

మూఁకశబ్దమునకు:—

సూ. అచోస్త్వావఖౌ కఖతథపఫాం గఘదధబభాః.

వృ. అచః పరేషా మసంయుక్తానా మనాదీనాం-కతపవర్గ ప్రథమద్వితీయానాం తృతీయచతుర్థాః క్రమేణ స్యుః.

టీ. అచః పరేషాం=అచ్చుకంటె పరము లైనటువంటి, అసంయుక్తానాం=సంయుక్తాక్షరములుగానటువంటి, అనాదీనాం=మొదలివిగానటువంటి, కతపవర్గప్రథమద్వితీయానాం=కతపవర్గములయొక్క మొదలి యక్షరములకును, రెండవవానికిని, తృతీయచతుర్థాః=తమవర్గములయందలి మూఁడవనాలవయవి, క్రమేణ=వెంబడిగాను, స్యుః=అవును, ఇది అపభ్రంశభాష యైన తద్భవము. ఇందువలనను కకారమునకు గకారము రాఁగా మూగ ఆయెను.

ఇందునకుఁ బ్రయోగము.—

సారంగధరచరిత్రమునందు:—

చ. తలవరు లేఁగ లేఁగఁ బులితండము నెత్తుటిజొత్తు ...
హలిమెయి రాఁగ రాఁగలయునంటి వృకంబులు క్రొంబొదల్ రొదల్
చిలుకుచు నీఁగ నీఁగలును జీమలు దొంతర లై పయిం బయిం
బిలబిల మూఁగ మూఁగవలె బెగ్గిలి పల్కఁగ లేక వేదనన్. (అ. 3. 117) 97

యక్షశబ్దమునకు:—

సూ. ఆదే ర్యో జః.

వృ. ఆదే ర్యస్య జ స్స్యాత్.

టీ. ఆదేః=శబ్దాది నుండెడు, యః=యకారమునకు, జః=జకారము, స్యాత్=అవును. దీనను మొదలియకారమునకు జకారము రాఁగా జక్ష అని యుండెను.

సూ. క్షః.

వృ. క్ష ఇత్యస్య జిహ్వామూలీయః స్యాత్.

టీ. క్ష ఇత్యస్య=క్ష అను నక్షరమునకు, జిహ్వామూలీయః=జిహ్వామూలీయము, స్యాత్=అగును. పాణినీయవ్యాకరణమునందు'ᳵక ఇతి జిహ్వామూలీయః' అన్నందుచేత, జిహ్వామూలీయ మనఁగాను దాపలివిసర్గము గల కకారమునకుఁ బేరు గాన ᳵక అనునది రాఁగా జᳵక యని నిలిచెను, మునుపు చెప్పిన అధోక్షజపక్కి-కావచనమువలన జాక్ష రము దంత్యాక్షర మాయెను. ఆంధ్రమునందు విసర్జనీయము లేదు గనుక నది లోపింపఁగా జక్క అని యుండెె అది తత్సమము చేయఁగా జక్కులు ఆయెను. ఇది మాగధీ భాష సైనతద్భవము.

సీ. కుక్క గోలెం బోలి కూళ గుండము కంతి గుజ్జు కరాటంబు గజ్జి కట్టె
సిక చేఁత చిక్కంబు చిన్నె సింగము సెజ్జ లక్క లచ్చన సుద్ది లయ్య లాగు
ప్రోడ పొత్తము పోఁక పుడమి బన్నము బూది బీరంబు బికిరంబు పిట్టు పుటము
వదినె వెన్నుఁడు వంక వడుగు వీడెము వన్నె రక్కసి రవణంబు రిక్క పగ్గ
తే. పీఁట దయ్యము తోరంబు పెట్టె మట్టి
బత్తి జతనంబు జాతర ముత్తియంబు
దాది కుప్పస మిటికె నిద్దంబు పెరిమె
యివము దెస డిగ్గి యనఁగఁ దద్భవము లయ్యె. 98

దీనికివివరము:—కుర్కురశబ్దమునకు కుక్క, గోళశబ్దమునకు గోలెము, ఆలిశబ్దమునకు ఓలి, క్రూరశబ్దమునకు కూళ, కుండశబ్దమునకు గుండము, గ్రంథిశబ్దమునకు కంతి, కుబ్జశబ్దమునకు గుజ్జు, కరండశబ్దమునకు కరాటము, ఖర్జూశబ్దమునకు గజ్జి, కాష్ఠశబ్దమునకు కట్టె, శిఖాశబ్దమునకు సిక, చేష్టాశబ్దమునకు చేఁత, శిక్యశబ్దమునకు చిక్కము, చిహ్నశబ్దమునకు చిన్నె, సింహశబ్దమునకు సింగము, శయ్యకు సెజ్జ, లాక్షకు లక్క, లాంఛనకు లచ్చన, సూక్తికి సుద్ది, లంజకు లయ్య, లంఘకు లాగు, ప్రౌఢకు ప్రోడ, పుస్తకమునకు పొత్తము, పూగకు పోఁక, పృథివికి పుడమి, భగ్నమునకు బన్నము, భూతికి బూది, వీరశబ్దమునకు బీరము, భిక్షకు బికిరము, పిష్టమునకు పిట్టు, స్ఫుటకు పుటము, వధూనికి వదినె, విష్ణునకు వెన్నుఁడు, వక్రమునకు వంక, వటునకు వడుగు, వీటికి విడ్డెము-వీడెము, వర్ణమునకు వన్నె, రక్షశ్శబ్దమునకు రక్కసి, రమ్యకు రవణము, ఋక్షమునకు రిక్క, ప్రజ్ఞకు పగ్గె, విష్టరమునకు పీఁట, దైవమునకు దయ్యము, స్థూలమునకు తోరము-దూలము, పేటికి పెట్టె, మృత్తికకు మట్టి, భక్తికి బత్తి, యత్నశబ్దమునకు జతనము, యాత్రకు జాతర, మౌక్తికమునకు ముత్తియము, ధాత్రికి దాది, కూర్పాసమునకు కుప్పసము, ఇష్టికకు ఇటిక, స్నిగ్ధకు నిద్దము, ప్రేమకు పెరిమె, హిమమునకు ఇగము.

సూ. వాస్యా త్క్వచి ద్వకారో నాదిగత స్యాద్యవర్గసరళస్య.

అనియెడు నీయాంధ్రశబ్దచింతామణి సూత్రమువలనఁ గకారమునకు వకారము రాఁగా ఇవ మని యనవచ్చు. దిశకు దెస, దీర్ఘికకు డిగ్గి. ఇట్టివి లోకంబున ననేకములు గలిగి యుండు నవి యెల్లఁ బ్రాకృతవ్యాకరణమువలనను సంస్కృతాది భాషా సప్తకంబున నుద్భవించి తద్భవముల వెలయు తెలుఁగుపలుకు లని తెలియవలయు.

## త్రిలింగశబ్దతద్భవము.

క. శ్రీ[1]క్షితిధరకాళేశ, ద్రాక్షారామంబు లనఁగఁ దనరారెడుని
త్రిక్షేత్రంబులలింగము, లీక్షింపఁ ద్రిలింగసంజ్ఞ నెన్నిక కెక్కెన్. 99

తే. తత్త్రిలింగనివాస మై తనరుకతన
నాం ... శంబు దాఁ ద్రి ... గాఖ్య మయ్యెఁ
దెలుఁ గగుచుఁ దద్భవము దానివలనఁ బొడమె
[2]వెనుకఁ గొందఱు దానినే తెనుఁగు నండ్రు. 100

## ఆంధ్రభాషాభేదచతుష్టయము.

మూ. సూ.-తజ్జా సమా చ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి.

తే. దైత్యదమన ...మ మనఁ దద్భవ మన
మన గ్రామ్యభాష నాఁ దెనుఁగు నాల్గు
విధము లందుఁ దత్సమమును విడిచి మూఁడు
నాంధ్రములె యెందు నందు గ్రామ్యంబు [3]దిరుగు. 101

## తజ్జలక్షణము.

మూ. సూ.—ప్రకృతిద్వయజా తజ్జా. 9.

తే. [4]వఱలుసిద్ధాక్షరములలో వర్ణసమితి, దూలఁ బోఁ బట్టి నర్థంబు [5]దోడరుకొనుచు
సంస్కృతప్రాకృతాఖ్యభాషాద్వయమున, నుద్భవించిన తెలుఁగులు తద్భవములు.

## తత్సమలక్షణము.

మూ. సూ. తుల్యా తు సమా. 10.

క. తెనుఁగువిభక్తులకడపలఁ, దనరారఁగ నిలుప సంస్కృతప్రాకృతముల్
గనుపట్టుఁ దత్సమములన, వనజాక్షుఁడు జముఁడు దనుజవరులకు ననఁగన్. 108

1. క్షితిని (అచ్చు); క్షమను (పె.వా). 2 వెనక (పె. వా). 3 దిగును (ప); దిగుడు (పె.వా). 4 వరస. 5 దోఁపు (ప.పె).

## దేశ్యలక్షణములు.

మూ. సూ.—ప్రవాహినీ దేశ్యా. 11.

క. ఏదేశము మానవులకు, నాదేశము భాష దేశ్య మయ్యె గరత్త
త్వాది జనవ్యవహారము,చే దాని నెఱింగి కృతులఁ జెప్పఁగ నొప్పు. 104

## ఆంధ్రదేశ్యభేదంబులు.

క. జలశయన యాంధ్ర దేశ్యం, బులు రెండు దెఱంగు లయ్యె భువి శుద్ధాంధ్రం
బులు నన్యదేశజాంధ్రం, బులు నాఁగా మెపలినామపురవరధామా. 105

తే. ఆంధ్రదేశపురస్థాయు లైనసకల, జనములకును మఱుంగుదేశంబు లేక
తేటతెల్లమిగాఁ బల్కుమాట లెల్ల, నవని శుద్ధాంధ్రదేశ్యంబు లనఁగఁబడును.

క. పాలును బెరుగును నెయ్యిని, వాలాయం బుట్టిఁ బట్టి వంచుక త్రాగెన్
ఓ లెక్కక నీబిడ్డఁడు, జోలి యిఁకేమున్న దన్న శుద్ధాంధ్రంబుల్. 107

క. కేశవ యాంధ్రులు నానా, దేశంబులయందు నిలిచి తెలుఁగులె తత్త
ద్దేశోక్తు లంటఁ బలికిన, నాశబ్దము లన్యదేశజాంధ్రము లయ్యెన్. 108

సీ. అలంబు చివ్వ కయ్యము పోరు బవరంబు దుర మని యొంటరి ద్రోమ్మి కల్లను
వెలఁది యింతి పడంతి యెలనాగ చెలి బోటి పొలఁతి తొయ్యలి నాతి మెలఁత నెలఁత
మేను వేసవి మోవి గౌను డెందం బక్కు వీను లుల్లము కేలు వెన్ను నొసలు
వావిరి యేడ్తెఱ వఱలుట కొఱలుట నలి నొగి మొగిఁ బర్వి నలువు పొలుపు

తే. నెల తునుక వాఁక వలవంత నెమ్మి నెఱక, లారజము సోయగము గొనయంబు చిలువ
[1]పొల్లు చెచ్చెర మక్కువ తెల్లమి యనఁ, దనరు నిటు లన్యదేశజాంధ్రములు పెక్కు.

క. నెలకొనుసంస్కృతతత్సమ, ములు దొరలక తజ్జదేశ్యములమాఁటను సం
ధిలి కేవలాంధ్రములు నా, నలరుఁ గృతుల నచ్చతెనుఁగు లండ్రు తెలుఁగునన్.

క. తెలుఁగుమఱుంగులు ప్రాఁదెనుఁ, గులు తద్భవదేశ్యములును గూర్చి మృదుపదం
బులు గాఁగ నచ్చతెనుఁగులు, మెలఁకువతోఁ జెప్పఁదగు శమీప్రాంతగృహా.

తే. అబ్ధిమేఖల కదయించినట్టిసీతఁ
జేకొనియె రాఘవుండని చెప్పచోటఁ
గడలిమొలనూలిచేడియ గనినపడుచుఁ
దెచ్చుకొనె రాముఁ డనఁగను దెనుఁగు[2]మఱుఁగు. 112

---

1 యెల్లి (ప). యెల్లి (వా). 2 లక్షుకు (పె).

క. తొల్లింటిజనులవాక్యము, లెల్లను బ్రాఁదెనుఁగు లయ్యె నిప్పటివారల్
చెల్లుబడి నాడునవియే, [1]దెల్లమిగా నింకఁ బ్రాఁత తెలుఁగులు నృహరీ. 113

క. పుడమియు సిరియును బడఁతులు, వెడవిలుతుఁడు పసిఁడికడుపు వేల్పును గొడుకుల్
గడలి విడిపట్టు పాపల, నడుచు [2]గుఱ్ఱముసామి కనఁగ నచ్చ తెనుంగుల్. 114

## పూర్వకవిసమయసిద్ధపదంబులు.

మూ. సూ.—సిద్ధి ర్లోకా ద్దృశ్యా లోకోఽనన్యాదృశశ్చ నిత్యశ్చ. 12.

క. కవులకు దేశ్యము లోక, వ్యవహారమువలనఁ దెలియ నగు నాలోక
వ్యవహారము నిత్యంబును, భువి నిజదేశమున యోగ్యమును నగుఁ గృష్ణా. 115

తే. అవనియందు లోకవ్యవహార మనఁగ, నాప్త దేశంబులను బెద్ద లైనవార
లాడుభాషావిశేషవాక్యములలోన, [3]వాడుకకు వచ్చునవి ముగ్ధ వార్ధిశయన. 116

వ. అవి యెయ్యవి యనిన. 117

సీ. మదిరాక్షిచెవులు తొమ్మిదిలెక్క లన రాదు ముద్దియకనులు తమ్ము లన రాదు
శుకవాణిబుగ్గలు ముకురంబు లన రాదు చెలిపండ్లు మల్లెమొగ్గ లన రాదు
గజయానచండ్లు బంగరుకుండ లన రాదు సతిబొడ్డు సుడిని మెచ్చ దన రాదు
సరసిజాననముడ్డి సైకతం బన రాదు హరిమధ్యకాళ్లిగు ళ్లనఁగ రాదు
తే. క్రమత వీనికి వీనులు కన్నదోయి
చెక్కులును బలువరుసలు నిక్కుఁజన్ను
గవయుఁ బొక్కిలి పిఱుఁదు చొక్కంపుటడుగు
లనుచు మును వాడి రవియు చేకొనఁగ వలయు. 118

తే. రణము [4]వర్ణించుచో వీరరసమునందు
యుద్ధపంచకమునఁ దిక్కనార్య సారెఁ
గా ళ్లిటంచు రచించుట గాంచి కవులు
చెప్పుకొనిరి మీఁగాళ్లని చెలఁగి కృతుల. 119

సారంగధరచరిత్రమునందు సీసపాదము:—
సీ. ఉమ్మెత్తపువ్వు నా [5]నోర వైనకుచ్చిళ్లు [6]చెలఁగి మీఁగాళ్లపైఁ జిందులాడ.

1 దెల్లముగా నెంతఁ బ్రాఁత తెనుఁగులు నృహరీ (వా); మిదెల్లమిగా వింకఁ బ్రాఁత తెనుఁగులను హరీ (ప). 2 గుతుర (పె). 3 వాడికకు (ప. వా. పె). 4 వరింపుచో (వా). 5 నోకవై (శ); నోరవైన (పె). 6 చెలికి (ప. వా. పె).

## గ్రామ్యపదలక్షణము.

మూ. సూ.—సంస్కారార్థో నియమో నియమాద్గ్రామ్యం హి యత్త్వపభ్రంశః. 13

తే. ఉక్తలక్షణవంతమై యుండునట్టి,[1] కావ్యముల నెఱుఁగవలయు సంస్కారమనుచు
హీనలక్షణకావ్యంబు నెఱుఁగవలయు, గ్రామ్య మనుచు నపభ్రంశకంబు ననుచు.

క. లక్షణవిరహితకావ్యము, పక్షిగమన గ్రామ్య మనఁగఁబడు నది పెద్దల్
వీక్షింపరు లక్షణయుత, మీక్షితి నగ్రామ్య మని గ్రహింతురు ప్రీతిన్. 121

తే. క్షితి నపభ్రంశపదములు కృతులయందుఁ, గమలలోచన చెప్ప నర్హములు గావు
గాన నాంధ్రకవీంద్రులు వానిఁ దెలియ, వలయు నీశాస్త్రమునఁ దమతలఁపు నిలిపి.

తే. చులుకఁగా గ్రామ్యజనములువలుకునట్టి, తెనుఁగుమాటలు గ్రామ్యంబులనఁగఁ బడియె
వర్ణలోపంబు నొంది కావ్యములఁ జౌరవు,పరులఁ దెగడెడుచోనొప్పుఁ బాలదొంగ.

తే. అక్షరవిలోప మై యుండునట్టిపలుకు,గ్రామ్య మననొప్పు నదె యపభ్రంశకంబు
ననఁగఁబడుధాత్రి నాకడ కాడ యనుచు, నడుమ నున్నకకారంబు నుడువకున్న.

క. వస్తాఁడా హరి సొమ్ములు, దెస్తాఁడా గొల్ల[2]డంట దిట్టక కరుణన్
జూస్తాఁడా కౌఁగిలి నేఁ, డిస్తాఁడా చెప్పు మన్న నివి గ్రామ్యోక్తుల్. 125

## అగ్రామ్యపదలక్షణము.

మూ. సూ.—విరళాః పేచోషాదికశబ్దాః [3]ప్రత్యాహార స్తు శబ్దజ్ఞాః,
ఇహ తు ప్రత్యాహార్యం సర్జ్యేతితసుప్రసిద్ధ మేవ పదమ్. 14

సీ. ధరణిపైఁ బుట్టి మధ్యమపురుషంబున బహువచనంబునఁ బరఁగుచుండు
నట్టిపేచోషశబ్దాదులు కడు నప్రసిద్ధంబు లగు నైన శేషశయన
వేదంబునందు వావిరిఁ బ్రయోగంబులు [4]గలవు నవార్తికంబులును "నోఽథ
నాస్త్యప్రయుక్త"యటంచు మహాభాష్యమునఁ బతంజలి యుక్తము లెయటంచుఁ

---

1 ఈ పాదమున రెండవగణము అయిదుమాత్రలుగల నలలము. వ్రాతప్రతులందును అచ్చుపుస్తకములందును ఈపాద మిట్లే ఉన్నది. 2 డొండు (ప); దంట (వా. పె). 3 ప్రత్యాహారస్తు... ప్రత్యాహార్యం (ప). 4 గలవు గావున వార్తికంబునొద్ద "నాస్త్యప్రయుక్త" (ప); గలవు నవార్తికంబులును "నోధ్వనస్తు ప్రయుక్త" (వా).

తే. బలుకుటను సంస్కృతమున శబ్దజాలప్ప, సిద్ధశబ్దంబులను గూర్చి చెప్పచుందు రాంధ్రమున సుప్రసిద్ధంబు లైనపూర్వ,కవిసమయసిద్ధపదములుగాని చౌరవు. 126

వ. ప్లేచయన్నందుకు ధాతువు 'ఉషచస్పాకే' యనునది. 'ఊష' యన్నందుకు ధాతువు 'వస నివాసే' యనునది. 127

ఆ. గ్రామ్య మైన నాంధ్రకవులు సంకేతిత, సుప్రసిద్ధ మనుచు సూత్రమునను గలిమి బూర్వసుకవికావ్యోక్తములు ప్రసిద్ధంబు లైనఁ గూర్పఁదలఁతు [1]రెపుడు.

వ. అది యె ట్లనినఁ గనియె ననవలసినభూతార్థక్రియాపదైకవచనంబునందు వర్ణలోప ము చేసిక నెనఁటయని గ్రామ్యపదముగా వాగనుశాసనులు ప్రయోగించినారు గనుక నది సాధనము చేసికొని యాంధ్రకవితాపితామహుఁడు కొనియె ననుటకుఁ గొనె నని చెప్పె నవి యెవ్వి యనిన. 129

[2]ఆదిపర్వమునందు:—

క. వనకన్యక యఁట నే నఁట, వన న గాంధర్వమున వివాహం బఁట నం దనుఁ గనె నఁట మఱచితి నఁట, వినఁ గూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్. 130

విష్ణుచిత్తీయమునందు:—

ఉ. పూని ముకుందునాజ్ఞఁ గనుబొమ్మనె [3]కాంచి యజాండభాండముల్
వానను మీఁదఁ బోవ [4]నడువం గొనెఁ ద న్నన నగ్రనిశ్చల
త్వానచలత్వనిష్ఠలె సమస్తజగంబులజాడ్యచేతనల్
గా నతి కెక్కు సైన్యపతికాంచనవేత్రము నాశ్రయించెదన్. 131

కందగీతిగర్భచంపకమాల.

చ. నరహరి కేశవా వనజనాభ రమాధవ వంశహస్త బం
ధురసుగుణాకరా దురితదూర జనార్దన దోర్బలాఢ్య గి
ర్వరగిరిశస్తుతా మురహరా సురపూజితముఖ్యపాద సుం
దర పురుషాగ్రణీ భుజగతల్ప శచీపతిపుత్రరక్షణా. 132

గర్భకందము.

క. హరి కేశవా వనజనాభ రమాధవ వంశహస్త బంధురసుగుణా
గిరిశస్తుతా మురహరా, సురపూజితముఖ్యపాద సుందరపురుషా. 133

---

1. రెడను (వా); రెలమి (పె). 2 ఈ పద్యము పినవీరభద్రుని శృంగార శాకుంతలమునందుఁ గనఁబడునుగాని, ఆదిపర్వమునందుఁ గనఁబడదు. (చూ. పు. 95 శృం. శా.) 3 దాల్చి (పె). 4 నడవం,(ప. వా. పె)

## గర్భగీతము.

తే. వనజనాభ రమాధవ శంఖహస్త, దురితదూర జనార్దన దోర్బలాఢ్య
మురహరా సురపూజితముఖ్యపాద, భుజగతల్ప శచీపతిపుత్రరక్ష. 184

## ఆశ్వాసాంత గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, కామెపల్లిపురమందిర, నందనందనచరణారవిందవందనాభిలాషమనీషాప్రభావ, వెంగనార్యతనూభవ, విద్యావిశేషసురాచార్య, కాకునూర్యప్పకవివర్యవిరచితంబైన యాంధ్రశబ్దచింతామణి యనువ్యాకరణశాస్త్రంబునందు గోవింద, కౌస్తుభ, వైజయంతీ, శ్రీవత్స, మురళీ, పంచాయుధ, పీతాంబర, బర్హిబర్హా, లక్ష్మీ, క్షమా, నంత, గరుడ, విష్వక్సేన, మారుతి, పరమభాగవత, విధాతృ, శారదా, శివ, భవానీ, గణేశ, గుహ, లోకపాల, గ్రహ, పురాతన వర్తమానభావికవిగురునమస్కారంబును, స్వప్నప్రకారంబును, భగవద్వాక్యంబును, గ్రంథప్రభావంబును, గర్తృవంశావతారంబును, గవివిచారంబును, షష్ఠ్యంతములును, మూలసూత్రంబులును, పూర్వగ్రంథనామ సంగ్రహంబును, ప్రబంధమహిమయుఁ, గావ్యభేదంబులును, శబ్దార్థలక్షణాలంకారదోషంబులును, వాక్యలక్షణంబును, రసవివేకంబును, పంచవిధభావంబులును, శృంగారరసస్వరూపంబును, అష్టరసప్రపంచంబును, నాయకనిర్ణయంబును, సుకవిమాహాత్మ్యంబును, తల్లక్షణంబును, సప్తవిధకవులును, కుకవినిరసనంబును, గవితాప్రశంసయుఁ, దేశభాషావిశేషంబులును, భాషాష్టకోత్పత్తివివరణంబులును, ప్రకృతివికృతిభేదంబులును, దద్భవంబులును, ఆంధ్రభాషాభేదచతుష్టయంబును, బూర్వకవిసమయసిద్ధపదంబులును, గ్రామ్యాగ్రామ్యంబులును గలభాషాపరిచ్ఛేదం బను ప్రథమాశ్వాసము. 135

# ద్వితీయాశ్వాసము.



మహితకొండవీటీ
నామకరమ్యగిరిదుర్గనగరాభిమత
శ్రీమకరవాహనహరి
ద్భూమిస్థితకామెపల్లిపురవరశరణా.

క. అవధారు శబ్దశాసనుఁ, డవనిఁ గలియుగమున కాది నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పినయాం, ధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దెనుఁగింతున్.

క. శిష్టార్యావింశతి విస్పష్టముగా నక్షరప్రపంచము లోకో
త్కృష్టుఁడు నన్నయ సుకవుల, కిష్టాపత్తిగ వచించె నెంతయుఁ బ్రీతిన్.

## వర్ణపరిచ్ఛేదమూలసూత్రంబులు ఆర్యావృత్తశ్లోకంబులు.

ప్రాణా స్సమాసతోఽచో బిందు రనుస్వార ఏ జఘో వక్రః,
వక్రతమ ఐజ్ఝల స్సృ శ్చ స్సమాసతః ప్రాణినో ద్రుతాఖ్యో నః.
కచటతపాః పరుషాఖ్యా గజడదబా స్తు సరళాః స్థిరా ఇతరే,
ఏతా స్సంజ్ఞా స్సర్వా జ్ఞాత్వా పశ్చా త్ప్రవర్తయే దత్ర.
బాలేందుపరిధిశృంగావర్తకుశగ్రంథిదాత్రపరశుసమాః,
ఆద్యా ఇభకరతుల్యా స్తద్దీర్ఘా శ్శూలసన్నిభా వన్యాః.
సిద్ధ స్సాధ్య శ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః,
హ్రస్వా త్పూర్ణోపి భవే ద్దీర్ఘా చ్ఛే త్ఖండ ఏవ స జ్ఞేయః.
దరశార్ఙ్గపిప్పలదళాంకుశపన్నగసన్నిభాః క్రమా త్పరుషాః,
స్తంభవిరేఖాధిక్యా స్త ఏవ వర్గద్వితీయవర్ణాద్యాః.

[1]కీరతరిహాస్తిమస్తకళుక్తితులాసనవితర్ద్రిసీరసమాః,
అంతస్థా శ్చోష్మాణో దంత్యా చజా గురురలా చ బిందుయుతా. 6
ఆద్యాయాః పఞ్చాశద్వర్ణాః ప్రకృతే స్తు తే దశోనా స్స్యుః,
సప్తత్రింశదిహాన్యే చానుప్రవిశంతి శబ్దయోగవశాత్. 7
ద్వివిధా దిదు దేదో తో చో వక్రతమా వనుస్వారా,
కగచజయుగటడణతదన పబమయరయుగలయుగవసహాశ్చ హాలః. 8
వికృతిపదాదా ప్రథమా స్తస్థ తృతీయానునాసికా న స్తః,
అయిగవుగాదేశౌ స్తః క్రమేణ సర్వత్ర వక్రతమయో ర్వా. 9
వా స్యా త్కచవటి ద్వకారో నాదిగః స్యాద్యవర్గసరళస్య,
అ ద్వితీయస్తాలవ్య శ్చ స్వక్రః స్యా న్నిత స్సవర్ణ శ్చ. 10
లఘూ లఘుప శ్చేతి ద్వేధా స్తస్థా న్విద న్తి శాస్తారః,
అన్యే న్వవ్యాకరణస్పృష్టా ర స్తత్ర గృహ్యతే ద్వివిధః. 11
అద్యః క్రియాసు [2]భూతాద్యర్థసముద్యోతితం వినా సర్వః,
యశ్రుతి మాత్యా లఘుయం ప్రవద న్తి ప్రాణతః పరం ప్రాణమ్. 12
క్వచి దపి న స్త ఉదోత్తా దంతో ఝభవస్య వికృతిశబ్దాదా,
నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం గయో స్తు నిత్యం స్యాత్.
శుభవర్ణా శ్శుభశబ్దా యే చ శుభగణా స్త ఏవ కావ్యాదా,
గ్రాహ్యాః పురా త్రిరసగిరిరుద్రేష్వకచటహమాతృకానింద్యాః. 14
*ఆద్యో[1]వళి ర్ద్వితీయో వర్ణః ప్రాసో త్ర పాదపాదేషు,
స్వస్వచరణేషు పూర్వః ప్రాస స్సర్వేషు చైక ఏవ స్యాత్. 15
వృత్తం జాతి శ్చేతి ద్వివిధం పద్యం గణై ర్నిసర్గాఖ్యైః,
సంబద్ధం వృత్తం స్యా దుపగణమాత్రాభి రన్వితా జాతిః. 16
శాస్తార ఏకమాత్రం లఘో ర్ద్విమాత్రే గురో రితి వద న్తి,
గౌ లౌ గగలలసంజ్ఞౌ గ్లౌ హాగణో లఘుగురూ లగౌ వగణః. 17
గత్రితయం లత్రితయం మనసంజ్ఞా వాద్యమధ్యమాంత్యల్గాః,
గురవ శ్చే ద్భజసగణా లఘవో యది యరతసంజ్ఞికాః క్రమశః. 18

---

1 కీరనాహస్తి (ప. వా.). 2 భూతార్థద్యోతిన మాద్యగం వినా.
* 15 30 శ్లోకముల వివరణము తృతీయాశ్వాసములో ఉన్నది.

మిత్రా నగలా విన్ద్రా నలనగసలభరతా శ్చన్ద్రా మ లఘుః,
రలరగతలతగనవనహా భలభగసలలనలలనగగనవసహాః. 19

దీర్ఘ స్సంయుక్తాద్యః పూర్ణానుస్వారపూర్వవర్ణ శ్చ,
ఏతే గురవ శ్శేషా స్సర్వే లఘ్వక్షరా ఇతి జ్ఞేయాః. 20

ఇతి శ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాన్ధ్రశబ్ద
చిన్తామణౌ వర్ణపరిచ్ఛేదో ద్వితీయః.

వ. ఈశ్లోకంబు లిరువదియును నలువదిరెండు సూత్రంబు లయ్యె నవి యెల్ల నిందు వివరించెద. 4

తే. కాంచనాంబర కవితాప్రపంచ మెల్ల, వర్ణరూపంబు గాన నావర్ణములకుఁ
గలుగుభేదంబు లెఱుఁగక కవిత వలుక, వలను గామి వచించెద వానినెల్ల. 5

వర్ణసంజ్ఞలు.

క. మాతృకలు వర్ణములు మఱి, భూతలమున వర్ణములు లిపులు వ్రాలు ననఁగ
దైతేయవిభంజన విఖ్యాతము లగు నక్షరాహ్వయము లివి యైనఁగ. 6

సీ. ఆదులు పదియాఱు నచ్చులు స్వరములు ముప్పదిమూఁడు కా మొదలు గాఁగ
నవనిపై హల్లులు వ్యంజనమ్ములు నయ్యె నీవ్యంజనములలో నిరువదేను
స్పర్శము లాదలియక్షరములు పయినాల్గు నంతస్థములు యకారాదికములు
పిదప శవర్ణంబు మొదలుగా నూష్మంబు లయ్యె నాస్పర్శంబు లైదునైదు
తే. వర్గములు గూడ నొక్కొక్కవర్గ మగును, వర్గవర్గంబుతుద లేనువర్ణములును
ధరణి ననునాసికము లనఁ బరఁగుచుండు, జమ్మికడఁ గామెపలి నున్నచక్రపాణి.

సీ. అత్వం బకారంబు ననఁ దలకట్టు నిక్కము దానిదీర్ఘ మాకార మయ్యె
నిత్వం బికారంబు నిది గుడుసు పే రీకార మన గుడి సెసఁగుదీర్ఘ
మమరు నుత్వము నుకారము ననఁ గుఱుచకొమ్మూకార మన దీర్ఘ యుత్వ మొంగ
మొనరు వట్రువ ఋత్వమును ఋకారము నన దీనిఁ జూపిన ఋత్వదీర్ఘ మనఁగ
తే. నేత్వ మేకార మైకార మైత్వ మయ్యె, నోత్వ మోకార మౌకార మౌత్వ మయ్యె
వసుధఁ బ్రత్యేకలిపు లైనవ్యంజనముల, పైనిఁ గూడిన నిమ్మాడ్కిఁ బలుకఁబడును.

తే. అత్తు నాత్తును మఱి యిత్తు నీత్తు నుత్తు, నూత్తు నేత్తును వెస నైత్తు నోత్తు నౌత్తు,
వరుసతో నివి షట్త్రింశ దక్షరంబు లయ్యె, నుంగలంబు, నొంగనుం దెలియంగవలయు నయ్య.

క. నిడుదలు నెఱియక్కరములు, పొడవులు చాఁపులును దీర్ఘములు నన నొక్కకై
వడివ్రాలు కుఱుచ లలరును, గిడుసులు గుజ్జులు ననంగ క్షితి హ్రస్వలిపుల్. 10
క. సున్న యన బొట్టనంగా, నెన్న ననుస్వారసంజ్ఞ లిలవలపల రెం
డున్నవి విసర్గ మనఁ జనుఁ, బన్నగపతిశయన ధవళపంకజనయనా. 11
ఆ. గజడదబలు మొదలుగా వర్గవర్గంబు, నందు మూఁడు మూఁడు హా యొకండు
యాదిలిపులు నాల్గు నన్యవర్ణయుతంబు, లైనళసలు ఘోష లనఁగఁ దనరు. 12
తే. ఒత్తు జడ్డయు ద్విత్వసంయుక్తములును, మహిని సంయోగవర్ణనామంబు లయ్యెఁ
బైస్వరము లేక కడుఁ దేలఁ బలుకఁబడిన, వ్యంజనంబులు పొల్లు లనం జెలంగు. 13

మూ. సూ.—ప్రాణా స్సమాసతో ఽచో బిన్దు రనుస్వార ఏ జథో వక్రః,
వక్రతమ ఐజ్ఝల స్స్యు స్సమాసతః ప్రాణినో ద్రుతాఖ్యో నః.
కచటతపాః పరుషాఖ్యా గజడదబా స్తు సరళా స్థ్సిరా ఇతరే,
ఏతా స్సంజ్ఞా స్సర్వా జ్ఞాత్వా పశ్చా త్ప్రవర్తయే దత్ర. 1

సీ. అచ్చులు ప్రాణంబు లని చెప్పఁబడు ననుస్వారంబు బిందుప్రశస్తిఁ గాంచు
నేత్వంబు నోత్వంబు నెసఁగు వక్రము లన వానిమీఁదివి రెండు వక్రతమము
లిలఁ బ్రాణు లనుపేర నేపారు హల్లులు ద్రుత మనంగ నకార మతిశయిల్లు
వర్గాదులను గలవర్ణంబు లైదును బరుషనామంబు లై ప్రణుతి కెక్కుఁ
తే. బంచవర్గతృతీయముల్ పరమపురుష, సరళముల్ శేషహల్లులు స్థిరము లయ్యె
శబ్దశాస్త్రంబు గాన నీసంజ్ఞ లెల్లఁ, దెలిసి యీగ్రంథమునఁ బ్రవర్తించు టొప్పు.

## వర్ణోత్పత్తిస్థానంబులు.

క. ఇమ్మహి ద్విస్థానోద్భూ, తమ్ములు వక్రయమవక్రతమయుగ్మవకా
రమ్ములు మఱియేకస్థల, జమ్ము లితరవర్ణములు భుజంగశయానా. 15
సీ. ఉదయించు నత్వంబు మొదలుగా రెండురెండచ్చులు వరుసతో నఱుతఁ దాలు
వుల నోష్ఠముల నవుదల దంతములఁ గంఠతాలువుల గళోష్ఠతలములందు
బొట్టు నాసను గళంబున విసర్గంబును గాదివర్ణము లైదు నైదు గూడి
తగఁ గంఠతాలుమస్తకరదోష్ఠముల నంతస్థములు తాలుమస్తకరదముల
తే. నూర్ధ్వదంతాధరంబుల నూష్మలిపులు, క్రమతఁ దాలుశిరోదంతకంఠములను
బలువ్రాయి శిరంబున బండిరాను, స్థానభేదంబు లేదు దంతములఁ జజలు. 16
వ. బలువ్రాయి యనఁగా దొడ్డళకార మనుట. 17

తే. అలఘుఅళిదంత్యచజలకు హ్రస్వవక్రములకు నిందుఁ బ్రత్యేకించి పలుకనియెడఁ
గ్రమతఁ దత్తత్ప్రధానవర్గముల కెవ్వి, యవియె వానికి నని తెలియంగ వలయు.

తే. అచ్చు లొకవర్గ మయ్యె స్పర్శాక్షరంబు, లయిదువర్గంబు లయ్యె యాద్యష్టకంబు
దలఁప నొకవర్గ మింకఁ గొందఱమతంబు,నూష్మములు నొకవర్గ మై యొప్పుచుండు.

శుద్ధాంధ్రలిపి లేఖనక్రమము.

క. మొదల నకారాద్యచ్చులు, పదియాఱును వానిపిఱుఁద బాణాసురదు
ర్మదహర కాదిలిపులు ము,ప్పదిమూఁడును బుట్టి వాక్ప్రపంచం బయ్యెన్. 20

మూ. సూ.—బాలేందుపరిధిశృంగావర్తకుశగ్రంథిదాత్రపరశుసమాః,
ఆద్యా ఇభకరతుల్యాస్తద్దీర్ఘా శూలసన్నిభా వర్ణాః. ౨

సీ. విదియచంద్రునిమాడ్కి వెలయు నత్వము దానికుడివంక శృంగంబుకొన గుణింపఁ
బ్రభవించుఁ దక్కినప్రాణంబు లెల్లను నడిమికి గుడిఁ జుట్టి విడుప నిత్తు
కుడి నావుకొమ్ముకైవడి వ్రాయ నుత్వంబు క్రిందను సుడి నిల్ప ఋత్వ మయ్యె
వలపల మీఁదికి వెలి గొన్న ఌస్వర మెడమ నెత్వం బొప్పఁ గొడవలిక్రియ

తే. యామ్యమున గండ్రగొడ్డలియట్లొనర్పఁ, గ్రాలు నోత్వ మిన్నింటిదీర్ఘములు కుడిని
గరికరాకృతిఁ దనరు డాకడవలపల, నమరు నైత్వౌత్వములు త్రిశూలములకరణి.

*వీనికి రూపములు.

–ఇది అకారము, –ఇది ఆకారము, –ఇది ఇకారము, –ఇది ఈకారము, –ఇది ఉకారము, –ఇది ఊకారము, –ఇది ఋకారము, –ఇది ౠకారము, –ఇది ఌకారము, –ఇది ౡకారము, –ఇది ఎకారము, –ఇది ఏకారము, –ఇది ఐకారము, –ఇది ఒకారము, –ఇది ఓకారము, –ఇది ఔకారము, "అనుక్త మన్యవత్" అనున్యాయము చేత నిశ్శబ్దానుశాసనసూత్రము నందుఁ జెప్పిన యనుస్వారమును, విసర్జనీయమును, సకలదేశప్రశస్తమైన నాగరలిపి యందు, నెటువలెనో, యటులఁ దెలిసికొనునది. తత్స్వరూపంబులు – ం – అం – ఇది పూర్ణానుస్వారము, ః – అః–ఇది విసర్జనీయము, ఇవి యచ్చులనంబడు.

అనుస్వారనిర్ణయము.

మూ. సూ.—సిద్ధ స్సాధ్య శ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః,
హ్రస్వా త్పూర్ణోఽపి భవే ద్దీర్ఘా చ్ఛేషోఽండ ఏవ స జ్ఞేయః.

*ఈరూపములు సరియయినవికావు. పూర్వకాలపువ్రాత ఎట్లుండెనో తెలియ గోరువారు బర్నెలువ్రాసిన 'సౌదిండియన్ పేలియోగ్రఫీ' అనేపుస్తకముగాని ఆంధ్రవిజ్ఞానసర్వస్వముగాని చూడవలెను.

సీ. పొసఁగ దీర్ఘాఖండపూర్ణంబు లనుపదంబులు సంజ్ఞ లౌ గట్టిబొట్టులకును
హ్రస్వఖండార్ధంబు లనుశబ్దములు మూఁడు నరసున్నలకుఁ బేరు లగుచు నుండు
శబ్దంబుతోడనె జనియించుబిందువు సిద్ధంబు నాఁగఁ బ్రసిద్ధ మగును
బుడమి నకారంబు చెడి యైనయాయనుస్వారంబు సాధ్యసంజ్ఞమున వెలయు.
తే. నిక్క మీసిద్ధసాధ్యంబు లొక్కటొకటి, ఖండపూర్ణంబు లన ద్విప్రకార మయ్యె
నవియె క్రమ్మఱ హ్రస్వదీర్ఘాక్షరముల, మీఁద రెండు తెఱంగులై మెఱయుఁ గృష్ణ.
ఆ. వెలఁది చెలఁగి నిన్నుఁ దలఁచిన నన సిద్ధ, ఖండబిందు వయ్యెఁ గమలనాభ
పొంక మైనయింతిపొందు సొం పగు నన, సిద్ధపూర్ణబిందు విద్ధచరిత 23
క. భువిఁ గొలిచెదఁ గాళిందీ, ధవు ననుచును వికృతులను ద్రుతంబులు చెడి బిం
దువు లైన వెల్ల సాధ్యో, ద్భవఖండము లయ్యెఁ గామెపల్లినివేశా. 24
క. కెందమ్ములు చెంగలువలు, మందర చెంగావిచీర మంగొం గన నీ
చందము లెల్లను నందిత, బృందారక సాధ్యపూర్ణబిందువు లయ్యెన్. 25

మూ. సూ: — హ్రస్వా త్పూర్ణోఽపి భవే ద్దీర్ఘా చ్చ ఖండ ఏవ విజ్ఞేయః.

తే. జగతిపై సిద్ధసాధ్యసంజ్ఞలఁ బొసంగు
ఖండములు హ్రస్వలిపులపై నుండెనేని
వానిఁ బూర్ణంబులను జేయ వచ్చుఁ గృతులఁ
బూర్ణములు ఖండములు సేయఁ బొసఁగ వెందు. 26

క. కొలఁకులకుఁ గొలంకులు నాఁ, దలఁపులకుఁ దలంపు లిట్లు తగ సిద్ధము లై
చెలు వందుఁ జిఱుతసున్నలు, వెలయును బూర్ణంబు లగుచు విషధరతల్పా. 27
క. జలజాక్షుఁ గొలుతు ననుచో, జలజాక్షుం గొలుతు ననుచు సాధ్యార్ధము భూ
తలమున నెరసున్నయు నై, చెలు వగుఁ గామెపలివాస సిద్ధోల్లాసా. 28
తే. నిడుద లగునక్కరములపై నిలిచినట్టి, యర్ధబిందువు [1]లన్నియు నరసి చూడ
ధరణి సిద్ధంబు లైన సాధ్యంబు లైన, ఖండములె కాని పూర్ణముల్ గావు సుమ్ము.
ఆ. లోఁగ వించు కైన జాఁగతనంబున, దోఁచి వలువ లెల్ల దాఁచినావు
గీఁజాబూర కొమ్ము నేఁ జన వలె నన్న, నిడుదమీఁద సున్న నిలుచు సగము. 30
తే. హల్లులను బంచవర్గంబులందు మొదలి, వర్ణములకును మూఁడవవర్ణములకుఁ
దక్క నితరాక్షరములకు దాపలికడ, నాంధ్రపదమధ్యమునఁ బుట్టదయ్యె బొట్టు.

1 లెలను.

సీ. కొంకక వీకపైఁ గొమ్మతోఁ జనుదెంచి ముంగల నాఁగినమురు వధించె
మించి చెయ్యాఁచక మేదినీసుతుఁ ద్రుంచి నెంజిలి రోఁజుకన్నియలఁ గొనియె
మింటితోఁటను గలమేటివృక్షము దెచ్చి మెండుగా వేఁడిన మెలఁత కిచ్చె
వింత సేఁతల గోపకాంతల వలపించి [1]పొం దూఁది బహువిధంబుల రమించె
తే. కంపుతూఁపులు గలవన్నె కానిఁ గాంచెఁ, గంబమునఁ బుట్టెఁ దాఁ బేటికరణినొప్పె
నౌర హరి యనఁ బూర్ణంబు లర్థములును, బరుష సరళాదులను గనుపట్టు నిట్లు. 32
తే. సగముజాబిల్లివలె వ్రాయ సగముసున్న, నిండుజాబిల్లివలె వ్రాయ నిండుసున్న
యయ్యెనీభేదము లెఱింగి యాంధ్రకృతుల, వ్రాయఁదగుబిందువులు పొండవేయపక్ష.
వ. c ఇది యర్థబిందువు, ౦ ఇది పూర్ణబిందువు. ఇంకను అచ్చులన్ని వరుసను వ్రాయుచున్నాము.

మూ. సూ:-దరశార్ఙ్గపిప్పలదళాంకుశపన్నగసన్నిభాః క్రమాత్పరుషాః,
స్తంభ విరేఖాధిక్యే స ఏవ వర్గద్వితీయవర్ణాద్యాః. 5
సీ. శంఖశార్ఙ్గద్విపాశనదళాంకుశపన్నగాకృతులను మీఁద నడ్డరేఖ
వలపల నొక్కటి నిలుపంగఁ బరుషంబులైనను వరుసఁ జెన్నారుచుండుఁ
గ్రిందఁ గంబముపోల్కి గీఁటొక్కటిడిన నాద్యములు రెండవలిపులై పొసంగుఁ
బైనున్న గీఁటు లిబ్బడి సేయఁ బ్రథమాక్షరంబులు సరళవర్ణంబు లగును
తే. గంబమొక్కటి రేఖాయుగంబు క్రింద, వ్రాసినఁ దృతీయమును జతుర్థంబు నగును
నిలువుగీఁటులు రెండునుం గలసి తమ్ముఁ, గదియ దొల్లింటి వనునాసికంబు లగును.

హల్లులకు రూపంబులు.

క - ఇది క్ కారము, ఖ - ఇది, ఖ్ కారము, గ - ఇది గ్ కారము, ఘ - ఇది ఘ్ కారము, ఙ - ఇది ఙ్ కారము, చ - ఇది చ్ కారము, ౘ - ఇది ౘ్ కారము, ఛ - ఇది ఛ్ కారము, జ - ఇది జ్ కారము, ౙ - ఇది ౙ్ కారము, ఝ ఇది ఝ్ కారము, ఞ - ఇది ఞ్ కారము, ట - ఇది ట్ కారము, ఠ - ఇది ఠ్ కారము, డ - ఇది డ్ కారము, ఢ - ఇది ఢ్ కారము, ణ - ఇది ణ్ కారము, త - ఇది త్ కారము, థ - ఇది థ్ కారము, ద - ఇది ద్ కారము, ధ - ఇది ధ్ కారము, న - ఇది న్ కారము, ప - ఇది ప్ కారము, ఫ - ఇది ఫ్ కారము, బ - ఇది బ్ కారము, భ - ఇది భ్ కారము, మ - ఇది మ్ కారము. ఇవి స్పర్శము లనంబడును.

[1] పొందూఁచి (ప).

మూ. సూ:—కీర[1]తరిహస్తిమస్తకశుక్తితలాననవితర్దిసీరసమాః,
అంతస్థా శ్చోష్మాణో దంత్యచజౌ గురురలౌ చ బిందుయుతౌ. 6

'తరి' అనఁగా నావకు పేరు.

తే. శుకతరిమతంగభవకుంభశుక్తిసన్ని,భంబు లంతస్థములు తులాభద్రపీఠ
వేదికౌహాలనిభములు శాదిలిపులు, దంత్యచజగురురలలకుఁ దనరు బొట్టు. 35

య - ఇది య్‌కారము, ర - ఇది ర్‌కారము, ఱ - ఇది ఱ్‌కారము. ల - ఇది ల్‌కారము, వ-ఇది వ్‌కారము. ఇవి యంతస్థము లనంబడు.

శ - ఇది శ్‌వర్ణము, ష-ఇది ష్‌కారము, స - ఇది స్‌కారము, హ - ఇది హ్‌కారము, ళ- ఇది ళ్‌కారము. ఇవి యూష్మము లనంబడు.

క. పొల్లు లయి తాము వ్రుట్టియు, హల్లులు ప్రాణములతోడ నంబుధితనయా
వల్లభ కూడి కదా తల, ములు గుడులు శృంగములును మొదలుగఁ దాల్చుఁ. 36
వ. అది యెట్లనిన. 37

## క్‌కారముతోడ నచ్చులుగూర్చి గుణించెడివిధము.

క- ఇది క్‌. క్‌కారమునకు తలకట్టు ఇచ్చిన క. తలకట్టున దీర్ఘమిచ్చిన కా. క్‌కారమునకు గుడిఇచ్చిన కి. గుడిలోదీర్ఘమిచ్చిన కీ. క్‌కారమునకు కొమ్ముఇచ్చిన కు. కొమ్మున దీర్ఘమిచ్చిన కూ. క్‌కారమునకు వట్రువసుడియిచ్చిన కృ. వట్రువసుడిని దీర్ఘమిచ్చిన కౄ. క్‌కారమునకు ఌత్వమిచ్చిన కౢ. ఌత్వమునకు దీర్ఘమిచ్చిన కౣ. క్‌కారమునకు ఎత్వమిచ్చిన కె. ఎత్వమునకుదీర్ఘమిచ్చిన కే. క్‌కారమునకు ఒత్వమిచ్చిన కొ. ఒత్వమునకు దీర్ఘమిచ్చిన కో. క్‌కారమునకు ఐత్వమిచ్చిన కై. క్‌కారమునకు ఔత్వమిచ్చిన కౌ. క్‌కారమునకుఅరసున్న పెట్టిన కఁ. నెరసున్న పెట్టిన కం. క్‌కారమునకు విసర్గములు పెట్టిన కః. ఇటువలెనే హల్లుల కెల్లను వ్రాయవలయునని తెలిసి కొనునది. 38

## ఇది స్వరగుణితము.

తే. ఎన్నిహల్లులు జడ్డలై యున్న నేమి, పొల్లులకు మీఁద నుండెడుహల్లులెల్లఁ
గడపటను వ్రాయఁద్విత్వ మొక్కటియె తాల్చు,దానితలకట్టు మొదలైనవాని నెల్ల.

[1] నౌ.

వ. ప్రద్యుమ్నుఁడు — ... ... ఇటువలెఁ గ్రిందను వ్రాసినయొత్తులకే తలకట్లు మొదలైనవి వ్రాయునది. ఈ లిపియందు రేఫమునకు నొత్తులు వ్రాయునదిగాని వలపలగిలక లేదు. అది యెట్లనిన. 40

తే. మొదల రేఫాక్షరంబు నాపిదప దాని
జడ్డయును గూర్చి యొకటిగాఁ జదువుకొనుచు
ముందు జడ్డయు వెస రేఫమునకు బదులు
గిలుక [1]లిఖియించియు వచింతు రిలఁ గుమతులు. 41

వ. స్వర్గ మనుటకు— ... యిటుల వ్రాయునది. 42

క. పద్యాది ప్రాణంబుల, నాద్యంతాంతస్థములుగ నజ్ఝలు కృతులం
జైద్యహర వ్రాయుదురు తము, విద్యాధికు లెల్లఁ జూచి వికవిక నవ్వన్. 43

క. ఇరు లీఁగ లుఋ లూ ళ్ళు, వ్వరు నేమిటి కొక్కఁ డొప్పు వానికి ననుసీ
కరణిపదంబుల మొదలివి, స్వరము లనుచుఁ దెలిసి వ్రాయఁ జనుఁ బద్యాదిన్. 44

క. బలుబొట్టుల పైవర్ణం, బుల క్రిందట నవియె మరల మూఢమతులు జ
డ్డలు చేసి వ్రాయుచుందురు, విలిఖింపరు వాని నెందు ద్విత్వము లార్యుల్. 45

ఆ. హల్లుమీఁద నున్నహల్లు దానికి ద్విత్వ, మొందుఁ గాని వేఱె యొకటి గాదు
సంధివేళ నది విచారించి వ్రాయుచోఁ, బాప రెందు దాని ప్రాజ్ఞు లెల్ల. 46

## పంచాశద్వర్ణనిర్ణయము.

మూ॥ సూ॥ ఆద్యాయాః పంచాశద్వర్ణాః ప్రకృతే స్తుతే దశోనాస్సన్తి,
సప్తత్రింశదిహాన్యే చానుప్రవిశంతి శబ్దయోగవశాత్. 7

తే. అయిదుపదులగు సురభాష కక్షరమ్ము
లందుఁ బది ప్రాకృతమునకు నడఁగిపోవు
[2]దొలఁగి చనుఁ బదియును మూఁడు దెలుఁగుబాస
కెసఁగుఁ దత్సమపదముల నేఁబదియును. 47

## వరరుచివచనము.

శ్లో॥ ద్విషట్ఛాశ ఏచో నుస్వారో విసర్గ ష్షోడశ స్వరాః,
స్పర్శా అంతస్థ్సా ఊష్మాణ శ్చతుస్త్రింశ ద్ధల స్స్మృతాః

1 విభజించియు లిఖింతు రిలఁ గుమతులు. 2 దొలఁగిచనునని పదచ్ఛేదము.

టీ. ద్విధా=రెండువిధములైన, అకః=అక్ప్రత్యాహారము, అక్కులనఁగా—అ ఇ ఉ ఋ ఌ, అనెడి ఈ యయిదక్షరములకుఁ బేరు. అది యె ట్లనఁగా.

పాణినీయసూత్రములు:—

హలన్త్యమ్.

వృ. ఉపదేశే న్త్యం హ లి త్స్యాత్.

టీ. ఉపదేశే=సూత్రమునందు, అంత్యం=తుదదిఅయినటువంటి, హల్=వ్యంజనాక్షరము (తుదపొల్లు), ఇత్=ఇత్తనుసంజ్ఞ గలది, స్యాత్=అగును—ఇందుచేత నిత్తనఁగ సూత్రముకొన నున్న పొల్లు అనుట.

ఆది రన్త్యేన సహేతా.

వృ. అన్త్యేన ఇతా సహితః ఆదిః మధ్యగానాం స్వస్య చ సంజ్ఞా స్యాత్.

టీ. అన్త్యేన=కడపటనున్న, ఇతా=ఇత్తుతోడ, సహితః=కూడుకొన్న, ఆదిః=మొదటిఅక్షరము, మధ్యగానాం=నడుమనుండెడు నక్షరములకును, స్వస్యచ=తనకును, సంజ్ఞా స్యాత్= పేరగును. కడపట నున్న యిత్తుతో కూడుకొన్నటువంటి మొదటి అక్షరమునడుమనుండెడునక్షరములకును దనకును పేరగును. ఇటన్నందుచేత తుద నున్న క కారమునకు పొల్లు పనిలేదాయెను గనుక.

సూ:—తస్య లోపః.

వృ. తస్యేతో లోప స్స్యాత్.

టీ. దానికొన నున్న యిత్తునకు లోప మవును. ఇందున్న కవర్ణము పొల్లు లోపముకాఁగాను జిక్కిన యయిదక్షరములును హ్రస్వములుగాను దీర్ఘములుగాను నుచ్చరించిన అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ అని పదిఅయెను. ఏచః= ఏ, ఓ, ఐ, ఔ, చ్ అను ఏచ్ప్రత్యాహారమునందు మునుపటివలె కొన నున్నచకారము పొల్లగనుక మిగిలినవి నాలు గాయెను.

సూ:— "ఏచ్ హ్రస్వో నాస్తి"

అను సూత్రముచేత ఈయేచ్చునకు హ్రస్వము లేదు గనుక ఏ, ఓ కారములు గీర్వాణభాషయందు కలుచలులేవు. అనుస్వారః=పూర్ణబిందు వొకటి (సంస్కృతము నందు పూర్ణమేకాని ఖండము లేదు.) విసర్గః=విసర్జనీయ మొకటి ఇవన్నియు కూడంగాను, స్వరాః=అచ్చులు, షోడశ=పదియాఱు, స్పర్శాః=స్పర్శములు ఇరువదియైదు, అంతస్థోష్మాణః=అంతస్థములు నాలుగును దొడ్డళకారమును, ఊష్మములు నాలుగును, హలః=వ్యంజనములు, చతుస్త్రింశత్=ముప్పదినాలుగు, అచ్చులు పదునాఱు, హల్లులు ముప్పదినాలుగు, ఉభయములు గూడ నేఁబది వర్ణము లాయెను.

తే. అచ్చు లొకపదియా ఱను వ్యంజనములు
పాండుపుత్ర సహాయ ముప్పదియు మూఁడు
దొడ్డళ్లా యందులోపలఁ దొరల నయ్యె
నమరభాషకు నేఁబది యక్షరములు. 49

సీ. ఏకసిళము దేవహేళనంబు నటంచు యాజుషామ్నాయంబునందు లేదొ
కాళనాళవ్యాళగోళహింతాళంబు లనుచు సంస్కృతభాషయందు లేదొ
గయ్యాళి త్రుళ్లు నంగళ్లు వజ్రపుతళ్కు తాళియటంచు నాంధ్రమున లేదొ
పాళం బెళుంగనికూళ విరాళి పిసాళించు ననుచు దేశ్యమున లేదొ

తే. యాగమజ్ఞులు దొడ్డబీజాక్షరంబు, లందు లేకున్కి సన్నంబు నదియుఁ గూడ
నొకటిగాఁ జేసి బీజోపయోగి గాన, ళాను జేకొని రది శబ్దసరణి గాదు. 50

వ. ఆగమజ్ఞులు పంచాశద్వర్ణంబులలో నున్నళకారమును గూడుకొన్నందునకు మహావిద్యలోనిశ్లోకంబులు. 51

శ్లో. మూలాధారం గుదస్థానం స్వాధిష్ఠానం తు మేహనం,
నాభి స్తు మణిపూరాఖ్యం హృదయాబ్జ మనాహతం,
తాలుమూలం విశుద్ధాఖ్య మాజ్ఞాఖ్యం నిటలాంబుజం,
సహస్రారం బ్రహ్మరంధ్ర మిత్యాగమవిదో విదుః.

శా. ఆధార స్తు చతుర్దళో రుణరుచి ర్వాసాంతవర్ణాశ్రయః
స్వాధిష్ఠాన మనేకవైద్యుతనిభం బాలాంతషట్పత్రకం,
రత్నాభం మణిపూరకం దశదళం డాద్యం ఫకారాంతకం
పత్రై ర్ద్వాదశభి స్సనాహతపురీ హైమీ కఠాంతాన్వితా.

శా. ద్వ్యష్టారం స్వరషోడశై శ్చ సహితం జ్యోతిర్విశుద్ధాంబుజం
హం క్షేత్యక్షరపద్మపత్రయుగళం రత్నోపమాజ్ఞాపురీ,
తస్మా దూర్ధ్వ మధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం
నిత్యానందమయీ సదాశివపురీ శక్త్యై ! నమ శ్శాశ్వతం.

తే. కావున మా జడ్డ యైన ళకార మగుట, దలఁప కేఁబదిలిపులలోఁ దానిఁగూర్చి
తొలుత భిన్నాక్షరం బైనదొడ్డళాను, విడిచి పెట్టె ననంతుండు వెఱ్ఱి గాఁడె. 52

వ. ఛందమునందు ననంతుఁడు చెప్పినవిధము. 53

క. యరలవ లంతస్థులు నాఁ, బరఁగును శషసహలు దేటపడు నూష్మ లనన్
సొరిది క్షకారము గూడుక, సరి నేఁబది యయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్. 54

క. ళశలకు భేదము లే దను, పలుకున శా దాలఁగి యైదుపదు లగు వర్ణం
బులు సంస్కృతభాషకు మఱి, తెలుఁగున ఱళ లనఁగ రెం డధిక మగుఁ గృష్ణా. 55

## ప్రాకృతోనాక్షరపరిగణన హేమచంద్రాచార్యవచనము.

శ్లో. ఋౡవర్ణౌ హ్రస్వదీర్ఘౌ వైజాద్యా వనునాసికౌ,
శషౌచ దశ తే న్యూనాః ప్రాకృతోక్తిషు సర్వతః.

టీ. హ్రస్వదీర్ఘౌ=హ్రస్వమును దీర్ఘమును ఐనటువంటి, ఋౡవర్ణౌ=ఋకార ౡకారములును, అనఁగా ఋ, ౠ, ఌ, ౡ అనునవి ఈరెండును, ఐచ్=ఐఔలును, ఆద్యౌ=మొదటి వైనటువంటి రెండును, అనునాసికౌ = అనునాసికములును, అనఁగా మొదటియనునాసికము లైనఙకార ఞకారము లనునవి, శషౌ చ=శవర్ణ షకారములును, తే దశ=ఆపదివర్ణములును, ప్రాకృతోక్తిషు=ప్రాకృతవచనముల యందు, న్యూనాః=తక్కువ. అనఁగా సంస్కృతభాషకు చెప్పిన యేబదింటిలో ఋ, ౠ, ఌ, ౡ, ఐ, ఔ, ఙ, ఞ, శ, ష, అనునీపదివర్ణములు ప్రాకృతభాషకు తక్కువ యగుచున్న వనుట.

తే. సప్తమస్వరముఖచతుష్టయము ద్వాద, శస్వరంబును లోకసంఖ్యాస్వరంబు
నుర్వి నాద్యనునాసికయుగము శషలు, ప్రాకృతంబున నిక్కు మీపదియు లేవు.

వ. లోకసంఖ్యాస్వర మనఁగా గణితశాస్త్రోక్తసంఖ్యను జతుర్దశలోకములు గనుక పదునాలవస్వర మనుట. ఔకారమునకు పేరు. 57

## ఆంధ్రభాషావర్ణసంఖ్య.

మూ. సూ:—ద్విविధాదిదు దేవో త్తో చో వక్రతమా వనుస్వారా,
కగచజఙ్యుగటడణతదనపబసుయురయుగలయుగవసహాళ్ఛహాలః.

సీ. అచ్చులలో సప్తమాక్షరం బాదిగా వరుస నాల్గును దుదివర్ణ మొకఁడు
స్పర్శాక్షరములందుఁ బంచవర్గములను సమము లై యుండునక్షరములు పది
మొదలివ్యంజనవర్గములను రెంటను దుదిఁ గనుపట్టుననునాసికద్వయంబు
నూష్మవర్ణము లన నొప్పునాల్గిటిలోనఁ బ్రథమద్వితీయాక్షరములు రెండు

తే. సెన్న నిరియొండు కడమగా నిరువదియును, జగతి శుద్ధాంధ్రదేశ్యభాషాపదముల
వెదకినను లేవు తత్సమపదములందుఁ, దనరు నిన్నియు నది సంస్కృతంబు గాన.

క. తుదలను వికృతివిభక్తులు, గదియుటచేఁ దెలుఁగులందుఁ గలసెను గాకో
యదువర తత్సమపదములు, మొదలాద్యప్రకృతిశబ్దములు దెలుఁగగునే. 59

సీ. దేవతాభాషను దీర్ఘంబులే కాని కలసైనఁ గుఱుచలు గాక యుండు
హారవిశ్వాదివసంఖ్యాచ్చులు దెలుఁగులఁ గడు హ్రిస్వములును దీర్ఘములు నగును
సంస్కృతంబునఁ దాలుజననమాత్రమె కాని జగతి నన్యస్థానసంభవంబు
చర్చింప నెఱుఁగనిచజ లాంధ్రమునఁ దాలుజాతంబులును దంతజములు నగును
తే. దలఁప నేకప్రకారమై దైవతోక్తు, లందు భేదంబు లేని రేఫాక్షరంబు
రేఫము అకారమును నన రెండు దెఱఁగు, లగుచు వికృతులఁ దనరు దుగ్ధాబ్ధిశయన.

వ. హారవిశ్వాదివసంఖ్యాచ్చు లనఁగాను గణితశాస్త్రోక్త సంజ్ఞను, హార యనఁ బదునొకొండవయచ్చు ఎకారము, విశ్వ మనఁగాఁ బదుమూఁడవయచ్చు ఒకారము, దివస మనఁగాఁ బదునేనవయచ్చు అఁ అనునది. యీమూఁడచ్చులకును దెలుఁగున హ్రిస్వమ్మును దీర్ఘమును గల వనుట. అం అనుదానికి దీర్ఘముగాఁగా అం అయెను. ఇంతమాత్రమున కచ్చులమొదల నకారంబును అకారంబును రెండును ఉన్నవి దానికిం జెప్పరాదా దీనికిఁ జెప్పవలెనా అనఁగా, ఇవి అకారమునకు చెప్పుట గాదు. అనుస్వారము ప్రత్యేక ముచ్చరింప శక్యము కాదు గనుక పాణిన్యాచార్యులవ్యాకరణమునందు అం ఇత్యనుస్వారః అని అకారముతోఁ గూర్చి చెప్పినాఁడు గనుక అం అనఁగాను బిందువునకు సంజ్ఞ. ఆబిందువునకు హ్రిస్వదీర్ఘము లెటువలెకలుగు నసఁగా ముంగలిపద్యముచేతను దెలిసికొనునది. 61

ఆ. బిందువునకు రెండు భేదంబు లగు హ్రస్వ, దీర్ఘరూపములను దెలుఁగులందు
హ్రస్వమనఁగ నొప్పు నర్ధబిందువు దీర్ఘ, మనఁగఁ బూర్ణబిందు వయ్యెఁ గృష్ణ. 62

క. తక్కువపదియును దొమ్మిది, యెక్కువలిపు లాఱు నయ్యె నేఁబదిలో నీ
లెక్కను మూప్పదియును నే, డక్కరములు నిలిచె శుద్ధ మగునాంధ్రమునన్. 63

వ. తత్తద్వర్ణభేదాభేదంబు లెఱింగించెద. 64

మూ. సూ:—వికృతిపదాదౌ ప్రథమాంతస్తృతీయోఽనునాసికో న స్తః.

క. తెలుఁగున యణకారంబులు, గలుగవు శబ్దాదులను యకారముపగిదిన్
బలుకఁబడునవి స్వరము లగు, ఖలపూర్వామరవినాశ కామెపలీశా. 65

క్రారకొమ్ములు.

సీ. క్రుజ్ క్రుధ క్రూర శిగ్రు శ్రుతి విశ్రుతి శుశ్రూష నిఃస్రుతి స్రు స్రువములు
భ్రూణ భ్రుకుంశ బభ్రు భ్రువాణంబులు భ్రుకుటిత భ్రూలతా ప్రకటితములు

క ద్రువ ద్రుపద ద్రుమ ద్రుహిణ ద్రుహి సౌరద్రు విద్రుమ శత్రువులును
ధ్రువమును ద్రుతమును భువిఁ గ్రారకొమ్ము లై తనరారుఁ గాని ఋత్వములు గావు
తే. వట్రువలు లేవు తెనుఁగున వానిపగిదిఁ, బలుకులిపు లెల్లఁ గ్రారకొమ్ములు నిజంబు
దునుము నిందాకఁజైద్యుఁడు ద్రుళ్లనఁగ,రోహిణీభర్తచరమాద్రిఁ గ్రుంకెననఁగ.

నృసింహపురాణమునందు :—

సీ. పా. క్రూరకిల్బిషశైలకులిశనిపాతంబు ఘనకలుషోరగగరుడమూర్తి.(అ. 2. 35.)
వ. మఱియు. 67
చ. శ్రుతిమతధర్మయోగములు చోద్యపుమూల్యము లప్పురంబునన్
జతురతఁ బుణ్యవస్తువులు సారవిముక్తిపదంబు లమ్మనా
రతులితవిష్ణుశాసనసమాహితు లైనమహాత్ము లంచితో
ద్ధతిఁ గొనువారు భూరివిహితవ్రతపారగు లైనబోధనుల్. (అ. 1. 46.) 68

కావ్యాలంకారచూడామణియందు:—

క. భావమె యించుక వదనా, వ్యావళితవికాస మైనహావము శృంగా
రావిర్భావనిదానము, భ్రూవల్లీమందచలనమున నెఱుఁగఁబడున్. (అ. 2. 22.)

ప్రభావతీప్రద్యుమ్నమునందు:—

సీ. పా. సురటి చేకొని భద్ర శుశ్రూష గావింప. (అ. 2. 15) 70
ఆ. అద్రువ విద్రువ నను క్రియాపదంబులయందుఁ, దగిలి వట్రసుడులపగిది నుండు
వ్రాలు తేలఁ బల్కుఁ గ్రారకొమ్ములు గాని, వట్రసుడులు గావు వనజనాభ. 71

ఋత్వాక్షరంబులు.

సీ. ఋష్యమూకాద్రియు ఋష్యశృంగుండును ఋక్షమృగేంద్రుండు ఋక్షపదము
ఋతము ఋత్విక్కు నైరృతి ఋతుషట్కమ్ము ఋతుపర్ణభూపతి ఋతుమతియును
ఋషభవాహనుఁడును ఋషియు ఋగ్వేదంబుఋభురాజుఋణమును ఋద్ధిఋజువు
ననునీపదంబుల కాదివర్ణంబులు సప్తమస్వరము లై జగతి వెలయుఁ
తే. గృష్ణ వృత్రాంతకా హృషీకేశ మదన, జనక పృథ్వీకుమారభంజన యటంచు
కాల్గులందును వట్రువ లమరి యుండు, సంస్కృతంబున యదువంశసార్వభౌమ.

వక్రభేదంబులు.

ఆ. ఏక మొక మిట్టు లేత్వంబు నోత్వంబు, నమరభాష నిడుదలు లగును గ్రాగ
హ్రస్వలిపులు గావు హల్లుపై నట్లన, యగును గేకికోకిలాలి యనఁగ. 73
ఆ. పెక్కు- రేల కృష్ణుఁ డొక్కఁ డోపఁడె పసి, నెలవు నేల యరసి పొలము వోవ
ననఁగ నిట్టు లెనుఁగులందు వక్రయుగంబు, హ్రస్వములును నిడుదవ్రాలు నగును.

## వ్యంజనలోపము.

ఆ. పూని నెగనెఁ బోదవెఁ బోనరెఁ బొందె నటన్న, పలుకులందు మొదలఁగలుగునట్టి
వ్యంజనంబు లడఁగి వానిపై స్వరములు, నిలుచు వలసినపుడు నీరజాక్ష. 75

పూని యనుటకు విష్ణుచిత్తీయమునందు:—

ఉ. పూని ముకుందునాజ్ఞఁ గనుబొమ్మనె [1]కాంచి యజాండభాండముల్
వానను మీఁదఁ బ్రోవ నడవం గొనెఁ ద న్నన నగ్రనిశ్చల
త్వాన్నచలత్వనిష్ఠ లె సమస్తజగంబులజాడ్యచేతనల్
గా నుతి కెక్కుసైన్యపతికాంచనవేత్రము నాశ్రయించెదన్. (ఆ. 1. 4) 76

పాల్గు లోప మైన ఊనె అనుటకుఁ బారిజాతాపహరణమునందు:—

క. మానవతి యిట్లు మానని, మాన క్రోధముల చేత మరలిచి చింతా
దీనగతి నుండ మదిలో, నూనినప్రేమమున నంబుజోదరుఁ డనియెన్. (ఆ.1.114)

నెగనె అనుటకు ఆదిపర్వమునందు:—

ఆ. కర్మబంధములను గ్రక్కునఁ బాయుచుఁ, బుణ్యగతికి నెగయుపురుషునట్లు
బంధనంబు లెల్లఁ బాయుచు భీముఁడు, నీరిలోననుండి నెగయఁ దెంచె. (ఆ.5.177)

విరాటపర్వమునందు:—

సీ. పా. నెగసినకోపలతో నింగి యంతంతకు నపలఁబోవఁగఁ దనరారుదాని. (ఆ.1.162)

ఉద్యోగపర్వమునందు:—

క. ఎఱకలు విచ్చుచుఁ దుండము, దెఱచుచు వ్రే గడఁచి సొగసి త్రెళ్లి వివశుఁ డై
యఱచిన నోడకు ముని వారి, నెటి చక్కఁగఁ ద్రోచి యెత్తె నెగయఁగఁ గృపతోన్.
(ఆ. 3. 301)

వ్యంజనలోప మైనందులకు శృంగారనైషధమునందు.—

సీ. పా. ఒంటికాలున నిల్చి యూర్మిమారుతములఁ జిగురుటెక్కలరేకు లెగయుచుండ.
(ఆ. 3. 69)

పొదవె నన్నందుకు నృసింహపురాణమున:—

తే. అదరిపాటున [3]వెస విచ్చి పొదవికొనినఁ, [4]దొలఁగి పోవఁగఁ గూడకమలయపవనుఁ
డిందుఁదిఱఁదూర్చుకొనియెనోయిప్పుడనఁగ, వమరుఁదాళవృంతములమందానిలంబు.

---

1 దాల్చి. 2 లఁజేత మాటిచ్చి (అచ్చుప్రతి). 3. వేసవి. 4 గలఁగి తలఁగి పోవ్వే రక. 5 నా నింపొనర్చి (అచ్చుప్రతి).

అం దే:—

తే. పొదవి యొండొండ దివియును భువియు దెసలుఁ
బొదవికొని యుండుచీఁకటి ప్రోవువలన
మిక్కుటంబుగఁ గాటుక గ్రుక్కినట్లు
కరవటం బన జగదండ ఖండ మమరె. (ఆ. 3. 80) 83

అం దే:—

క. అది యట్లు గాదె నిప్పనఁ, జెద లంటునె దేవదేవు శ్రీరమణీశుఁ
మదినుంచుకొన్న వానిని, బొదవునెయాపదలు రవిని బొందునె తమముల్. (ఆ.4.32)

అచ్చునకుఁ జిత్రభారతమునందు:—

క. తదనంతరంబ గ్రమ్మఱ, యదువిభుఁడు కృపావిధేయుఁ డై వాణీశ
త్రిదశేశుల కాశ్చర్యం, బొదవ మనిచె

ఉద్యోగపర్వమునందు:—

క. పదపడి దుస్తర మగునీ, పదుమూఁడవయేఁడు గడవఁబడుట యరిది ద
క్షుఁడు తెలుఁగకుండ నాపద, లొదవఁగ సైరించి రిట్టి యునికియుఁ గలదే. (ఆ.1.9)

పొనరె నన్నందుకు నుద్యోగపర్వమునందు:—

క. ధనమును విద్యయు వంశం,బును దుర్మదులకు మదంబుఁ బొనరించును స
జ్జను లైనవారి కడఁకువ,యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా. (ఆ.2.35)

అం దే:—

మ. అని ని స్సెచ్చి వృకోదరుం డతఁడు కార్యం బింత తెల్లంబుగాఁ
బొనరం బల్కెనె యంచుఁ జేరెలుఁగు సొంపుం జెంద వక్త్రంబుపా
ల్పున దర్పం బొలయంగ నంగములకుం బొం గారుతద్భ్రంహిత
ధ్వని యై మించుమహోగ్రసింధురముచందం బొందె పొల్చెం దగన్. (ఆ.3.143)

పకారములో నిస్వర మే నిల్చినందుకుఁ బ్రబంధపరమేశ్వరుఁడు చెప్పిన

అహోబలమాహాత్మ్యమునందు:—

క. నిను నాశ్రయించియును నే, నసఘా కడ లేనిపసట యనుపవనిధిలో
మునుఁగుదునె ప్రతీకారం, బొనరింపఁ గదయ్య దీని కూహించి కృపన్. 89

హరిశ్చంద్రోపాఖ్యానమునందు:—

చ. ధనదునిపుష్పకంబునకుఁ దానెన వచ్చు నటంచు లోకముల్
వినుతి [1]యొనర్పఁ బొల్పెసఁగి విద్రుమహాటకీక శిలవజ్ర కాం

1 యొసంగె (ప).

చనయుతము న్స్వవేగవాయసంఘటితంబును నైనతేరు నొం
పొనరఁగ నెక్కి మిక్కిలి సముత్సుకతం బురబాహ్యవీథులన్. 90

పొందె ననుటకు శంభుదాసునిలక్ష్మీనృసింహావతారకథయందు:—

ఉ. పొందవు దుఃఖము ల్భయము పొందదు పొందదు దైన్య మెమ్మెయిం
బొందవు తీవ్రదుర్దశలు పొందుఁ బ్రియంబులు పొందు సంపదల్
వొందు సమగ్రసౌఖ్యములుఁ బొందు సమున్నతకీర్తు లెందు గో
విందపదారవిందపదవీపరిణద్ధగరిష్ఠచిత్తులన్. (ఆ. 2. 31) 91

ఓదాదేశహ్రస్వంబులు.

తే. కాంచు హ్రస్వద్వితీయవక్త్రంబు నంద, యొక్కఁ డనువీని రెండవయక్కరంబు
హ్రస్వ మగుఁ జోటనుపదంబునందు మొదలివర్ణము గబ్బములను గావలసినపుడు.

'అందోఱు' అనుట కాదిపర్వమున:—

క. [1]గిఱపు నెడ నేయు నెడ వడిఁ, [2]బఱపు నెడం బెనఁగు నెడ నపారబలంబుల్
మెఱయు నెడ భీమునకు నం,దొఱు గీడ్పడఁ దొడఁగి రుద్ధతులు రాజసుతుల్. (ఆ.5.168)

ఆరణ్యపర్వమునందు:—

సీ. పా. కూరులు ధృతరాష్ట్రసుతులు దుర్యోధనాదులు దురాధర్షు లందొఱును మనకు.
(ఆ. 1. 269)

ఒత్వము రానందుకు విరాటపర్వమునందు:—

క. ఎఱుక గలవారి కైనను, గఱపక దక్కు రుచితప్రకారము శుభముల్
గొఱలుహితు లట్లగుట నం,దఱకును జెప్పంగ వలయుఁ దగియెడుబుద్ధుల్. (ఆ.1.116)

ఒక్కొ యనుటకుఁ గర్ణపర్వమునందు:—

మ. సమదాటోపత వాయునందనుఁడు ధృష్టద్యుమ్ను సైనేయు లే
కమనోవృత్తిఁ గడంగి తో నడువ దోర్గర్వంబు శోభిల్ల శౌ
ర్యము నొంపార నిలింపకోటి వొగడన్ రారాజుసైన్యంబు లొ
క్కొ మొగిం బెల్లగిలంగ బెట్టదిమె సత్క్రోధాంతరంగంబునన్. (ఆ. 2.352)

మనుచరిత్రమునందు:—

క. ఇట నవ్వరూథినియు నొ,క్కొటఁ గతిపయసఖులు దన్నుఁ గొలిచి నడువఁగాఁ
గటకఝుళంఝుళరవపద, కటకసమాకృష్టకేళికలహంసిక యై. (ఆ. 3. 72) 97

1 క ·చు. 2 బఱచు.

రాఘవపాండవీయమునందు:—

స్రగ్ధర. ఆరాజన్యోత్తముం డిట్లనుదితరథసుం డై భవత్సత్వరవ్యా
హారం బిట్లోర్చి యుం టన్యముగఁ గొనకు మాత్మాంగనాశుల్కతాద్య
క్సారోగ్రేష్వాస మ ట్లశ్రమజిత మగు బెంచంగ నాచేతికాటం
గ్రూరేష్వాసంబు లేదొక్కఁడు గలుగునె మద్ఘోరయుద్ధంబునైపక౯. (ఆ. 2. 93)

ఓకారము రానందులకుఁ గాశీఖండమున:—

ఉ. కంటికి నిద్ర వచ్చునె, సుఖం బగునే రతికేళి, జిహ్వకు౯
వంటక మిందునే, యితరవైభవము ల్పదివేలు మానసం
బంటునె మానుషంబు గలయట్టిమనుష్యున కెంతవానికి౯
గంటకుఁ డైనశాత్రవుఁ డొకండు తనంతటివాఁడు గల్గిన౯. (ఆ. 1. 108) 99

విరాటపర్వమునందు:—

సీ. పా. శక్రాదిసురలతో సంగ్రామ మొనరించి ఖాండవం బేర్చె నొక్కరుఁడు గాఁడె.
(ఆ. 4. 210)

చోటు అనుటకు ద్రోణపర్వమునందు:—

క. కటకట పేరినపెన్నెత్తుట జొత్తిలి యున్నమోముతోడను గొడు కె
చ్చటఁ బడి యున్నాఁడో య, చ్చోటుఁ జూపెడువారు లేరె చూచెద వాని౯.
(ఆ. 2. 251)

విష్ణుచిత్తీయమునందు:—

మ. స్ఫుటభూయోవ్యాతిశంక వార్ధిరవిరశ్మిల్ మున్నుఁ జేర్పం దటి
చ్ఛటగార్యంబుగఁ గాఱుకొంచు ఘనమై త్వాధీర వర్షింప న
చ్చోటునం ద్రోచి గ్రసింపఁ బోలుఁ గలశీసూనుండు గాకున్న నో
క్కోటఁ దారాగ్రహభాస్కరేందుమణిశుక్తుల్ వ్యక్తమై తోఁచునే.
(ఆ. 4. 145)

హ్రస్వము గానందులకు మనుచరిత్రము:—

ఉ. పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక నీవు ద్రోయ ని
చ్చోట భవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొను మంచుఁ జూపి య
ప్పాటలగంధి వేదన[1]నెపం బిడి యేడ్చెఁ[2]గలస్వనంబున౯
వాటిన విచ్చుగబ్బిచనుమిట్టల నశ్రులు చిందు వందఁగా౯. (ఆ. 2. 70) 103

1 నెపంబున నే. 2 గలస్వనంబుతో.

వక్రభేదంబులు. పాణినీయసూత్రము.

సూ.—తద్ధితే ష్వచా మాదేః.

వృ. ఇతి జితి చ తద్ధితే పరే అచా మాదే రచో వృద్ధి స్స్యాత్.

క. హైయంగవీనమునకు, నైయంకవశబ్దమునకు నైయగ్రోధ
స్త్రైయజితాదుల కాదిని, ప్రాయంగా వలయుఁ బ్రథమవక్రతమంబుల్. 104

క. వైయర్థత్రైయంబక, వైయాకరణాగ్రగణ్యవైయాఘ్రపదీ
వైయాత్యంబుల మొదలను, వ్రాయం దగు బుధులు ప్రథమవక్రతమంబుల్. 105

క. యౌవనయౌవత కౌస్తుభ, సౌవర్ణకయౌవరాజ్యసౌవీరమహీ
దౌవారికశబ్దంబులఁ, దావుకొను ద్వితీయవక్రతమములు మొదలన్. 106

క. సౌవగ్రామిక శౌవన, [1]సౌవర్చససౌవిదల్లసౌవస్వలస
త్సౌవరశబ్దముల మొదల, వావిరినిలుచున్ ద్వితీయవక్రతమంబుల్. 107

నృసింహపురాణమునందు:—

ఉ. శ్రీస్తనకుంకుమద్రవనిషిక్తభుజాంతరభాగవిస్ఫుర
త్కౌస్తుభనూతనార్కరుచిగర్వితనాభిసరోజసౌరభ
ప్రస్తుతమత్తభృంగరవరాగరసోల్బణభోగిభోగత
ల్పాస్తరణుం దలంచు సుకృతాత్ము లపాస్తసమస్తకల్మషుల్. (అ. 2. 37) 108

క. మెచ్చొప్పగుకబ్బములలో, నచ్చతెనుఁగుపల్కులందు నైత్వౌత్వంబుల్
వచ్చిన నొం డగు రెం డగు, విచ్చలవిడి వలసె నేని విబుధస్తుత్యా. 109

మూ. సూ:-అయుగవుగాదేశౌ స్తః క్రమేణ సర్వత్ర వక్రతమయో ర్వా.

క. క్రమమున వక్రతమములకు, నమరు నయిక్కును నవుక్కు ననియెడునాదే
శములు వికల్పంబున దైత్యమదాపహ యాంధ్రభాషయం దెల్లెడలన్. 110

ఆ. లోకహితముకొఱకుఁ బైకొని దుష్టుల, నయ మొనర్చి శిష్టు లయిననృపుల
నేల యేల నిలిపెఁ గౌలిచ్చి నలుదెసఁ, దవిలి కృష్ణరాయఁ డవుర యనఁగ. 111

కవర్గాక్షరభేదంబులు.

మూ. సూ:—వా స్యాత్క్వచి ద్వకారో నాదిగత స్యాద్యవర్గసరళస్య.

సీ. పరుగులు పరువులు పగడంబు పవడంబు పగలుట పవలుట పగలు పవలు
నగుబాటు నవ్వుబాటు నలుగురు నలువుర తెగులాట తెవులాట తొగలు తొవలు

1 సౌవర్చన సౌవిదల్ల సౌదర్భ్య (అచ్చు).

త్రాగుట త్రావుట ప్రేగులు ప్రేవులు ప్రోగులు ప్రోవులు సోగ సోవ
యిగ మివ మగు నవు నిగురాకు లివురాకు లీగు లీవులు మ్రానిచేగ చేవ

తే. తీగియలు తీవియలు పయిఁ దిగిచెఁ దివిచె
ననుచు నిబ్బంగి నొకవేళ నాదివర్ణ
ములకుఁ దక్కంగఁ గొన్ని మాటలను గృతులఁ
బ్రథమసరళంబులకు వకారములు వచ్చు. 112

పూర్వనైషధమునందు:—

మ. పవిసంగంబునఁ దాప మొందినశచీప్రాణేశుకెంగేలికిం
జివురుంగైదువజోదువైద్య ముపదేశించెన్ రహస్యంబుగా
నవనీహారపయోమిళన్మలయజస్నానార్ద్రపర్యంకమై
యివతాళించువిదర్భరాజతనయాహృద్యస్తనద్వంద్వముల్. (ఆ. 3. 34) 113

శాంతిపర్వమునందు:—

చ. వినుము నరేంద్ర విప్రుఁ డలివెన్ జమదగ్నిసుతుండు శాప మి
చ్చె నమరభర్త వంచనము చేసె వరం బని కోరి గొంతి మా
న్చె నలుక భీష్ముఁ డర్ధరథుఁ జేసి యలంచెఁ గలంచె మద్రరా
జనుచిత మాడి శౌరి విధి యయ్యె [1]నరుం డనిఁ జంపెఁ గర్ణునిన్. (ఆ. 1. 35) 114

మార్కండేయపురాణమునందు:—

చ. ఘననిబిడాంధకారరిపు[2]ఖండనచండమయూఖరాజిచే
ననుదినముం బ్రభాతములయం దమృతాంశుమరీచు లేఁగఁగా
వనజము లుల్లసిల్లఁగఁ [3]దొవ ల్మడుఁగం బ్రథమాద్రిఁ బొల్చున
ద్దినమణికి న్నభోమణికి దేవశిరోమణి కేను మ్రొక్కెదన్. (ఆ. 7. 23) 115

తే. ఆఁగె లోఁగెను వీఁగెను డాఁగె నేఁగె, ప్రాఁగె నన్నునివి మొదలగువాక్యములను
బొదలునక్షరములు చిన్నబొట్లుపైఁ గ, కారములు గాని యున్నవానికమ్ములు గావు.

చవర్గాక్షరభేదంబులు.

మూ. సూ:—అద్దంత్యా స్తాలవ్యా శ్చ ర్వకశ్రి: స్యా న్మిథ స్సవర్ణా శ్చ. 6

ఆ. ధరణి దంత్యములును దాలవ్యములు నన, వికృతిచజలు రెండువిధము లయ్యె
వీనిఁ దెలియ కున్న విశ్రమభంగంబు, దొడరి కావ్యములను దోష మొందవు. 117

1 నరుం డటు నంపె. 2 ఖండపిచండ. 3 ద్రోవల్మొగుడం ; దొవల్ముడుఁగం.

ఆ. దంతజంబు లెల్లఁ దలకట్టులును వాని, యందు దీర్ఘములును బొంది యుండుఁ
దాలుజాక్షరములు దనరారు హ్రస్వాది, వక్రయుతము లగుచు వనజనాభ. 118

ఆ. చలము మాని కుడువు చట్టకేశవ ప్రొద్దు, చాల నయ్యెఁ బసిప్రజంబు వెడలె
జతలు గూడి వచ్చి సఖులు చీరెద రేల, జా గనంగ దంతజంబు లయ్యె. 119

ఆ. చెప్ప రాని క్రొవ్వుచేఁ గంసు పంపునఁ, జెలఁగికొనుచుఁ దన్నుఁ జేరి పెనఁగ
జెట్టి మట్టుబెట్టెఁ జిఱుతయే నందుని, పట్టి యనఁగఁ దాలుభవము లయ్యె. 120

ఆ. చేతఁ జీర లైను చేరెడువరహాలు, జేనెఁ డంత జిత్తు చేక టొకటి
చేదుకొనియెఁ గృష్ణుఁ జేర్చుక యన నిట్లు, వఱలుఁ గొన్ని దీర్ఘవక్రలిపులు.

తే. దంత్యముల నరవంకలు దైవభాషఁ, గనము తాలవ్యములఁ దలకట్లు లేవు
ప్రాకృతమునందుఁ దద్భవపదమునందు, దంత్యములె కాని తాలుజాతములు లేవు.

వ. వక్రమునకుఁ దద్భవము వంకలు, అరవంక లనఁగాను గుఱుచయెత్వములు అనుట.
దీర్ఘమునకుఁ దద్భవములు తీఁగలు. 128

ఆ. చందమామ గాయఁ జక్కెరవిలుకాఁడు, జాజిపువ్వుటంపజల్లు గురియఁ
జామ గాక కోర్వఁ జాలక హరి వచ్చు, దనుక బడలె ననఁగ దంత్యచజలు. 124

తే. చంద్రమశ్శబ్దమునకుఁ దజ్జంబు చందమామ జాతికి జాజి శ్యామకును జామ
శర్కరకుఁ జక్కెరయు జలము (?)

వ. చంద్రమశ్శబ్దతద్భవంబు చందమామ, జాతికి జాజి, శ్యామకు చామ, శర్కరకు చక్కెర, జలమునకు "లళయో రభేదః" అనుసూత్రముచేత జళము, దానికి "లడయో రభేదః" అనుదానిచేత జడ మాయెను. అది ప్రాకృతముచేసిన నాది వర్ణము దంత్యమాయెను. అది తద్భవముచేసి బహువచనముచేసిన జల్లు. 125

క. తొడరు జటాశబ్దమునకు, జడ యనునది తద్భవంబు చదలును జానం
గడు నచ్చ తెనుఁగు లిపి పద్యపడి మూఁడును దంత్యములుగఁ బలుకఁ దగు హరీ.

వ. జటాశబ్దతద్భవము జడ. 127

ఆ. జడలు మెఱయ వచ్చి సంయమిశ్రేష్ఠుఁడు, చదలుమ్రానిపువ్వు శౌరి కిచ్చె
సరస నున్నదనుచు జా నొప్ప భీష్మక, తనయ కిచ్చె నతఁడు దగ వెలింగి. 128

పారిజాతాపహరణమునందు:—

సీ. గీ. దేహకాంతు[1]లు బాలచంద్రికల నీన, జడలు మోత్కుదుపల్లవశంకఁ జేయ.
(ఆ. 1. 44) 129

1 లకాలచంద్రికల (అచ్చు పారిజాత.).

నైషధమునందు:—

సీ. పా. చదలేటిబంగారుజలరుహంబుల[1]తూండ్లు,భోజనంబులు మాకుఁ బువ్వుఁబోఁడి.
(ఆ. 2. 49)

అనంతునిఛందమునందు:—

ఉపజాతి. పినాకికోదండము బిట్టు ద్రుంచెన్, జా నొప్ప గెల్చె న్జను
ఘనుం డితం డుర్వి ననంగ రెంటన్, జా నైనవృత్తం బుపజాతి యయ్యెన్. 131

క. భూమినిఘంటునఁ జంచః, పామరజాతీయ యనుట పరికించి బుధ
గ్రామణులు చంచు లని వెసఁ, దా మేత్వం బిడరు వడికి తలకట్టగుటన్. 132

తే. ప్రాసముల రెండు నొకటిగాఁ బలుకవచ్చు
వడికి స్వరమైత్రి లేకున్న నడుగ రాదు
పొట్టియెత్వములకు దంత్యములకుఁ దక్క
భేదములు లేవు చజలకు వేదవేద్య. 133

ఆ. రాచనెలఁతలందు నేచెలియకు భోజ,రాజతనయవంటి యోజ గలదె
చక్కఁదనము గాక సద్గుణంబును గాంచెఁ, జెఱకుఁగోల ఫలముఁ జెందినట్లు. 134

తే. దంత్యతాలవ్యచజలకు ధరణి వ్రాయు, తఱిని శుద్ధాంధ్రలిపిని భేదంబుకలిమి
ద్వ్యర్థకృతులను దలకట్టు లనుచునొకట, నిడియునొకదాన నదియునునిడఁగరాదు.

రాఘవపాండవీయమునందు:—

ఆ. ఎందు వేఁట రారె యితరు లేమన సుతో
దారసంగసుఖము తప్పఁ ద్రోచి
తకట పాండురాజయశ మెన్న నై తతి
క్రూరదశరథేశకులము రోయ. (ఆ.1. 29) 136

వ. ఈపద్యములోను రామాయణార్థమునందు అజయశ మని సమాసము చేసి పలుక జకారము తాలవ్యమాయెను. భారతార్థమునందు పాండురాజ యని సంబుద్ధిగాఁ బలుక అవర్ణమే పరల దంత్యం బాయెను. ఇటువలెనే యాదిమహాకవిప్రయోగంబులు చూడఁగాను, దాలవ్య మర్థాంతరమందు దంత్యముగా చెప్పరాదని యెట్లంటివోయి యనఁగా ఆద్యప్రకృతియందు దంత్యచజలు లేవు గనుక శుద్ధసంస్కృతమైనపాండురాజశబ్దమునందు గల జకారము తాలవ్యమే కాని దంత్యము కానేరదు. ఇది తెలియక కేవలాంధ్రులు దంత్యాక్షరముగా నుచ్చరింతు రది లాక్షణికమతము కాదు. అట్లగుటం జేసి కవితాప్రవర్తకులైన సూరపరాజుగారు ఇంతవట్టును విచారించి ప్రయోగించిరి. 137

1 తూండ్లు (ఒ).

పాణినీయసూత్రము.

సూ:—ఛే చ.

వృ. హ్రస్వస్య, ఛే పరే తుగాగమ స్స్యాత్సంహితాయాం విషయే. 'హ లంత్య' మితిసూత్రేణ కకారస్య ఇత్సంజ్ఞా. "తస్య లోప" ఇతిలోపః తు, "ఉప దేశే జనునాసిక" ఇతి ఉల్లోపః.

సూ:—స్తో శ్చునా శ్చుః.

వృ. స్తోస్సకారతవర్గయోః శకారచవర్గాభ్యాం యోగే శకారచవర్గౌ స్తః. [1]శివచ్ఛాయా.

సూ:—ఆఙ్మాఙో శ్చ.

వృ. ఏతయో శ్ఛే పరే తుగాగమ స్స్యాత్. అచ్ఛాదయతి, మాచ్ఛినత్. 'పదాంతా' ద్వేతి వికల్పాపవాదః.

సూ:—దీర్ఘాత్.

వృ. దీర్ఘా చ్ఛే పరే తు క్స్యాత్. హ్రీచ్ఛతి, మ్లేచ్ఛతి.

సూ:—పదాన్తాద్వా.

వృ. దీర్ఘా త్పదాన్తా చ్ఛే పరే తు గ్వా స్యాత్, లక్ష్మీచ్ఛాయా,లక్ష్మీఛాయా.

సీ. ఛాగపుచ్ఛచ్ఛటాచ్ఛందోయదృచ్ఛాసితచ్ఛత్రపద్మచ్ఛదచ్ఛలాచ్ఛ
విచ్ఛిత్తికచ్ఛాపకచ్ఛపరిచ్ఛేదపృచ్ఛాచ్ఛవిచ్ఛిరతుచ్ఛగుచ్ఛ
పదములు మొదలైనత్రిదశభాషాశబ్దముల నాదిమధ్యాంతములను గలుగు
సప్తమవ్యంజనాక్షరము హ్రస్వముమీఁదఁ దనక్రిందఁ దాన ద్విత్వ మగుచుండు
తే. నిడుద లుసనక్కరములకుడిన నిలుచు, నప్పడ వికల్పకంబున నట్లన యగు
బంధురవిలాస చంద్రికాభదరహాస, భర్మమయవాస శ్రీకామెపలినివాస. 138

టవర్గాక్షరభేదంబులు.

ఆ. తవర తీవి తేవ తావును థాకయు, మొదలుగా ద్వితీయములు చతుర్థ
వర్ణములును గలుగువాక్యంబులును స్వదేశ్యములు గాని వైకృతములు గావు. 139

విజయవిలాసమునందు:—

క. కొమ్మప్పయి నీవు పక్షము, లిమ్మెయి నెరపును వి దేల యేచెద నకటా
కమ్మఁగ నవాతుచక్కెర, గ్రమ్మఁగ మాటాడు తవర కలకంఠవరా.(ఆ.౩.56) 140

1 శివ (తుక్+తు+త్+చ్), చ్ఛాయా.

మనుచరిత్రమునందు:

క. దివి బిసరుహబాంధవసైంధవసంఘుం బెంతదవ్వు దగ లే కరుగున్
భువి నంతదవ్వు మేమును, దవదవ లే కరుగుదుము హుటాహుటినడలన్. 141
(అ. 1. 76)

పాండురంగమాహాత్మ్యమునందు:—

సీ. గీ. సఖులు పరిహాసకులు వెంటఁ జనఁగ యువతిభుక్తనిర్ముక్తపరిధానయుక్తుఁడగుచు
నగర ఘంటాపథంబున నగుచుఁ దిరుగు, నొఱపుగలతివి జాతిమాత్రోపజీవి. 142
(అ. 3. 10)

రామాభ్యుదయమునందు:—

సీ. పా. [1]తేవ మీఱఁ దటిన్నటీపంక్తిఁ బ్రేరించి కోపుగా మెఱుములు గొనఁగఁ జేసి.
(అ. 6. 18)

సుభద్రాపరిణయమునందు.

శా. దేవబ్రాహ్మణభక్తిప్రోవు ప్రియవక్తృత్వంబు కాణాచి వి
ద్యావైశేష్యముదిక్కు ధర్మమునకుం దార్కాణ మర్యాదకున్
తా వౌచిత్యముజీనగట్టు హితశిష్టవ్రాతసంతోషణ
శ్రీవజ్రాంగి యజాతశత్రుఁడు మహీభృన్మాత్రుఁ డే చూడఁగన్. (అ. 1. 85)

శశిబిందుచరిత్రమునందు:—

క. నాకాకసు లైనను నీ, ఢాకకు నిల్చెదరె కటకటా మముఁబోట్లం
జేకొని సంరక్షింపక, యిటు లుచితంబె యురవణింప నరేంద్రా. 145

సీ. క్ష్వేళంబు క్ష్వేడంబు చోళుఁడు చోడుఁడు తాళంబు తాడంబు దళము డడము
క్రోళంబు క్రోడంబు నాళంబు నాడంబు నీళంబు నీడంబు గౌళి గౌడి
వ్యాళంబు వ్యాడంబు చూళిక చూడిక జళి జడి హేళి సర్వజ్ఞహేడి
జలకేళి జడకేడి వెలలుఁడు వెడలుఁడు కేళంబు కేడంబు పాళి పాడి

తే. నేవళము నేవడం బిట్లు నిర్జరాంధ్ర
భాషలను రెండు గొన్నిశబ్దంబులందు
నరయ "లడయోరభేద" యటన్నసూత్ర
మున ళకారంబునకు డత్వములు ఘటించు. 146

1. తేవ మీరంగఁ దటిన్నటి ప్రేరేచి క్రొవ్వుగా మెఱుపులు గొనఁగఁజేసి (పూ. ము.).

సీ. డిండీరదీప్తి పోఁడిమి మీఱు నీకీర్తి దిండీరపాండిమఁ దెగడు నవ్వు
డంభ మిచ్చటను గూడదు కృష్ణ నీ వేగి దంభంబు మిత్త్రవిందకడఁ జేయు
డాడిమీఫల మిద్యోడకు నేల కొనిపొమ్ము దాడిమీఫలము సుదంత కిమ్ము
డోలిక నూఁగువేడుక నీకుఁ గల్గిన దోలిక లక్షణతోడ నెక్కు

తే. మనుచు నీపద్యమునఁ జరణాదులందు, నిలుపుపదముల మొదలును గలుగువ్రాలు
డత్వదత్వంబులందు రెంటను బొసంగు, శాబ్దికమతంబునను వనజాతనయన. 147

తే. డంభడిండీరడోలికాడాడిమాది, శబ్దముల కాదివర్ణంబు సంస్కృతమున
నపరివర్తితృతీయమై యొప్పునట్లు, తెనుఁగున డకారము [1]దవర్ణ మొనరుచుండు.

తే. దాక దగ్గర దిగ్గియు దాయ దోయ, దాపలను దిగ్గు మను వైకృతముల మొదల
డాక డగ్గరి డిగ్గియు డాయ డోయ, డాపలను డిగ్గు మని డాకడంగి నిలుచు.

రాజశేఖరచరిత్రమునందు:—

శా. డాకేల న్నిజకన్యకామణులు కంఠశ్రేణి గీలించి వీ
ణాకంజాతము లాత్మపాద నఖరేఖం దార్చి సంగీతవి
ద్యాకౌశల్యము గానరా మదికి నాహ్లాదంబు సంధిల్లఁగా
రీకల్యాణము వాడి రప్పుడు పురంధ్రీరత్నముల్ వేడుకన్. (ఆ. 3. 167) 150

ద్రోణపర్వమునందు:—

చ. డిగకుఁడు వాహనంబులు గడిందిమగంటిమి గోలుపోవ మీ
ర గడఁక [2]దక్కిపెట్టకుఁడు రూపఱ నాయుధము ల్మహాస్త్రశ
క్తి గెలుతు [3]సేన మత్కులిశతీవ్రశరంబులకై భవంబు [4]భూ
రిగదవిహారభంగియు నరిప్రకరంబులు పిచ్చలింపఁగన్. (ఆ. 5. 381) 151

ఉద్యోగపర్వమునందు:—

ఉ. దక్కను రాజ్య మంచు నకటా యిటు తెమ్మనిభాగ మీక నీ
వెక్కటి మ్రింగఁ జూచెద వ దెట్లరుగున్ వినుమీను లోలతన్
గ్రక్కున నామిషంబుచవి గాలము మ్రింగినమాడ్కి సువ్వె యి
ట్లుక్కివుఁ డైననీకొడుకునుల్లము నిన్నిటు లాడఁ [5]గూడునే. (ఆ. 2. 52) 152

1. దవర్ణమునకు వచ్చు (ప); దవర్ణము నగుచుండు (వా). 2 దక్కిటిల్లనుఁడు (వా); దక్కిదిల్లనుఁడు (ప). 3 జంపఁ దత్కులిశ (వా); ఁజూమద త్కులిశ (ప); గోత్రభిత్కులిశ (అచ్చు). 4 భూరిగను విహారభంగుల (వా). 5 గూలునే (వా).

వైజయంతీవిలాసమునందు:—

తే. దొంగవలె వచ్చి యిక్కడ [1]దొంగిలావు, దేవయా బావగారు పెద్దామె కోప
గించినందులకో బళా మంచివాఁడ, వేమనందును ముసలాపె యేవివేకి. 153
(అ. 4. 36)

వ. డంభడిండీరాదిశబ్దములవలె నేయన్నందుచేతను రెండునుగలవు గనుక దకారమునకు.

ఆరణ్యపర్వమునందు:—

క. జగముల నెల్లను నిండిన, పొగడ్తను వెలితి చేసి పొలయొడలికి నై
తగు నేజన్మవ్రతములు, దిగ విడువఁగ నిపుడు నాకుఁ ద్రిభువనదీపా.* (అ.7.290)

ఉద్యోగపర్వమునందు:—

క. తగ నీలో నూహింపుము, దిగ విడువక ధర్మతనయు దృఢమతి వై పొం
దగుచందముకొడుకులకును, బ్రెగడలకును జెప్పి [2]తేర్పఁ బెంపేర్పడఁగన్. (అ.2.95)

పారిజాతాపహరణమునందు:—

ఉ. తామర[3]డోయలోఁ దవిలి దాఁటెడు తేఁటులువోలెఁ బెన్నెఱుల్
వేమఱుఁ జేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులన్
గోమలలీల దువ్వి తెలిగొజ్జఁగినీ రటు చల్లి చల్లి గం
ధామలకంబు వెట్టె నొకయంగన కాళియనాగభేదికిన్. (అ.2. 10) 156

తే. పడఁతుక వడంకుగుబ్బలిపడుకచెంతఁ, గడమ మ్రాఁకులకడ నుండుఁ గడఁకతోడ
వేఁడుకొనఁ దగు నాపువ్వుబోఁడి ననఁగఁ, గడలిపులు గావు సరళము ల్గాని కృష్ణ.

నృసింహపురాణమునందు:—

సీ.పా. వడిగాలి సుడిసిన మిడుఁగురులందందఁబొదవినఁ దాలిమి[4]వదలనీక.(అ.2.14)

అందే:—

చ. కడిఁదివరంబు వారిరుహగర్భునిచేఁ గొనినాఁడు వాఁడు మీ
యెడ ననిశంబు పెన్పగయు నీసును రోషము నెమ్మనంబులో
జడి గొని యుండుఁ గావున నసాధ్యుఁ డవధ్యుఁడు దైత్యనాథుఁ డే
వడువునఁ బౌరుషంబు గొని వాని జయించుట ప్రేఁగు చూడఁగన్. (అ.2.135)

రాఘవపాండవీయమునందు:—

సీ.పా.పుడమి ఱేఁడీరీతిఁగడఁగి డెందమునమృగవ్యాపారఖేలనమభిలషింప. (ఆ.1.19)

---

* అచ్చుప్రతిలో పాఠాంతరము లున్నవి.

1 దొంకి (ప.వా). 2 తీర్పు. 3 దోయలో (ప). 4 ప్రిదుల (అచ్చు).

తే. పోఁడిమియు నురువడియును నాఁడెమునను
బలుకులఁ దృతీయసరళముల్ వలసినపుడు
భువి స్వకీయానునాసికంబులును గాఁగఁ
బలుకఁబడు నాదికవులకబ్బములకలిమి.

రంగనాథుని రామాయణమునందు ద్విపదము:—

రాణివాసద్రోహి రావణుఁ బట్టి, పోణిమి చెఱుపవా బుధులు నుతింప. 162

రాఘవపాండవీయమునందు ద్విరదగతి రగడము:—

పోణిమిగ వకుళకుజపున్నాగములఁ బూగములు,రాణఁ దనరారినపరాగములు రాగములు.
(ఆ.2.6)

కర్ణపర్వమునందు:—

తే. సారవంత మై కర్ణునిసైన్య మురవణించఁ గా కేమిటికి నిల్చి నృపవరేణ్య
పూని చేయంగ[1]ఁ దగినవి గానకార్య, మతని సమయించుటయె నాకు నదిభరంబె.
(ఆ.2.148)

శాంతిపర్వమునందు:—

*చ. యజనము దానకర్మములు నధ్యయనంబు తప స్సహింసయుక్
ప్రజ కనురాగ మైనపరిపాలన శాంతియు సంగరంబున
న్విజితవిభీత మై యురవణించుటయు న్నృప ధర్మముల్ కురు
వ్రజతిలకా యమాన సమరంబు సుధర్మము వీనిలోపలన్. (ఆ.2.224) 164

చంద్రికాపరిణయమునందు:—

ఉ. నాణెము [2]నూడ నున్నదితినందను లందఱు నొక్కరాశి యై
ప్రాణులఁడు వీఁ డొకండు నొకరాశి యటుండు జగంబు గాల్పఁ గ
ల్యాణవిదూరు లొకడమయండఱు పుణ్యజనాఖ్యులు న్జగ
త్ప్రాణసమాఖ్యుఁ డీఖలుఁడు నైరి సుఁడీ [3]విపరీతలక్షణుల్. 165

తవర్గాక్షరభేదంబులు.

ఆ. వెలికి వాని కలికె జలికిలఁ బడి యావు, బిలుక చీర లులికె గొలికె ననుచుఁ
బల్లుకుచోఁ దకారముల దకారములును, వలసె నేని నిలుప వచ్చుఁ గృతుల. 166

---

* అచ్చుప్రతిలో పాఠభేదములున్నవి.

1 వలయుఁ బ్రధానకార్య, మతనిసమయించుటయు (అచ్చు). 2 నూదనొ్న (ప). 3 విపరీతలక్షణన్ (బా).

కవిగజాంకుశమునందు:—

క. ఒదుగుచు లక్షణ మెఱుఁగక, గొదుకుచుఁ బ్రాసంబు వడియుఁ గూడక మీఁదుల్
వెదకుచుఁ బదసంధులు చెడ, నదుకుచు వెడకవిత చెప్పు నతఁడుం గవియే. 166

ఆముక్తమాల్యదయందు:—

చ. కదళిగభీరపుష్పపుటికాచ్ఛటఁ జేతుల నిప్పపిండి పైఁ
గుదురుగ నిల్పి యోఘ్రగతి గూనల నూనియనించి త్రాట మూ
న్నుదికినశాటి వ్రేల నది నొక్కుటఁ గ్రుంకిడి వత్తు రెండ చేఁ
వదలక యాతనింట శనిశారమునం [1]బరదేశవైష్ణవుల్. (ఆ. 1. 83)

చిత్రభారతమునందు:—

చ. చదివినవారికి న్వినినసభ్యుల కున్నది వాంఛ సేయుబ
ల్లిదులకుఁ గల్గు విప్రులకు లేఁగలతోఁ గనుపట్టులక్షపె
న్మోదవుల నిచ్చునట్టిఫలము న్హయమేధము సేయుపుణ్యముం
గోదకక ధాత్రి యంతయు నమంతతేదాన మొనర్చుశ్రేయముం 168

కళాపూర్ణోదయమునందు:—

చ. అది శతతాళదఘ్న మనుసార్థకనామముతోడ నుత్తమ
ప్రదములలోఁ బొగడ్తఁ గనినట్టిది యందునఁ బడ్డవానికిం
బ్రదుకులె యంచు (ఆ. 4. 56) 169

వసిష్ఠరామాయణమునందు:—

చ. కదిసిన[2]నోరువోయిమఱి కబ్బపుదొంతులసత్పదార్థముల్
గదుకుచు నెట్టివారిఁ బొడగన్నను గుబ్బనిస్నేహసౌఖ్యముల్
మదికి [3]నసహ్యమౌ శునకమార్గమునం [4]జరియించుచున్నత
త్పదకవు లెల్ల మత్కవిత తప్పులు పట్టక యూరకుండుఁడీ. (ఆ. 1. 7) 170

అంతస్థభేదంబులు:-

శబ్దానుశాసనమూలసూత్రము.

మూ. సూ:—లఘవో లఘువ శ్చేతి ద్వేధా న్తస్థా న్వద న్తి శాస్త్రారః,
అన్యోఽన్య ద్వ్యాకరణస్పష్టా ర స్తవత్ర గృహ్యాతే ద్వివిధః. 12

1 బరదేశి (అచ్చు). 2 నోరవోవుమరు; నోరువోయిమొరు. 3 నసహ్యమై.
4 జరియింపనున్న సత్పద; జరియింపుచున్న సత్పద,

క. అలఘులఘునామకంబుల, నలరు నిరుదెఱంగు లగుచు నంతస్థము లీ
తెలుఁగున నయ్యెను రేఫము, యలవలు సెప్పఁబడి యుండు వ్యాకరణములన్.
క. ఆద్యంతాంతస్థంబులు, చోద్యం బగుపాణినీయసూత్రమువలనన్
హృద్యము లై యాగమసంవేద్యా లఘ్వలఘువు లన ద్వివిధము లయ్యెన్. 172
వ. యవలు రెండువిధము లయినందునకు.

పాణినీయసూత్రము.

సూ. హలి సర్వేషామ్.

వృ. భోభగోఅఘోఅపూర్వస్య లఘ్వలఘూచ్చారణస్య యకారస్య లోప స్స్యా ద్ధలి సర్వేషాం మతేన; భోదేవాః, భోలక్ష్మీః, భోవిద్వద్బృంద, భగో నమ స్తే, అఘో యాహి, దేవా నమ్యాః.

క. పలుకులఁ బ్రాకృతసూత్రము, వలనను ద్వివిధంబు లగుచు వసుమతిలోన
న్వొలయుఁ దృతీయాంతస్థము, వలమును గొంచెంబు ననఁగ వనజదళాక్షా. 173
వలమనఁగా: దొడ్డు అనుట, కొంచెమనఁగా: సన్నమనుట.

లకారము రెండువిధము లైనందునకు వాల్మీకిసూత్రము:—

సూ. లోళః క్వాపి శాచ్యాన్.

వృ. లకారస్య ళ స్స్యాత్, ముకులస్య, ముకుళః. గలస్య, గళః. ప్రలయస్య, ప్రళయః.
క. అంతస్థంబులలోపల, వంతున కనఁగా ద్వితీయవర్ణం బీగ్రం
థాంతరమున నిరుదెఱఁ గగుఁ, గంతుజనక రేఫమన ఱకారం బనఁగాన్. 174

రేఫము ద్వివిధ మైనందునకు.

మూ. సూ.—ర స్త్వత్ర గృహ్యతే ద్వివిధః. 13

రస్తు=రేఫమన్ననో, అత్ర = ఈ యాంధ్రశబ్దచింతామణియందు, ద్వివిధః= రెండువిధములుగా, గృహ్యతే=గ్రహింపఁబడును.

యకారభేదంబులకు.

మూ. సూ:—అద్యః క్రియాసు భూతాద్యర్థసముద్యోతితం వినా సర్వః.
సీ. ఆంధ్రోక్తిమొదల నాద్యంతస్థ మొండదు ప్రాణ మై యది గనుపట్టుఁ గాని
సుతుగ్గలనఘుమను గడను యా కెందును దలకట్టు దక్క నెత్వంబు లేదు
యూకు భూతాదిక్రియాద్యోతితములఁ జూపట్టు నెత్త్వము దలకట్టు గాదు
తలకట్టు వక్రము ల్గాల్పు నిరెండును నలఘుయకారంబు లనఁగఁ బరఁగు

తే. నిప్పు డీపంకఁ గనుగొంటి నింతలోన, నెచ్చటికి నేఁగె ననఁగ నాద్యచ్చు లయ్యెఁ
గయ్య మైనను గానిమ్ము గాయకమునఁ, గాయ వలె శౌరి ననఁ దలకట్టు లయ్యె.
సీ. ఎక్కడఁ గనఁబడియెదు జక్రి చెలులార యింక నెవ్వరు చనియెదరు వెదుక
నీవేళ నెటకుఁ బోయెద వన్న మిన్నక యేఁగె న న్నేమనియెదరు మీరు
హేమాంగదము లిడియెదఁ జెప్పరే వాని నేరీతిఁ బొడఁగనియెదము మనము
హితము దలంపఁ డాయెను నన్నుఁ గని నగియెదు సపతుల కిది హేతు వయ్యె
తే. ననుచు నిట్లు భూతాదిక్రియాపదాంతములు విశేషణభావిక్రియలను దక్క
మొదలియంతస్థమున కేత్వములు త్రిలింగ, దేశభాషను బుట్టవు దితిజభేది. 176

ఆదియకారంబునకు నుద్యోగపర్వమునందు:—

తే. కొంచె మైనను దగఁ బంచికుడువ మేలు, పనులయెడదుఃఖమోర్చి యల్పంబుసుఖము
ననుభవించుట హితముశత్రునకునైన, నిచ్చుటయె లెస్స యడిగినయెడ నృపాల.
(ఆ. 2. 47.)

మధ్యయకారమునకు రుక్మాంగదచరిత్రమునందు:—

మ. ధననాథప్రియకంఠకాళిమము మోదం బొప్ప వీక్షించి చ
య్యన జంబూఫల మంచు డాసి నిజహస్తాగ్రంబు వే సాఁచి యే
పునఁ బల్మాఱును బట్టి రాఁ దిగుచు వేల్పుంబ్రోడ విఘ్నేశ్వరుం
డనుమోదంబునఁ జేయు మత్కృతికి నత్యంతంబు నిర్విఘ్నముల్. (ఆ. 1. 8.)

విజయవిలాసమునందు:—

మ. అనిన న్మదిలోఁ దలంచునది మే లౌ సిద్ధసంకల్పు లీ
రని యావేళనె చిత్రవాహనుఁడు కొల్వై యుండఁగాఁ బోయి యా
యన రా రమ్మని గారవించి సుముఖుం డై రాజు గారిప్పు డే
మనినారయ్యెవి వార్త లంచుఁ బయిపై నాసక్తితోఁ బల్కఁగన్. (ఆ. 2. 4.)

వ. భూతాదిక్రియార్థంబులు దెలుపని కడపటియకారమునకు. 180

విరాటపర్వమునందు:—

ఉ. స్వాంతము బాహుగర్వఘనసంతమసాంధము గాఁగ శంక యా
వంతయు లేక కీచకుఁ డహంకృతి ముంగలినాగమంటపా
భ్యంతరసీమఁ జొచ్చి [1]దరియం జని యారసి సెజ్జఁ గాంచి య
త్యంతముదావహాం బగుడు నందు రయంబునఁ గేలు సాఁపఁగాన్. (ఆ. 2. 381.)

1 కదియన్ (ప.)

భమత్కారమంజరియందు:—

మ. ధరలోనన్ ద్విజరాజనామమున సత్సంగంబున న్సత్కళా
నిరతి న్మించియు సత్పలప్రియుఁ డన న్నిత్యంబు రాజీవసం
హరణం బే కరజాలముల్ సొనిపి [1]చేయం బూను నీచం ద్రుఁ డో
యెంత చేసిన దయాదాక్షిణ్యముల్ గల్గునే. 182

క్రియాపదాంతయకారమునకు శృంగారనైషధమున:—

చ. అడిగితి నొక్కనాఁడు కమలాసను తేరికి వారువంబనై
నడుచుచు నుర్విలో నిషధనాథున కెవ్వతె యొక్క భార్య య
య్యెడు నని చక్రఘోషమున నించుక యించుక గాని యంత యే
ర్పడ విన నైతి నీ వనుచుఁ బల్కినచందము దోఁచె మానినీ. (ఆ. 2. 58.) 183

తే. ధరణి నుయ్యెల పయ్యెద తాయెతులను, గలయకారంబులకు వక్రములు నిజంబు
ముద్దరాజురామన వానిమాఁటెని బద, మధ్యయా లని చెప్పె నిమ్మాట మిథ్య. 184

తే. ఊచు నెలకొ కగుటచేత నుయ్యె లయ్యెఁ
బయిని యెద కున్కి వక్రోక్తిఁ బయ్యె దయ్యెఁ
దల్లి కాపునకై కట్టఁ [2]దగినసరులు
తేలఁ బల్కఁగఁ దాయెతు లేర్పడునను. 185

వ. హేలాశబ్దమునకు దద్భవము ఏల. అది కుఱుచకొసచేయఁగా హ్రస్వముగాఁ బలికిన ఎల అయినది. ఊచెడిఎల.గనుక ఉయ్యెల. హృదయశబ్దమునకుతద్భవము ఎద అయెను. దానికిచేసిన నుండెడిది గనుక వక్రసమాసము.పయ్యెద యాయెను. ఎత్తులనఁగా దక్షిణదేశీయమున దండలకుపేరు. దానిజడ్డను తేలఁ బలికిన ఎతు లాయెను. తాయి యనఁగా తల్లి, ఆ తాయి శిశువులకు శరీరరక్షగా కట్టునది యెతులు గనుక తాయెతులు.అటుగనుక శబ్దాది నున్న అచ్చులు గాని హల్లులు గావు. సంధిచేతను లఘుయకారము లైనవి.ఇవిమూఁడును ప్రత్యేకపదములు గాని యేకపదములుగావు. వీనిని తెలియక ముద్దరాజురామన కవిలోకసంజీవనిలోను చెప్పికొనిన పద్యము.

"తే. తాయెతులు నుయ్యెలయుఁ బయ్యెదయును దక్కఁ
గలుగ దెక్కంబు మధ్యయకారమునకుఁ
దుదిని గ్రియఁ దక్క నెక్కంబు గదియు దాది
మ్మొందదు దనుఁగున నబ్జనాభ. 187

1 సేయం (ఛ్రా. ము); నేయం (ప). 2. దగినయెత్తు (ప).

ఉయ్యేలకు నరణ్యపర్వమునందు:—

చ. కలి దమయంతిఁ బాప సమకట్టి పొరింబొరిఁ బాయ నోపఁ డా
లలనను దీర్ఘసౌహృదబలంబున నిట్టులు రెంటియందు న
న్నలుఁడు విమోహరజ్జులు పెనంగ గతాగతకారియై దయ్యే ను
య్యేలయును బోలె నూఁకడక యెంతయుఁ బొద్దు వినిశ్చితాత్ముఁ డై. (అ.2.78)

పయ్యెదకు యయాతిచరిత్రమునందు:—

సీ. వలఁ బడ్డజక్కవల్ వలె నున్నజిలుగుపయ్యెదలోనిగుబ్బపాలిండ్లు మెఱయ. 189

తాయెతులకుఁ జంద్రభానుచరిత్రమునందు:—

సీ. పా. ఒకయింతియొరఁగినసికమీఁదముడిపువ్వు లెత్తులు[1]దొరయుతాయెతులుచుట్టి."

ఒఘుయకారమునకు.

మూ. సూ:— య శ్శ్రితి మాచార్యా లఘుయం ప్రవద న్తి ప్రాణతః పరం
ప్రాణమ్. 15

తే. తొలిపదము తుదివర్ణంబుతోడఁ దమకు, సంధి లేనిపదాదిగ స్వరము లెల్ల
లఘుయకారంబు లై భూతలమున వెలయు, దేవకీపుత్త్ర జాంబవతీకళత్త్ర. 191

క. సురనది యాత్మజ కాఁగా, దరపతి యాసనము మరుఁడు తనయుఁడు రతిసుం
దరి యన్న నను(ఁగుఁ)గోడలు, సిరి [2]యంగనయబ్ధియిరువు శ్రీహరి కెపుడున్. 192

రేఫభేదంబులు.

తే. రేఫము ఱకారమును నన రెండు తెఱఁగు, లగుచు వికృతిపదంబుల నమరియుండు
వాని సంస్కారపూర్వకావ్యప్రయోగ, సరణుల నెఱుంగవలయు సజ్జనవిధేయ.

వ. సంస్కార మనఁగా లక్షణవంత మనుట. ఇందులోపల నే భాషాపరిచ్ఛేదమునందు
చెప్పఁబడియున్నది. 194

తే. ప్రకృతి శబ్దానుశాసనోభయకవినుత, శంభుసేవకసోమభాస్కరులచేత
భారతాదుల విభజింపఁబడియెఁ దొల్లి, కరిపరద రేఫములును ఱకారములును.

రేఫాక్షరసీసమాలిక.

శ్రీకామెపల్లిపురిగోపికాజార యసురసంహార నీ కంకితముగ
నాదికవీంద్రకావ్యము లెల్ల శోధించి క్రమత హ్రస్వములు దీర్ఘములు నై న

1 చొరయు (ప). 2 యబ్ధియుపాలిఁ బరపు (పూ. ము).

యచ్చులమీఁదను హల్లులమీఁదను గలుగు రేఫఱకారములు వచింతుఁ
దాళ్లపాకాన్వయోదధిపూర్ణ ధవళదీధితి [1]పెద్దతిరుమలదేశికుండు
మొదలైనవారలు మునుపు రచించినయవి యెల్లఁ జాలవా యనఁగ వలదు
వెండియు నొకకొన్ని వెదకి కూర్చితిఁ గవిరాజులు మే లని ప్రస్తుతింప
నిత్తి వెత్తియు నని యిట్లు క్రిందను జడ్డ లుండెడులిపు లెల్ల బండిఱాలు
పీనిద్విత్వము లొకవేళఁ బోయినఁ బోవు జెఱిపోఁతు కఱిమేఁక గొఱియ యనఁగఁ
జనిరి కొంచితిరి చేకొనియెద రనియెదునవి మొదలైన క్రియాపదముల
తుదలను సంస్కృతపదములందును దద్భవములయందును ఱకారములు లేవు
క్రచ్చఱ బ్రతుకుట గ్రాలుట మొదలగు క్రారము రేఫవర్ణములె యగును
జేకూఱె ననుటకుఁ జేకుఱె నని యిట్లు పొడుగు లెల్లను హ్రస్వములుగఁ జేసి
పలికెడువేళ రేఫములును ఱాలును మునుపటియట్లనే తనరుచుండు
రా దక్కఁ సకలాక్షరములమీఁదను గ్రార కదియ నకారఱకారము లన
నట రవర్ణమున కొక్కటికిని బై నిఫ యని నిల్చుటను రేఫ మనఁగఁ బరఁగె
నరదంబు సేనాంగ మరుగుట పోవుట యరి కప్ప మరసగ మరుదు వింత
యరయుట వెదకుట యిర వొందుటమరుట యిరుపదంబు యుగార్థ మిరవు నెళవు
కలనఁ బెట్టురుముట గద్దిక సేయుట యురణించు టురు [2]లొడ్డు టురులఁ ద్రోయు
టురవడించుట [3]వీఁక నొత్తుట యురువడి యురియాడుటయు డెంద మురియఁ జేయు
టెరగలి చిచ్చు మేఁకెరు వెరమానుట యెర గాఁగ భోజనం బిడి యెరియుట
యొరు లొండొరులసొమ్ము లొరయుట [4]యొరిమె కేకరివాఁడితూపులుకరిసెముకృషి
కరువలి పుత్తడి కరఁగి యీకరణిని గురుగునఁ బోసి యొక్కరుఁడు చేసెఁ
గరవాలు ముక్కార కరకరల్ కరకరి కరిగోరుటలు కనికరము వాన
గురియుట తొలుకరి కొరఁ బ్రాణములు కరకరఁ గ్రాలి కర మొప్పఁ గెరలి పడుట
గరిత బంగరుమేను గరు డాల్చెఁ గరిచేడి గరిగె చేఁబట్టుట గరువతనము
గిరగిర వ్రాయ వేగిరపడి జేగురుకొండపై గురుపోతు గురుసు పట్టి
గురువులు బారుచు గురువుగా గురుగాకు గురుగులఁ బెట్టి ముగ్గురును వండి
చెరుచుటయును మరి చెచ్చెర చేటను జెరుగుట చెరువులోఁ జొరవఁ జేసి
చొరక యచ్చెరువుగా చిరుగని కొకల చెరఁగులు చించుట చెరగు మనుట
తరచి యాడుటయుఁ జిత్తరుబొమ్మ తరఁగలు తరిచినమజ్జిగ తరము బడిత
తరము శక్యము మూఁడుతరములచుట్టంబు తరలఁ బారుట తరతర దిరుగుట
సినకూడు మార్తురమేని నెత్తురు తెరలఁ గాఁగిననెయ్యి తెరవుతోడు

---

1 మేటి(ప); వేద(పూ.ము). 2 లొగ్గు (ప). 3 వీఁగ (ప). 4 యొరిమి(వా).

తెరతెర వచ్చుట తెరలు గట్టుట రెండు* తెఱఁగులవారిలో దొరలుకొనుట
తొరితొరి చెప్పుట దొరగుట బెదరుట దరి ద్రొక్కి జూదరి దరికొలుపుట
దరము సేయుట దురదురఁ బోయి కుదురుట దొరయుట సరియొకాట దొరకొనుటయు
దొర రాజు దొరకొలు దొరసుట బొసఁగుట నర [1]వెంద్రుకలు పెద్దనరము నరుగు
నెరయఁగాఁ జల్లుట నెరసులు పరుసంబు పరువులు వెట్టుట పరపు నిడుపు
పరిచను వెంచుట పరిగొని పరిపరి పరపుట నించుట పరువడి యనఁ
బరిమారుచుట పెనుపరి నేరుపరి దొడ్డపరి చప్పరంబు దెప్పరము పరగఁ
బరికింప పరసు పొంపిరి వోవఁ బిరిగొని ఫురఫురఁ బొక్కుట పురిఁటితగవు
పురుడీడు పురికొలుపుట తుట్టెపురుగులు పెరగుట నిక్కుట పెరుగు పెరడు
పెర తేనె పొరిపొరి పొరుగునఁ బొరిగొని పొరిగడుగుట పొరపొచ్చెము పొర
పొరలుట చీపురు పొరకలు బరికెలు బరుజులు గజ్జెలు బరవసంబు
బరు లుబ్బఁగా నానవాలు ద్రావుట బరిమేను గంధపుచెక్కమీఁదిబరడు
బిరుదు లబ్బరము గొబ్బరకాయ బెరయుట బురబురఁ బొంగుట †బురద నేల
మరులు మోహముబుద్ధి మరుపుట తామర మరియాద క్రమ్మర మరలి చనుట
మిరియంబు మురిపెంబు మూరియలు తునియలు మురమురలాడుట మొర మెరయును
మొరపనేలయుఁ దేంట్లు మొరయుట మొరడును రమ్మని పిలుచుట రచ్చ రంగు
రంకెలు రజ్జులు రమణ రక్కసి రహి రిచ్చలు రిత్తయు రెట్ట రెండు
దేవర వివరంబు తెరువరి తలవరి యెవ్వరు నివ్వరు నవ్వరనఁగ
వరిచేను విరుజాలు వరుసయు వరపును నోవరి విరవిరఁ బోవు టనఁగ
విరిసినవిరు లెల్ల విరియఁ జల్లుట కొలువురు పలువురు నలువురు పదువురు
వెరువరి [2]వెరువాక వెరుసు దూసరియొడ్లు సరకు లమ్ముట సరి సరకుకొనమి
సిరికి సై సురియల సురుగుట సిరిబడి [3]సొరిది మోహరములు హరువు గనుట
మొదలుగా నొక కొన్ని పదముల హ్రస్వాక్షరములపై రేఫంబు లమరియుండు
[4]నారెకుత్తులవరు లారాట మారటం బారఁ గూరినశోక మారఁ గాఁగి
నట్టిపా లారనియనల మారఁగ ధర్మ మారసెఁ దనకన్నులారఁ జూచె
శ్రమ మారెఁ బొంగారెఁ జల్లారెఁ దనరారె నిరికె రెత్తుట యిగురు వెట్టు
టీరేడు జగము లీరెలుఁగు హీనస్వర మీ రన నిమ్ము పేరూరు పల్లె

---

1 వెంట్రుకలు (ప. వా). 2 వెరువార్ర (ప. వా). 3 సొరది (ప., జా) కాని శ. ర. లో సొరిది అనియేకాని సొరది అనిలేదు. 4 అరిక.

* శ. ర. లో, తెఱఁగు అనియేకాని తెరఁగు అనిలేదు.

† శ. ర. లో, బురద అనియేకాని బురుద అనిలేదు.

యాఱొఱ్పు ఊఱట యూఱ కుండుట దొంగ ఱేఁడి యనుట యిది యేఱి కొనుట
యోఱోఱి యనుమాట కోఱుచుకొనుటయు నోఱ వోయినఁగోనె లోఱనిలుట
*కొఱలు కల్లలు కొఱమెఱుంగులు పటుకొఱ ముక్కాఱుపంట రిపులు
కొఱ కొఱించుట కడు నొప్పి పెట్టుట కొఱాకు కొఱాట కొఱియంబు
కూఱట పొఱలుట కూఱుకు నిద్ర చెకూఱుట కూఱిమి కూఱ దినుట
యెమ్ములు గూఱగా నేయుట గాతంబు గూఱుట దానికిఁ గూఱుతు నవఁ
గోఱికె గోఱుట కోఱప్పనము పంది కోఱాడె కోఱడి కోఱ గిన్నె
గాఱెలు భక్ష్యముల్ గాఱాము బంగారు గోఱు గాఱాబంబు గారవంబు
చీఱికిఁ గొన కైదుచీఱలు చేఱుట చేఱువ చెంతలఁ జేఱఁ డనఁగఁ
జీఱుట పిలుచుట చూఱనఁగాఁ బోడి చేఱు ద్రావుట చూఱి చిన్ని కత్తి
తాఱెల్ల నేగిరి తీఱనికినుకతోఁ దూఱుపునాటికిఁ దేఱు లెక్క
తేఱెద మనుచు నేతేఱ తేఱకు తేఱ తేఱోఱ సొమ్ములు తోఱముగను
దూఱులు పలుకుట నారచీఱలు వింటినాఱి విన్నారు కస్నార మనఁగ
నీరు ద్రావుట పోఱ నీఱయి పోవుట నేఱుపు నేఱేడు నోఱు పడుట
పూఱేడు జగడంబు పేఱుట పేఱాఖ్య పేఱిన నేతులు పేఱురంబు
పోఱామి పోఱచి పోఱోఱి యనుటయు పోఱుట పోఱాట పోఱితంబు
బాఱు గట్టుట బైత్యబాఱికిఁ దప్పుట బాఱెడు బీఱంబు బూఱటిలుట
బూఱుగుచెట్లలో బూఱగ యూఁదుట బూఱెలు బేఱంబు బేఱజంబు
బోఱనిమోఁగియుట బోఱుఁగొండ లనంగ బోఱలు క్రిందుగా బోఱగిలుట
మాఱటమూర్తి యై మాఱిమసంగుట మాఱేడు వేమాఱు మాఱుతు రన
మీఱలు మేఱలు మోఱతోపు లనంగ ఱాయంచ ఱాచూఱి ఱాయడి పడి
ఱాణ ఱాణించుట ఱాయలు ఱాణువ ఱాపాడి ఱాముల్క ఱాను ఱావి
ఱాచుట ఱాఁజుట ఱాఁపుట ఱాలుట ఱొగిల్లుటయును ఱారా యనుటయు
ఱాము పొమ్మనుటయు ఱాఱాపు వలదు పోఱా వినుఱా యేలఱా చలంబు
రీతిగా దనక నిరీతి రూపించుట రూపుట రూపరి రూపు రూక
రేయి గేదంగిపూ రేకులు రేయెండ రోఁజు రోకలి రోలు రోవెలంది
ఘనులార బాలురు కోలారి జాలారి తేరు కోలారి తలారి [1]కొండ్లు
వారువ మశ్వంబు వారనికోపంబు వారించుకొనుటయు వారకులును
వారక వ్వార లెవ్వారును దెలియనివారు గారిది యెల్ల వారకంబు

* శ. ర. లో శకటరేఫమే కాని లఘురేఫము లేదు.

1 కొండ్రు (పూ. ము); కొండ్లు (ప).

వీరల్లసాటి లే రీరాజ్యమున నన సారెల జూదంబు సారె సారె
సైరణ లేక వేసారుట సూరెలు సోరణగండ్లును సేరుపసపు
తే. సౌరు సౌరంబు నోడబేహారి వింత, హోర యనునిట నాదిగా నొక్కకొన్ని
తెలుఁగుపలుకులలోపల దీర్ఘలిపుల, పైనిఁ ధనరారుచుండు రేఫములు కృతుల.

## హ్రస్వాక్షరములమీఁది రేఫములకు రూపములు.

అరదము=సేనాంగము
అరుగుట=పోవుట
అరి యనఁగాఁ దనకంటెదొడ్డరాజునకు బెట్టెడుపన్ను
అర, అనఁగా సగము. దీనికి లక్ష్యము:—
అరగంటఁజూచుట=సగముకంటఁజూచుట, అరవాయి=సగమునోరు, అరగోఁజితే=సగముతక్కువ—ఇవి మొదలైనవి
అరుసు=వింత
అరయుట=వెదకుట
ఇర వొందుట=అమరుట
ఇరు=అనఁగా. రెండు దీనికి
ఇరువాగు, [లక్ష్యములు
ఇరువంక,
ఇరువురు=ఇద్దఱు,
ఇరువాయి=రెండునోరులు,
ఇరుగేలు=రెండు చేతులు,
ఇరుమేను, ఇవి మొదయినవి
ఇరవు=నెళవు, [చుట
ఉరుముట=జగడమునగద్దిం
ఉరణించుట [పని
ఉరు లొడ్డుట=వేఁటకాని
ఉరులఁ ద్రోయుట=కోటలు మొదలయినవి పడఁగొట్టుట

ఉరవడించుట=వీఁకనొత్తుట
ఉరువడి=బిగ్గర
ఉరియాడుట=డెంద మురియఁ జేయుట
ఎరగలి=చిచ్చులు
మేఁకెరువు=మేఁకపెంట్రిక
ఎరమానుట=[1]ఎరపరికముచిడుచుట, ఎరగా నాహారముఁబెట్టుట
ఎరియుట
ఒరులు=అన్యులు
ఒండొరులు=ఒకరొకరు
సొమ్ములొరయుట=ఒరగంటను వ్రాయుట
ఒరిమె=కలిపికోలుతనము, ఒరిమి యనియుం గలదు
కేకరి=వాఁడితూఁపులు
కరిసెము=కృషి
కరువలి=గాలి [వానిపని
పుత్తడి కరఁగుట=కంసాలి
ఈకరణిని=ఈరీతిని
కరుఁగునఁబోయుట=పోఁతఁబోయుట
ఒక్కరుఁడు
కరవాలు=ఖడ్గము
ముక్కర=ముత్తెము
కరకరలు
కరకరి
కరి గోరుట

కనికరము=పొడి
వాన గురియుట
తొలకరివానలు
కొరఁబ్రాణము
కరకరఁగ్రాలుట [ప్పుట
కరమొప్పుట=మిక్కిలి యొ
కెరలుట
గరిత=పతివ్రత
బంగరు=పైఁడి
మేను గరు దాల్చుట=గగురుపొడుచుట
గరిచేడిగరిగె=పెండ్లివేళ చేతఁబట్టుకొనియుండెడిముంత
గరవతనము=సరకుసేయక పోవుట
గిరగిర ద్రాయుట
వేగిరపడుట
జేగురుకొండ
గురుపోతు
గురుసులవరపు గుర్రములు
గురువులు బారుట=గమనవిశేషము [ట
గురువుగాను=దొడ్డగానను
గురుగాకు=గురుగుకూర
గురుగులు=పిడతలు
ముగ్గురు
చెరుచుట
చెచ్చెర

1 విపరీతము విడుచుట (వా).

చేటను చెరుగుట
చెరువు=తటాకము
చౌరవఁ జేసికొనుట
చౌరక=చౌరకపోవుట
అచ్చెరువందుట
అచ్చెరువు
చిరుగనికోక
చెరఁగులు=అంచులు ట
చెరగుమఱుట=తరచియాడు
చిత్తరువు=బొమ్మ
తరఁగలు=కరళ్లు
తరచినమజ్జిగ
తరము=బడిత
తరము గాదు, అనఁగా శ
క్యము గాదనుట
మూఁడుతరములచుట్టము
దేహము తరలఁ బారుట
తరతర
తిరుగుట=సంచరించుట
తిరిసినకూడు
మార్తురు=పగవాఁడు
మేనినెత్తురు
తెరలఁ గాఁగిననేయి
తెరువు తోడు
తెర తెర వచ్చుట
తెరలు గట్టుట
రెండు తెరఁగులు = రెండు
తెగలు
తొరలుట=కలయుట
తొరితొరి
చెమట దొరిగుట
బెదరుట_చింత్యము
దరి ద్రొక్కుట
జూదరి
దరికొలుపుట [సేయుట
దురము సేయుట = జగడము

దురదురఁ బోవుట
కుదురు సేయుట
దొరయుట=సరి వచ్చుట
దొరకొనుట
దొర=రాజు
దొరకోలు
దొరసుట=పొసఁగుట
నర వెండ్రుకలు
పెద్దనరము=జీవనరము
నీటినురుగులు
నెరయఁ జల్లుట
నెరసులు
పరుసము
పరువులు పెట్టుట
పరపు నిడుపు
పరిచను దెంచుట
పరిగొనుట
పరిపరి
పరపుట=నించుట
పరువడి
పరిమారుచుట
పెనుపరి
నేరుపరి
దొడ్డపరి
చప్పరము
దెప్పరము
పరగ
పరికింపుట
పరసు
పొంపిరి వోవుట
పిరిగొనుట
పురపురఁ బొక్కుట
పురిటితగవు
పురుడు...ఈడు
ల్పుట
తుట్టెపురువులు

పెరుగుట=నిక్కుట
పెరుగు
పెరడు=ఇంటివెనుక
పెర=తేనెతెట్టె
పొరిపొరి
పొరుగు
పొరిగొనుట
పొరిగడుగుట
పొరపొచ్చెము
పొర
పొరలుట
చీపురు
పొరకలు
బరిగె
బరుజులు=గజ్జెలు
బరవసము
బరులు=వళులు
బరిమేను=దిస మొల
గంధపుచెక్క మీఁది బరడు
తాఁట
బిరుదులు
అబ్బురము
కొబ్బెరకాయ
పెరయుట
బురబురఁ బొంగుట
బురదనేల
మరులు=మోహము
బుద్ధి మరపుట
తామరపువ్వు
మరియాద
క్రొమ్మర
మరలి చనుట
మిరియము
మురిపెము
మురియులు=తునియలు
మురములాగుట=[illegible]

మదిలో మెరమెర
మెరపనేల
తేంట్లు మెరయుట=కూయుట
మెరడు=మోటు
రమ్మని పిలుచుట
రచ్చ రంగు
రంకెలు వైచుట
రజ్జులాఁడి
రమణ
రక్కసి
రహి
రిచ్చపడుట
రిత్తకు రిత్త
రెట్టవడుట
రెండుచేతులు
దేవర
వివరము
తెరువరి
తలవరి=తలారి
ఎవ్వరు
దానమివ్వరు
నవ్వరు
వరిచేను
వరుజాలుగట్టుట
వరుపు=వాన లేకుంట
వరుస
ఓవరి
విరవిరఁ బోవుట
విరియుట=విప్పుట
విరులు=పువ్వులు
విరియఁ జల్లుట
కొలువురు=కొల్చులము
పలువురు
నలువురు
పదువురు

వెరవరి
వెరవాక
వెరసులు వేయుట
దూసరివడ్లు
కేసరులు
దినసరులు మొదలయిన వన్నియు
సరకు అమ్ముట
సరి
సరకు గొనమి=పరవసేయక పోవుట
సిరి=లక్ష్మి
సురియలు=చూరుకత్తులు
సురుఁగుట=చచ్చుట
సిరిబడి
సొరిది=చాలు
మోహరము = దండునకుఁ బెద్దమొన
హరువు=ఉపాయము

ఇవి హ్రస్వాక్షరముల మీఁది రేఫములు.

---

దీర్ఘాక్షరములమీఁది రేఫములకురూపములు.

ఆరెకులు=తలవరులు
ఆరాటము
ఆరటము
ఆరఁ గూరినశోకము = నాడినదుఃఖము
ఆరఁ గాఁగినపాలు
ఆరనియనలము= శమింపని యగ్ని
ఆరగ ధర్మము
ఆరయుట=పరామర్శించుట
తనకన్నులారఁ జూచుట=కన్నులనిండుగఁ జూచుట

శ్రమమారుట బడలిక దీరుట
పొంగారుట=పొంగుదీరుట
చల్లారుట=చల్లఁదనము నిండుట
తనరారుట
ఈరికలెత్తుట= ఇగురువెట్టుట
ఈరేడుజగములు
ఈరెలుఁగు=హీనస్వరము
ఈరు=ఇమ్ము
ఊరు=గ్రామము
ఊరార్చుట = దుఃఖ ముడుపుట
ఊరకుండుట=చాలించుట
దొంగ లేరని యడుగుట
ఇది యేరికి=ఎవ్వరి కనుట
ఓరి యని పిలుచుట
ఓరుచుకొనుట
ఓర వోయినగోనెలు
ఓరసిలిపోవుట
కారులు=కల్లలు
కారు మెఱుంగులు
పటుకారు
ముక్కారుపంట
రిపులుకారు
గారించుట=నొప్పిచేయుట
కారాకులు
కారాటము=వ్యాపనము
కారియము=కర్జము
కూరుట=పొరలుట
కూరుకు=నిద్ర
చేకూరుట
కూరిమి
కూరదినుట
ఎమ్ములు గూరఁగా నేయుట =యెముకలు నాట సేయుట
గాతము కూరుట=నాటుట

దానిఁ గూతురు ననుట
కోరికె
కోరుట
కోరు అప్పనము
పంది కోరాడుట
కోరడి=ఆవరణముగా వేసిన
పాడిమట్టిగోడ
కోరగిన్నె
గారెలు=భక్ష్యములు
గారాము
బంగారు
గోరు=నఖము
గారాబము
గారవము
చీరికిఁ గొనక
అయిదు చీరలు=కోకలు
చేరుట
చేరువ=సమీపము
చేరఁడు
చీరుట=పిలుచుట
చూరు=పాడి
చేరుద్రావుట
చూరి=కొంచెపాటికత్తి
తారెల్లరు=తమరందఱు
తీరనికినుక=శమింపని కోప
ము
తూరుపునాఁడు
తేరులు=రథములు
తేరెదము అనుట
ఏతేరిన వచ్చితేని అనుట
తేరకు తేర, తేతేర యని
యుంగలదు [నుట
తేరోరి=సొమ్ములు తేరోరియ
త్రోరము
దూరులువలుకుట
నారచీరలు

వింటినారి
విన్నారు
కన్నారము
నీరు ద్రావుట
పోరనీరయి పోవుట=చ
చ్చుట
నేరుపు
నేరేడు-చెట్టు
నోరు వడుట
పూరేడుపిట్ట
జగడము పేరుట
పేరు=నామము
పేరిననేతులు
పేరురము=పెద్దఱొమ్ము,
పేరాముదపుగింజలు
మొదలయినవి
పోరామి
పోరచి=కూర [ట
పోరోరి=పోరాయోరియను
పోరు
పోరాటము
పోరితము
బారు కట్టుట
వానిబారికిఁ దప్పుట
బారెడు
బీరము
బూరటిలుట
బూరుగుచెట్టు
పెద్దబూరుగ యూఁదుట
బూరెలు=పిండివంటలు
ఓడబేరము
బేరజము
బోరని మ్రోయుట
బోరుగొండలు
బోరలు క్రిందుగాను బోర
గిలుట

మారట=మార్తి
మారి మసంగుట
మారేడు
వేమారు
మారుట
మారుతురు=పగవారు
మీరలు=మీరను
మేరలు
మోరత్రోపు
రాయంచ
రాచూలి
రాయడిపడి
రాణ
రాణించుట
రాయలు
రాణువ
రాపాడి=రాచినపాడి
రామాల్క-పండు
రాను=యథార్థము
రావిచెట్టు
రాచుట
రాఁజుట
రాయుట
రాలుట
రాగిల్లుట
రారా యని పిలుచుట
రాను పొమ్మనుట
రారాపు
వలదుపోరా
వినురా
ఏలరా చలము
రీతి గాదు=నడితి గాదు

రూపించుట
రూపుట=ఒకరిని తెలుపుట
రూపరి

| | | |
|---|---|---|
| రూపుచెడుట | జాలారి | వారకము |
| బంగారురూక | వేరు | వీరలసాటిలేరు |
| రేయి=రాత్రి | కోలారివాఁడు | సారెలజూదము |
| గేదంగిపూరేకులు | తలారికాఁడు | సారెసారె |
| రేయెండ=వెన్నెల | వారువము=గుఱ్ఱము | సైరణ లేక |
| రోఁజు పుట్టుట | వారనికోపము = శమింపని కోపము | వేసారుట |
| రోఁకలి | వారించుకొనుట | నూరెలు |
| రోలు | వారకలు | సోరణగండ్లు |
| రోవెలఁది=లంజ | వారక | సేరుపసుపు |
| ఘనులార-సంబోధనము | వారలు | సౌరు |
| బాలురు-ప్రథమాబహువచనము | ఎవ్వారు | సౌరంబు |
| కాలారి | తెలియనివారు గారు | ఓడబేహారి |
| | | వింతహోరలు |

ఇవి దీర్ఘాక్షరములమీఁది రేఫములు.

## అకార సీసమాలిక:—

అఱపఱ లనఁ దునియలు నోట నఱచుట యఱిముఱి యఱగోఱ లఱము టబ్బ
[1]టఱకటఁ బెట్టుట యఱ చేత నఱకాల నఱవలు ద్రావిడు లఱవు డఱిసె
లఱిగిపోవుట కొంచె మగు టఱమఱ సేయు టఱ లేక చను టఱి గఱపుకొనుట
అఱువది కోట్లఱ పొఱఁడు గుజ్జుక్కఱి రూపఱి పాలపఱి రొపఱచుట
పెంపఱి సిగ్గఱి బిట్టఱి బెల్లఱి నఱయిల్లు క్రచ్చఱ యక్కఱపడి
[2]యఱకమ్ము టఱమ ఱంటులఱ టఱకం బిఱియుట కదియుట యిఱియుటయును నన
నిఱులు చీఁకటిబండియిఱుసు క్రిక్కిఱియుట యిఱుకటం బిఱుకన్న మిఱిసి చెడుట
యుఱఁడు గైకోనఁ డేరి నుఱుకుట వే చను టుఱపదం బెల్లెడ నురుతరార్థ
ముఱు వన్నలా వను టుఱిది బెట్టిద మయ్యె నుఱక మానక మొగు లొడ్డి యుఱిమె
నుఱుకఱి బలముఱి యుఱియని ల్లుఱియుట యుఱనిరోపంబున నుఱుతపట్టి
ఱొఱపఱికంబన సెఱగుట మ్రొక్కుట యెఱుపు కెంపెఱుకవాఁ డెఱి కేఁజెప్ప
సెఱకలు వా సెక్కు లెఱుఁగుట తెలుసుట యెఱవుసొమ్మొకరిది యెఱచి మాంస

1 టఱకట పొదుగుట (ప); టఱకటఁ బెట్టుట (వా). శ. ర. లో అఱకడ అనియే కాని అఱకట యని లేదు. 2. అఱకమ్ము టమఱటులఱవ యిఱియుట కది యుట యిఱియుట కలసుటయును (ప).

మొఱలుట విలపించు టొఱవ దేహం బొఱగాల నుండుట యొఱ కత్తిమూఁత
యొఱకటంబునఁ బోవు టొఱపులు నాఁ డెక్కు[1]లొఱుగుబిళ్ల తలాడయొఱగువంక
కఱపుట నేర్పుట కఱతలు పోకిళ్లు కఱదలు బుద్ధులు కఱటి మంకు
కఱువు కాఠిన్యంబు కఱవు దుర్భిక్షంబు కఱ కప్పు మెకములఁ గఱచుఁ గుక్క
కిఱపుట కెఱయును క్కఱయుఁ బక్కఱయును గుఱుమాపు కుఱుగండ్ల కుఱుచ కుఱులు
కుఱువలిగొనుటయుఁ గుఱు కుఱ కుఱకలు కుఱుగొని కుఱఁగడ కుఱుపు వ్రణము
కొఱకొఱలాడుట కొఱఁత తక్కువ పండ్లు గొఱకుట కోపంబు కొఱడు వడుట
కొఱ యనఁగాఁ బని కొఱలుట నిండుట కొఱవిఁ జూఁడుట సొమ్ముకొఱకు ననుట
గఱికె నట్టులు గఱగఱికెలు గఱుగులు గఱిసె డగ్గఱ నంపగఱి పగఱలు
గిఱిగొనుటయు మోటగిఱుకయు గిఱుమిట్లు గిఱులు వ్రాయుటయును గీఱుటయును
గుఱక వెట్టుట గుఱగుఱ గుఱ వెట్టుట గుఱుకొని గుఱి గుఱు కొండి గుఱుతు
గుఱుములు గింజలు గొఱుగుట వపనంబు గొఱవంక పిట్టలు గొఱక కట్టె
వా చఱచుట గొడవలి కాఁచి చఱచుట కరమునఁ జఱచుట గట్టుచఱులు
చిచ్చఱపిడుగులు చిఱుతయుఁ జిఱునవ్వు చిఱికొట్టి చిఱిమి ముచ్చిఱితనమునఁ
జూఱుకు పుట్టఁగ మేను చుఱచుఱఁ గాల్చుట చెఱువున భుజియించి చెఱకు బట్టు
చెఱలాట చెఱుచుట చెఱుముట చెఱుగుట చెఱసాల చెఱుకులు చెఱిసగంబు
జఱిజఱి పూఁజఱి జాఁజఱి జఱిగొని [2]జఱపుట జఱజఱ ఝఱిగె ననుట
చేతుల వెదఱుట జిఱజిఱఁ ద్రిప్పుట జుంజుఱు వెంట్రుకల్ జొఱజొఱ యనఁ
దఱుగుట వెలితియుఁ దక్కువయును గోసి దైచుటయును నగువలసినపుడు
తుఱగలి బేహారి తఱుగనిసంపద తఱిగొలుపుటలు ముత్తఱులు తఱుచు
తఱి వేళ పయనంబు దఱలుట పుచ్చినతఱకలు శత్రుల దఱియఁ జొచ్చెఁ
దఱుముక వచ్చుట తఱిగొని నడచుట తిఱుగ రెండవపారి తిఱిఁ బెనుచుట
తిఱుగలి తుఱుము వాతెఱ మోవి యేడ్తెఱ తెఱలినవాసన తెఱకొలుపుట
దెఱపి సేయుట కన్ను దెఱచుట పాపుట తెఱవలు తెఱకువ తెఱఁగు విధము
తొఱలుట కలయుట తొఱగుట ముందఱ నందఱు ఎందఱు కొంద ఱింద
ఱిద్దఱు పదఱుచుఁ బెద్దఱికంబున గద్దఱి యుద్దిఱా కట్టెదుఱను
నఱుజొంచెము మ్రాను నఱుకుట నిఱుపేద నుఱుముగా నుఱుపుట నెఱవుపాడవు
నెఱి యనఁగా బాగు నెఱదొడ్డు గొప్పయు నగు నెఱి యనఁగను మిగుల ననుట
[3]నిటుల నెఱపుట నెఱి లేనిమిత్రుఁడు నెఱసుట నిండుట నెఱికకాసె
నెఱఁకు లాయంబులు నెఱులు కేశంబులు పఱపఱఁ జించుట పఱుసదనము

1 శ-ర. ఒరగుబిల్ల (రూ). 2 శ-ర. జరపుట. 3 నిటులని (ప).

పఱచుట సేయుట ప్రవహించుటయు వేగ నుఱుకుటయును నగు నుచితభంగిఁ
బఱికెలు పఱియలు పఱివోవు టంపఱ పఱతెంచి పఱిగొని పఱి పఱియలు
పఱు వైనపువ్వు చూపఱుఁ బరిమార్చుట తెంపఱి పెంపఱుఁ దెప్పిఱిలుట
పిఱుఁదను వెనుకను బిఱుఁను నితంబంబు పిఱుసనుటయు దొడ్డ పిఱికితనము
పుఱియ కపాలంబు పెఱికెలు గోనెలు పెఱిగినమీసముల్ పెఱుకుకొనుట
పెఱ యితరార్థంబు పెఱుసనిపోవుట బఱబఱ నీడ్చి దబ్బఱ పలుకుట
బిఱబిఱఁ ద్రిప్పుట బిఱుసులు బుఱుజులు మఱవ మృద్భాండంబు మఱుఁగుచాటు
మఱచుట మఱునాఁడు మఱఁదలు మఱఁదియు మఱియు నేమఱుట పల్మఱు మఱుగుట
మఱుపడి క్రమ్మఱ మఱు లేక క్రమ్మఱి పడమఱ మఱఁగాలు పెడమఱలుట
మిఱిచూపు మిఱిమిట్లు ముఱిముఱి చీఁకటిముఱిమొంగె మఱిమఱి మొఱములిడుట
[1]మెఱపులు మెఱుసుట మెఱుఁగు లీనుట కను మొఱఁగుట దాఁగుట మొఱకవెలితి
మొఱలు పెట్టుట మొఱ మొఱలుగా మొఱయుట మొఱగుడుకుక్కలు మొఱకుతనము
ఱట్టు ఱంపిల్లుట ఱవ ఱంకు ఱవికెలు ఱవఱవల్ ఱంపము ఱంతు ఱవిళి
ఱిక్కలు వ్రైచుట ఱివ్వన ఱువ్వుట ఱెక్క ఱెప్పలు ఱెల్లు [2]ఱెమ్మ ఱొమ్ము
[3]వఱతయు వఱదయు వఱదు గూయుట వంగవఱుగులు వఱలుట విఱిగిచనుట
విఱివోవు విఱిగాలి విఱివిడి కంబము విఱుగుట వెఱ బొమ్మ వెఱ చఱుచుట
వెఱచుట వెఱఁగు నివ్వెఱ సుఱ స్రుక్కుట యను ఱుసు ఱను టివి యాదిగాఁగ
గొన్ని తెనుంగుఁబల్కుల హ్రస్వములమీఁదఁ దప్పక బండిఱా లొప్పుచుండు
వెల్లంకితాతన బొల్లెను బండిఱా నిడుద పైఁ గలుగదు నిక్క మనుచుఁ
గావున నేను దీర్ఘములపైఁ గలపెద్దఱా లొకకొన్ని యేర్పఱుతు నింక
నాఱు సంఖ్యాపద మూఁఱడి యాఱికెపంట చిచ్చాఱెఁ బాపంబు లాఱె
నాఱనితేజ మూటాఱినముత్రెంబు తడియాఱె శ్రమ మాఱెఁ దాప మాఱె
నాఱపు లాడెనో టాఱె దేహం బెల్ల నూఱడి చాలించు టూఱుగాయ
లుదకంబు లూఱుట యోఁక పండ్లేఱుట యేఱుపసీమలో నేఱు దాఁటి
కాఱుపోతులు ఘోరాంతకాఱి కాఱడవులు కాఱిచుఁ బెట్టుట గాసిలుటసూఁ
గాఱుట జాఱుట కోఱలు పండ్లు గీఱుట నాఱుటయును దీఱుటయు నయ్యెఁ
జేఱెడు మాడలు చీఱుట రెండుగాఁ జేయుట యుయ్యేలఁ జేఱు లనఁగఁ
జాఱ యెల్లరిని దోఁచుట చోఱమీనులు చాఱబెబ్బులి చాఱపప్పు .
జాఱుపయ్యెదలు బజాఱికన్నియలు హజాఱంబులోన దుజాఱు లనఁగఁ

1 శ-ర. మెఱపులు. 2 శ-ర. లో రెమ్మ అనియేకాని ఱెమ్మలేదు. 3 శ-ర. లో వఱఁగ అనియేకాని వఱతలేదు.

దాఱు మెకంబు తీఱున దీఱిమ దీఱుట పొదలలో దూఱచనుట
దేఱి చూచుట గడి దేఱుట ధర్మంబు దేఱుట యింతకు దేఱుదు రన
సౌన్నాఱి నాఱు వైచుట నాటు విడుచుట నీఱు నిప్పులమీఁదినిండుబూఁది
పసపు నూఱుట నూఱుపదులు నన్నూఱు మున్నూఱు అనవెస దొమ్మన్నూఱును ననఁ
బాఱుఁడు బ్రాహ్మణుఁ డేఱు పాఱుట యింకఁ బాఱుట వెన్నిచ్చి పాఱుటయును
బడఁతిదేహము గఱు పాఱుట పీఱుట చీఱుట పోఱఁడు చిన్నవాఁడు
బీఱు వోవక యినుమాఱు మాఱడుగుట మాఱి మసంగుట మాఱుపడుట
మాఱుమాటాడుట మాఱుమొగంబు వేమాఱు పెద్దలమాట మీఱి చనుట
ఱాచు నీలపుఱాయి ఱాఁగ వెన్నెలఱేఁడు ఱేని ఱేసున గంగ ఱేవు తెప్ప
ఱేఁచుకుక్కలు ఱేల ఱేఁగు ప్రేఱేఁచుట ఱోయుట వెదకుట ఱోఁత పడుట
తే. వేఱు పడుటయు వీఱిడి వే ఱొకటియును
నాదిగాఁ గొన్ని యాంధ్రవాక్యములయందుఁ
బొదుకొను దీర్ఘములమీఁద బండిఱాలు
వీని నెఱుఁగక కృతిసేయు వెఱ్ఱి గలఁడె. 197

## కుఱుచలమీఁది ఱకారములకు రూపములు.

అఱవఱలు=తునుకలు
నోట నఱచుట=కూయుట
అఱిముఱి=బడిబడినియనుట
అఱగోఱలు
అఱముట=అబ్బుట
అఱకటఁ బెట్టుకొనుట=పొదిగిటఁ బెట్టుకొనుట
అఱచేయి
అఱకాలు
అఱవలు=ద్రావిడులు
అఱువుడు=కప్పసము
అఱిసెలు=అప్పములు
అఱిగిపోవుట=తక్కువయి పోవుట
అఱమఱ సేయుట

అఱ లేక చనుట=అపోహము లేకపోవుట
పెండ్లియఱుగు
అఱపుకొనుట=దక్కించుకొనుట
అఱువదికోట్లు
అఱపోఱఁడు=పొట్టివాఁడు
ఉక్కఱి
రూపఱి
పాలుపఱి
ఏపఱచుట
పెంపఱి
సిగ్గఱి
బిట్టఱి
అఱమూఁతయిలు

క్రచ్చఱ
అక్కఱపడి
అఱకమ్మటలు
అఱంటులు=అఱటికంబము
అఱటులు=స్త్రీలు మెడను గట్టుకొనెడుపూసలు
అఱకము=అన్నమఱుఁగకుండుట
ఇఱియుట=కదియుట దీనికి లక్ష్యములు:—
ఇఱిచను=చిన్నచనుగవ
ఇఱికికొనిపోవుట=కదియించుకొని పోవుట ఇవి మొదలైనవి
ఇఱియుట=నలిగిపోవుట
ఇఱులు=చీఁకటులు

బండియిఱుసు [కదియుట
క్రిక్కిఱిసియుట = మిక్కిలి
ఇఱకటము=కసిలి
ఇఱుకు=కొంచెము
అన్న మిఱిసిపోవుట=కది
యఁబడి ముద్ద కట్టుట
ఈఱఁడు=సురేంద్రుఁ డైన
నుఁ గైకొనఁడు [వుట
ఉఱుకుట=వేగముగఁ బో
ఊఱు అనఁగా మిక్కిలియు
నుట దీనికి లక్ష్యములు:-
ఉఱునట్టివరము ఊఱుత
నదుశక్తివాలయఁగ ఇవి
మొదలైనవి.
ఊఱువు=లావు
ఉఱుది=బెట్టిదము
ఊఱక=మానక
మేఘము ఉఱుముట
ఉఱుకఱి
బలముఱి
ఉఱియ=దిట్ట
ఉఱియుట
ఊఱని=తెగువ
ఉఱుతపట్టి
ఎఱపఱికము
అడుగుల కెఱఁగుట=మ్రొ
క్కుట
ఎఱుపువన్నె
ఎఱుకువాఁడు
ఎఱికె=చెప్పుట
ఎఱకలు=ఱెక్కలు
ఎఱుఁగుట=తెలిసికొనుట
ఎఱుపుసొమ్ము = మఱొకరి
సొమ్ము
ఎఱచి=మాంసము
ఒఱలుట=శోకించుట

ఓఱప=దేహము
ఒఱగాల నిలుచుట
ఒఱ=కత్తిమీఁదిమూఁత
ఒఱకటపుదోవనుబోవుట
ఒఱపులు=ఎత్తులు
ఒఱగుబిళ్ల
ఒఱగు వంక
కఱపుట=నేర్పుట
కఱతలు=పోకిళ్లు
కఱదలు=బుద్ధులు
కఱటి=మంకువాఁడు
కఱకు=కాఠిన్యము దీనికి ల
క్ష్యములు:- కఱకెక్కుట
కఱకులాడుట ఇవి మొ
దలైనవి.
కఱవు=దుర్భిక్షము
కఱ = కప్పు దీనికిలక్ష్యము
లు:-కఱకంఠుఁడు
పోఁకకఱ
తమ్మకఱ
నీలకఱ ఇవిమొదలైనవి.
కఱచుట దీనికిలక్ష్యములు:-
పండ్లఁ గఱచుట వేళ్లు
గఱచుట పూరి గఱచుట
పింజపింజ గఱచుట ఇవి
మొదలైనవి.
కిఱపుట
కెఱయుట
ఉక్కెఱ=పిండివంట
పక్కెఱ
కుఱుమాపుచీర=కొంతమా
త్రము మాసినచీర
కుఱు=కంటు
కుఱుచ=కొంచెము
కుఱులు=వెండ్రుకలు
కుఱువలిగొనుట

కుఱుకుఱ
కుఱుకులు
కుఱుగోని
కుఱుగడ
కుఱుపు=వ్రణము
కొఱకొఱలాడుట
కొఱఁత=తక్కువ
పండ్లు గొఱుకుట
గుజ్జుపుకొఱడ [డుచునది
కొఱడు=ఆకాశమునఁ బో
కొఱ=పని దీనికి లక్ష్యము
లు:- కొఱగామి కొఱ
గాదు కొఱమాలుట కొ
ఱ అవుట కొఱగలవాఁ
డు ఇవి మొదలైనవి.
కొఱలుట=పూర్ణమవుట
కొఱవినిగాల్చుట
వానికొఱకు-చతుర్థి
గఱికెనట్టులు
గఱుగుకాయలు
గఱిసె
డగ్గఱ=సమీపము
అంపగఱి
పగఱ=పగవాఁడు
గిఱికొనుట=కుప్ప వడుట
మోటగిఱుక
గిఱుమెట్లు=గిఱుకచెప్పులు
గిఱులు వ్రాయుట
గీఱుట [రము
గుఱుకపెట్టుట=నిద్రావికా
గుఱగుఱ
గుఱపెట్టుట
గుఱుకోని
గుఱిగడచుట=మేరదప్పుట
గుఱుకొండి
గుఱుతు

గుఱుములు=గింజలు
తలఁగోఱుగుట
గోఱవంకపిట్టలు
గోఱకకట్టె
వాచఱచుట
కోడవలికోఁడిచఱచుట అడ్డచుట దీనికిలక్ష్యములు:— చేతఁ జఱచుట వీఁపు జఱచుట నేలఁ జఱచుట గోడ సున్నము జఱచుట యివి మొదలైనవి.
గట్టుచఱులు=కొండచరులు
చిచ్చఱ = ఇంగలము దీనికి లక్ష్యములు:— చిచ్చఱపిడుగు చిచ్చఱకన్ను చిచ్చఱకోల = ఆగ్నేయాస్త్రము ఇవి మొదలయినవి.
చిఱుత = కొంచెము దీనికి లక్ష్యములు:—చిఱుతప్రాయము చిఱుతనడుము చిఱుతగండు ఇవి మొదలైనవి.
చిఱు=పిన్న ఇందుకు లక్ష్యములు:— చిఱునవ్వు చిఱుచెమట చిఱుదోడ మొదలయినవి.
చిఱికొట్టి
చిఱిమి
ముచ్చిఱితనము
చుఱుకుపుట్టుట
మేను చుఱచుఱఁ గాల్చుట
చెఱువు
చెఱకబట్టుట
చెఱలాడుట

చెఱచుట
చెఱుముట=రాచుట
చెఱుగుట
చెఱసాల
చెఱుకులు
చెఱిసగము
జఱిజఱి
పూజఱి
జాజఱి
జఱిగొని
జఱపుట = ఆలస్యము చేయుట
జఱజఱ
జఱుగుట=పోవుట
వెజఱుట
జిఱజిఱఁ ద్రిప్పుట
జుంజుఱువెంట్రుకలు
జోఱజోఱ
తఱుగుట = వెలితిఅవుట దీనికి లక్ష్యములు:— నెయ్యి తఱుగుట, మఱియు, తఱగుటఅనఁగా తక్కువగుట. దీనికిలక్ష్యములు:— ధారణ తఱగుట కొంత తఱగుట ఇవి మొదలయినవి. కొన్నిచోట్ల తఱగుట, అనఁగా కోసివైచుట. దీనికి లక్ష్యములు:— తల తఱగుట కూర తఱగుట ఇవి మొదలయినవి.
తఱుగఱి = నిర్ణయించెడివాఁడు
తఱుగని సంపద
తఱి గొలుపుట
ముత్తఱులు=నళులు
తఱుచు=దట్టము

తఱి=వేళ
పయనముతఱలుట
పుచ్చినతఱకలు
శత్రువులను దఱియఁ జొచ్చుట
తఱుముకవచ్చుట
తఱిగొని నడచుట
తిఱుగ=రెండవసారి
తిఱి=పెనచుట
తుఱఁగలి=కాంతి
తుఱుము
వాతెఱ=మోవి
ఏడ్తెఱ
తెఱలినవాసన
తెఱకొలుపుట
తెఱపిసేయుట
కన్ను తెఱచుట = పాపుట దీనికి లక్ష్యములు:— నోరు తెఱచుట, తలుపు తెఱచుట ఇవి మొదలైనవి.
తెఱవలు=స్త్రీలు
తెఱకువ
తెఱఁగు=విధము దీనికిలక్ష్యములు:— తెఱఁగెట్టిదకో, తెఱఁగొప్ప, తెఱఁగులేమి, ఇత్తెఱఁగున ఇవి మొదలయినవి.
తోఱలుట=కలయుట
తోఱగుట
ముందఱను
అందఱు
ఎందఱు
కొందఱు
ఇందఱు
ఇద్దఱు
పదఱు

పెద్దఱికము
గద్దఱికాఁడు
అద్దిఱ
కట్టెదులు
నఱుజా=కొంచెము - దీనికి
లక్ష్యములు:— నఱుజా
పేలు నఱుజాము తెమ్ములు
మొదలగునవి.
మ్రాను నఱుకుట
నిఱుఁ బేద
నుఱుము=నుగ్గు
ధాన్యము నుఱుపుట
కోకనెఱవు=పొడవు
నెఱి=బాగు దీనికి లక్ష్యము
లు:- నెఱి దప్పి వడుట
నెఱి చెడుట నెఱిఁ బ
డుట నెఱిమొగము నె
ఱికురులు నెఱినొచ్చుట
నెఱి ద్రోవ నెఱిచక్కఁ
ద్రోచుట ఇవి మొద
లైనవి.
నెఱ యనఁగా దొడ్డ దీనికి
లక్ష్యములు:— నెఱతన
ము నెఱగూఁటుట=దొడ్డ
నాటుట నెఱనారసము
నెఱసతి నెఱవాదులు
నెఱదాతలు నెఱబిరుదు
లు నెఱపంటలు నెఱ
చందురుఁడు ఇవి మొ
దలైనవి.
మఱియు నెఱ యనఁగా గొ
ప్ప దీనికి లక్ష్యములు:-
నెఱమంట నెఱచెవులు
నెఱవెంట్రుకలు మొద
లైనవి.
నెఱియను=మిగులను

నీటులు నెఱపుట
నెఱిలేనిమిత్రుఁడు [చుట
నెఱసుట=అంతట విస్తరిం
నెఱిక=కొస
నెఱకులు=ఆయములు
నెఱులు=తలవెంట్రుకలు
కోక పఱపఱ చించుట
పఱుసదనము
పఱచుట = సేయుట దీనికి
లక్ష్యములు:— పఱచిన
పాట్లు చిక్కు పఱచుట
సిగ్గుపఱచుట భంగపఱ
చుట ఇవి మొదలైనవి.
కొన్ని చోట్ల పఱచుట య
నఁగా ప్రవహించుట దీ
నికిలక్ష్యము:— నెత్తురు
కాలువలై పఱచుట.
ఒకచోట పఱచుట - యన
వేగ నుఱుకుట దీనికి
లక్ష్యములు:— వెనుకొ
ని పఱచుట గుఱ్ఱము ప
ఱచుట శత్రులఁ బఱ
పుట అమ్ములఁ బఱపుట
ఇవి మొదలైనవి.
పఱికెలు
పఱియలు సేయుట [ట
పఱివోవుట = ముంచుకొను
అంపఱిక=ఓపక
పఱతెంచుట=వచ్చుట
పఱిగొనుట=నిండికొనుట
పఱిపఱియలు సేయుట
పఱు వైనపువ్వు
చూపఱ పొగడఁదను
పఱిమార్చుట
తెంపఱ
పెంపఱ

తెప్పిఱిలుట
పిఱుఁదను=వెనుకను దీనికి
లక్ష్యములు:- వానిపిఱుఁ
దనె చొచ్చుట విఱిగి
పిఱిఁదికిఁ బాఱుట ఇవి
మొదలైనవి. [ము
ఒకపట్టు పిఱుఁదు=కటిస్థల
పిఱిసనుట
పిఱివోవుట=వెనుకదీయుట
దొడ్డపిఱికితనము
తలపుఱియ=కపాలము
పెఱికెలు=గోనెలు
పొడవు పెఱుగుట
అమ్ములు పెఱుకుట=పీకుట.
పెఱ యన మఱియొకటి. దీ
నికిలక్ష్యములు:— పెఱ
మూఁకలు పెఱచేతలు
పెఱవారు పెఱచోట
ఇవి మొదలైనవి.
పెఱుసనిపోవుట
బఱబఱ నీడ్చుట
దబ్బఱమాటలు
బిఱబిఱఁ ద్రిప్పుట
బిఱుసు గాల్చుట
కోటబుఱుజులు
మఱువు=మంటికుండ
మఱుఁగు=చాటు దీనికి ల
క్ష్యములు:— మాట మ
ఱుఁగు పెట్టుట కనుమ
ఱుఁగుచోటు బలవంతుని
మఱుఁగుచొచ్చుట పై
మఱుఁగు=కవచము కొం
దఱు మఱు అని యనిరి
ఇవి మొదలైనవి.
మఱచిపోవుట
మఱునాఁడు

మఱఁదలు
మఱఁది
మఱియు
ఏమఱిపాటు
పలుమఱు
మఱుగుట=మచ్చికయవుట
మఱుపడి
క్రమ్మఱ=తిరుగ
మఱులేక=మఱఁగులేక
క్రమ్మఱుట=తిరుగుట
పడమఱ=దిక్కు
మఱగాలు
పెడమఱలుట
మిఱిచూపుట
మిఱుమిట్లుగొనుట
ముఱిముఱి చీఁకటి
ముఱి=మొండెము
ముఱిముఱి=బడిబడిని
పిల్లమెఱుములు వైచుట
మెఱుపులు మెఱయుట
మెఱుఁగు లీనుట
కనుమొఱఁగుట=దాఁగుట
మొఱక=
మొఱ పెట్టుట
మొఱమొఱ లాడుట
మొఱసుట=కోపవికారము
కుక్కలు మొఱగుట
మొఱకుతనము
ఱట్టువొందుట
ఱంపిల్లుట
వజ్రపుఱవలు
ఱంకువోవుట
పట్టుఱవిక
ఱవఱవలు=కోపము
ఱంపము
ఱంతు

ఱవిళి
ఱెక్కలువైచుట
ఱివ్వన నెగయుట
ఱాళ్లను ఱువ్వుట
చిలుకఱెక్కలు
కనుఱెప్పలు
ఱెల్లుగడ్డి
పూఱెమ్మలు
బలుఱొమ్ము
వఱత వెల్లి
ఏఱివఱద
వఱడుగూయుట
వంగవఱుగు
వఱలుట
దండు విఱిగి చనుట
విఱివోవుట
విఱిగాలి
విఱివిడి
కంబము విఱుగుట
వెఱబొమ్మలు
వెఱచఱచుట
వెఱచుట
వెఱగొందుట
నివ్వెఱపడుట
సుఱసుఱ స్రుక్కుట
అసు ఱుసు ఱనుట

ఇవి కుఱుచలమీఁది ఱకారములు.

నిడుపలమీఁది ఱకారములకు రూపములు.

ఱు=లెక్క దీనికి లక్ష్యములు:—ఱుచవులు ఱుమ్ములు ఱుమాట లివి మొదలైనవి.

ఆఱడిపోవుట
ఆఱికెపంట
చిచ్చాఱుట
పాపము లాఱుట
ఆఱని తేజము
ఊటాఱినముత్యములు
శోకతడియాఱుట
శ్రమ మాఱుట
ఆఱపులు
దేహమంతయు నోటాఱుట
ఊఱడి విశ్రమించి
ఊఱుగాయలు
నోరూఱుట
ఓఁకపండ్లేఱుట
ఏఱువసీమ
ఏఱు దాటుట
కాఱుపోతులు
హొంతకాఱి
కాఱడవులు
కాఱియఁ బెట్టుట=గాసిపెట్టుట
కాఱుట=జాఱు
కోఱలు=నోటిపండ్లు
గీఱుట=నాటుట
పండ్లను గీఱుట=తీర్చుట
చేఱెడుమాడలు
చీఱుట=నడిమికి రెండుగాఁ జేయుట
ఉయ్యాలచేఱులు
చూఱ=అందఱినిదోఁచుకొనుట
చోఱమీను=చేఁప
చాఱలబెబ్బులి
*అపభ్ర
పయ్యెదజాఱుట
బజాఱివాండ్లు

హజాఱము = పెద్దకొలువు సావడి
తుజాఱి=ధనముగలవాఁడు
తాఱుట=పఱువెత్తుట
యీతీఱిన తీఱుట = సేయవలసిన పనితీఱుట
తీఱినమిట్టుగుడ్లు
పొదలలో దూఱుట
తేఱిచూచుట
తేఱికొనచూచుట
గడిదేఱుట
ధర్మముదేఱుట
ఇంతకుం దేఱుదురు
సొన్నాఱి = అగసాలవాఁడు
వంగనాఱు వైచుట
నీఱు అనఁగా నిప్పు పైఁగప్పి యుండెడుబూడిద
పసపు నూఱుట
నూఱుపదులు
పాఱుఁడు=బ్రాహ్మణుఁడు
ఏఱు పాఱుట
ఇంకఁ బాఱుట
వెన్నిచ్చి పాఱుట
దేహము గఱుపాఱుట
పీఱుట=చినుగుట
పోఱఁడు=చిన్నవాఁడు
బీఱు వోవుట

ఇనుమాఱు
మాఱడుగుట
మాఱి మసంగుట=గావు పట్టుట
మాఱుపడుట
మాఱుమాట
మాఱుమొగము
వేమాఱు
పెద్దలమాట మీఱుట
ఱాచుట
నిలపుఱాయి
వెన్నెలఱేఁడు = చంద్రుఁడు
ఱేసి
ఱేసున
గంగఱేవున
ఱేవు
ఱేఁచుకుక్కలు
ఱేల
ఱేఁగు
ప్రేఱేచుట
ఱోయుట=వెదకుట
ఱోఁతపడుట
వేఱు పడుట
వీఱిఁడి
వేఱొకటి
ఇవి నిడుదలమీఁదిబండి ఱాలు ఉభయ రేఫలు.

అరుగుట=పోవుట
చెఱుచుట
తెఱఁగులు
తొఱలుట
తొఱఁగుట
నెరయుట=విస్తరించుట
పరిగొనుట
పరిచనుదెంచుట
పరిమెయి=పరయొకటి
పరిమార్చుట
పెరుగుట
క్రమ్మర
మరలుట

ఇవికుఱుచలమీఁది రేఫ అకారములు రెండు నగును.

ఆరుట=శమించుట
తీరనికినుక
తీరుట
పోరనీరయి పోవుట
మారిమసంగుట
వేమారు

ఇవిదీర్ఘములమీఁది రేఫ అకారములు.

కుఱుచలమీఁది రేఫఱకారములు రెండును అయినవానికి లక్ష్యములు.

అఱుగుట, పోవుటకు మానసలవర్ణమునందు:—

క. మఱునాఁడ యగుట లెస్సగ
నఱిగె; నినుం డపుడు వేఁడి యడరినదీప్తుల్
తఱఁగలి గొని పశ్చిమగిరి
చఱికి ననతిదూరుఁడై విశదుఁడై తోఁచెన్. 198

చెఱుచుటకు సభాపర్వమునందు:—

క. వెఱచఱువ నింతకంటెను, దఱుచుగ బాణంబు లేసి తడయక పగఱం
జెఱుతు నని యిసుముఁ జల్లుచు, నుఱక ధనంజయుఁడు రణజయోన్నతి నరిగెన్.
(ఆ. 2. 305)

తెఱఁగునకుం గవిజనాశ్రయమునందు:—

క. నెఱయంగా నీఛందము, తెఱఁ గెఱుఁగక కవితఁ జెప్పఁ దివురునతఁడు ద
బ్బఱచీకు చీకుగుఱ్ఱముఁ, బఱపినగతి నిఖిలహాస్యపదనిరతుఁ డగున్. 200
(ఆ. 1. 4)

తొరఁగుటకు నృసింహపురాణమునందు:—

సీ.పా. పరమాత్మపదములఁ దొరఁగి పాఱెడు నేటి, తరఁగలపై లీల దాఁటి దాఁటి.
(ఆ. 1. 54)

అందే:—

తే. పొగడ ప్రాఁకుల మొదలను బుష్పరసము
[1]తొఱఁగి నెత్తావి యందున నెఱయ నొప్పఁ
బూచు కొఱకును మున్ను నింపులు దలిర్పఁ
గడఁగి వనలక్ష్మి యుమిసిన కళ్లయనఁగ. (ఆ. 2. 69) 202

పరిగొనుటకు.

పరిచను డెంచుటకు విరాటపర్వమునందు:—

చ. పరిచను డెంచె గోగణముఁ బట్టె నన న్విని పిన్న గాన మీఁ
దరయక రాజనందనుఁ డహంకృతితోఁ బఱతెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ దనబుద్ధి గలంగినఁ బాఱఁ జొచ్చె నీ
పురుషుని శౌర్యసంపదయు భూరిబలంబు నెఱుంగఁ డేమియున్. (ఆ. 4. 78) 203

పరిమెయి యన్నందునకు శాంతిపర్వమునందు:—

చ. పరిమెయిఁ బాటి పాఱఁ గని పట్టి వెసం బెడకేలు గట్టి తె
చ్చి రసురభర్త నూచి యిటు సేరఁగఁ దేవల దీకృతఘ్నునిం
బొరిగొని వేలినుం డనినఁ బోకడ మాలినవార మయ్యు యి
ద్దురితశరీరముం దినఁగ [2]దోసము మా కని వార లొల్లమిన్. (ఆ. 8. 505) 204

1 అచ్చుపడ్డనృసింహపురాణమందు 'తొరఁగి' 'నెరయ' రెంటను లఘురేఫ మున్నది. 2 గూడునె (ప. వా.) ఈపాఠమున యతిభంగము.

## పరిమార్పుటకు.

పెరుగుటకు స్త్రీపర్వమునందు:—

క. పెరుగుట ప్రగ్గుట చపలం, బొరయుట యరుచంబు గాఁగఁ బుట్టుట సావం
బెరయుట పాయఁ బదార్థో, త్కరముల కైజంబు లెల్లఁ దప్పింప నగున్. 205

(అ. 1. 24)

క్రమ్మఱుటకు అరణ్యపర్వమునందు:—

మ. పఱచుం దవ్వగఁ జేయలంతి నిలుచుం బట్టీక యాసాసలం
బిఱువోవుం బొదలందు డిందుఁ బొడముం బిట్టుల్కి వే దాటుఁ గ్ర
మ్మఱి చూచుం జెవి దార్చి నిల్చు మలయు న్నట్టాడుఁ గ్రోడాడు నే
మఱిన ట్లుండుఁ దృణంబు లాను నలయున్ మాయామృగం బిమ్ములన్. 206

(అ. 6. 327)

మఱఁద లనుటకు భాస్కరరామాయణమునందు:—

చ. ఎఱిఁగి యెఱింగి మున్నతఁడె యొగ్గొనరింపఁడె దానికై కదా
చెఱఁ గొని వచ్చితిం బిదప సీత వృథాకథ లింక నేల పెం
పఱ భ్రతు కింత తీయనె ఖరాదుల చావున కేమి చింత నీ
మఱఁదలిబన్న మేపగిది మానిని యీగుదు సంధి చేసినన్. (యుద్ధ. 784.) 207

నెరసె ననుటకు నృసింహపురాణమునందు:—

మ. ధరణీమండలి దిద్దిరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె ని
ర్జరనాథప్రముఖాఖిలామరనివాసశ్రేణులం దోలిపై
నెరయం బంకజసంభవాలయమున న్నిండారె నవ్వేళ శ్రీ
కరదైతేయతనూభవోద్భవకథాకల్యాణ ముద్ఘోష మై. (అ. 3. 141) 208

నిడుదలమీఁది రేఫఱకారములు రెండునుఅయినవానికి లక్ష్యములు.

ఆరుటకు శాంతిపర్వమునందు:—

క. కారవులు సేయునవమతి, కారణముగఁ గోప మెత్తెఁ గర్తునివదనాం
భోరుహము గనుఁగొనఁగ [1] శ్రమ, మారు న్నావళము గాక యాతనిబుద్ధిన్. 209

(అ. 1. 13)

ఆదిపర్వమునందు:—

క. కాఱడవిఁ బఱచుమృగముల, [2] నూఱడకం దిగిచి డస్సి యున్నతని శ్రమం
బాఱంగా నెదఁ దాపము, దీఱఁగఁ జైపీచె నన్న దీపవనంబుల్. (అ. 4. 18) 210

1 శమ. 2 నూఱకడం (వా).

కాఱులకు నుద్యోగపర్వమునందు:—

ఉ. ఱడివోకయు న్ఫలము నందుటయుం గని పల్కు నేరమి
న్గాఱటనోటిదాన నయి మాటలు చిత్తమునందు నిల్ప కే
గాఱులు [1]ప్రేలెద న్వినుడు కర్జము సెగ్గను గాన నల్కమై
[2]పేఱెడి యైనమానిసికి వెండి వివేకము గల్గ నేర్చునే. (అ. 3. 107) 211

తీఱుటకు రామాయణమునందు:—

ఉ. మీఱినకోఱలు న్మిగిలి మింటికిఁ బర్వినపల్లి[3]వెండ్రు కల్
తీఱినమిట్టగ్రుడ్లు నతితీక్ష్ణతరం బగునట్టి సాహసం
బాఱని తేజము న్దిశల నంటినచేతులు లోకరాజిలో
నేఱిన మేటిరూపముల నెంతయు నేర్చిరి రాక్షసు ల్వడిన్. 212

తేఱుటకు యుద్ధకాండమునందు:—

క. తేఱుదురు రిపుల నక్కఱ, మీఱుదురును నిపుడు మూర్ఛ మెయి నిట్లున్నా
రాఱని తేజంబులతో, నీఱు పయిం గవిసి యున్న నిప్పలువోలెన్. 213

నీఱనుటకు.

త్రిపురాంతక దేవుని యుదాహరణమునందు:—

ఉ. ఱడియూస నీరసధనాధిపలోకమునిండ్లవాకిళుల్
దూఱుట మాని శ్రీనగమునూరుపువాకిట దూఱి పాపముల్
నీఱుగఁ జేసి గంధవతి నీళ్లను గ్రుంకి మనంబులోనిచి
చ్చాఱగఁజేయు టొప్పుఁ ద్రిపురాంతకదేవునకై నమస్కృతుల్. 214

మాఱి యనుటకుఁ గర్ణపర్వమునందు:—

ఉ. పాఱినఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతనూజుతోడ నీ
కాఱియ మద్భలంబునకుఁ గాఁ దగునే వివిధాస్త్రసంపద
న్మీఱినసీవు గల్గఁగ నమేయపరాక్రమ నీకుఁ బాండవు
[4]ల్మాఱి తలంప నీదగుబలంబును జేవయుఁ జూపు మిత్రతన్. (అ. 3. 10) 215

వేమాఱనుటకు నృసింహపురాణమునందు:—

క. మీఱినమానులకినుకకు, మాఱలుగక యున్నమీసమగ్రక్షమ వే
మాఱు గొనియాడఁగాఁ దగు, నీఱునె పాతకులబుద్ధిఁ గిల్బిషచయముల్. 216
(అ. . 95)

---

1 చీరెద (ప్ర. వా). 2 (ప. వా). 3 వెంట్రుకల్ (ప. వా).
4 మాఱె (వా).

క. తెలిపితి నన్నయభట్టాదులకావ్యములందు నాకు దొరకినశేషం
బులు జాలు మఱియు నెందులఁ, గలిగినఁ దగ వనక యవియుఁ గైకొనుటొప్పున్.

క. తొలుతటివారలు వాడని, తెలుఁగులపలుకులను గలద్వితీయాంతస్థం
బులు గూర్పరు తద్భేదం,బులు దెలియమి బుధులు ప్రాసములకు యతులకున్. 218

లకారభేదంబులు:—

తే. దురితసంహార నిర్జరోక్తులనె కాదు, వెలయుదొడ్డళకారంబు వికృతియందు
నెళవు దళవాయి మేళంబు నీళ్లనంగఁ, బళ్లెరం బనఁ గక్కులకళ్లె మనఁగ. 219

ఆ. ప్రథమమీఁద నుండుపంచమవర్గాది, వర్ణమునకు బదులు వచ్చి నిలుచు
లాఁతి యనువకార మాఁతమ్మె తెలుఁగునఁ, బరువు వెట్టి చిక్కువడియె ననఁగ. 220

మూ. సూ.—క్వచి దపిన స్తు ఉదోతౌ దంతోష్ఠభవస్య వికృతిశబ్దాదౌ.

సీ. జాతివాగలవోష్ఠ్యశబ్ద మొక్కటి దక్క సంస్కృతాంధ్రముల ముజ్జగములందు
శబ్దంబు మొదల నిశ్చయముగాఁ గొమ్ములు నోత్వంబులును గల్గ వొకటి కైన
వాకు శృంగములకై వడి నోత్వములభంగి శబ్దాదిఁ గలయవి స్వరము లగును
రెండును లాఁతుల నుండుఁ గృష్ణుఁడు గిన్క వుట్ట మోదినఁ జెట్టు వొలిసె ననఁగ

తే. నడుమఁగొమ్ములు సంస్కృతాంధ్రములరెంట,బలసిజాత్యక్షరములకే గలిగి యుండు
భావుకము నీవు భవుకంబు భవుఁడనంగ, బొడవు దీవులు నవురంబు పువ్వు లనఁగ.

లఘ్వలఘుభేదంబులకు:—

మూ. సూ.—నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయో స్తు నిత్యం
స్యాత్.— 17

క. వైకృతకావ్యంబులలోఁ, గాకోదరశయన లఘుయకారము హల్లై
కైకొనఁ దగు బ్రాసములకు, జోకయె స్వరమాయలు వడికిఁ జొప్పడు టరుదే.

తే. ప్రియుఁడు రాఁడాయె సత్యభామయెడఁ గాఁగ
నెన్నిమాయలు పన్నెనో యెఱుఁగరాదు
గాయఁగాఁ జొచ్చె శశి మింట నాయనంగఁ
డేయఁగాఁ జొచ్చె సఖి చక్రి యేడి యనఁగ. 223

రెండర్థంబులపద్యము, లుండెడిచో నొకటి యచ్చు నొకయర్థమునన్
నిండాయహాలు నను మీఁర, ఖండన వలసినను లఘుయకారము కృతులన్ 224

రాఘవపాండవీయమునందు:—

క. విని యతనిం దనపై నిడు, కొని యోఁగినియమికిఁ దగనిఘోరాత్రి యొన
ర్చినవాఁడ మీకు దండ్యుఁడ, నని తనుఁ దెలుపుచును వారి కప్పనఁ జేసెన్. 225
(ఆ. 1. 25)

సీ. త్రైయక్ష పానీయ పీయూష వైయాత్య హైయంగవీన వైయాసిక త్వ
దీయ స్వకీయా స్మదీయ మదీయ ప్రభృతులను [1]గియ్యలు పెట్ట రాదు
క్షయ్య జయ్య న్యాయ్య సాహాయ్య సాన్నాయ్య ధాయ్య హేయ్యములని కాయ్యములను
గ్రయ్య శబ్దమునను గియ్యలు గల వని తెలిసి ప్రాసములకు నిలుప వలయు
తే. పైయెద పయోట్టయము నొయ్యారి బలుగయాళి, యనుపదంబులఁ గొన్నిటివరసి చూడ
దొలఁగు నిలుచును గియ్యలు దెలుఁగులందు, సత్యభామాముఖాంభోజచంచరీక. 226

శశిబింబచరిత్రమునందు:—

ఉ. పయ్యెదఁ బాపి గుబ్బలను బాహులఁ బట్టఁగ నిచ్చి మోవిపైఁ
దియ్యనిమోవి యూన్చ మనసు దీరఁగఁ గ్రోలఁగ నిచ్చి యిప్పు డో
తొయ్యలి నీవి ముట్టినను ద్రోచెద వేనుఁగు నిచ్చి యంకుశం
బియ్యక కయ్య మాడఁ దగునే నను నీగతి నేఁచఁ బాడియే. 22'

చిత్రభారతమునందు:—

ఉ. అయ్యమరాచలంబు ధనువై విలసిల్లఁగ విష్ణుఁ డమ్ముగా
వేయువిధంబులం బరిఢవిల్లెడు శింజిని గూర్చినట్టి శూ
లాయుధు [2]నొక్కమాత్రమున నంగము వ్రయ్యఁగ మోది మించి తోఁ
దీయనివింటనే వెనుకఁ దీయనిబీరమున న్మనోభవా. 228

రేఫమునకు:—

తే. జాతివైరంబు నొంది ప్రాసంబులందు, విశ్రమములందుఁ దమలోన వేఱు గలిగి
దేవదానవు లట్లన తెనుఁగులందు, మించి రేఫఱకారముల్ మెలఁగుఁ గృష్ణ. 22
క. భ్రమయక రేఫములకు ఱేఫములను వాలకును వాలుఁ బ్రాసములను వి
శ్రమములను జెప్పఁ దగు నీ, క్రమ మెఱుఁగక రెండునుం గుకవి గూర్చుఁ గృతిన్.
ఆ. [3]సారిది భోజకన్య నరదంబుపై నిడి, రేయిఁ దెచ్చె ననఁగ రేఫ మయ్యె
మఱద్ది యనక సిగ్గు పఱిచి రుక్మిని జాల, నట్టు చేసె ననఁగ ఱా ముకుంద. 23
తే. చెల్లు నని ముందు భీమన చెప్పె నమ్ముఁ, గలుపుదురు రేఫములును ఱకారములును
దుష్టకవు లవి యొక్క టైనఁ దొంటిపెద్ద, లందఱును నేల విభజింతు రని తెలియరు.

2 నూట (వా). 3 సారది (వ. వా).

క. వలసిన రేఫఱకారము, లలవడుఁ దా మొకటి కొక్కటని భీమనరే
పలుకుట గలిగిన నాతఁడు, గలిపినలక్ష్య మొక టైనఁ గనఁబడ కున్నే. 233

ఉ. బమ్మెరపోతరాజకృతభాగవతంబు సలక్షణంబు గా
కిమ్మహి నేమిటం గొదువ యెంతయు నారసి చూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుం గలసి ప్రాసము లైనకతంబునం గదా
యిమ్ముల నాదిలాక్షణికు లెల్లను మాని రుదాహరింపఁగన్. 234

శారదాదర్పణమునందు:—

తే. చఛజఝలకు మొదలియూష్మములు మూఁడు, సరసపడి నిల్వఁగా నేకజాతి యైన
బండిఱాకు రేఫము వడికుండ రాదె, ప్రాసవర్ణంబులకుఁ గూర్ప రాదు గాని. 235

*ఈపద్యంబు లక్షణవేద్యంబును సుకవిహృద్యంబును గా దది యెట్లనిన:—

కవిజనాశ్రయమునందు:—

క. ధరజఝలను నీ రెండక్షరములు విన్నయదిలేదు శబ్దము మొదలన్
మరయలవములను నేనక్షరములు తమతమకె వళ్లు కమలాధీశా. 236

అనంతుని ఛందమునందు: —

క. ధర నెక్కటివళు లై తగు, లరమఱవలు దానితోఁ దొలంగక లావు
న్నరి శా యని విశ్రమవేళ రమాధవ రెండునుం గలసి వర్తించున్ 237

ఆ. మరునితండ్రి లోకమహితుండు యాదవ, రాజసింహమూర్తి రక్షకుండు
ఱాఁగ వేలు పనఁగ ఱంపిల్లు నెక్కటి, వళ్లు నాఁగ నిట్లు వనజనాభ. 238

కావ్యాలంకారచూడామణియందు: —

క. లరమఱవ లేకతరవళు, లరయఁగఁ దమతమకె కవులయనుమతి వళు లై
పరఁగుఁ బదాంతముకారము, పొరి నూఁదిన దూరి చనినఁ బుపుబు[1]భువు లగున్.
(అ. 7. 44)

లక్ష్యము.

ఆ. అజ్జ లాడి యీగి ఱాపడి సభలోన, జేనిపోరిలోన జిచ్చుఁ బోరని
పెన్న మాడుగుపుడమి యేండ్ల నేల నుతింప, మనకు విశ్వనాథుఁ డొనరి యుండ.

సర్వలక్షణసారసంగ్రహమునందు:—

తే. మహిమ నెక్కటివళు లన మరవఱలలు, రహిని దమతమకయ యొగు రమ్యచరిత
వనధిగంభీర సద్గుణవాస యనఁగ, భంజితాసురసముదాయ యాంజనేయ. 241

* ఇది(వా) లోనే కనఁబడును. 1 భుల కగున్.

### రేఫలోపము.

క. నేరు పనునట్టిలపితము, లో రేఫం బచ్చుతోడ లోపం బగు రా
ఘారమణ వఱసినప్పుడు, భారతమున సోమయాజి పలుకుటవలనన్. 242

విరాటపర్వమునందు:—

క. ద్యూతక్రీడకుఁ గొండొక, నేతుం గపటమున నొప్పనిజనంబులు నా
చేతిధన మెల్లఁ గొని పరిభూతి యొనర్చిన విరక్తి పొడమి వెడలితిన్.(అ. 1. 196)

మౌసలపర్వమునందు:—

క. కొంచి కొని వచ్చి తగ నా, నేచినయ ట్లచట నిచట నిలిపితి మునినా
థా చేటును భంగంబును, జైచిత్తము శోకమునకు నగ్గం బయ్యెన్.(అ. 1. 215)

లోపము రామికి రాజశేఖరచరిత్రమునందు:—

క. ఏరికి బుద్ధిబలంబులు, కారణములు గావు సుమ్మె కలరె ధరిత్రిన్
నేరిచి బ్రతికినవారలు, నేరక చెడ్డట్టివారు నీరజనేత్రా. 245

### క్రారవడులకు.

తే. క్రిందు గ్రద్దయుఁ ద్రోవయుఁ ద్రిమ్మటయుఁ
బ్రోచుటయు బ్రతికించుట మ్రొక్కుటయును
వ్రేలుటయు స్రుక్కుటయు వన వీనిమొదలి
వ్రాలిటులఁ గొన్నిటను గ్రారవడులు చెందు. 246

### లకారమునకు.

క. విరమణమూలకును భ్రాంతా, క్షరములకును లళలు దొడ్డసన్నములును మ
చ్చరము తెలుంగక చెల్లును, వారసుత "లళయో రభేద" యనుసూత్రమునన్.

ఆ. గంగకొడుకుమాట గాదని సభను బెగ్గిలపడ నెల్లనృపులలోన వారిని
గొల్లడనుచుఁ జాలఁ ద్రుళ్లి చేదివిభుండు, వాలిసెఁ బఱచి బలము నెళవుఁ జేర.

### వకారమునకు.

తే. పొలుపడి నిల్చు లాఁతిపా ప్రాసమునకు, జాతివాను సవర్ణమై శంక లేక
యుతికిఁ బంచమవర్గాద్య మగుటఁ జేసి, చెల్లదు వకారమునకు లక్ష్మీభుజంగ.

తే. అవనితనయునిచేతఁ బట్టువడి యున్న, పడుచుకొమ్మల హరి చెట్టపట్టి యేలెఁ
దవిలి పదియాఱువేవురు దమకుఁ దామ్ము, మేలువాఁ డని తను నిచ్చ మెచ్చుకొనఁగ.

తే. లాఁతి వాతికి వడికి నిల్వఁ దగ దనుచు, సూత్రమునఁ జెప్ప లే దని చూడ వలదు
సన్నయాద్యుఁడు పంచమామ్నాయమునను, నిలుపులక్ష్యంబులకుమాఱు వలుకవలె నెం.

ఆదిపర్వమునందు:—

ఉ. భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టఁగఁ దోడనె పుట్టు నుత్తమ
జ్ఞానము సర్వభూతహితసమ్మతబుద్ధియుఁ జిత్తశాంతియు
స్థానమదప్రహాణము సమత్వము సంతతవేదవిద్యను
ష్ఠానము సత్యవాక్యము దృఢవ్రతముం గురుజాపరత్వమున్. (అ. 1. 157) 252

క. నువు నువ్వు నూవు నూఁబు, వ్వెవఁ డెవ్వాఁ డెవ్వఁ డేవఁ డీతఁ డనంగాఁ
బువు పువ్వు పూవు పూమొ, గ్గవురా వికసించె ననఁగ నగు వలయునెడన్. 253

నూ వన్నందుకు శశిబిందుచరిత్రమునందు:—

క. నూవుంబువ్వును సంపెఁగ, పూవు గెలిచి బిరుదుముత్తెపుంజల్లి దగ
న్దా వైచె ననఁగ ముంగర, తో వనరుహనేత్ర నాస తుల లేకొప్పున్. 254

ఏవాఁ డన్నందుకు విరాటపర్వమునందు:—

క. నీ వొకతె యేల యిలఁ బడి, వేవురు వేవలచి పట్టి వెఱకిన నడ్డం
బై వచ్చి వలదు నా నిం, దేవాఁడు మగండు లేమి సెఱుఁగవు కంటే. (అ. 2. 256)

శాంతిపర్వమునందు:—

క. ఏవానిబంధుమిత్రులు, జీవధనంబులును నొప్పిఁ జెందుదురు కృశుం
గా వాని నెన్నఁగాఁ దగుఁ, గేవలతనుకార్శ్యయుతుఁడు కృశుఁడె నరేంద్రా.
(అ. 1. 52)

పూ వన్నందుకు ఆముక్తమాల్యదయందు:—

ఉ. వేవినమేడపైవలభి వేణికఁ జంట గ్రహించి విప్పఁగాఁ
బూవులు గోళ్ల మీటుతటిఁ బోయెదు తేఁటుల మ్రోఁత కామిశిం
జావహ మౌఁ గృతాభ్యసన లౌటను దంతపుమెట్లవెంబడిం
జేవడి వీణ మీటుటలుఁ జిక్కడలించుటలున్ [1]సమంబుగన్. (అ. 1. 62) 257

వ. కడమవి ప్రసిద్ధములు గనుక లక్ష్యములు వ్రాయలేదు.

సకారభేదంబులు.

క. శస లెఱుఁగక చదువంగాఁ, బొసఁగ ద దెట్లనిన శకలము సక్రొత్తనుచో
వసుధ సకలము శకృత్తన, రసికులు నవ్వుదురు గాన రాక్షసవైరీ. 258

సీ. వికృతిపదాదిని వెలయుసాఱవహల్లు మొదలివిభక్తిపైఁ గదిసెనేని
యరయఁ దృతీయోష్మ మగు శౌరి సీరలు దాఁచి గోపస్త్రీల నేఁచె ననఁగ

1 సరింబడన్ (అచ్చుప్రతి).

ప్రథమోష్మవర్ణంబుఁ బరికింపఁ దద్భవాద్యంధ్రదేశోక్తులయందు లేదు
సింగంబు [1]సింగిణి సెవమును సెలగోల వీసెఁడు పని గొనఁ జేసి రనఁగ
తే. భీష్మసన్నుత యివి తృతీయోష్మలిపులు, గాని ప్రథమోష్మవర్ణము గ్లావు వీనిఁ
దెలియక రచించు కృతులు ధాత్రీతలమునఁ, బ్రాసభంగంబులై నగుబాటుఁజెందు.
క. తెలుఁగుపదంబుల నెత్యము, గలమూఁడవయూష్మమును శకారముఁ గాఁగం
బలుకుదు [2]రజ్ఞజనంబులు, సెలగోలలు సెనగ లాలుసేరులు ననుచోన్. 260

## హకారవివేకము.

సీ. బహ్వర్థ విహ్వల జిహ్వ హ్వ లాహ్వాన గహ్వ రోపహ్వర ప్రహ్వ కహ్వ
శబ్దంబులు వకారసహితంబు లగుఁ గాని బిందుపూర్వములు దా నొందుఁ గావు
సంహతి సంహూతి సంహిత సంహార సంహాన సాంహో నృసింహ రంహ
బృంహణ పదములు బిందుపూర్వకములు గాని వకారయుక్తములు గావు
తే. మాముడులు నిల్పు బ్రహ్మజిహ్మగపదములఁ
జిహ్న మనుచోట నాముడిఁ జెందియుండుఁ
గియ్య లగు లేహ్య గృహ్య ప్రగృహ్యములను
బ్రాసముల వీని నెఱిఁగి చెప్పంగ వలయు. 261

## కావ్యాదిగ్రాహ్యవర్ణంబులు.

మూ. సూ.-శుభవర్ణా శ్శుభశబ్దా యే చ శుభగణా స్త ఏవ కావ్యాదా
గ్రాహ్యాః. 18
తే. లిపుల కధిదైవతంబులు లింగములును, బ్రాణగతి ఫలబీజంబు లాసనములు
నమృతములు విషములును దగ్ధాదిభములు, దెలిసి కావ్యముఖంబున నిలుప వలయు.
క. జడ్డలు గలమాతృక [2]తొలి, నిడ్డ నధోర్ణముల కొల్ల నేఁటికి మీఁదన్
దొడ్డదొరబిడ్డలైవడి, నొడ్డై కనుపడ్డ వ్రాల నూహింపఁ దగున్. 263

## వర్ణాధిదైవతంబులు.

తే. హరిధరలు కంతురమ లంబికామరాంబ, లలకుమారవరాహశక్తులు వసుత్రి
దివభిష్మృక్కులు మధుచిత్రభవులు కాళి, కార్యలు హరాభవులు పటు లచ్చులకును.
సీ. స్పర్శవర్గములకుఁ జతురాస్యపవమానకరిముఖగణపతివరమృగేంద్రు
లింద్రావరజగుహాద్రీంద్రజాభైరవజిను లంతకాస్రపశివమహేశ

1 సిరిదరిసెనమును (ప. వా). 2 తో, నిడ్డ (ప)

వాణులు ఫణినాథవాసుకినందికేశ్వరపద్మమిత్రశంకరులుపిర
భద్రకేశవదప్రభద్రకాళీశూలధారులు నింక నంతస్థములకు
ఆ. మారుతాగ్నిపూర్వమాతంగవరుణులు, శాదివర్ణములకు శ్రీదినేశ
వాక్పినాకధరులు పల మాటిలోను భూతములు నాగమోక్తదైవతములు. 265

తే. కృతిముఖాక్షర [1]దేవత పతికి సుకవి, వరుసకును లేఖకునకును వాచకునకు
శ్రోతృజనములకును శుభాశుభఫలంబు, తెలమిఁ గల్పించుచుండు మహీస్థలమున.

వర్ణలింగంబులు.

క. పుల్లింగంబులు ప్రాణము, లెల్లను స్త్రీలింగములు మహిని స్వరములతో
హల్లులు నపుంసకంబులు, ఫాల్ల లగుఁ గకారముఖ్యములు నలినాక్షా. 267

తే. చిరవిభూతి పతికి స్త్రీలింగలిపు లిచ్చు, భంగపఱుచు షండలింగలిపులు
భూరివైభవంబుఁ బొందించుఁ బుల్లింగ, లిపులు తొలుత నిలిచి లేఖవినుత. 268

వర్ణంబులకు నల్పప్రాణమహాప్రాణంబులు.

ఆ. స్పర్శవర్గజాతసమలిపు లాఁడవ, వర్గమునను విషమవర్ణములును
నాలు గూష్మములును నలిమహాప్రాణంబు, లల్పసంజ్ఞికంబు లన్య 269

క. తొలుత మహాప్రాణంబులు, నిలిచినఁ గృతినాయకుండు నిల్గును నెలలో
పల నల్పప్రాణాక్షరములు గూర్చినఁ బెక్కువర్షములు జీవించుఁ గా. 270

వర్ణంబులకు దేవమనుష్యతిర్యగ్రౌరవగతులు.

సీ. ప్రాణార్ణములుఁ బదియాఱును పంచమాత్రరములఁ బాసినస్పర్శములును
హ్రస్వంబు లగుతటి నాదిత్యగతు లగుఁ జాపు లైనపుడు భూజనగతు లగుఁ
జింతింప ననునాసికాంతస్థవర్ణంబు లరయ నెప్పుడును దిర్యగ్గతు లగు
శషసహాక్షరచతుష్టయమును దొడ్డకకారంబును గూడ రౌరవగతు లగుఁ
తే. గృతిమొదల నిల్చుసురగతు లీక్కీర్తిఁజేయు,మనుజగతులువిరోధినాశనముఁ జేయుఁ
గినిసి తిర్యగ్గతులు చాలఁ గీడుఁ జేయుఁ, బతికి రౌరవగతులు పాపంబుఁ జేయు.

వర్ణంబులకుఁ బ్రత్యేకఫలంబులు.

ఆ. శుభకరంబు లాఱు విభవనాశదములు, నాల్గు కీర్తిదములు నాల్గు హాని
దములు రెండు వరుస దప్పక కావ్యంబు, మొదల నిలుపఁ బ్రాణములు ముకుంద.

సీ. ధనధాన్యసుతరాజ్యకనకంబులును యశోనాశనారోగ్యదైన్యప్రతాప,
మరణంబులును దుఃఖమానభంగద్రవ్యరోగభద్రములును భోగయుద్ధ

1 దేవతే (వా).

ధైర్యతేజఃపరితాపంబులును శౌర్యభీతినిరోగసంప్రీతివంశ
నాశనంబులును మానక కాదివర్గంబు లైదు నొసంగు కల్యాణదాహ
తే. భేదదీర్ఘాయువులు యకారాదు లిచ్చు, జయభయశ్రీసుఖంబు లూష్మము లొనర్చు
నాయు వల్పంబుగాఁ దొడ్డశా యొసంగుఁ, గవికిఁ బలికిని బద్యాదిఁ గదియునపుడు.

## వర్ణంబులకు బీజచక్రము.

సీ. నిలువుగీటులు పది నిలిపి రేఖాషట్క మడ్డంబుగాఁ గీఁచి యాదిలిపులు
తొలిదొంతిక్రిందు క్రిందుల రెండురెండిడి రెండవదాన నొండొండు గూర్చి
కడపలిప్రాణంబు కడగ మున్న లిఖించి హెచ్చుశా దానిపైయింట నిలిపి
తరువాతిదొంతులధామంబులను గాదు లొక్కటొక్కటి క్రమ మొప్ప వ్రాసి
తే. యడ్డముగఁ జూడ నయ్యె వాతాగ్నిభూమి, జలఖబీజంబు లివి కావ్యములకు మొదల
నిలుప ఖేదార్తిధనహార్ష నిర్ధనంబు, లొసఁగుఁ గర్తకు భర్తకు నుదధిశయన. 274

## బీజాక్షరచక్రోద్ధారణము.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అఆ | ఎ | క | చ | ట | త | ప | య | ష | ఇవిగంయు | వాయుబీజాక్షరములు పద్యాదిని నిలిపిన ఖేదమును జేయును. |
| ఇఈ | ఐ | ఖ | ఛ | ఠ | థ | ఫ | ర | స | ఇవిగంయు | అగ్నిబీజాక్షరములు పద్యాదిని నిలిపిన ఆర్తిని జేయును. |
| ఉఊ | ఓ | గ | జ | డ | ద | బ | ల | హ | ఇవిగంయు | భూమిబీజాక్షరములు పద్యాదిని నిలిపిన ధనమును జేయును. |
| ఋౠ | ఔ | ఘ | ఝ | ఢ | ధ | భ | వ | ళ | ఇవిగంయు | జలబీజాక్షరములు పద్యాదిని నిలిపిన హర్షముఁ జేయును. |
| ఌౡ | అం | ఙ | ఞ | ణ | న | మ | శ | అః | ఇవిగంయు | గగనబీజాక్షరములు పద్యాదిని నిలిపిన నిర్ధనమును జేయును. |

## ఊర్ధ్వముఖాధోముఖపార్శ్వముఖంబులు.

తే. వట్రుసుడు లూర్ధ్వముఖములు వక్రములును
గుడుసులు నధోముఖంబులు గడమపదియుఁ

బార్శ్వముఖములు వరుసతోఁ బ్రాణహాని
ఖేదసంపద లొసఁగుఁ గావ్యాదినిలిచి. 275

## వర్ణంబులకు నమృతవిషంబులు.

క. పరువడి హ్రస్వము లమృతా,క్షరములు కృతిమొదలఁ గూర్ప గదము లడంచుర్
[1]ధర నిడుపులు విషలిపు లవి, గరళముగతి మ్రింగుఁ బతిని గావ్యాది నిడర్. 276

## వర్ణంబులకు దుష్టనక్షత్రంబులు.

క. పలికెడుకబ్బమునకు మొన, దల నెలకొనునక్కరంబు తారకదగ్ధా
దుల నైదింటను దొరలక, వెలసిన నాయకున కింద్రవిభవం బబ్బుర్ 277

## దగ్ధజ్వలితధూమితతారలు.

తే. క్రూరఖేటము విడిచినతార దగ్ధ, యపుడు వసియించువది జ్వలితాఖ్య దాని
ముంగలిదిధూమితంబదివిమూఁడుఁగృతికి,మొదలఁ[2]గదిసినమృతిదుఃఖగదము[3]లొదవు.

## మృతజీవరోగభంబులు.

తే. సైంహికేయగ్రహస్థితర్క్షంబుమీఁద, తార మొదలుగఁ బదుమూఁటిదనుక జీవ
యుతము లవతలి వన్నియు మృతము లిట్లు, త్రివిధముగఁజెప్పఁబడియె విరించిజనక.

ఆ. తన్మిచుట్టు మున్న తారక మొదలుగ, మృతము లేదు ప్రాణయుతము లర్క
పరిమితములు రోగభంబులు గూడంగ, నిది వశిష్ఠమతము యదుకులేశ. 280

క. కృతిమొదల నిలిచి చంపును, మృతనక్షత్రంబు చాల మే లొనరించుర్
సతతంబు జీవతారక, పతికిఁ దెవులు సేయు రోగభము నెలలోనర్. 281

## అవకాద్వర్ణస్వరనిర్ణయము.

## వరరుచిసంహితోక్తవచనంబులు.

శ్లో. స్వరాః పంచవిధాః ప్రోక్తా అ, ఇ, ఉ, ఏ ఓతి క్రమాత్
తైర్యుక్తా అవకాద్వర్ణా ఏకైకం పంచధా భవేత్
అవకహాడా మటపరతా నయబజఖా శ్చాధ గసదచలాః,
వర్ణా ఏతే భానా మేకైకం, పంచధా క్రమశః
ఐత్వ మౌత్వ మనుస్వారో విసర్గో వా [4]భవేద్యథా,
సర్వస్వరాణాం మాతృత్వా దేతేషా మస్వరో భవేత్

1 ధరనిడుపు విషము లిపులవి (పా). 2 గదసిన (ప వా). 3 లొసఁగు (ప).
4 భవేద్యది (ప).

[1]ఋత్త్వేత్వయో ర్మిథో హ్రస్వదీర్ఘయో రైక్య ముచ్యతే,
యామళోక్త మిదం జ్ఞాత్వా వదే త్సర్వబలాబలం.

క. తలకట్టులు గుడుసులు కొమ్ములు వెస నేత్వములు నోత్వములు ననఁ బ్రాణం
బులు పంచవిధము లై హల్లుల నెల్లను గూడుకొని నిలుచుఁ దారలకున్. 282

తే. అవకహడలును మటపరతాక్షరములు, నయబజఘగసదలచవర్ణములు వరుస
నిరువదియు స్వరపంచకాన్వితము లగుచుఁ, గృత్తికాదుల నాల్గేసిహత్తియుండు.

తే. ప్రాణషోడశమునకు నాద్యస్వరంబు, జనని యగుటను బిందువిసర్గవక్ర
తమములకుఁ దాన యగునిడుదలకు నెల్ల, గుఱుచలగు వట్రుసుడులకుగుడుసులగును.

## నక్షత్రాధిపతులు.

సీ. అశ్వినీప్రభృతుల కైదింటికిని దస్రయమకీలిధాతృనిశాకిరణు
లార్ద్రాదులకు శంకరాదితిచిత్రశిఖండిసంభవభుజంగమ[2]పితలును
నిజముపూర్వాఫల్గునీముఖ్యములకు భగార్యమార్కత్వష్టృహరిణహాయులు
మఱి విశాఖకు శతమఖవహ్ను లిద్దఱు పిదప ననూరాధ మొదలుగాఁగ

తే. నాలుగింటికి మిత్రేంద్రనైరృతాంబు, లుత్తరాషాఢనుండి యష్టోడువులకు
విశ్వవిధివిష్ణువసుతోయ విభువిరించి, పాదహిర్బుధ్న్యపూషులు పతులు కృష్ణ.

క. ఏతారకు నెవ్వఁడు విభుఁ, డాతనినామంబు లెల్ల నాతారకుఁ బ్ర
ఖ్యాతముగాఁ జెప్పంబడు, జ్యోతిశ్శాస్త్రంబునందు సుమనస్స్తుత్యా. 286

వర్ణంబులకు నక్షత్రంబులును రాసులును నెఱుంగు తెఱంగు వివరించెద.

## కాలజ్ఞకల్పోక్తశ్లోకంబులు.

శ్లో. అకారః కృత్తికా మేష ఈ, ఊ, ఏ కృత్తికా వృషః,
ఓ, వా, వీ, వూ, ధాతృవృషౌ వే, వో, మృగవృష స్తథా.
కా, కీ, మృగశిరాయుగ్మం కూ, ఘం, ఙం, ఛ, శివాయుగం,
కే, హా, కో, అదితిద్వంద్వం హీ, సురాంబా[3]కుళీరకాః.
హూ, హే, హో, డా, పుష్యకర్కీ డీ, డూ, డే, డో, హి కర్కటః,
మా, మీ, మూ, మే, మఘాసింహౌ మో, టా, టీ, టూ, భగేభభుక్.
టే, ఉత్తరాభ హార్యక్షౌ, టో, పా, పీ, ఉత్తరావధూః,
పూ, ష, ణా, ఢా, హస్తకన్యా పే, పో, చిత్రా కుమారికా.

1 ఋత్త్వేత్వయో (వా). 2 పితరులు (ప. వా). 3 కుళీరగః (ప. వా).

రా, రీ, చిత్రా, తులారాశీ రూ, రే, రో, తా, మరు త్తులా,
తీ, తూ, తే, వైశాఖతౌలీ తోవిశాఖా సరీసృపః.
నా, నీ, నూ, నే, మైత్రకీటో నూ, యూ, యీ, యూ, స్వరా షవిః,
యే, యో, బా, బీ, దైత్యచాపో బూ, ధా, ఫా, డా, జలం ధనుః.
బే, విశ్వేదేవకోదండో భో, జా, జీ విశ్వవాశ్వరః,
జూ, జే, జో, ఖాభిజిన్నక్రో ఖీ,ఖూ,ఖే,ఖో, హారి గ్రహాః.
గా, గీ, ధనిష్ఠామకరో గూ, గే వసువయోధరః,
గో, సా, సీ, సూ, శతభిష గ్ఘటరాశి రుదాహృతః.
సే, సో, దా, [1]అజరాట్కుంభో ధిఅజైకపదో ఝమః,
దూ, శా, ఝూ, దా అహిర్బుధ్న్య త్తారాషే త్రం తిమింగిలః.
దే, దో, చా, చీ, పౌష్ణతారా రాశిః పాఠీనసంజ్ఞికః,
చూ, చే, చో, లా అశ్వినీ భా లీ, లూ, లే, లో భరణ్యాజః.

వ. మఱియు వీనికి నాదేశంబు లగునక్షరంబులు గల వివియనుం జెప్పెద. 288

శ్లో, [2]ఘూరార్ద్రే త్రిక్షు ద్వితీ యేంఘ్రా వహిర్బుధ్న్య త్తృతీయకే,
డకారో జలభ స్స్యాంతే తద్వితీయే థ కారకః.
భవర్ణక స్తత్తృతీయే ఏతే వర్గ చతుర్థకాః,
ద్వితీయే హిర్బుధ్న్య భస్య ప్రథమో స్యాక్షరం విదుః.
రాద్రా హిర్బుధ్న్య త్తో పూర్వ్వ నక్షత్రాణాం మునీషిభిః,
ద్వితీయాదిత్రిపాదేషు యే వర్ణాః కీ ర్తితాః పురా.
తేషా మేకైకవర్ణ స్సా త్సర్వస్వరసమన్వితః,
మాతృత్వా దస్వర స్తేషా మేక ఏవ ప్రకీ ర్తితః.
ఆద్యద్వితీయవర్గానునాసికాక్షరయో ర్మిథః,
భేదో నా స్తి మిథ స్తద్వ దంత్యవర్గసమార్ణయోః.
యత్ర తిష్ఠంతి నామాదౌ సంయోగవ్యంజనాక్షరాః,
తత్రాదివర్ణం జనం గ్రాహ్య మి త్యుక్తం బ్రహ్మయామళే

1 అజపాట్కుంభో (వ. పా).
2 ఘూరార్ద్రాక్షుద్వితీయకాహ్యాష్టహిర్బుధ్న్య (అచ్చుప్రతి).

రేఫాన్వితాక్షరో యత్ర నామాదౌ నృపభృత్యయోః,
ధనధాన్యాయ దంపత్యో ర్గ్రాహ్యో రేఫస్తు నేతరః.

తే. హరునిరిక్క రెండవకాల నవలిభాద్ర, మూఁడవపదంబునను సలిలోడువునకు
నబ్ధినేత్రకృశానుసంఖ్యాంఘ్రులందుఁ, గ్రమత వర్గచతుర్థాక్షరంబు లమరు. 289

క. జలరవిశివోత్తరాభా, ద్రలతొలిపాదములఁ దక్కఁ దక్కినముటన్
గలిపుల కేస్వరంబులు, తల నిలచిన నొకటి గాఁగఁ దలఁపఁగ వలయున్. 290

క. మించి ప్రథమానునాసిక, మెంచఁ జవర్గాంత్యమునకు నెల్లెడఁ జెల్లున్
బంచమవర్గచతుర్థము, వంచింపక స్వద్వితీయవర్ణమున కగున్. 291

క. పతినామాద్యర్ణమునకుఁ, గృతిముఖమున నుండువ్రాయికిని గీర్వాణ
స్తుత ద్విత్వము లున్న నధో,గతము లుడిగి మీఁదిమాతృకయ కొను టొప్పున్.

క. నామాది నుండువర్ణము, దామోదర రేఫసంయుతం బై యున్నన్
యామళమునందు రేఫం,బే మిక్కిలి గ్రాహ్య మనుచు నెన్నంబడియెన్. 293

## నాయకాక్షరకూటంబులు.

తే. నేతృనామాది నుండెడిమాతృకకును, గావ్యముఖవర్ణమునకును గాంతిజాతి
చక్రగణయోనిలింగ[1]నక్షత్రయోగ, రాశిఖగమైత్రు లెఱిఁగి కూర్పంగ వలయు. 294

క. కుతలమున వధూవరులకుఁ, జతురత దైవజ్ఞమణి విచారించుగతిన్
గృతికన్యానాయకులకు, హితమతిఁ దెలియఁ దగు సుకవు లివి తొమ్మిదియున్. 295

## 1. అక్షరకాంతికూటములు.

తే. ప్రథమదశమచతుర్థస్వరంబు లెఱుపు, లసితరుచులు తృతీయషష్ఠాష్టమములు
పంచమైకాదశంబులు పచ్చవన్నె, లిందునిభములు తక్కినయెనిమిదియును. 296

సీ. శ్యామలశుభ్రశోణార్జునకృష్ణంబు లసితవినీలారుణాంజనాభ
కాళిమ లరుణశుక్లచ్ఛవిపీతసితేతరరక్తంబు లిందుకాంతి
హారిణమేచకహరిద్రాభపాండురములు సితకృష్ణధవళలోహితసువర్ణ
పతిశిలాభంబులు స్పర్శవర్గములకుఁ గృష్ణారుణాసితక్షీరరుచులు

తే. ఫాల్గునంతస్థములకుఁ గుందనఁపుతేట, గెంపుఱాచాయయును బవడంపుజిగియు
మొల్లవిరిమిసిమియు నూష్మములకుఁ దెలుపు, నెఱ ళకారంబునకునువన్నియలువరుస.

ఆ. విభుశరీరకాంతి వీక్షించి తత్కాంతి, గలుగునక్షరములు కావ్యములను
మొదల నిలుపఁ దేజ మొదవు వేఱొకచాయ, వర్ణమిడినఁ దెవులు వచ్చు నిజము.

---

1 నక్షత్ర, దూర (పూ. ము).

క. శ్వేతము నీలము నేకము, భూతలమునఁ బీతరక్తములకు నభేదం
బై తనరుఁ గృతులయందును, నీ తెఱఁగున దెలియ వలయు నిభపతివరదా. 299

## 2. అక్షరకులకూటము.

సీ. ఆదిషోడశమును గాదిపంచాదశవర్ణంబులును ద్విజాన్వయభవములు
తపవర్గమాత్ర్యౌదశకసమాంతసములు రాజగోత్రసముద్భవములు
తలపోయ నంతసములలోన బేసులు నూష్మంబులును విట్కులోద్భవములు
రదనజాతచజాక్షరములును గురుఱళల్ జగతి నంఘ్రిజవంశసంభవములు[1]
తే. వీనిఁ దెలిసి కావ్యవిభుని దేజాతి తజ్జాతియక్షరంబు సత్కవీంద్రు
లరసి కృతిముఖంబునందుఁ బొందించిన, నెసఁగు సకలశుభము లిరవుగాను. 300

## స్నిగ్ధరూక్షాక్షరంబులు.

ఆ. అధిపుకులముఁ బ్రాయి యల్పాసు వైనను, స్నిగ్ధ మయ్యె నాదినిరు లొసంగు
నన్యజాతిలిపి మహాప్రాణ మైరూక్ష, మనఁగ మొదల నిలిచి యునికిఁ బాపు. 301

## 3. అఋంచక్రకూటము.

సీ. అయి దూర్ధ్వరేఖలయందుఁ దిర్యగ్రేఖ లైదైదిడి యిట్లు ...
యధిపనామాద్యక్షరాదిగా నచ్చులు హల్లులు గురళకారాంతములుగ
నాద్యగ్నిహరనిధిహస్తివేదాదిత్యదిగ్రసకరినృపతిమనుబాణ
శైలవాసరవిశ్వసంఖ్యాలయంబుల లిఖియించి యామీఁదిలిపులు మరల
తే. వెనుకటట్టుల నిలిపి తక్కినవి రెండు, పదియు మూఁడవతావునఁ గుదురుపఱిచి
జగతి నరివర్ణశోధనచక్ర మిట్లు, వ్రాయఁగాఁ దగు నేఁబదివర్ణములను. 302

## 4. స్నిగ్ధాదిచక్రకూటము.

సీ. [2]నాల్గిండ్లు పైని గ్రిందను బ్రదక్షిణముగా జత గూడి యొక్కొక్కచవుకమయ్యె
నట్టిచౌకములు నాల్గవి క్రమంబున సిద్ధసాధ్యసుసిద్ధారిసంజ్ఞము లగు
నవి గాక యొక్కొక్కచవుకంబునను గ్లునిరవులు నాల్గును వరుసతోడ
క్షితి సిద్ధసాధ్యసుసిద్ధారు లన నొప్పుఁ గావునఁ గడచవుకంబునందుఁ
తే. గలగృహంబులు నాల్గింటఁ గడమమూఁడు, చవుకములయందుఁ గడపలి
ద్వ్యముఖివర్ణములు గనుపడెనేని, పతికి నెటువంటిహితుఁడైనఁ బగర యగును. 303

1 నేని (పూ. ము). 2 నాల్గింట్లు (ప).

## అరివర్ణచక్రోద్ధారణము

| | | | |
|---|---|---|---|
| ౧<br>ఎటర | ౨<br>అంణష | ౩<br>ఐఠల | ౪<br>అఃతస |
| ౫<br>ఛబఉ | ౬<br>గధఅ | ౭<br>జభఊ | ౮<br>ఘనఆ |
| ౯<br>ఔఢశ | ౧౦<br>ఖదళ | ౧౧<br>ఓడవ | ౧౨<br>కథహ |
| ౧౩<br>ఇయబౠ<br>ఌౡ | ౧౪<br>చఫఈ | ౧౫<br>ఝమఋ | ౧౬<br>ఞపఇ |

ఎఱ్ఱాప్రగడ తనకును, అరణ్యపర్వశేషము మొదలిపద్యమునకును, అక్షరచక్రము చూచుకొన్నందునకు తెలివిడి.

తెనుఁగున శబ్దాదిని యకారము లేదు గనుక నెఱ్ఱాప్రగడనామాద్యక్షరమచ్చుగనక, ఎకారము ఆది మొదలుకొనియు ప్రాయఁగా పద్యాదివర్ణము, 'స్ఫురదరుణాంశు' అన్నాఁడు గనక ద్విత్వాక్షరమునందు మీఁదటియక్షరమే కారణము గనక సకారము సాధ్యపుచొకమునందు సాధ్యపుయింట నిలిచెను గనక సాధ్యసాధ్యము మంచిది, యెవరికిఁ జూచినను ఇటువలెనే. 304

*శ్లో. ఆద్యగ్నిరుద్రగ్రహనేత్రవేద రవిర్దిశర్తు వసుషోడశశ్చ,
మన్వంతరే బాణతురంగవాసర త్రయోదశాస్యుః పదవర్ణమాహ.

ఉ. చేరక నిట్లువ్రాసి తగ సిద్ధము సాధ్యము నా సుసిద్ధముం
దైరియుఁ గావ్యనాయకుని వర్గగృహాదిఁ బ్రదక్షిణంబుగా
నారసి చూచి శత్రులిపు లన్నియు వీడ్కొని భద్రమధ్యమా
దారశివప్రదంబులని తక్కినమూఁటి నెఱుంగఁగా నగున్ 305

## 5. అక్షరదేవారిగణకూటము.

క. ఆరయ నామాద్యక్షర, తారాగణమును దదీశతారాగణముం
బేరము నొందిన భరకు, ఘోరార్తి ఘటించు మైత్రిఁ గూడిన నొప్పున్. 306

* (వా) లోనే యున్నది

తే. అధిపతికి నేండ్లు ముప్పది యైనదనుక, నతఁడు పుట్టినరిక్కయు నంతనుండి
నామధేయంబు మొదలివర్ణమున నైన, చుక్కయును జేకొని బలంబుఁజూడవలయు.

క. జనియించినతార యెఱుంగ, గనిజనులకు నామతారకయ చేకొనఁగాఁ
జను నని సంహితలోపల, ననియె వశిష్ఠుండు గోచరాధ్యాయమునన్. 308

## గణనిర్ణయము.

సీ. నవతార లొక్కగణం బగు నట్టిగణంబులు మూఁడువిధంబు లయ్యె
హాయమృగాదితిపుష్యహస్తమారుతమైత్ర రేవతీశ్రవణముల్ దేవగణము
లగ్నీంద్రవరుణచిత్రాహిమూలలు విశాఖావసుమఖలు రాక్షసగణములు
పూర్వత్రయవిరించిశర్వోత్తరత్రయయామ్యముల్ నృగణంబు లనఁగఁ జెలఁగు

తే. నుత్తమము రెండుగణములు నొకటియైన, మధ్యమము సురనరగణాహ్వయము లైన
నధమ మాదిత్యగణము దైత్యంబు నైన, నాశనము దానవంబు మానవము నైన. 309

ఆ. మురవిభేది కొవ్వముఖవర్ణతారకొ, యోని నాయకర్త యోనితోడఁ
బొందు గూడెనేని పూర్ణాయు వగు వైర, మొందెనేని హాని చెందుఁ బతికి. 310

## యోనినిర్ణయము.

సీ. వాజిళతోడు లశ్వములు యామ్యాంత్యభంబులు కరు లగ్నిజ్యములు గొఱియలు
బ్రహ్మేందు లహులు సర్పపునర్వసులు పిల్లు లిల మఘాఫల్గును లెలికెకూన
లుత్తరాహిర్బుధ్న్య లూహింప గోవులు వాయుహస్తంబులు వాహరిపులు
దలఁప నింద్రాగ్నిచిత్రలు పులు లింద్రానురాధ లేణంబులు రాక్షసార్ద్రి

తే. లడవికుక్కలు జలభంబు వారియుఁ గపులు, విశ్వతారాభిజిత్తులు వేఁటముంగు
లజపదంబు ధనిష్ఠయు నరసి చూడ, బాలకంఠీరవంబులు పద్మనాభ. 311

ఆ. ఏకయోను లైన నెంతయు మంచిది, కొంత మేలు భిన్నజంతు లైన
వైరజాతు లైన వర్జనీయము వాని, తెఱఁగు గాతమోక్తి దెలియ వలయు. 312

సీ. అశ్వంబునకు హరివ్యాఘ్రిసైరిభములు కరటికి శార్దూలతురగహరులు
మేఁకకుఁ గపిపుండరీకహర్యక్షంబు లురగంబునకుఁ బిల్లియును నకులము
మార్జారమునకు సింహవ్యాఘ్రిశునకంబు లాఖువునకు బిడాలాహిబభ్రు
లర్వగోకాసరైణాలికిఁ గేసరిద్వీపులు పులికి హ స్తిద్వేషంబు

తే. గుక్కలేటికి సింగంబు గొల్పులియును, బభ్రుకపులకు శునకడింభంబు నరులు
గట్టితనమున మృగరాజుఁ బట్టునట్టి, జంతువులు లేవు దానిచ సమునయ్య గా. 313

ఇభరాజభయనివారణ, ప్రభుతారాలింగమును బ్రబంధాదివవ
ర్ణభలింగంబును గలసుక, శుభదంబులు గాఁగ సుకవి చూడఁగ వలయున్. 314

## లింగనిర్ణయము.

ఆ. ప్రథమయోని [1]పురుషభం బొక్క_ టైనను, యువతిభంబు మిథునయోగ మైన
నుత్తమంబు స్త్రీభయుగ మైనమధ్యంబు, పురుషభద్వయమునఁ బోరు పుట్టు. 315

క. నెలఁతలకుఁ బురుషతారలు, తలఁపఁగఁ బురుషులకు యువతితారలు నై సం
ధిలునపుడు లింగదోషంబులు పని లేదనిరి కశ్యపుండును భృగువున్. 316

## అక్షరనక్షత్రదూరము.

ఆ. కృతిముఖంబు వ్రాయిరిక్క_కు విభుతార, పదియు మూఁటిమీఁదఁ బొదలు నేని
భర్త వర్షశతము బ్రతుకు లోపల నున్న, నల్పకాలమునఁ గృతాంతుఁ గాంచు. 317

## అక్షరరాశికూటము.

క. అక్కజ మగుకబ్బముతొలి, యక్కరపుంజుక్కరాశి యారభ్యముగా
లెక్కింప నధిపురాశికి, నిక్కు శుభాశుభము లెఱిఁగి నిలుపఁగ వలయున్. 318

## రాశినిర్ణయము.

తే. క్రమతఁ గావ్యాది నుండునక్షత్రరాశి,నుంచి లెక్కింప భూరామయుగళరాద్రి
కరితపనసంఖ్యలను గృతీశ్వరునినామ, రాశి దనరిన నతులసామ్రాజ్య మొదవు.

తే. మేషమునకు వృశ్చికమును మిథునమునకు, నక్రమునుసింహమునకు మీనంబునహితు
లెనిమిదవయవి శుభదంబు లనుచు వీనిఁ, గైకొనుటగూడదనిచెప్పెఁ గశ్యపుండు.

తే. విదితముగ రెండు నాఱు తొమ్మిదియుఁ బదియుఁ
బదునొకొండు నై పదిరాశి పరఁగు నేని
నిర్ధనంబుఁ గళత్రహానియు నపత్య
నాశనంబు దుఃఖంబు దైన్యంబు గలుగు. 321

ఆ. కన్యకాకుళీరకార్ముజలగ్రహ, వృషతిమింగిలంబు లెంచునపుడు
షష్ఠరాసు లైనజాయకు దీర్ఘాయు, వనుచు నక్షపాదుఁ డానతిచ్చె. 322

తే. రాశి యొక్కటి రెండు తారకలు నైన, రాముగతిఁ గృతిపతి శత్రురాజి నడఁచు
రిక్క యొకటియు రాసులు రెండు నైన, రిపులచేఁ గృతిపతి సంహరింపఁబడును.

1 పురుషభంబు బిందుకమది (ప. వా).

క. మును దూషించినరాసులు, గనుఁగొన నేకాధిపత్యభిగమైత్రము లొ
దినఁ దద్దోషము లెల్లను, జను నని నారదుఁడు సెప్పె సంహితలోనన్

అక్షరగ్రహకారకములు

ఆ. కర్తృరాశి పతికిఁ గావ్యాదివర్ణము, రాశి కీశుఁ డైన గ్రహమునకును
నూఁడు గలుగఁ జెప్పువాఁడు కౌలయముండు, గాని కవివరుండు గాఁడు పతి!

శ్లో॥

క. ధరణీసుతభృగుబుధశశి, సరసిజహితసౌమ్యకవిరసాభవసుమనో
గురుమందపంగుజీవులు, తిరముగ మేషాదిరాశ్యధిపతులు వరుసన్ 32

వ. మఱియు నొక్కవిధంబు.

చ. హరిపతి హేళి, కర్కివరుఁ డంబుజశత్రుఁ, డజాళిభర్తగ
హ్వారితనయుండు, యుగ్మవనితాధిపుఁ డిందుసుతుండు, చాపమ
త్స్యరమణుఁ డింద్రమంత్రి వృషతౌలివిభుం డుశనుండు, నక్రపు
ష్కరధరరాశివల్లభుఁడు సారసబంధుకుమారుఁ డచ్యుతా.

క. జ్యోతిశ్శాస్త్రము గా దని, మాతృకలకు భైరవుండు మఱియొకచందం
బై తనరఁ జెప్పె గ్రహాసం, ఘాతము రాశిపతి దక్క గ్రహ మొరుఁ డగునే.

తే. అధిపతులకంటె గణముల కర్ణములకు, గ్రహములే బలవంతు లామహిమఁ గాదె
యుడుగుదాకినఁగవిభానుఁ డలిగి మూఁడు,గడియలకుఁ దొల్లి శిల పొడిగాఁగఁడిట్టె.

గ్రహమైత్రీనిర్ణయము.

సీ. భానున కాప్తులు భౌమేజ్యసోములు శత్రులు భృగుపుత్రశనులు, శశికి
సఖులు బుధార్కులు శత్రుఁ డొక్కఁడును లేఁడు, కుజునకుఁ జుట్టలు గురరవీందు
లరి రౌహిణేయుఁడు,హరిణాంకసుతునకు హితులు భార్గవమందు లీసు తండ్రి,
గురునకుఁ జెలులు భాస్కరచంద్రకుజులు వైరులు కావ్యసౌమ్యులు, బలిగురునకి

తే. బంధు లినతనయజ్ఞులు పరులు మిహిర, తుహినకిరణులు శనికి విందులు కవిజ్ఞు
లహితు లారార్కతారేశు లందఱకును, సములు చిక్కినవారిపదచారు లెల్ల.

క. సమమిత్రము లైనను భద్రము నేకురుఁ బతికి సుహృదరాతిగ్రహముల్
సముమూడిన భయ మొదవును, సమశాత్రవు లెనఁ గీడు చాల ఘటించున్. 332

తే. ఈశుఁ డొకఁడైన నిర్ధనత్రికస్థుఁడైన, మంచిది సమత్వమైనను మధ్యమంబు
వైరమైనను వర్జింప వలయుఁ గాని, తగదు సేకొన నవియెఁ బితామహుండు.
తే. రవియుతుఁడు నీచగతుఁడు పరాజితుండు, నహితరాశిస్థితుండునై యప్పు డుండు
గ్రహము వర్ణంబు గణమును గావ్యమునకు, నాది నుండిన లేవు శుభాశుభములు.
తే. శారదాదర్పణంబున జ్యోతిషంబుఁ, బట్టి గ్రహమైత్రి మాత్రంబు వలుకఁబడియె
దానిఁ గని విస్తరించిరి తద్విధంబు, భైరవాదులు తెనుఁగునఁ బనికిమాలి. 335

## కృత్యాదివర్ణద్వయయోగలక్షణములు.

ఆ. గరిమ యోనిలింగగణతారకౌమార, రాశిఖేటతత్వ్రికాశబీజ
చక్రకూటములు విచారించి కావ్యాది, వర్ణయుగము నిలుపవలయు సుకవి. 336
తే. ఆదిలిపి కన్యయును ద్వితీయాక్షరంబు, పతియుఁ గాఁ జేసి యీరెండువర్ణములకు
నిపుడు చెప్పినకూటంబు లెల్ల నరసి, కూర్చిన ప్రబంధము నిలింపకుజము పతికి. 337
క. మొదలను సంయుక్తార్ణము, గదిసిన నీరెంటికిని సకలకూటంబుల్
పదిలముగఁ జూడ వలయును, బదరక యామీఁదిలిపికిఁ బని లేదు వారీ. 338
క. క్రిందను జడ్డక్షరములు, సెందనిలిపు లాది నున్న సిద్ధముగాఁ జూ
డం దగుఁ గూటము లెల్లను, బొందుగఁ బ్రథమద్వితీయములకు ముకుందా. 339
తే. త్రిదశనుత యోని లింగంబు మొదలు గాఁగ
నాలుమును జెప్పఁబడి యుండు నవలిఖేట
కాంతికూటము మొదలుగాఁ గ్రమత మూఁడు
దెలియఁ బలికెద నిఁకఁ దేటతెల్లగాఁగ. 340

## గ్రహకాంతికూటము.

క. మొన నున్నవాత్యకాద్వయు, మునకు న్గణయుగ్మమునకు మును జెప్పినచొ
ప్పన నైన ఖేచరంబుల, తనుకాంతులవలనఁ దెలియఁ దగుఁ దత్ఫలముల్. 341

## గ్రహవర్ణంబులు.

క. రవిభౌములు రక్తాంగులు, కవిశైవాత్మకులు ధవళకాయులు సోమో
ద్భవగురులు పీతగాత్రులు, దివాకరసుతుండు నీలదేహుం డరయన్. 342
తే. పాండుపీతాంగు లెల్ల శుభగ్రహములు, రక్తమేచకతనులు క్రూరగ్రహములు
పద్మహితుఁగూడి శశియును పాపి యగును, గ్రూరసంగతి బుధుఁడును గ్రూరుఁడగును.
తే. రెండునుఖలగ్రహములైన మృత్యువగును, సౌమ్యుఁడునొకండునైనను శర్మమగును
పాపశుభఖేచరములైన బవర మగును, శోభనక్రూరులైనను శోక మగును. 344

ఆ. [1]శనినామమునకుఁ గ్రిందివంకను మీఁది, వంకయందు నుండువర్ణములకు
గణములకును బాపఖచరంబు లైయున్నఁ, జెడక యుండువాఁడు శివుఁడొ హరియొ.

## బీజాక్షరకూటము.

క. కమలాప్రమదాప్రియ కావ్యముఖంబున నుండు రెండు వ్రాలకు నగుబీ
జము లుక్తక్రమమున మిత్రము లైనను బతికి శుభము దార్కొను టరుదే. 346

## బీజమైత్రీనిర్ణయము.

తే. చదలు గాడ్పులమింగల జగతి పుడమి, సరస నేలయు నిరను జలముమీఁద
క్షితియు నప్పును నిప్పును జిచ్చుచెంత, నుదకమును గృతిముఖమున నున్నమైత్రి.
ఆ. కీలిమీఁదిగాలి కృతిముఖంబున నిల్చి, యేటిలోనఁ బొత్తు మెల్లఁ గాల్చు
గాలిమీఁదికీలి కర్తమందిర మెల్ల, నిర్దహించు నాఱునెలలలోన. 348

## అరివర్ణశోధనచక్రకూటము.

క. నిక్కము మొనలిఫీ రెండవ, యక్కరమున కరిగృహంబునం దుండినయా
వెక్కురకబ్బం బొడయనిఁ, జిక్కు పడఁగఁ జేయుఁ బగరచే రణభూమిన్. 349

## ప్రశస్తకూటంబులు.

తే. క్షితిసురుల కాఱు ధారణీపతుల కైదు, వైశ్యులకు నాల్గు శూద్రాంత్యవర్ణజులకు
మూఁడు రెండును శుభకరంబులయియున్నఁ, జాలునని యొసంహితలోన శౌనకుండు.
తే. విప్రులకు గ్రహమైత్ర్య ముర్వీపతులకు, గణవిధము వైశ్యులకు రాశిగణన శూద్ర
నీచులకు యోనితార లిన్నింటిలోనఁ, గడుఁ బ్రశస్తంబు లిది వృద్ధగర్గమతము.
క. కూటము లెఱుఁగవు మాతో, సాటికిఁ బద్యములు చెప్పి చదివెద విది బల్
చేటు సుమీ యని పెద్దలు, [2]నేటించినఁ గుకవి కడుఁ గినిసి జగడించున్. 352

## సంయుతాక్షరవిశేషము.

సీ. క్షారహారిద్రారజంబులు గూడఁగఁ దమశుభ్రపీతవర్ణములు విడిచి
రక్తవర్ణంబు లై రాణించుచాడ్పున నశుభప్రదంబు లైనట్టివ్రాలు
జగతిపై సంయుతాక్షరము లై కనుపట్టి నిజదుష్టఫలము లిన్నియును బూని
సకలసంపత్ప్రదాయకము లై తనరారు పంచదారయు నానవాలు గల్గి
తే. లొంటికంటెను మిగుల మాధుర్యరుచుల, నొప్పగతిశుద్ధలిపులుసంయుతములగుచు
నధికమంగళకరము లైయమరు ననుచు.

1 మదపతి మాత్ర... నృపుని (పూ.ము). 2 మాటికిఁ బల్కినను వినవు మఱి జగడించెదవ్ (వా).

## శ్రీకారప్రభావము.

తే. వేదముల కెల్ల నోంకార మాది యైన, కరణిఁ గృతులకు నెల్ల శ్రీకార మాది
గాఁ గవివరు లెల్లను దానిఁ దక్క, నితరవర్ణంబు లిడరు సత్కృతుల మొదల.

క. ఎంతయు శ్రీకారము లాద్యంతంబుల నుంచి లేఖ లంపిన నగు న
శ్రాంతంబు గార్యసిద్ధి మ్మరాంతక కావ్యాదిఁ గూర్ప నరుదె శుభంబుల్. 355

క. పదపడి శ్రీకారము కృతి, మొదల నిలిచి దోషపుంజము నడంచి శుభం
బొదవించుఁ బరుస మినుమును, [1]కదిసి సువర్ణంబు సేయుకరణిన్ ధరణిన్. 356

క. శుభదేవతాత్రయంబును, శుభఖచరత్రయము గలిగి శుభవాచక మై
యభినుతి గాంచినకతమున, శుభములు శ్రీకారమునను జొప్పడు టరుదే. 357

వ. దీనితాత్పర్యము శకారమును, రేఫమును ఈస్వరమును ఈమూఁడును గూడఁగా శ్రీకారమాయెను. అందులోను శకారమునకును ఈకారంబునకును అధిదేవత లక్ష్మీదేవి గనుక రేఫమున కగ్నిదేవుఁడు అయిననేమి. "శ్రియ మిచ్ఛే ద్ధుతాశనాత్" అని పురాణవచనము గలుగుటం జేసి అతఁడును లక్ష్మీప్రదుండే. అటుగనుక మూఁడువర్ణములకును శుభదేవతలే అయిరి. మొదలిశవర్ణమునకు గ్రహము గురుఁడు రేఫమునకును ఈ యనుస్వరమునకును శుక్రుఁ డొక్కఁడే. అటుగనుక మూఁటికిని శుభగ్రహములే అయిరి. "కమలా శ్రీ ర్హరిప్రియా" అని లక్ష్మీనామ మగుటం జేసి శుభవాచకమును ఆయెను. అటుగనుక గృతిముఖమునందుఁ బ్రయోగించిన శ్రీకారమువలన శుభము గలుగుట యాశ్చర్యము గాదు నిశ్చయమేయనుట. 358

సీ. మొదలితాలుభవోష్మములకు నభోబీజరౌరవగతి మహాప్రాణములును
దిగువరేఫమునకుఁ దిర్యగ్గమనదాహఫలవీతిహోత్రాధిపత్యములును
గనుఁగొన నారెంటికిని మర్త్యదానవగణబృహస్పతిశుక్రఖచరములును
బ్రథమాక్షరమునకుఁ బలికిని వైశ్యబాహుజకులగోవ్యాఘ్రయోనిభములు
తే. నగుకతంబున శ్రీ యనునక్షరమున, నిండి యుండుదోషంబు లిన్నియు నెఱింగి
సంయుతం బనియును శుభశబ్దమనియు, నదియ నిలిపె నన్నయ భారతాదియందు.

## కృతిముఖప్రశస్తంబులు.

మూ. సూ:—శుభవర్ణా శ్శుభశబ్దా యే చ శుభగణా స్తథైవ కావ్యాదౌ
గ్రాహ్యాః. 19

1 కదని (ప.వా).

తే. అమరవాచకములు మంగళార్థవాచ్యకములు నైనశబ్దములు కావ్యములమొదల
నిలిచి దుర్వర్ణదోషము ల్దొలఁగఁ ద్రోఁచి, కర్తకును భర్తకును భావుకంబుఁ జేయు.

క. శ్రీవాణీకీర్తిసతీ, జైవాత్రృకహర్షమేఘసాగరధరణీ
భావుకనిరోగాయుః, గ్గావ్యాఖ్యానములు శుభకరము లాది నిడన్. 361

క. మోదంబున సత్కృవి ప్రతిపాదింపఁగ వలయు శుభముఁ బడయుట కై కా
వ్యాదిని వరుసను నాశీర్వాద మయిన దేవతాభివాదన మైనన్. 362

క. గాయకపుకవులు కొందఱు, నాయకకల్యాణగుణగణము లొండె నభీ
ప్సాయితవస్తువు లొండెను, బాయక కీర్తింపుదురు ప్రబంధము మొదలన్. 363

వ. అమరవాచకంబులకు నైషధమునందు "ప్రాలేయాచలకన్యకా" యనియును,
కల్పితకల్పవల్లియందు, "హేరంబ మవలంబే" యనియును రామాయణమునందు
"రాముని శుభచరితమ్ములు" అనియును మంగళార్థవాచకంబులకు శ్యామలాదండ
కంబునందు "జయమాతంగతనయే" యనియును త్రిస్థలీదండకమునందు "విజయ
నగరహేమకూటంబునన్నిల్చి" యనియును ఆశీర్వాదంబునకుఁ గృష్ణవిజయంబు
నందు "పాయాదపాయా" త్తనియును సాహసాంకంబునందు "అవ్యాత్సవో"
యనియును దేవతాభివాదంబునకు చపన్నంబునందు "ప్రణమ్య లోకకర్తార"
మనియును నాయకగుణంబులకు నైషధమునందు "సువర్ణదణ్డైకసితాతపత్రితజ్వల
త్ప్రతాపావలికీర్తిమండల" యనియును అభీష్టవస్తువులకు పృత్తరత్నాకరమునందు
"సుఖసంతానసిద్ధ్యర్థ" మనియును లక్ష్యంబులు గలిగియుండును. 364

తే. క్లీబలింగశబ్దంబులు కృతికి మొదలఁ, గూర్ప నాయకుధన మెల్లఁ గొల్ల వోవు
సరవి స్త్రీలింగపుల్లింగశబ్దము లిడ, సంపదలు వైభవంబులు చాలఁ గలుగు. 365

అతిశుభదపదయుగాంత, ర్గత మై పతి పేరు కృతిని గనుపట్టిన నీ
క్షితి వజ్రపంజరాంత, ర్గతుమాడ్కి నభేద్యుఁ డగు నరాతుల కెల్లన్ 366

## తత్తత్స్థానప్రయోగనిషిద్ధాక్షరంబులు.

మూ. -పురాప్త్రరసగిరిరుద్రే ష్వకచటపా మాతృకానింద్యాః.

ఆదిస్వరమును ప్రథమై, కాదశపష్ఠార్ణములు కకారాదులలో
నాదట దంతోష్ఠ్యము లిడ, రాదు పురశరర్తుగిరిహరస్థానములన్. 367

మూఁడవతావున మొదలిటి, మూఁడుసరళవర్ణములును మూఁడవస్వరమున్
మూఁడవయూష్మాక్షరమును, గూడదు కదియింప నెట్టికూళకు నైనన్ 368

తే. వ్యంజనాహ్వయమున నొప్పువ్రాలలోన, షోడశాక్షర మాఱవచోట నిలిపి
మచ్చరంబునఁ దనుఁ జంప వచ్చినట్టి, చెడుగునకు నైనఁ బద్యంబు నుడుగ వలదు.
సీ. గడియలోపల మూఁడు కంద్రిక లై తాఁడి ధరఁ గూలఁ దిట్టె మేధావిభట్టు
కినిసి యొక్కమహా ర్తమున బ్రహ్మదండిముం డ్లెల్ల డుల్లఁగఁ దిట్టె మల్లఘనుఁడు
మూఁడునాడికలకు ముట్టడి వైచినమారని భీమన మడియఁ దిట్టె
నరజామునకుఁ జెఱు వంతయు నింకంగఁ దిట్టెను బడబాగ్ని భట్టసుకవి
తే. వాసరత్రయమునకుఁ జావంగఁ దిట్టె, శ్రీనగము దోఁచుతుక్కాని శేషమంత్రి
తురగచోరకుఁ బడఁ దిట్టెఁ దిరుమలయ్య, పద్యగతదుష్టవర్ణప్రభావములను. 370

వీరలు చెప్పినలక్ష్యంబు లెవ్వి యనిన మేధావిభట్టు ఆఱవచోట తకారము నిలిపి గడియకుఁ డ్రాటిచెట్టు విఱుగఁ దిట్టినచాటుధార:—

క. సాళువపెదతిమ్మమహీ, పాలవరుఁడు వీఁడె వచ్చెఁ బద్యము వ్రాయన్
గేలను లే దా కొకటియుఁ, దాళమ ముత్తునియ లగుచు ధరఁ బడుమా. 371

ప్రౌఢకవిమల్లన మూఁడవచోట అకారమును నిలిపి రెండుగడియ లకు బ్రహ్మదండిచెట్టుముండ్లు రాలఁ దిట్టినచాటుధార:—

క. గుడియన్న నృపతిఁ బొడఁగన, నడవంగాఁ గొండపల్లినగరిపడమటం
గుడియడుగుడమ గాఁడిన, చెడుముండులు బ్రహ్మదండిచెట్టున డుల్లున్. 372

వేములవాఁడభీమకవి పదునొకండవచోట హాకారంబు నిలిపి మూఁడు గడియలకు రామగిరిదుర్గమున ముత్తిక దిగినమారన్ని జావఁ దిట్టినచాటుధార:—

ఉ. చక్కఁదనంబుధీవి యగుసాహిణిమారఁడు మారు కైవడిన్
బొక్కి పడం గలండు చలము న్బలముం గలయీచళుక్యపుం
జొక్కనృపాలుఁ డుగ్రుఁ డయి చూడ్కుల మంటలు రాలఁ జూచినన్
మిక్కిలి రాజశేఖరునిమీఁదికి వచ్చిన రిత్త వోవునే. 378

బడబానలభట్టు ఏడవచోటను టకారంబునిల్పి త్రిపురాంతకము నుండి శ్రీశైలమునకుం బోవునప్పుడు తెల్గురాయఁడు గట్టించిన చెఱువునీళ్లన్నియు నాలుగుగడియలకు ఇంకి పోను దిట్టినచాటుధార:—

గ. ఢ్ఢ. గ.

క. బడబానలభట్టారకు, వడిచేయుంగరము రవికి గొబ్బున నర్ఘ్యం
బిడువేళ నూడి నీలోఁ, బడియెఁ దటాకంబ నీటఁ బాయుము వేగన్. 374

ఏలూరి శేషమంత్రి యైదవచోట కకారము నిలిపి శ్రీశైలముం బోఁచిన తుక్కరుసును మూఁడుదినములకుం జావం దిట్టినచాటుధార:—

చ. మును పాకకేల రావణుఁడు మోదమున న్రజతాద్రి యెత్తినం
దన వారుఁ దప్పుడే తనపదంబునఁ ద్రొక్కి మదం బడంచెఁ గా
వనమయగోరితుక్కసచివా యల శ్రీగిరి గడ్డపారలన్
గనలుచుఁ ద్రవ్వి సర్వమును గైకొన నీకిపు డాతఁ డోఁపునే. 375

వెల్లూరి తిరుమలయ్య ఆఱవచోటను తకారంబు నిలిపి తనగుఱ్ఱమును దొంగిలించిన శ్రీపతిరాజు పోతరాజును నేఁడుదినములకుం జావఁ దిట్టిన చాటుధార:—

చ. హాయ మది సీత పోతవసుధాధిపుఁ డారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ జాహ్నవి వారిధి మారుఁ డంజనా
ప్రియతనయుండు లచ్చన విభీషణుఁ డాగుడిమిట్ట లంక నా
జయమును బోతరక్కసుని చావును నేడవనాఁడు సూడుఁడీ. 376

వ. మఱియును గొన్నియుదాహరణంబు లెడవల్లి పర్వతన్న పంచమస్థానంబునను హకారము గూర్చి చెప్పినపద్యము:—

క. అంగజసంహారుం డగు, సంగరభీముండు ప్రళయసమయోగ్రుం డై
యుండలపుఁగంటఁ జూచిన, బంగరుకామయ్య మేను భస్మం బయ్యెన్. 377

పింగళి రామరాజు పంచమస్థానంబున కకారంబును షష్ఠస్థానమున చకారంబును గూర్చి చెప్పినపద్యము:—

ఉ. పింగళి యేకచక్రపురి పెంపుగ నందు వసించి యున్నయా
తంగెడకొండఁడే బకుఁడు తథ్యము మానవులార వానిబా
ధం గడ ముట్టఁ జేసె మును ధర్మజుతమ్ముఁడు భీముఁ డిప్పుడీ
యెంగిలిముచ్చుఁ జంపుటకు నీశ్వరు వేఁదుఁడు భీముఁ డయ్యెడిన్. 378

తెనాలిరామకృష్ణయ్య పంచమస్థానంబున కకారంబును షష్ఠస్థానంబున టకారంబును గూర్చి చెప్పినపద్యము:—

క. బసవనకుఁ బుట్టినప్పుడే, పసరము గోవిందరాజు పసరం బైతే*
గస వేటికిఁ దినఁ డంటేఁ, గసవుం దిను శత్రు లాజిఁ గవిసినవేళన్. 379

రంగరాజులింగయ తృతీయస్థానమునందు కకారము గూర్చి గూఢముగాఁ దిట్టినచాటుధారపద్యము:—

క. రవికోటిధామమయ మై, నవకాంచనయుతము నగుచు నానాఁటి కొగిన్
భువిని శివాన్వితమగు నీ, భవనము జాపల్లిలింగ భనగుణసంగా. 380

తే. ఆదిపర్వంబు మొదలిపద్యంబునందు, సప్తమస్థానమున శబ్దశాసనుండు
జమిలియక్కరమును విశేషము దలంచి, పాముకొలిపె జవర్ణంబు భయము దక్క.

## దోషప్రభావము.

క. ఇప్పటినియమము లన్నియు, నొప్పఁగఁ గావ్యంబు మొదల నొకపద్యము దాఁ
జెప్పినను జాలు నవతలఁ, దప్పిన దోషంబు లేదు దర్పకజనకా. 382

క. గట్టిగ దోషము తెఱుఁగక, తిట్టిన నది దీవన యగు దీవించినచోఁ
దిట్టగు నది దెలుసుక మఱి, తిట్టిన దీవించినను బతికి నిక్క మగున్. 383

క. గుడ్డి యగు నెద్దు జొన్నను, బడ్డపగిది లక్షణంబుపథ మెఱుఁగనియా
యెడ్డె కవిత్వముఁ జెప్పిన, నడ్డం బై బుధు లదల్ప [1]నది యే మగునో. 384

## గుణావగుణబాహుళ్యవిశేషంబులు.

తే. ఇపుడు చెప్పినదోషంబు లెల్ల మాని, గుణము లన్నియుఁ గలుగంగఁ గూర్ప నగు నె
స్రష్ట కైనను స్వల్పదోషంబు నధిక, గుణము లగు నెద్ది దానిఁ జేకొనఁగ వలయు. 385

క. ఇల సద్గుణనికరములో, పల నొకదోషం బడంగుఁ బదియాఱమృతాం
శులలోన నొకకళంకము, జలజారికి నెన్నఁ బడనిచందమున హరీ. 386

తే. విఫలము సకంటకంబును విషధరాశ్ర
యంబు వక్రంబు పంకభవంబు నైన
మొగలి పరిమళమున యోగ్య మగు తెఱఁగునఁ
సద్గుణం బొక్కటియ దోషసమితిఁ జెఱుచు. 387

*పూ.ము.లో 'పసరం బైనన్'...'డనఁగా' అనియుండెను. గాని వ్రాఁతప్రతులలో మాత్రము 'పసరం బైతే' 'అంటే' అనుప్రయోగములే కనఁబడును.

1 నపుడ మగునో (వా); నపు డేమియగున్ (ప).

క. తెలియఁగ నీశుభలక్షణ, ములు కుకవులకావ్యముల లేవు సుమీ
తొలుత మహాకవివర్యులు, పలికినసత్కృతులఁ దక్కఁ బన్నగశయనా. 388

## మాతృకార్చనావిధానము.

చమత్కారచంద్రికాయామ్:—

శ్లో. అకారాదిక్షకారాంతవర్ణాః స్యుర్మాతృకాహ్వయాః,

సాహిత్యరత్నాకరే:.

శ్లో. ప్రభూనుద్దిశ్య పద్యం వా ప్రబంధం వా కదాచన,
న వక్తవ్యం న వక్తవ్యం మాతృకాపూజనం వినా.

లక్షణదీపికాయామ్:—

శ్లో. నాయకేన ప్రయుక్తస్సన్ దంతధావనపూర్వకమ్,
పుణ్యనిర్మలతోయేన మంగళస్నాన మాచరేత్.
శుచిర్ధౌతాంబరధరో గంధమాల్యైరలంకృతః,
పూజాగృహం వ్రజేన్నానాగీతవాద్యాదినిస్వనైః.
శుభాసనే సుఖాసీనః ప్రాఙ్ముఖో న్యాసపూర్వకమ్,
విప్రాదిమాతృకా స్తత్తద్వర్ణద్రవ్యైః ప్రపూజయేత్.

ఆ. కవులు మొదల మాతృకాపూజ సలుపక, కావ్య మొండెఁ జాటుకావ్య మొండెఁ
జెప్పిరేని తమకుఁ దప్పఁగఁ బతికిని, హాని వచ్చుఁ గృతియు నడఁగి పోవు. 389

సీ. ప్లక్షకాష్ఠంబునఁ బలుదోమి మంగళస్నాతుఁడై శుభ్రవస్త్రములు కట్టి
మలయజకర్దమం బలఁది భూషణములు పైఁ దాల్చి కుసుమదామములు చుట్టి
కవిలాక్షణికలేఖకగ్రంథవాచకశాబ్దికతార్కికసహితముగను
గానతతానద్ధఘనసుషిరస్వనంబులు సర్వదిక్కుల భోరుకలుఁగ
తే. వచ్చి దక్షిణపాదపూర్వకము గాఁగ, మౌని యై మాతృకార్చనమందిరంబుఁ
జొచ్చి పూర్వాభిముఖముగా సుకవివరుఁడు, చిత్రకంబళిమునసుఖాసీనుఁడగుచు.

శ్లో. విఘ్నరాజ నమ స్తుభ్యం లమ్బోదర గజానన,
నిర్విఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా.

క. ఈమంత్రంబున మున్నుగ, సామజముఖు నేకదంతుఁ జామరకర్ణున్
ధూమధ్వజుఁ బ్రమథగణ, స్వామిని బూజించి సుకవి సమధికభక్తిన్ 391

సీ. జ్యోతిర్విదుక్తముహూర్తకాలంబునఁ బ్రస్థపంచకమాత్రపాండుశాలి
తండులంబులను వాస్తవ్యయసన్త్రాంసముచతురశ్రకస్థండిలంబు

గావించి నాల్గుచౌకపుటిండ్లు రచియించి వామదేవునిమూలగీమునందు
విప్రమాతృకలను వీతిహోత్రునితావుమందిరంబున రాజమాతృకలను
ఆ. దనుజుఛాయభవనమున వైశ్యమాతృక, లను సమీరభాగమునను గలుగు
సదమునను శూద్రజాతిమాతృకలను, వరుస దప్పకుండ వ్రాయవలయు. 392

## మాతృకానిర్ణయము.

శారదాదర్పణే: —

శ్లో. స్వరాః కచటవర్గాశ్చ ధరణీసురమాతృకాః,
తపవర్గా సమాంతస్థా బాహుసంభవమాతృకాః.
యలౌశాదిహాకారాంత వర్ణాశ్చోరవ్యమాతృకాః,
దంత్యౌ చ జౌ గురు ళశౌ జఘన్యభవమాతృకాః

అ ఆ, ఇ ఈ, ఉ ఊ, ఋ ౠ, ఌ ౡ, ఏ ఐ, ఓ ఔ, అం అః, ఈస్వరములు పదునాఱును క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, టఠడఢణ, ఈకచటవర్గాక్షరములు పదునేనునుగూడ ముప్పదియొకటియు విప్రమాతృకలు; ఇవి యీశాన్యమూలయింట వ్రాయవలసినది. త థ ద ధ న, ప ఫ బ భ మ, యీతపవర్గాక్షరములు పదియును అంతస్థములలోన సరియక్షరములైన రేఫవకారములు రెండును గూడఁగాఁ బండ్రెండును రాజమాతృకలు; ఇవి యాగ్నేయదిక్కుననుంచవలసినది. యవర్ణలవర్ణములు రెండు శ ష స హ లు నాల్గును గూడ నాఱును వైశ్యమాతృకలు; ఇవి నిర్ఋతిభాగమున నిలుపునది. దంత్య జచలు రెండును ఱకారళకారములు రెండును గూడ నాలుగును శూద్రమాతృకలు; ఇవి వాయవ్యకోణమున లిఖించునది.

సీ. అస్వర, మవుదల యాఘాల మిద్వాయి శ్రవణయుగ్మం బుకారములు రెండు
గన్నులు ఋత్వయుగంబు చెక్కులు ఌవర్ణద్వంద్వ ముభయదంతచ్ఛదములు
వక్త్రముల్ భుజములు వక్రతమాక్షరంబులు కక్షములు సున్న అలికగళము
పటువిసర్గము లురోభవమూచకంటులు కచవర్గములు పాణికరరుహములు
తే. టాదు లైదును గూడఁ బృష్ఠము చతుర్థ, వర్గముదరంబు పంచమవర్గజములు
జఘన మంతస్థలిపులు సూష్మములు నంఘ్రి, లేవధూమణి కట్టివాగ్దేవిఁ గొలుతు.
క. అని వారిజాతసంభవు, వనితకుఁ బ్రణమిల్లి సుకవివరుఁ డీపద్యం
బునఁ జెప్పినట్లు న్యాసము, తనకుడికడ మొదలుగాఁ బిదపఁ జేయ నగున్. 394

## న్యాసప్రకారము.

అం శిరసి, ఆం లలాటే, ఇం దక్షిణకర్ణే, ఈం వామకర్ణే, ఉం దక్షిణనేత్రే, ఊం వామనేత్రే, ఋం దక్షిణకపోలే, ౠం వామకపోలే, ఌం ఊర్ధ్వోష్ఠే, ౡం

అధరోష్ఠే, ఏం దక్షిణభుజే, ఓం వామభుజే, ఐం దక్షిణకక్షే, ఔం వామకక్షే, అం గళే, అః దక్షిణోత్తరస్తనాగ్రయోః, కం ఖం గం ఘం ఙం దక్షిణహస్తాంగుళిషు, చం ఛం జం ఝం ఞం వామహస్తాంగుళిషు, టం ఠం డం ఢం ణం పృష్ఠే, తం థం దం ధం నం ఉదరే, పం ఫం బం భం మం జఘనే, యం రం లం వం దక్షిణపాదే, శం షం సం హం వామపాదే విన్యసేత్.

## విప్రమాతృకాపూజామంత్రః.

విధిప్రదీపికాయామ్:—

శ్లో. శ్వేతమాల్యాంబరధరాం శ్వేతరత్నవిభూషితామ్,
శ్వేతాబ్జవాసినీం విప్రమాతృకాం పూజయామ్యహమ్
అనేన వాగీశ్వరీధ్యాన ముక్తం. తల్లక్షణం మంత్రరహస్యే ద్రష్టవ్యమ్.

వ. అకారము మొదలు ముప్పదియొక్క మాతృకలను ఈమంత్రముచేత వేఱువేఱ పూజించునది. 395

సీ. వెలిపట్టుబుట్టంబు మలయజగంధంబు మౌక్తికోమలవజ్రమయము లైన
భూషణంబులు దెల్లపువ్వులు కర్పూరధూళిధూపంబు మధూకతైల
నీరాజనంబు ఖర్జూరపాత్రంబు సమన్వితశర్కరాయామృణధేను
దుగ్ధాన్నమును భక్తితో సమర్పణ చేసి శ్వేతాబ్జకర్ణికావిష్టరస్థ
తే. దారకాకుందమందారధవళదేహ, బుస్తకసువర్ణవల్లకీహస్త విప్ర
మాతృకను గవి శాస్త్రోక్తమార్గమునను, గొలువ జతురవచోలబ్ధి గలుగు టరుదె.

## రాజమాతృకార్చనమంత్రః.

శ్లో. రక్తమాల్యాంబరధరాం రక్తరత్నవిభూషితామ్,
రక్తాబ్జవాసినీం రాజమాతృకాం పూజయామ్యహమ్.
అనేన వశ్యముఖీధ్యాన ముక్తమ్. తల్లక్షణం ప్రపంచసారే ద్రష్టవ్యమ్.

వ. ఈమంత్రముచేత బందెండుమాతృకలను పూజ సేయునది. 397

కవిగజాంకుశే:—

సీ. జిలుగుచందురుకావిచీరయుఁ గుంకుమగంధంబు పద్మరాగప్రవాళ
ఖచితంబు లగుపరిష్కారంబులును గెంపుపువ్వులయ గలపరువంపువిరులు
ప్రస్తుతాలక్తధూపంబులు తిలబీజతైలదీపికయును తామ్రచషక
పూరితగోక్షుతాహారంబు భక్తితో నర్పించి రక్తతోయజనివిష్ట

తే. కోకనదనిభలోహితఁ గోమలాంగిఁ, బ్రసవబాణేక్షుకోదండపాణి రాజ
మాతృకను గవి శాస్త్రోక్తమార్గముననుఁ, గొలువఁ జతురవచోలబ్ధి గలుగు టరుదె.

వైశ్యజాతిమాతృకారాధనమంత్రః.

శ్లో. పీతమాల్యాంబరధరాం పీతరత్నవిభూషితామ్,
పీతాబ్జవాసినీం వైశ్యమాతృకాం పూజయా మ్యహమ్.
అనేన సిద్ధలక్ష్మీధ్యాన ముక్తమ్. తల్లక్షణం మంత్రార్ణవే ద్రష్టవ్యమ్.

వ. ప్రతిమాతృకారాధనము నీమంత్రము చదువుచును జేయునది. 391

సీ. అతతబహురత్నపీతకౌశేయంబు నవహరిద్రాలేపనంబు పుష్య
రాగగారుత్మత రత్నకీలితమండనంబులు పచ్చకొన్నలసరులు
సాంద్రసౌరభహరిచందనధూపంబు బస్తాజ్యసహితదీపంబు రీతి
ఘటపరిపూరితక్షౌద్రోపహారంబు గడు భక్తి నర్పించి కనకనలిన
తే. కర్ణికాపీఠికాసీన గౌరగాత్రి, వనజకుట్మలాన్వితకరద్వంద్వ వైశ్య
మాతృకను గవి శాస్త్రోక్తమార్గముననుఁ, గొలువఁ జతురవచోలబ్ధి గలుగు టరుదె.

శూద్రమాతృకారాధనమంత్రః.

శ్లో. నీలమాల్యాంబరధరాం నీలరత్నవిభూషితామ్,
నీలాబ్జవాసినీం శూద్ర మాతృకాం పూజయా మ్యహమ్.
అనేన త్వరితాధ్యాన ముక్తం. తల్లక్షణం మత్రదర్పణే ద్రష్టవ్యమ్.

వ. శూద్రమాతృకల నన్నిటిని బూజచేయునప్పుడు ఈమంత్రమే చెప్పవలసినది.

సీ. నీలవర్ణదుకూలచేలంబును లవంగమృగమదగంధంబు నగవిరోధి
రత్నవిభూషణరాజియుఁ గృష్ణపుష్పములు కాలాగురుసాలమాల
రచితధూపంబు నేరండబీజస్నేహనీరాజనంబును జారుకాంస్య
మయచషకాన్వితమధ్యనైవేద్యంబు నొసఁగి సద్భక్తిఁ బెంపొంది మదిని
తే. శ్యామపద్మనివిష్ట మేచకశరీర, శరధనుఃకాండధృతపంచశాఖ శూద్ర
మాతృకను గవి శాస్త్రోక్తమార్గముననుఁ, గొలువఁ జతురవచోలబ్ధి గలుగు టరుదె.

వ. ఇది ప్రబంధోపక్రమం బింక నాశుధారాకవిత్వమున కెట్లనిన. 403

తే. సభలను సమస్య లొసఁగినసమయముననుఁ, మాతృకాపూజ కవుల కీరీతి నబ్బు
నపుడు వాగ్దేవతాధ్యాన మాత్మఁ జేసి, యాశువుగఁ జెప్ప నొప్పఁ బద్యంబు లెల్ల.

## వాగ్దేవతాధ్యానము

సీ. [1]త్రయివేణి మీమాంసతల వైద్యశాస్త్రంబు నుదురాగమంబు కన్బొమలనడుము
కడపలిప్రాంబల్కు కణతలు శ్రోత్రంబు తళుకుఁజెక్కులు నిరుక్తంబు శ్రుతులు
న్యాయంబు చిబుకంబు జ్యోతిషం బక్షులు శిక్ష గంధవహంబు స్మృతి రదములు
కావ్యంబు జిహ్వ వ్యాకరణంబు పెదవులు గీతంబు గళ మలంకృతి కుచంబు
తే. లలపురాణంబు నడు మితిహాస మక్కు, కల్పము కరద్వయము రతికళ జఘనము
ఛంద మూరులు నాట్యలక్షణము పదము, లేవధూమణి కట్టివాగ్దేవిఁ గొలుతు. 405
ఆ. అనుచు శారదాంబ నధరనిర్జితబింబ, భ్రమరవేణిఁ బద్మభవునిరాణి
సుకవిరాజకీరసురమహీరుహలతఁ, గొలిచి యాశుకవితఁ గూర్ప వలయు. 406

## ప్రబంధోపక్రమశుభకాలంబులు.

క. వెస నయనమాసపక్షది, వసవారభయోగకరణవర్జ్యవిలగ్నా
భ్రసరేక్షణము లరసి సదవసరమునను మొదలు సేయ వలయుం గృతికిన్. 407
తే. సింహమున గురుఁ డున్న రాజీవబంధుఁ
డార్ద్రి మొదలుగఁ బదితారలందు నడువ
జీవకవు లస్తమయమును జెంది యున్నఁ
గావ్యసముపక్రమము సేయఁగాదు పతికి. 408
సీ. అబ్దంబు మొదలిదినాష్టకం బయనర్తుమాసాదులను బంచవాసరములు
కవిబృహస్పతులు గ్రహకమందుఁ బొడిచినవెనుకను మును ప్రొద్దుమునుయుగాదు
లగుదినములు సంక్రమాది రెండుపగళ్లు గ్రహణంబుతోలునాఁడు కామదహన
మునకు మీఁదను మూఁడుదినములు తిథ్యాదిఘటికాత్రయంబు బుత్క్షంబుమొదల
తే. నాడికాయుగ్మమును విలగ్నమున కాది, వెలసిననవాంశ మొకటియు విడిచిపెట్టి
చిక్కినప్పుడు శుభములు సేయ వలయు, ననుచు చ్యవనుఁడు సంహితయందుఁ జెప్పె.
సీ. షష్ఠ్యంతమున నొక్కసంవత్సరము హాయనాంతంబునను బక్ష మయనమునకుఁ
గడపల దివసాష్టకము బుతుమాసావసానంబునను దివసంబు లైదు
రవిశశిగ్రహణాదివివిధమహోత్పాతముల కెల్లఁ దరువాత మూఁడునాళ్లు
సంక్రమాంతమున వాసరము తిథ్యంతంబునందు నాడీత్రితయంబు లెక్క
తే. కావను బదిగడియలు లగ్నమునకుఁ దుదినిఁగడియుసార్ధనవాంశంబు వదలి కావ్య
మునకుఁ దొలుతటిపద్యంబు మొగి రచింప, వలయు సత్కవి తక్కినవానియందు.

1 తర్కమీమాంసలు (ప

క. ఉదగయనంబునఁ జెప్పిన, సదమలకావ్యంబు పతికి సంపద లిచ్చుక్
బదపడి యామ్యాయనమున, మొదలుకొనినఁ బ్రాణమునకు మోసముఁ దెచ్చుక్.

తే. శ్రావణజ్యేష్ఠకార్తికచైత్రమాఘ, మార్గశీర్షకఫాల్గునమాధవముల
సకలశుభకర్మములు సల్పఁ జను నటంచుఁ, జెప్పిరి పరాశరాత్రివసిష్ఠమునులు. 412

తే. నింద్యములుభాద్రపదమును నెలయుశుచియు,సరవిఘ్నపచైత్రకర్కటశ్రావణములు
నధికమాసంబు బుష్యంబు నాశ్వయుజముఁ, గార్తికాది నేకాదశఘస్రములును.

క. కావ్యమునకు నారంభము, కావ్యుఁడు సితపక్షమునను గావించిన నా
ధివ్యాధు లడఁగు విభునకు, ద్రవ్యక్షయ మగుసితేతరంబున నైనక్. 414

క. దశమీద్వాదశ్యేకా, దశులను బంచమిని విదియతదియల హిమధా
మశశాంకసుతబృహస్ప, త్యుశనోవారములఁ గావ్య మొనరింపఁ దగుక్. 415

. ఉభయపక్షములందుఁ ద్రయోదశియును, సప్తమియు దినవాథవాసరము నంత
రాయ మొనరించుఁ గృతిసమారంభమునకు, నితరతిథివారములు గూడ నెంచిచూడ.

క. లిప్తలను బూర్వాహ్ణంబున, నుపక్రమించిన శుభంబు లొసఁగును గావ్యం
బపరాహ్ణంబున సంధ్యల, క్షపలను దొరకొనిన సాధ్వసం బొనరించున్. 417

నందయు భద్రదినంబును జయయు రిక్తయును బూర్ణయు ననఁ గ్రమతనైదు
భంగుల దివసముల్ పదియేను నొప్పారు భూమిబీజాక్షరంబులకు నంద
వనబీజలిపుల కెల్లను భద్ర శిఖిబీజరాజికి జయ వాయుబీజములకు
రిక్త నభోబీజరేఖకుం బూర్ణయు నాదిగాఁ బంచసంఖ్యాస్వరములు
తే. చెందు టిన మొక్కటొక్కటి శిశుకుమార, రాజ్యవృద్ధమృతాఖ్యలఁ బ్రమదవిత్త
విజయభయలయదంబులై వీని నెఱుఁగ,వలయుఁ గృతిపతినామాదివర్ణమునను. 418

క. బాలాదిస్వరములకును, గాలము నాఱేసినాడికలు చేసి కృతుల్
వాలాయము నందాదుల, మే లగువేళల నుపక్రమింపఁ దగుఁ గృతుల్ 419

వరుస భూజలవహ్నివాయునభస్తత్త్వములు దంతిగతశాస్త్రభూతశైల
పరిమితఘటికలఁ బగలును రేయును దినమున కెనమాఱు దిరుగుచుండు
సూరేందుభౌమజ్ఞవారంబులను ధరాంభోగ్నివాతము లాది యగుఁ గ్రమమున
గురుశుక్రమందవాసరముల నాకాశతత్త్వంబు మొదలుగాఁ దవరు నైదు
తే. కావ్యములఁ దత్త్వమున నుపక్రమముసేయు,ధనముదకతత్త్వమునసుఖమనలతత్త్వ
మున క్షయంబు మరుత్తత్త్వమున గదార్తి,గగనతత్త్వంబునమృతంబుగలుగుఁబతికి.

నాడికాత్రయము వినాడికావింశతిమాత్రకాలములఁ గ్రమంబుతోడ
సత్త్వరజస్తమస్సంజ్ఞల వేళలు త్రివిధంబులై పద్మరిపుసు రేజ్ఞ

దినముల సత్త్వాఖ్యయును భౌమభృగువారముల రజోవేళయు జలజమిత్ర
బుధమందవాసరంబులఁ దమోవేళయు నాదిగా సూర్యోదయమున నుండి

తే. పదియు నెనిమిదిమాఁబులు ప్రతిదినంబుఁ, దిరుగుఁ గావున నివి యెల్లఁ దెలిసికవులు
భర్తరాశికి మైత్రి చొప్పడనివేళఁ, జెప్పుదురు కబ్బములు వానిఁ దెలుచుకొఁటకు.

తే. సత్త్వపరిపంథులు కుళీరచాపమీన, కన్యలు రజోభియాతులు కార్పివృషభ
మేషతులలు తమోరులు మిథునసింహ, ఘటమృగంబులు చుట్టలు కడపు తెల్ల. 422

తే. వైష్ణవత్రయమునను బూర్వత్రయమున, మిత్రపూషాశ్వినుల భాస్కరత్రయమున
ధాతృషట్కనిశాచరతారకలను, గావ్యసముపక్రమముఁ జేయఁ గలుగు శుభము.

తే. వజ్రశూలవ్యతీపాతవైధృతులను, గండపరిఘాతిగండవిష్కంభములను
బదియు మూఁడవదానను బ్రతుకునాస, సేయువారు శుభంబులు సేయఁ బోరు.

క. బవ మొద లగునాఱింటను, గవి కబ్బ ముపక్రమింప ఘనతరవిభవం
బవు భద్రాదుల నేనిటఁ, దివిరి మొదలు సేయఁ దోడ తెవులు జనించున్. 425

తే. వ్యప్రలత్తలు క్రాంతయోగాపయోగ, దుర్ముహూర్తములును ద్యాజ్యదోషములును
దుష్టచంద్రోడుబలములు దొరలునపుడు, కృతికి దొరకొనునట్టిదుర్గతియుఁ గలఁడె.

తే. తనకు భర్తకు నష్టమద్వాదశారి, జన్మములు గానిశుభఖేటసదనములను
మొదలు సేయఁగఁ దగుఁ గబ్బమునకు గ్రహము, లష్టమంబున లేకుండ నరసి సుకవి.

తే. పాపు లాఱింట మూఁటను బదునొకొంట, సౌమ్యులు ధరాగ్నిగతిదిశాజలజగర్భ
మునిగృహంబుల నుండంగ మొదలుకొనిన, గబ్బములు గడతేఱు విఘ్నములు లేక.

క. బుధుఁ డినుఁ గూడనివేళను, బుధదినమున బుధవిలగ్నమున బుధదృష్టిన్
బుధహోరను గావ్యములకు, బుధవర్యు లుపక్రమింపఁ బూనుదు రెపుడున్. 429

## సారస్వతౌషధంబులు.

తే. బ్రాహ్మి బోడతరంబు పిప్పలియువసయు, శుంఠియు సమంబులుగఁ దూచి చూర్ణఁజేసి
ప్రతిదినము రేపకడ సగబాలు తేనె, గలిపి రూకెత్తు దినినసూక్తులు ఘటించు. 430

## బ్రాహ్మి యన మండూకబ్రహ్మికి పేరు.

సీ. కరక కాయలమీఁదఁ గలుగుబబ్బరయును బిప్పలిమూలంబు తిప్పతీఁగ
బ్రాహ్మియు శుంఠియు బావంచివిత్తనములు నపామార్గము మొదలివేళ్లు
వాయువిళంగంబు లాయష్టిమధుకంబు సన్నపిప్పలియు నచ్చపుసముద్ర
సోడవి తనంబులు బోడతరంబును వలమాటితుంగము సలును వసయు

తే. సమములుగఁ దూఁచి పొడి చేసి సంతతంబు, ప్రొద్దునను లేచి నేతితో ముద్దఁజేసి
కర్షమాత్రంబు భక్షింపఁ గలిగెనేని, గడియ కొకపద్యశతకంబు నడుపు టరుదె.

సీ. చెంగల్వకోష్టును జిఱుతపిప్పలియును మంచియోమపుఁబొట్టు మ్రానిపసపు
మైపూఁతపసపును మధుకంబు సైంధవలవణంబు చిత్రమూలంబుబరడు
జీలకఱ్ఱయు శుద్ధి చేసినశుంఠియు సమభాగములు గాఁగ సంతరించి
చూర్ణంబు గావించి శుభ్రపటంబుపై రాచి యాక్రిందను రాలినట్టి
తే. పొడుము నూతనఘటములో నిడి ప్రభాత
సమయమునఁ బ్రత్యహంబు నాజ్యమున మెదపి
వేసరక చిన్నమెత్తు సేవించునరుని
నాలుకను గాపురం బుండు నలువచెలువ. 432

కందద్వయరుగ్మవతీకమలవిలసితగర్భక్రౌంచపదవృత్తము.

ద్వారవతీనాథా సదుదారా, తరుణధవళకరధరసుతనామా
మారమణీధామా సుకుమారా, మరుదధిపతిరిపుమదగిరిశంబా
సారసనేత్రా సత్యవిచారా, శరరుహభవముఖసకలసురేశా
శూరకులా తేజోజితసూరా, సురవరమణినిభసురుచిరదేహా. 433

గర్భప్రథమకందము.

ద్వారవతీనాథా సదు, దారా తరుణధవళకరధరసుతనామా
మారమణీధామా సుకు, మారా మరుదధిపతిరిపుమదగిరిశంబా. 434

ద్వితీయకందము.

సారసనేత్రా సత్యవి, చారా శరరుహభవముఖసకలసురేశా
శూరకులా తేజోజిత, సూరా సురవరమణినిభసురుచిరదేహా. 435

గర్భరుగ్మవతీవృత్తము.

ద్వారవతీనాథా సదుదారా, మారమణీధామా సుకుమారా
సారసనేత్రా సత్యవిచారా, శూరకులా తేజోజితసూరా. 436

గర్భకమలవిలసితవృత్తము.

తరుణధవళకరధరసుతనామా, మరుదధిపతిరిపుమదగిరిశమ్బా
శరరుహభవముఖసకలసురేశా, సురవరమణినిభసురుచిరదేహా. 437

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర కామెపల్లిపురమందిరనంద నందనచరణారవిందవందనాభిలాషమనీషప్రాభవవెంగనార్యతనూభవ విద్యావిశేష సురాచార్య కాకునూర్యప్పకవివిరచితం బైనయాంధ్రశబ్దచింతామణి యనువ్యాకరణశాస్త్రంబునందు మూలసూత్రంబులను వర్ణసంజ్ఞలును వర్ణోత్పత్తిస్థానంబులును శుద్ధాంధ్రకలిపివిలేఖనక్రమంబులును బంచాశద్వర్ణనిర్ణయంబును బ్రాకృతోనాక్షరపరిగణనయు నంధ్రభాషావర్ణసంఖ్యయుఁ దత్తద్వర్ణభేదంబులును గావ్యాదిగ్రాహ్యవర్ణంబులును నాయకాక్షరకూటంబులును గృత్యాదివర్ణద్వయయోగఫలంబులును సంయుతాక్షరవిశేషంబును శ్రీకారప్రభావంబును గృతిముఖప్రశస్తంబులును దత్తత్స్థానప్రయోగనిషిద్ధాక్షరంబులును దోషప్రభావంబును గుణావగుణబాహుళ్యబలంబును మాతృకార్చనవిధానంబును శుభకాలంబులును సారస్వతౌషధంబులును గలవర్ణపరిచ్ఛేదం బనుద్వితీయాశ్వాసము.

శ్రీ



శైలభ్రమరాంబా
ధీశైశానీవిదిజ్మహీతలవిలస
త్కాశీసమతం గెడనగ
రీశమదాశానివేశరిపుజననాశా. 1

క. అవధారు శబ్దశాసనుఁ, డవనిం గలియుగమున కాది నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పినయాం, ధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దెనుఁగింతున్. 2

క. ఇమ్మగ వర్ణపరిచ్ఛే, దమ్మునఁ జెప్పంగఁబడియెఁ దగ నేకశ్లో
కమ్మున ముఖ్యవళిప్రా, సమ్ములు సంక్షేపములుగ సామజవరదా. 3

మూ. సూ:—ఆద్యో వళి ర్ద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు,
స్వస్వచరణేషు పూర్వః ప్రాస స్సర్వేషు చైక ఏవ స్యాత్. 21

వ. ఈశ్లోకం బొక్కటి యొకసూత్రం బయ్యె నది యెల్ల నిందు వివరించెదను. 4

క. చరణచరణమున కాద్యక్షరములు వళు లయ్యె నవియె క్రమ్మఱఁ దత్త
చ్చరణములలోనఁ జెప్పిన, యిరవులఁ బొందింప వలయు నెల్లకృతులలోన్. 5

తే. విరతి, విశ్రాంతి, విశ్రామ, విశ్రమములు, శ్రాంతి, విరమణ, విరమ, విరామ, యతులు
ననఁగ నివి తొమ్మిదియు వళి కాఖ్య లయ్యె, భవ్యసత్ఫలాయామ్యభాగ గేహ. 6

భీమన పది చెప్పె నన్నం, తామాత్యుఁడు చేసె వెనుక యతు లిరువది, నా
ల్గామీఁదఁ గొందఱు కవి, గ్రామణు లిరువదియు నేడు గావించి రొగిన్. 7

ఆ. పూర్వకవులలక్ష్యములు గూర్చి సత్కవి, జనము లవు నటంచు సమ్మతింప
విశ్రమంబు లేను, విరచింతు నాలుగు, పదులమీఁద నొకటి విదితముగను. 8

## యతిభేదములు4.

క. స్వరయతులు వ్యంజనాక్షర, విరతు లుభయవళులు ప్రాసవిశ్రాంతులు నా
బరికింప నాలుదెఱఁగుల, విరమణములు వఱలుచుండు విహగతురంగా.

అందు స్వరవళు లెట్టి వనిన:—

స్వరవళులు.7

తే. రసను స్వరమైత్రివళులు స్వరప్రధాన
వళులు లుప్తవిసర్గకస్వరవళులును
ఋవళి ఋత్వసంబంధంబు ఋత్వసామ్య
వృద్ధు లన స్వరవళు లేడువిధము లయ్యె. 10

స్వరమైత్రివళులు. 1.

తే. అద్వయమునకు వక్రతమద్వయంబు, నద్వయమునకు ఋయుగంబు నెద్వయంబు
నుద్వయమునకు నంత్యవక్రద్వయంబుఁ, జెల్లు స్వరమైత్రివళు లన శేషశయన. 11

అకారయతులు.

ఆ. అబ్జపత్రనేత్ర ఆర్తావనచరిత్ర, ఆతతాయిజైత్ర ఐంద్రమిత్ర
ఐందవప్రగోత్ర ఔర్వశేయస్తోత్ర, యనుచుఁ జెప్పనొప్పు యతులు కృష్ణ. 12

ఇత్వవళులు.

ఆ. ఇందువంశసోమ ఈశ్వరీసుతనామ, ఈడితాంగధామ ఋషభభీమ
ౠక్షజాభిరామ ఎటులైన మాభామ, ఎడఁగటాక్ష మంచి ఏలు మనఁగ. 13

ఉద్విరాము.

ఆ. ఉరగరాజశాయి ఊర్ధ్వవిష్టపదాయి, ఊర్జితోరుకీర్తి ఒడలి కార్తి
ఒదవ కుండఁ బ్రోచి ఓలి దాసునిఁ గాచి, చేరి కనకకశిపుఁ జీరి తనఁగ. 14

స్వరప్రధానవళులు. 2.

క. తెలిని పదాంతగతాక్షర, ములతోఁ జైశబ్దములకు మొదలఁ గలుగున
చ్చులు గూర్చినసంధుల కవ్వల స్వరములె నిలుచు నుభయవళులను దక్కన్. 15

తే. అతులగుణధామ భానువంశాబ్ధిసోమ, ఇనతనూభవమిత్ర లంకేశజైత్ర
ఉరుగుణకలాప శకలీకృతోగ్రచాప, నాఁగ నిట్లు స్వరప్రధానవళు లొప్పు.

లుప్తవిసర్గస్వరవళులు. 3.

తే. దైవభాష నదంతసాంతములమీఁద, నత్తు మొదలను గలశబ్ద మతుకువేళ
నమరు నోత్వంబునకుఁ జెల్లు నయహాళిపులు, జగతి లుప్తవిసర్గకస్వరవళు లన. 17

తే. అంబుదశ్యామ తవ కింకరోహ మనఁగ, యామినీచరగర్వతమోర్క యనఁగ
వారిసుతుండును నీవు నన్యోన్యమిత్రు, లయి ప్రవర్తింతు రనఁగ లక్ష్యంబు లయ్యె.

మరున్నందనశతకమునందు:—

శా. కోపాటోపము కుప్పిగంతులు నిజాకుంఠీభవచ్చాపల్య రే
ఖాపాండిత్య మయారె నీకును నమస్కారంబు లంకాపురీ
పాపగ్రంథికులాంగనాకుచతటీపత్రాపహద్గ్రాహ బా
హాపాటచ్చర రామదాస తవ దాస్యోహం మరున్నందనా. 19

సుభద్రాపరిణయమునందు:—

శా. తా పైరింప కపర్ది యుండఁగ భవద్గర్భంబునం దాల్చి తే
జోసహ్యుఁడౌ శరజన్ముఁ గాంచి యలనీహారక్ష్మాభృత్కుమా
రీసాపత్న్యము గన్న మోహపుఁబురంధ్రీ[1]రత్నము న్నీవ కా
దే సర్వజ్ఞుని కేల నిన్నుఁ దలపై నెక్కించుకో జాహ్నవీ. (1-114) 20

ఉద్యోగపర్వమునందు:—

ఉ. దైన్యము దక్కి మూత యుచితంబుగఁ బాండునృపాలుపాలు రా
జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెడు నన్న లోకసా
మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొంద మ
న్యోన్యవిరుద్ధభాషణము లాడినఁ దత్ఫల మూతఁ డక్కెడిన్ (1-32) 21

ఋవళి. 4.

క. ఇత్వైత్వంబులఁ [2]దోలఁగక, ఋత్వంబును ఋవళి యనఁగ రేఫముతో మి
త్రత్వంబు నెఱపు నెట్టిమహత్త్వమ్మోయట్లు నగుఁ గావులం దున్నపుడున్. 22

క. రతివల్లభజనక వినిర్జితకనకవిలోచనాఖ్య ఋగ్యజురాది
శ్రుతిచయగోచర వాహీకృతఖేచరకులలలామ రిపుజనభీమా. 23

సభాపర్వమునందు:—

సీ. పా. ఋత్విజుం డని విచారించి పూజించితే ద్వైపాయనుం డుండ ధర్మయుక్తి.
(2.11)

విజయవిలాసమునందు:—

ఉ. ఆణిమెఱుంగుముత్తెపుటొయారపుముగ్గులు రత్నదీపికా
శ్రేణులు ధూపవాసనలు శ్రావ్యనిరంతరవాద్యఘోషము
ల్రాణఁ బొసంగఁ బోలు మిగులం గనువిందొనరించు నిత్యక
ల్యాణముఁ బచ్చతోరణము నై జను లందఱు నుల్లసిల్లఁగాన్. (1.83) 25

1 రత్నమహాదీవ (వా). 2 గలయక (పూ. ము); బెరయక (వా).

హ్రా, య(+ఇ ఈ, ఋ, ౠ, ఎ ఏ) : వృ, వ్వృ

ఋత్వసంబంధవళులు. 5.

తే. సారిదిఁ గాదులఁ గలవట్టుసుడుల కెల్ల, ఋత్వమిత్రంబు లగునచ్చు లెనయ నైదుఁ
జెల్లు,హాయలును స్వరమైత్రిఁ జెందునపుడు,వెలయునివి ఋత్వసంబంధవళులనంగ.

అ. ఇనతనూభవుండు వృషదశ్వసుతు నేసె, ఋభునదీసుతుండు కృష్ణు నేసె
నేమి చెప్ప నపుడు ద్రుపదశక్తి శల్యుండు, హీనబలునిఁ జేసె వృష్ణికులుని. 27

జైమినిభారతమునందు:—

సీ.గీ. తండ్రితరమునఁ జెనిమిటితరమునందు, వీసమంతయుఁ బుణ్యంబుఁ జేసి యెఱుఁగ
వార్ధకంబున నిం కేల వట్టితోడుసు, కృష్ణు దర్శింప నన్న నాకేమి చిక్కు. 28

(2.109)

మనుచరిత్రమునందు:—

సీ. తీర్థసంవాసు లేతెంచినా రని విన్న నెదురుగా నేగు దవ్వంత రైన
నేగి తత్పదముల కెరఁగి యింటికిఁ దెచ్చుఁ దెచ్చి సద్భక్తి నాతిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్న సంతృప్తులఁగాఁ జేయుఁ జేసి కూర్చున్నచోఁ జేర వచ్చు
వచ్చి యిద్ధరఁ గల్గువనధిపర్వతసరిత్తీర్థమాహాత్మ్యము ద్దెలియ నడుగు. (1.57) 29

నరసింహపురాణమున:—

సీ. పా. ఏదేవులీల లై యెసఁగుజగంబులు సృష్టిరక్షాసమాపేక్షఁ బరఁగు. (2.30)

ఆముక్తమాల్యదయందు:—

చ. హితులు భిషగ్గ్రహజ్ఞబుధబృందకవీంద్రపురోహితుల్ హితా
హితులు ధనార్జనాదినృపకృత్యనియుక్తులు వెండి కేవలా
హితులు దశాదశార్పితసమృద్ధరమాచర[1]ణేప్సు లౌట నా
హితమును నట్ల కాఁ జతురవృత్తిఁ జరించుట నీతి యేనికిన్. (4.278) 31

సుభద్రాపరిణయమునందు:—

తే. చెఱకువిలుకానిబారికి వెఱచి నీదు, మఱుఁగుఁ జొచ్చితిఁ జేపట్టి మనుపు నన్నుఁ
బ్రాణదానంబుకన్నను వ్రతము గలదె, యెఱుఁగవే ధర్మపరుఁడవు నృపకుమార.

(1-158)

ఎడపల్లిపర్వతన్న చాటుధార:—

మ. రణరంగంబున నీకితాని యరినోరం బూరి గైకొన్నఁ దా
నణుమాత్రంబును వానిపైని దెగ దావాచిత్ర మాహింపఁగాఁ
దృణమే కావలె దారికట్టు మొన కట్టిదారుణీమండలి
ప్రణుతప్రాభవ కందనోలిపురగోపాలా క్షమావల్లభా.

1 ణేప్సు (పూ. ము).

ఋత్వసామ్యవళులు. 6.

తే. వట్రువలు చెంది తమలోన వ్యంజనంబు, లన్నియును గూడు ఋత్వసామ్యవళు లనఁగ
వృష్ణివంశాబ్ధిసోముఁడై పృథివిఁ బుట్టి, మృతుని గావించెఁ గంసు నిఁగృష్ణుఁ డనఁగ.

విష్ణుచిత్తీయమునందు:—

సీ. గీ. తిరుగుడు రయాశ సురపురి సురల మఱిగి, బహుళ హాలహాలభరితకల్పరిగనగర
సగరపురవరపరివృఢజవనయవన, మృతిన భవదసి ననిఁ దెగి కృష్ణరాయ. (1-41) 35

అందే:—

మ. గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగార[1]పల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో వాల్లభ్య[2]లభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో ద్రాగ్దీపికారోపమో
నృహరీ వాదము లేల లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్. (2. 91) 36

వృద్ధివళులు. 7.

క. తలకట్టులపై సంస్కృతములఁ గడియుపదాదివక్రములకు వరుసతో
నెలకొనువక్రతమంబుల, కిల నుభయముఁ జెల్లుచుండు వృద్ధివళు లనఁగ. 37

తే. ఇభభయవిదార సర్వలోకైకవీర, అఖిలభువనప్రశస్త జితైణహస్త
ఉదధిజాశ్రితవక్ష భక్తౌఘరక్ష, హతపరానీక నందవ్రజైక యనఁగ. 38

మనకు విష్ణుచిత్తీయమునందు:—

మ. గురుగుం జెంచలి తుమ్మి లేఁదగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావికట్టారికో
గిరము[3]న్మెక్కి తమిం [4]బసుల్ వ్రాలమ్మవోఁ గ్రేపుల్ మెయి న్నాకమేఁ
కైరవుంగుంపటిమంచ పెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్. (4-134) 39

ఋత్వమునకు విరాటపర్వమునందు:—

ఉ. ఆకమలాక్షిరూపమహిమాతిశయంబు మనివాంఛ
గీకపరాయణుల్ పురుషులంగజుఁ డప్రతిమానచేష్టిత
స్వీకృతలోకుఁ డట్లగుటఁ జేటు పురంబునవారి కెల్లయి
గాఁ కెటు లుండు నిట్టియవగాఢపుఁబొత్తు మనంగ వచ్చునే. (3-32) 40

---

1 పర్యంకికా (ప). 2 తార్క్ష్యధ్వజ (ప). 3 మేసి (వా). 4 కోమల్ (వా).

ఓకారమునకు భాస్కరరామాయణమునందు:—

శా. నీకంఠార్పితకాలపాశము శిరోనిర్ఘాతపాతంబు లం
ఘ్రాకస్సంచయకాళరాత్రి గళబద్ధోదగ్రకాలాహి క
న్యాకారాగతమృత్యు వీజనకకన్య న్వేగ నొప్పించి లో
కైకత్రాణుని రాముని గనుము నీ కీబుద్ధి గా కుండినన్. (సుం. ప. 448) 41

ఔకారమున కయ్యల[1]రాజు రామభద్రుని చాటుధార:-

క. రాజమనోజా విద్యా, భోజా దీనారికల్పభూజా రిపుసం
ఘౌజా వైభవవిజితబిడౌజా రవితేజ గుత్తియప్పలరాజా. 42

ఇవి యేడును స్వరయతిభేదంబులు.

వ్యంజనాక్షరవిరతులు.

సీ. క్రమమునఁ బ్రాణి వర్గజ బిందు తద్భవవ్యాజ విశేష సమాహ్వయములు
మహి ననుస్వారసంబంధానునాసికాక్షర మువిభక్తి ముకారయతులు
మొగి మవర్ణవిరామములు ఋజు ప్రత్యేక భిన్నైకతరము లభేదవిరతు
లొలి నభేదవర్గోష్మవిశ్రాంతులు సరస సంయుక్తవిశ్రామములును

తే. గరిమ నంత్యోష్మసంధి వికల్పసంధి, విరమములు నాఁగ వ్యంజనాక్షరవిరతులు
నిఖిలసుకవిప్రయోగము ల్నెమకి చూడ, నేకవింశతిభేదంబు లెఱుఁగ వలయు. 43

ప్రాణివిరామములు. 3.

తే. ప్రాణములు నాఁగ స్వరసమాహ్వయము లయ్యె
నవి కలిమిఁజేసి హల్లులు ప్రాణులయ్యెఁ
బొల్లుహల్లుల నచ్చులు పొంద కునికిఁ,
బ్రాణు లని పల్కఁ గూడదు వాని నెందు 44

తే. వ్యంజనంబులు స్వరమైత్రివలనఁ దనరుఁ, గాన ప్రాణివిరామాభిధానములను
జెంది మూఁడు తెఱంగులై చెల్లుచుండు, వాని నెఱుఁగక కృతి సేయ వలను గాదు.

క. చెలులు తలకట్లు నాచ్చా, పులు నైత్వౌత్వములు మిత్రములు గుడిగనయుక్
[2]సుడిగవయు నైత్వయుగమును, జెలు వగుచుట్టములు ద్వివిధశృంగోత్వమ్ముల్. 46

---

1 విటరాజు రామభద్రుని (వా); బలరామభద్రుని (ప). 2 సుడి (ప); సుళి (వా). ఉడలప్రాసము. అప్పకవికిసమ్మతమే (అ. 3-366).

సీ. కలశాబ్ధిగంభీర కాంచనాచలధీర కాళియోరగవైరి కైటభారి
కైలాసపతిమిత్ర కౌశికస్తుతిపాత్ర కిల్బిషాద్రిసురేంద్ర కీర్తిసాంద్ర
కీలాలరుహనాభ కృష్ణజీమూతాభ కృతవర్మతో నేగి కెలఁకు లాఁగి
కెరలి చైద్యుఁడు నూడఁ గేకయు గ్లానియాడఁ గుండినేశునిపట్టిఁ గూడ మట్టి
తే. కూర్మి వలకేల సింగంపుఁగొదమలీలఁ, గొని శతాంగంబుపై నుంచి కోర్కి మించి
ద్వారకకు వచ్చు నీవైభవంబుఁ బొగడ, శక్యమే యనఁ గాకు లక్ష్యంబు లయ్యె.

వర్గయతులు. 9.

ఆ. శబ్దసూత్రములను జగతి నేకస్థాన, సంభవంబు లగుచు సంధివేళఁ
గలసవర్ణసంజ్ఞఁ దలపోసి యతులకుఁ, గూర్ప వచ్చు మఱియుఁ గొన్నికృతుల. 48
క. తమతమయనునాసికవర్ణములు విడిచి వెనుకలిపులు నాల్గును దమలోఁ
దమకు [1]నర లేక నిలిచిన, నమరాహితదమన వర్గయతు లనఁ బరఁగున్. 49
ఆ. కంధిమధ్యగేహ ఖండితారిసమూహ, ఖంజనాభదేహ గానమోహ
గరుడపక్షివాహ ఘనవాహజస్నేహ, భర్గవినుత యనిన వర్గయతులు. 50
వ. తక్కిననాలుగువర్గములకు నీలాగుననే తెలిసికొనునది. 51

బిందుయతులు. 10.

క. పనిఁ బూని నిలుచుఁ దమతమ్ముయనునాసికములకు బిందుయతులను వెనుకన్
గనుపట్టు నాల్గులిపులను, బెనుసున్నలు డాని తమకుఁ బెఱుఁదఁ గఱియుచోన్.
తే. జ్ఞానవేద్యాయ తప్తకాంచనవిభూష, ణాయ మేచకవర్ణ కంఠప్రియాయ
నగధరాయ నమోస్తు సౌందర్యవిజిత, మనసిజాతాయ గోపడింభాయ యనఁగ. 53

తద్భవవ్యాజవిశ్రమములు. 11.

సీ. విజ్ఞానమునకు భావింప విన్నాణంబు విజ్ఞాపనమునకు విన్నపంబు
సంజ్ఞకు సన్న యజ్ఞమునకు జన్నంబు నాజ్ఞప్తి కానతి యాజ్ఞ కాన
యని యిట్లు సంస్కృతవ్యవహారమధ్యావసానంబుల ద్వితీయసరళమునకు
నడుగునఁ గలతాలుజానునాసికములు తద్భవంబున దుత్వంబు గాంచి
తే. వెలయుటను దద్భవవ్యాజవిశ్రమమున, జరిగి నణలకు రెంటికి జా తనర్చు
జ్ఞానిచేతోంబుజాతశోణకర యనఁగ, జ్ఞాతివిద్వేషనృపనాశనకర యనఁగ. 54

గణితమునందుఁ బావులూరి మల్లన్న:—
ఉ. శ్రీనిధి యైనశిష్యునను జిష్ణునుఁ న్మతి సూర్యదేవునిన్
ధీనిధిఁ బోలనార్యులను దేజమునన్ రవితుల్యులైనయా

1 నెరి (ఎం).

మానసుల నల్వురం బడసె సూరిజనస్తుతసత్యభారతీ
జ్ఞానులఁ బద్మగర్భవదనంబులు నాలుగుఁ బోలె వారిలోన్. 55

## విశేషవళులు. 12.

తే. ప్రౌఢకవులు కొందఱు జకారంబునకును బ్రథమవర్గంబుతోలియక్కరములు నాల్గు
నిడుమరు ప్రబంధముల నొక్కయెడ విశేషవళులనుచు సోమయాజులు వానుకత్తన.

శాంతిపర్వమునందు:—

క. జ్ఞానము కేవలకృప నజ్ఞానికి నుపదేశవిధిఁ బ్రకాశము సేయం
గా నది సకలధరిత్రీ, దానంబునకంటె నధికతరఫలద మగున్. (4–255) 57

## అనుస్వారసంబంధయుతులు. 13.

ఆ. ఆదిపూర్వయుతము లై టతవర్గాక్షరములు తుదను గలుగువ్రాలు దక్కఁ
బొసఁగు నొకటి కొకటి భువి ననుస్వారసంబంధయుతులు నాఁ బ్రబంధములను.

మనుచరిత్రమునందు:—

శా. శీలంబుం గులము న్శమంబు దమముం జెల్వంబు లేఁబ్రాయమూం
బోలం జూచి యితండు పాత్రుఁ డని యే భూపాలుఁ డీవచ్చినన్
సాలగ్రామము మున్నగాఁ గొనఁడు మాన్యక్షేత్రము ల్వెక్కుచం
డాలం బండు నొకప్పుడుం దఱుఁగ దింట్టుం బాడియుం బంటయున్.(1–55) 59

రావిపాటితిప్పరాజుచాటుధారః:—

మ. సరిబేసై రిపు డేల భాస్కరులు భాషానాథపుత్రా వసుం
ధరనం దొక్కఁడు మంత్రి యయ్యె [1]విసుకొండ న్రామయామాత్యభా
స్కరుఁడో యా నయతే సహస్రకరశాఖ ల్లే వదే యున్నవే
తిరమై దానము సేయుచో రిపుల హేతి న్వ్రేయుచో వ్రాయుచో. 60

ఆముక్తమాల్యదయందు:—

మ. దవధూమం[2]పుతమంబులోఁ దమరసద్ద్రవ్యంబు పంకేజబాం
ధవభానుప్రతతుల్ హరింపఁ గుయి వెంట్ల న్వెళ్లుశూన్యోరుకూ
పవితానంబులఁ జూడఁజూడఁ బుడమిం బాటిల్లి పై విప్పలై
యనసం బంచుల నాడఁగాఁ నెగసె వాత్యాళి న్నజళ్చక్రముల్. (2–48) 61

1 వినికొండ (వా). 2 ధూమంబుతమంబు (వా).

## అనునాసికాక్షరయతులు. 14.

తే. అల ద్రుతంబునకును మధ్యమానునాస్యి, కమునకును జెల్లు ననునాసికయతు లనఁగ
ఙాపలను బూర్ణములు గల్గుటతడఢలును, దథదధలును గ్రమంబున దానవారి. 62

క. మనుసంతతిమండన భండనవిర్జితకార్తవీర్యనరనాయకఖం
డన పఙ్క్తిస్యందనసంక్రందన చందనచక్రవారణ్ణలసత్కీర్తీ. 63

కిష్కింధాకాండమునందు:—

క. బలసంతుఁ డైనవాలికిఁ, దలఁకుచుఁ గిష్కింధ వెడలి త్వరతో నలుది
క్కులకుం బాతి మహీమండల మెల్లను జూచినాఁడ నాఁడు నరేంద్రా. (ప. 614)

రాజశేఖరచరిత్రమునందు:—

మ. కలమాన్నంబు ఘృతంబుఁ బాయసము శాకవ్రాతముల్ పిండివం
ట్లలు బాశ్తేనియ జున్ను వెన్న యిడి యాన్నా లుక్కెర ల్చక్కెరల్
ఫలము ల్పానకము ల్రసాయనము లంబ ల్గూరుబిం డ్లూసగా
యలు బజ్జు ల్దధిపిండఖండములు నం దావిర్భవించె న్వెసన్. (2–127) 65

పరమయోగివిలాసమునందు:—

సీ. పా. నిగమచోరకుని ఖండించినయలఁతయో యబ్ధిలోఁ గిరి మోచినట్టియలఁతో. (2–104)

చిత్రభారతమునందు:—

తే. నకులసహదేవులార భండనపటిష్ఠు, లార సౌందర్యలక్ష్మీకుమారులార
పోయితిరె మీరు నేఁడు నాపొందు విడిచి, యనుచు విలపించు నలుదిక్కులాలకించు.

హరిశ్చంద్రోపాఖ్యానమునందు:—

సీ. పా. పల్లవారుణజటాపటలభారముతోడ నవ్యపలాశదండంబుతోడ. (1–8) 68

## మువిభక్తియతులు. 15.

'ము' = అన్యత్ర గలపద ద్గకొల్లస్థానము 15+16

తే. పున్నపుంసకతత్సమంబులకడపలఁ, దత్సమాంధ్రదేశ్యశబ్దములతుదలఁ
గదిసినము కారశృంగముల్ కావ్యములను, బొసఁగుమువిభక్తియతులనఁబుధులబుధులను.

తే. పుష్కరము సూక్ష్మమధ్యమమ్మునకు నొనర్చ్చి, ఫుల్లపంకేరుహము వక్త్రమ్మునకు నొనర్చి
భ్రాంతమున్ల్లెలు దరహాసమ్మునకు నొనర్చి, భోజనృపనందనకు నిక్కమ్మునకు నజుండు.

ఆదిపర్వమునందు:—

క. ఎట్టివిశేషకులంబునఁ, బుట్టిన సదసద్వివేకమ్ములు గలిగినఁ దాఁ
గట్టినకర్మఫలంబులు, నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్. (5–58) 71

"బ్రాహ్మణపల్లెనుకాట్టెట మోసపోయెను" ఆనాధులు.
"వ్రేలుకట్టెలుగా నుసమస్త భూశక్తాధీశా" అనంతుడు

## మకారయతులు. 16.

క. పెచ్చరికను బుధులకు, నచ్చపు మాకొమ్ములే మహాకవులాదిన్
మెచ్చులుగ నిలిపి రచ్చట, నచ్చటను మకారయతు లటంచును గృతులన్. 72

వసంతవిలాసమునందు:—

క. అత్తఱి విటనాగరకులు, చిత్తమున వసంతకేళి చిగురొత్తంగా
మొత్తములు గట్టి తెచ్చిరి, మత్తిల్లపుఝల్లరులతో డిబ్బులకొమ్ముల్. 73

శ్రీరంగమాహాత్మ్యమునందు:—

చ. పరిచరుఁ గాఁగ నేలె నిరపాయచరిత్రునిఁ బాపకానన
స్ఫురదురువీతిహోత్రుని సముజ్జ్వలమేరుసమానగాత్రునిన్
బరమపవిత్రునిన్ మునిసుపర్వపరస్తుతిపాత్రుని న్నమో
హరఫలశేముషీకబళితాంబుజమిత్రుని వాయుపుత్రునిన్. 74

హరిశ్చంద్రకథయందు:—

ద్విపద. మున్ను మీ రేలిననభూతలాధీశు, లందు రాజ్యంబుఁ బోనాడి క్రమమున.

## మవర్ణవిరామములు. 17.

సీ. మర్దితదైత్య సంయమిమనోబ్జాదిత్య మహితమేఘాభ సంరక్షితేభ
మాయాప్రవర్తి సంలబ్ధనిర్మలకీర్తిమణిహార సురవశంవదవిహార
మందరధైర్య వంశనినాదచాతుర్య మాభూప యువతిపుంషండరూప
మంజులస్వాంత కంసధరావరకృతాంత స్మరహరారాధ్య సింహనిభమధ్య
తే. యనుచుఁ జరమానునాసికంబునకు నిట్లు, గ్రాలుఁ గృతుల మవర్ణవిరామము లన
దండిసున్నలు దాపల నుండెనేని, పెలుచ నంతస్థములు నూష్మములును గృష్ణ. 76

భీమనచాటుధార:—

చ. గరళపుముద్ద లోహ మవగాఢమహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొలిమి యురగాధిపుకోరలు పట్టుకార్లు ది
క్కరటికరంబు దాయి లయకాలుఁడు కమ్మరి వైరివీరసం
హారణ[1]గుణాభిరాముఁ డగు మైలమభీమనఖడ్గసృష్టికిన్. 77

అనంతునిఛందమునందు:—

తే. యరలవలు శషసహలును నాదిబిందు, యుతము లై మకారవిరామయుక్తిఁ దనరు
మారుతాత్మజుఁ డరిదిసంయమి యనంగ, మదనజనకుఁడు దనుజసంహారుఁ డనఁగ. 78

(1-117)

---

1 రణాభిరాముఁడగు (వా).

ఋజుయతులు. 18.

తే. మొదలియంతస్థవర్ణంబు తుదిని బొదలు, నూష్మమును ఋజుసంజ్ఞచే నొకటికొకటి
యతు లగు వసారకూరసంహార యనఁగ, హారముఖార్చితపాదతోయజ యనంగ.

ప్రత్యేకయతులు. 19.

తే. ఉత్తరపదాద్యలిపి లోప మొదవ కుండు, తటిని బ్రత్యేకయతి నాఁగఁ దనరుచుండు
నరయ శార్ఙ్గంబు హరిచేతియదియుఁ నాఁగ, దివ్యచాపంబు శూలిచేతిది యనంగ. 30

భిన్నయతులు. 20.

తే. గుడుసుపైఁ గ్రియనడుమ నాగుడుసు వచ్చి
[1]భిన్నయతి యగు రానిచోఁ [2]బెఱయతి యగు
నైదను లచ్చిని హరి ధరియించె ననఁగ
రిపుల నెల్లను ఘోర హరించె ననఁగ.

విజయవిలాసమునందు:—

ఉ. చిత్తజుఁ డగ్గిచూపు మొనఁ జేసినఁ జేయఁగ నిమ్ము పై ధ్వజం
బెత్తిన నెత్తనిమ్ము వచియించెదఁ గల్గినమాట గట్టిగా
నుత్తరళాయతేక్షణకటాక్షవిలాసరసప్రవాహముల్
కుత్తుకబంటి తామరలకుం దలమున్కలు గంటిమీలకున్. (3-15) 32

అందే:—

ఉ. చెట్టతనంబునన్ జనకుజీవన మంతయు వెల్లి పుచ్చి తోఁ
బుట్టినయాపెయి [1]ల్వెటిచి పుట్టినబిడ్డనికిం బగైన నీ
యుట్టినిశాటకృత్యమున కెవ్వఁడు రోయక సమ్మతించు నీ
పెట్టి ప్రదోషవేళ జనియించినవాఁడవొ గాక చంద్రమా. 33

పెఱయతి.

ఆగమము రానందులకు శ్రీరంగమాహాత్మ్యమునందు:—

ఉ. కరిదపుఁగొండనెత్తములఁ గందువమేలిమిలీవయిండ్లలోఁ
గొందలిరాకుపాన్పున సుఖించి నితాంతరతిశ్రమంబునుం
జెందిన[2]చెంచుగుబ్బెతలచెక్కులఁ జిమ్ముజవాదివాసనల్
విందులు సేయుచు న్నెలఁగు వేసవిఁ గోమలగంధవాహముల్. 34

1 చెఱచి (ఊ). 2 చంచు (ప).

## ఏకతరయతులు. 21.

తే. మహిని రేఫాక్షరంబును మఱి శకాంగ
నామక ఱకారమును సవర్ణంబు లయ్యెఁ
గావ్యములయందు నొకటికొక్కటి గలయక
దమకుఁ దా మఱియగు నేకతరయతు లన. 85

ఆ. రార బాలకృష్ణ రచ్చలగమిఁ గూడి, జాఁగ యనుచు నిన్ను జవ్వఁబెట్టు
వాండ్రయిండ్ల కేఁగి వా దేల దెచ్చెద, వనిన నేకతరమునై పొసంగు. 86

## అభేదవిరతులు. 22.

తే. వేదముఖమున వబయో రభేద యనుట, వలన వబ లొక్కటొక్కటి నిలుచు విరతి
కవని లడలకు లళలకు నట్లు కలిమిఁ, జేసి తమలోన నివియును జెల్లుచుండు. 87

ఆ. వసుమతీకళత్ర బకజైత్ర గానక, లాలసత్కలాప[1]డంభ గోప
లలితదేహ పింగళిపురదక్షిణగేహ, యన నభేదవిరతు లప్రమేయ.

ఆదిపర్వమునందు:—

చ. నుతజలపూరితంబు లగునూతులు నూఱిటికంటె నూన్నృత
వ్రత యొకబావి మేలు మఱి బావులు నూఱిటికంటె నొక్కస
త్క్రతు వది మేలు తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటె నొకసూనృతవాక్యము మేలు చూడఁగన్. (4–94)

ఆరణ్యపర్వమునందు:—

చ. ప్రతిబలదర్పభంజనుఁడు పార్థుఁడు దారుణబాణవర్షము
న్నతి నతిధీరుఁడై కురిసినం బరముండు మహాంబువృష్టి ప
ర్వతము [2]గ్రసించునట్లు తనబాహుల వాని గ్రహించి పోర న
క్షతతనుఁ డయ్యె వాని నతిగర్వితుఁ బార్థుఁడు చూచి యాత్మలోన్. (1–311) 90

భీమనచాటుధార:—

చ. *బిసరుహగర్భ[3]వ్రాతయును విష్ణునిచక్రము వజ్రివజ్రముం
దెసలను రాముబాణము యుధిష్ఠిరుకోపముఁ గాలుదండమున్

1 డంబ (పూ. ము). 2 గ్రహించు (పూ. ము.) 3 శాపమును (వా); పాశమును (వ).

* పాఠాంతరము.

చ. బిసరుహగర్భవ్రాతయును విష్ణునిచక్రము వజ్రివజ్రముం
దశరథసూనుబాణమును ధర జడకోపము మహానిశాపమున్

మసకపుపాముకాటును గుమారునిశక్తియు వరానిరోపమున్
బసవనిరొతుకూలమును బండితవాక్యము రిత్త వోవునే. 91

చమత్కారమంజరియందు:—

ఉ. బంగరుదుప్పటంబు వలెవాటుగ నొప్ప హసన్ముఖాబ్జుఁడై
రింగున నారిఁ గోల నమరించి తటాలునఁ ద్రుంచె సాధను
శ్చంగుఁడు గోపయౌవతభుజంగుఁడు మోచితసంగుఁడుం గృపా
పాంగుఁడు దృప్తదర్పబలభంజనయంత్రము మత్స్యయంత్రమున్. 92

తే. పెద్దళాకును దనకు నభేద మగుట, లళలకు నభేద మట్లన కలుగుకతన
క్షితిని మూఁడవసరళంబు యతులఁ బ్రాస, ములను లఘ్వలఘులకారములకు నిలుచు.

అనంతుని ఛందమునందు డళలకు:—

క. కాకుస్వరయతి యగు నిత్యుఁడే కదలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ్ర
శ్నాకలితదీర్ఘము న నిత్యుఁడే కవ్వడిరథముఁ గడిపె నిమ్ముల ననఁగన్. (1–95) 94

లళలకు నాదిపర్వమునందు:—

చ. అలసత నొరఁగఁగాఁ దరుణి యమ్మునిపుంగవుప్రోల నున్నయా
మిళితసుగంధబంధురసమీరవశంబునఁ దూలి బాలపై
వలు వెడల న్బయల్పడియె వల్దకుచంబులుఁ గత్తుయుగ్మమున్
లలితకృశోదరంబుఁ దరళత్రివళీయుతరోమరాజియున్. (4–42) 95

నిర్వచనోత్తరరామాయణమునందు:—

శా. చేసేతం బృథివీశు లందుకొనఁ గాశిపుణ్యాతోయంబునన్
జేసె న్మజ్జనముం గుటంబున హరించెన్ బల్లవోర్వీశును
ల్లాసం బైతగ ఫాలలోచనములీలం గట్టెఁ గావేరి వే
లాసాధ్యాఖిలదిఙ్ముఖుండు కలికాలత్మాధిపుం డల్పుఁడే. (1–26) 96

పారిజాతాపహరణమునందు:—

మ. అలినీలాలక నీవు నీపతి రహస్యక్రీడ వర్తించునో
శైలతారంతాయుధుసంగరంబునకు సుల్లాసంబు గల్పించును
జ్జ్వలదీపాంకుర హైరతిశ్రమతనూసంజాతధారాళఘ
ర్మలవంబుల్ దొలఁగింపఁగా సురటి యై రంజిల్లు నిచ్చారతిన్. (1–60) 97

మసకపుపాము కాటును గుమారునిశక్తి [illegible]
బళువతికంటిమంటయును బండితవాక్యము రిత్త వోవునే.

## అభేదవర్గయతులు. 23.

క. తన కరలేని[1]బకారం,బునకు స్వవర్గజము లైన మొదలిలిపులరెం
టను వెలిఫి నొకటను వా, యనుప్రాయి యభేదవర్గయతి వా నెనయుఙ్. 98

ఆదిపర్వమునందు:—

ఉ. ప్రల్లదుఁ డైనయొక్క_కులపాంసనుచేసినదానఁ దత్కు_లం
బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము కావున న్మహీ
వల్లభ తక్షకాధముని పంబున సర్పము లెల్ల నగ్నిలోఁ
ద్రెళ్లఁగ సర్పయాగ మతిధీయుతి సేయుము విప్రసమ్మతిన్. (1–126) 99

అందే:—

క. ఉరగకళేబర మంసాంతరమునఁ బడి వ్రేలుచునికిఁ దలఁపక యచల
స్థిరుఁ డై పరమధ్యానో, పరతేంద్రియవృత్తి నున్నవాని శమీకున్.(2–172) 100

ఆరణ్యపర్వమునందు:—

క. శౌరి యనేకయుగంబు ల్పారతపోయుక్తు లైనవారికిఁ బడయన్
దూరము నీసభ [2]మతినీ, కారుణ్యమునంతకంటెఁ గడుద ప్పెందున్. (1–871) 101

ఫకారమునకు సాంబోపాఖ్యానమునందు:—

క. మురసంహారునాటోప, స్ఫురణమ్మునకున్ సదాశివుం డైన రణ
స్థిర నిలువఁ గలఁడె బాణా,సురునకుఁ దోడుపడ వచ్చి సొలయుట వినరే. 102

ఆదిపర్వమునందు:—

మత్తకోకిల. ధీరు లీధృతరాష్ట్రపాండు లతిప్రశస్తగుణు ల్పవిని
ర్ధోరకీర్తులు నాకు నిద్దఱు నొక్క_రూప తలంపఁగా
వీరు వా రనునట్టిబుద్ధివిభేద మెన్నఁడు లేదు గాం
ధారిపుత్రశతంబునందుఁ బృథాతనూజులయందునున్. (8–29) 103

## ఊష్మవిశ్రాంతులు. 24. శ = ష = స

తే. అంత్యవర్ణంబుఁ బాసి యూష్మాక్షరంబు,లూష్మవిశ్రాంతు లనఁ జెల్లు నొకటి కొకటి
శతమఖోపలభూషానుషంగ యనఁగ, షడ్జయుతవేణునాదప్రసంగ యనఁగ. 104

## సరసవళులు. 25.

క. హయ లత్వములను, శషసలు, నయవర్తన చఛజఝలను, నలి మధ్యమవ
ర్గయుతాననాసికము న్నిశ్చయముగ దుతములనఁ జెల్లు సరసవళులనన్. 105

1 భకారం. (పూ. ము 1902). 2 మేదిని (పూ. ము).

తే. హరిహయాదిసురారాధ్యతత్త్వ అంబుజాక్ష, యతిజనమనోంబుజవిహార అఘవిదూర
నరకదైత్యవిరోధి ఘృణాపయోధి, యనఁగ సరసాఖ్యవళ్యుదాహరణము లగు.106

తే. శకటదానవసంహారి చక్రధారి, షట్పదశ్యామమూర్తి స్వేచ్ఛాప్రవర్తి
స్వర్ణపటపరిధాయి భుజంగశాయి, కరుణ నను బ్రోవు మన నయ్యె సరసవళులు.

## సంయుక విశ్రామములు. 26.

ఆ. ఒకటి రెండు జడ్డ లుండెడువర్ణంబు, విశ్రమస్థలమున వెలసెనేని
యవల దాని కెద్ది యైన సంయుక్తవి, శ్రామసంజ్ఞచేఁ బొసంగుచుండు. 108

తే. క్ష్మాధరం బాతపత్రంబుగా ధరించె, క్ష్మాకుమారుని బోరను సంహరించె
క్ష్మారుహంబునకై నిలింపపతి నొంచెఁ, జక్రి యనిన సంయుక్తవిశ్రామములగు.109

## యతినియతి.

క. ఏకపదంబున విరతు ల, నేకంబులు గలిగి యుండునేని పదాదిం
జేకొన్నలిపియె యన్నిటఁ, బ్రాకటముగ నిలుచు నీసపదములఁ దక్క. 110

ఆ. ఒక్కపదములోనఁ బెక్కువిశ్రమములు, జఱుగుచోట మొదల జడ్డ లున్న
నడుగు వెడలుదనుక నం దొక్కటియె కాని,యుండ దొకటనదియు నొకటనిదియు.

జయభద్రరగడ:—

క్ష్మాపుత్రికాలోల కమనీయగుణజాల, ఘననీల యని చెప్పఁగా బహువిరతు లొప్పు
క్ష్మాపాలకలలామ శంధిగర్వవిరామ, సంగ్రామభీమ యన మహిని రెంటికిఁ దప్పు.

తే. ఒంటియడుగున బహుయతు లుండునపుడు,నడుమ నొకదాన జమిలివర్ణంబు గదియ
నందుఁ జరణాదికి సవర్ణ మయ్యె నెద్ది, దానికయ నిల్చు విరతి యందరను గృతులు.

విజయమంగళరగడ:—

దైత్యమదతమఃపతంగ స్వజనపోషితాంతరంగ
ప్రజవధూభుజంగ యనఁగ వలయుఁ బెక్కు పదులమొదల
చారితక్షమాకుమార ద్వారకాపురీవిహార
వ్యాసనన్నుతప్రచార యనఁగఁ దప్పుకడకు వెడల. 114

## అంతోష్మసంధివిధులు. 27.

పాణినీయసూత్రము.—

సూ. ఝయో హోఽన్యతరస్యామ్.

వృ. ఝయః పరస్య హస్య పూర్వసవర్ణో వా స్యాత్. వాక్ హరిః, ఘోషవత్త్వాది
గుణవతో హస్య వర్గచతుర్థః పూర్వసవర్ణ స్స్యాత్. వాగ్ఘరిః.

సీ. కైరవకౌముదుగ్ధరవాహకవికుంద హైరణ్యగర్భవాగ్ఘరిసబృంద
డిండీరభోగిరాడ్హిమశైలకైలాసహరిధవళాంబురుద్ఘరినివాస
దేవాశ్వసురసరిద్దీరముక్తాకాశహరిచందనైణభృద్దాద్రిదిసిత
పారదప్రాక్కుబ్బకంబుక్షీరహాలధరశారదాబ్బయపటీర
తే. పాండుసత్కీర్తి యని యిట్లు వర్ణహల్లు, పొల్లులనఁ బైహకారంబు పొందునపుడు
శంధిబంధన యంతోష్మసంధివిరమ, జాఖ్యచే దాని కెమ్మెయి దైనఁ జెల్లు. 115

వికల్పవిరమణములు. 28.

పాణినీయసూత్రము:—

సూ. యరో నునాసికే నునాసికో వా.

వృ. యరః పదాన్తస్యానునాసికే పరే అనునాసికో వా స్యాత్. ఏతన్మురారిః, ఏతద్మురారిః, మయటి నిత్యమ్ వాచ్యమ్, చిన్మయః.

తే. వ్యాకరణసూత్రముల సంధు లతుకనపుడు, రెండువిధముల రూపంబు లుండెనేని
వసుధ నయ్యక్కరముల కవ్వల వికల్ప, సంధి విరమణ మన రెండు సాగుచుండు.
తే. నందసుకుమార గూఢపాన్మదవిహార, దళితశిశుపాల గోత్రభిన్మణివిసిల
నాగపర్యంకశాయి సన్మార్గయాయి, ధాత్సనతనాకు యోగిహృన్మధ్యధామ. 117

[1]ఆదిపురాణమునందు:—

కు. ఒకనాఁ డిందుధరుండుఁ బార్వతియు లీలోద్యానకేళీసరి
న్నికటానేకవనప్రదేశముల దైత్యేయేంద్రకన్యాప్సరో
నికరుంబంబులు, పారిజాతకుసుమానీకంబు పైఁ జల్లద
ర్పకబాణంబుల కెల్ల నెల్ల యగుసౌభాగ్యంబు శోభిల్లఁగాన్. 118

మనుచరిత్రమునందు:—

మ. అకలంకాపధసత్త్వముం దెలియ మాయాద్వారకావంతికా
శికురుక్షేత్రగయాప్రయాగముల నే సేవింప కుద్దండగం
డకవేదండవరాహవాహరిపుఖడ్గవ్యాఘ్రి మిమ్మంచుకొం
డకు రాఁ జెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదు ల్గదా శ్రోత్రియుల్. (2-16) 119

తే. హలధరానుజ మయటి నిత్యమ్మటంచుఁ, బలుకువాక్యంబుచే వ్రయుపద్మము గ్రహ్మ
నప్పు డనునాసికంబై నిత్యముయి నిల్చు, నలినలోచను మేను చిన్మయ సువంగ. 120

ఇవి వ్యంజనాక్షరవిరతిభేదంబులు.

---

1 ఆదిత్యపురాణము (ప) ఇది సోమనిఉత్తరహరివంశములో ఉన్నది. ఇందు ధరోపాఖ్యానమందు కొందటిపద్యము.

ఇఁక నుభయయవళు లెట్టివనిన వివరించెద.

సీ. సర్వేశ యుష్మదస్మచ్ఛబ్దయతులును బరరూపవిరతులు ప్రాదియతులు
వెండి నిత్యసమాసవిశ్రాంతిదేశ్యనిత్యసమాసనిత్యాభిధానములును
రాగమసంధివిభాగనామాఖండపంచమీవికృతివిభక్తియతులు
కాకుస్వరప్లుతాక్షరయుగవిశ్రామములు నన నుభయాఖ్య వెలయువళులు
తే. క్రమత శబ్దానుశాసనప్రభృతిపూర్వ, కవిజనంబులకృతుల లక్ష్యములకలిమిఁ
బదియు రెండువిధంబులై పరఁగుచుండుఁ, దద్విధంబులు దెలియంగఁ దగుమునుండ.

యుష్మదస్మచ్ఛబ్దయతులు.

క. క్షితి నస్మద్యుష్మత్పద, యతు లనఁ గావ్యముల యుష్మదస్మచ్ఛబ్ద
ద్వితయమునకుఁ బైఁ బ్రాణము, లతికిన నుభయంబుఁ జెల్లు నభయవిహారా. 122

సాంబోపాఖ్యానమునందు.—

క. చతురాననందన ది, వ్యతపోధనవర్య యుష్మదాగమనమునఁ
గృతకృత్యుఁడ నైతిని నే, నతిపావన మయ్యె నస్మదన్వయ మెల్లన్. 123

అధర్వణాచార్యులవిరాటపర్వమునందు:—

ఆ. ధర్మతనయ యుష్మదాజ్ఞానిగళవిని,బద్ధ మగుచుఁ జిక్కువడియెఁ గాక
విజయమత్తగజము విడివడ్డచో నడ్డ, పాటు గలదె విష్టపత్రయమున. 124

ఆదిపర్వమునందు:—

క. ప్రస్తుతఫణిసత్రభయ, త్రస్తాత్ముల మైనయస్మదాదుల కెల్లన్
స్వస్తి యని పలుక నవసర, మస్తీకున కయ్యె నిప్పు డంబుజనేత్రా. (2-219) 125

2. పరరూపవిరతులు.

వ్యాకరణసూత్రము.—

సూ. అచోఽన్త్యాది టి.

వృ. అన్త్యాచ్ ప్రభృతిశబ్ద ష్టిసంజ్ఞ స్స్యాత్. శకంధ్వాదిషు (టేః) పరరూపం వాచ్యమ్. (వా)

శ్లో. శకంధు రథ కర్కంధూః కుద్దాలోఽల క్షపర్కటీ,
లాంగలీషా హలీషా చ మనీషా చ పతంజలిః.
కుత్కిలోష్ట్రోష్ఠ మంజీరమ స్త్వమ్కకులటాదయః,
తథా వృకంధుసీమన్తౌ శకంధ్వాదిగణే స్మృతాః.

శకానాం దేశానా మంధుః కూపః శకంధుః, శకంధు వనఁగాను, శకదేశమందలి బావిపేరు. కర్కస్యాంధూః కర్కంధూః. 'కర్కంధూర్బదరీకోలీ'త్యమరః. కర్కంధువనఁగాను రేఁగుచెట్టు. కం శిరః, ఉష్ణవీర్యత్వా దుద్దాలయతీతి కుద్దాలః; కుం భూమిముద్దాలయతీతి వా. దళ విశరణే ఉ దిత్యుపసర్గః. 'కుద్దాలో బహువారక' ఇత్యమరః. కుద్దాలమనఁగాను విరిగిచెట్టు. పాద మలతీ త్యలక్తః. అల భూషణే- 'యావో లక్తోద్రుమామయ' ఇత్యమరః. అలక్త మనఁగాను లత్తుక పేరు. పర్చ్యతే పరస్పరం స్పృజ్యత ఇతి పర్కటీ. పృచి సంసర్గే. 'ప్లక్షో జటీపర్కటీ స్యా'దిత్యమరః. పర్కటి యనఁగాను జువ్విచెట్టు. లాంగలస్యేషా లాంగలీషా, 'ఈషా లాంగలదండస్స్యా'దిత్యమరః. హలస్యేషా హాలీషా. ఈ రెండును ఏడికోలపేళ్లు. మనస ఈషా లాంగలదండవత్సంబద్ధా మనీషా. 'బుద్ధిర్మనీషా ధిషణే'త్యమరః. మనీష యనఁగా బుద్ధిపేరు. పతత్ అంజలిః పతంజలిః. పతంజలి యనఁగాను వ్యాకరణమునకు మహాభాష్యము చేసిన నాగముని పేరు. కో ర్వ్యాభమే రుత్కలః కుత్కలః. 'అగ కుత్కలజీమూత సానుమన్నగపర్వతా' ఇత్యమరః. కుత్కలమనఁగాను గట్టుపేరు. ఉష్ణస్య ఈషః, ఉష్ణీషః. ఉష్ణీష శ్శిరోవేష్టకిరీటయో రితి నానార్థే. ఉష్ణీష మనఁగా దల్లపాగ పేరు. మంజు రుచ్యం మీర యతీతి మంజీరః ఈర స్వనే. 'మంజీరో నూపురో స్త్రియా' మిత్యమరః. మంజీరమనఁగాఁ గాలిగజ్జె. మస్తం శిర ఇష్యంతి ప్రాప్నోతీతి మస్తిష్కం; ఇష గతౌ. 'తిలకం క్లోమమస్తిష్క' మిత్యమరః. మస్తిష్క మనఁగాఁ దలమెదడు పేరు. కులం విటకుల మటతీతి కులటా, అట గతౌ. 'అసతీ కులటేత్వరీ' త్యమరః. కులట యనఁగా లంజె పేరు. ఆదిశబ్దముచేత వేదండసారంగములు మొదలైనవి మఱి కొన్ని గలవు. వేదః సామవేదః అండః జననకారణం యస్యాసః వేదండః, సామోద్భవ ఇతి ప్రసిద్ధిః. 'సామజ స్సింధురోపి స' ఇత్యమరః. వేదండ మనఁగా నేనుఁగుపేరు. సారా ణ్యంగాని యస్య సః సారంగః. 'సారంగ శ్చాతకే భృంగే కురంగేచ మతంగజ' ఇత్యమరః. సారంగ మనఁగాను చాతకాదుల పేరు. వృకస్య అంధుః వృకంధుః వృకంధువనఁగాను వృకదేశమందున్న బావిపేరు. సీమ్నః అంతః సీమంతః. సీమంత మనఁగాఁ బాపటపేరు. ఇవి శకంధుశబ్దము మొదలుగాఁ గలవి గనకను శకంధ్వాదిగణ మనఁబడును.

క. విరతికి వ్యాకరణమునను, వరరుచిచేఁ జెప్పఁబడిన వాక్యమువలనన్
బరరూపము నిత్యం బై, పరఁగు శకంధ్వాదులకు నుభయమునుం జెల్లున్. 126

వేదండశబ్దమునకు నాదిపర్వమునందు.—

మత్తకోకిల. దండితాహితవీర నూరినిధాన దానవినోద కో
దండపార్థ పరాక్రమ ప్రియధామ దిక్పరిపూరితా

ఖండపాండుయశోనిధీ పరగండభైరవ శైరిభై
ద్దండదండవిదారిఘోరతర్జానిభాసిభుజార్గళా. (3-228) 127

భీష్మపర్వమునందు:-

ఉ. పాండునృపాలనందనులు పావని ముందుగఁ డాఁకనట్లు భీ
ష్ముండు గడంకమై నడుచుచోటికిఁ జక్కటిగాఁగఁ ద్రోచి యొం
డొండ గడంగి సేన తమయుబ్బున కుబ్బగ నన్యసైన్యవై
దండధముఖాంగము ల్తృణవితానముఁగాఁ గొని నిర్వికారులై. (1-234) 128

సారంగశబ్దమునకుఁ జంద్రికాపరిణయమునందు:-

ఉ. జంగమరోహణాద్రిసదృశంబులు తత్పురిఁ గల్గుభద్రసా
రంగవరేణ్యము ల్వయికి హస్తము లించుక సాఁచి యవ్వియ
ద్గాంగఝరంబు పీల్చి మఱి తద్వమధుప్రకరంబు దప్పి వా
యంగ నొసంగు రంగుగ నిజాఖ్య వహించినచాతకాళికిన్. 129

ద్రోణపర్వమునందు.-

ఉ. అంగద సాధుమిగిననృకావలి దన్వెసఁ జుట్టుకొన్న స
ర్వాంగములుం జలింప బెగ డందుచు దిక్కులు చూచుచున్న సా
రంగియ పోలె నుండెఁ గురురాజ భవత్సుతుసేన భీష్ము నా
జిం గబళించి పాండవులు జృంభితవిక్రమలీలఁ బొల్చుటన్. (1-17) 130

3. ప్రాదియతులు: ఉపసర్గలు.

శ్లో. ప్ర పరా ప్రతి ప ర్యత్య ధ్య భ్యవానూప సం స్వప,
ని వి ని ర్దు రుద ప్యాజిత్యుపసర్గా స్తు వింశతిః.

ప్ర, పర, ప్రతి, పరి, అతి, అధి, అభి, అవ, అను, ఉప, సమ్, సు, అప, ని, వి, నిర్, దుర్, ఉత్, అపి ఆఙ్, ఇవి యిరువదియును నుపసర్గలు.

వ. ప్రకారోపసర్గం బాది యగుటంజేసి ప్రాదు లనంబడును. 131

తే. ఆంధ్రమునకుఁ జేరనిపరాజవులు మూఁడు, గాక తక్కినయుపసర్గకములతలల
స్వరము లతికిన వాని కవ్వలను నిలుచు,న చ్చయిన హ ల్లయినఁ బ్రాదియతి యనంగ.

తే. అబ్జయోని రజోగుణ ప్రాప్తిఁ దనరుఁ, బద్మనాభుఁడు సాత్త్విక ప్రాప్తిఁ దనరు
రజతగిరిమందిరుఁడు, తమః ప్రాప్తిఁ దనరు, ననఁగ నిభ్భంగిఁ బ్రాదుల కమరుయతులు

ధ. కడమ యుపసర్గములకు అన్నిటికిని ఇటువలెనే రెండువు జెలు నని తెలిసికొనునది.

## 4. సమాసవిశ్రాంతులు.

తే. ఒక్కసమసనమున శబ్దయుగము గూడి పదము లేర్పాటుగాఁ గానఁబడని ప్రాణ
సంధులకు నిత్యసమసనశ్రాంతులును నఖండవిశ్రమములు నన రెండుఁ జెల్లు. . 135

క. లోకంబునఁ గర్ణాటవ, నౌకోద్వీపాంతరీపనాస్తిపదార్థా
నేకాశ్యన్యజనార్దన, నాకాదులు నిత్యసమసనము లండ్రు బుధుల్. 136

వ. ఆదిశబ్దముచేత మందారనారికేళశబ్దాదులు మఱియు ననేకములు గలవు. 137

కర్ణాటశబ్దమునకు రామాయణమునందు:—

శా. లాటీచందనచర్చ చోళమహిళాలావణ్యసామగ్రి క
ర్ణాటీగీతకళాసరస్వతి కళింగాంతఃపురీమల్లికా
వాటీమంజరి గౌళవామనయనావక్షోజహారాళి యై
పాటింపం దగు నీదుకీర్తి రఘునిపాలాగ్రణీ సాహిణీ. (కిష్కి. 826) 138

శ్రీనాథుని వీథినాటకమునందు:—

మ. కుసుమం బద్దినచీరకొంగు వొలయం గ్రొవ్వారు[1] పాలిండ్లపైఁ
ద్రిసరంబు ల్వ్రేలుపార వేణి యవటూదేశంబుపై రాయఁగాఁ
బస నెవ్వాఁడో యొకండు రాత్రి రతులం బల్గాసి గావించిన
న్వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనం గంటిరే. 139

వ. వనౌకశ్శబ్దమునకు వనే కౌనన్, ఓకః స్థాన మస్యేతివనౌకాః. 140

అథర్వణాచార్యులవిరాటపర్వమునందు:—

క. శ్రీకంఠుఁ డెదురునపుడు వృషాంకోధ్వజ మింద్రమకుట మర్జునతురగా
నీకము దివ్యశతాంగము, నాకప్పడి కబ్బియున్న నతఁ డే మగునో. 141

వ. దానియందె.

క. ఆకర్ణదురాలాపము, లాకర్ణింపఁగ నసహ్య మై ద్రోణునితో
నాకనదీసుతుఁ డనియె వృషాంకోధ్వజ మెఱుఁగ వచ్చునరుఁ జూపి తగన్. 142

ద్వీపశబ్దమునకుఁ గావ్యాలంకారచూడామణియందు:—

ఉ. ద్వీపులఁ ద్రుంచువిశ్వజగతీపతి యుత్తమశక్తిజాంబవ
ద్వీపమునందు గోవులకు నిమ్ముగఁ జేయుటయుం బ్రసన్నుఁ డై
గోపతిధేను వవ్విభునకుం దనవైభవ మిచ్చెఁ గాక యే
భూపతు లీవదాన్యగుణబుద్ధిఁ బ్రసిద్ధి వహించి రుర్వరన్. (7-65) 143

1 పాలిండ్ల.

నైషధమునందు:-

సీ. పా. వితతనవద్వ్యయద్వీపనానాజయశ్రీవధూటీసమాశ్లిష్టభుజుఁడు. (1-44) 144

వ. అంతరీపప్రతీపశబ్దములకును ఇటువలెనే. 145

నాస్తిపదమునకు శృంగారషష్ఠమునందు:—

సీ. గీ. తల్లియును దండ్రి దైవంబు తలఁప గురుఁడ
కాఁడె యితఁ డేమి చేసినఁ గనలఁదగునె
నాస్తికాధమ యోరి యన్యాయవృత్తి
"నాస్తి తత్త్వం గురోః పర" మ్మనఁగ వినవె. 146

విష్ణుచిత్తీయమునందు:—

శా. అనిష్ఠానిధిగేహసీమ నడురే యాలించిన న్శ్రోత్రియు న్సెం
తే నాగేంద్రశయానుపుణ్యకథలుం దివ్యప్రబంధానుసం
ధానధ్యానము "నాస్తి శాకబహుతా, నాస్త్యుష్ణతా, నాస్త్యపూ
పో, నాస్త్యోదనసౌష్ఠవం చ, కృపయా భోక్తవ్య" [1]మన్పల్కులుఁ. (1-84)

పదార్థశబ్దమునకు సాంబవిలాసమునందు:—

తే. హాలికి నెదు రేఁగి సకలపదార్థములు న్సమాయనము వెట్టి నిముద్దుపట్టితోడ
జాంబవంతునిచే హితు శౌరిపుత్రు, సాఁబు నొప్పించి బ్రతికించు సకలజనుల.

భాస్కరశతకమునందు:—

ఉ. దక్షత లేనియింటికిఁ బదార్థము వేల్కొకచోటనుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బలాయన మైచనుఁ గల్ల గాదు ప్ర
త్యక్షము వాగులు న్వఱద లన్నియు వచ్చిన నీరు నిల్చునే
యక్షయ మైనగండి వెగినట్టితటాకములోన భాస్కరా. 149

అనేకశబ్దమునకు విష్ణుచిత్తీయమునందు:—

క. తునియలు తొమ్మిది యఁట పదు, నెనమంద్రఁట మోచువా రనేకపకిటికూ
ర్మనగాహు లేటిలావరు, లనితాపకబాహు వొకటి యనని భరించెన్. (1-85)150

కాళహస్తిమాహాత్మ్యమునందు:—

ఉ. తాను గుమారజంగమసుధాకరమౌళియుఁ గూడి మాడి యిం
పైనరతిప్రసంగముల నర్థనిమీలితనేత్రపద్మముల్
[2]మానని చుంబనం బలర [3]మాటలుసొక్కులు వీడి వీడిపో
నినికవుంగిలింతలు ననేకవిలాసములుం జెలంగఁగాన్. (1-42) 151

1 మన్బల్కులున్ (ప). 2 మానిత (వా). 3 మాటలసోఖ్యలు (అచ్చు).

కర్ణపర్వమునందు:—

ఉ. మ్రొగ్గడువాహనంబులును మోములు ద్రెళ్లఁగ జారువాజులున్
డిగ్గి తొలంగుసైనికు లనేకులు గప్పుఁబాటు చొప్పడన్
¹మ్రగ్గసిడంబులుం గులను మాటికి నేటి ²యెదిర్చి యొంటిమై
మ్రగ్గడువారు నై కురుధరావరుసైన్యము రూపు మాయఁగాన్. (2-355) 152

ఆముక్తమాల్యదయందు:—

చ. మలిచి పయోజకోశములమాడ్కి నొనర్చినపద్మరాగపుం
గలశపుబొజ్జడాల్బొమిడికంబులతో నపరంజియోడుబి
ల్లల నలవై జయంతముఁ జలంబున గెల్వఁ దదంశితంబులై
నిలిచినభంగి మాడువు లనేకము లుల్లసిలుం బురంబునన్. (1-52) 153

వ. అనాది అనంత అనంగ అనూరుశబ్దములు మొదలైనవఞ్సమాసముల కన్నిటికిని
ఇటువలెనే రెండునుం జెప్ప వచ్చును. 154

అన్యోన్యశబ్దమునకు గావ్యాలంకారచూడామణియందు:

ఉ. ధన్యుఁడు విశ్వభూవిభుఁడు ధారుణి నేలఁగ భూజనంబు ల
న్యోన్యహితత్వసంపదల నొందిరి దంపతు లింపు నింప న
న్యోన్యసుఖానుకూలతల నోమిరి విప్రులు వేల్పుపిండు న
న్యోన్యసుపుష్టితుష్టికుశలాదుల నొందిరి నాఁడునాఁటికిన్. (7-68) 155

జనార్దనశబ్దమునకు:—

వ. జనా నర్దయతి సుఖయతీతి జనార్దనః. అర్ద గతౌ యాచనే చ. 'విష్వక్సేనో
జనార్దన' ఇత్యమరః.

సాంబవిలాసమునందు:—

చ. శరధిసుతాకళత్ర నవసారసనేత్ర బలాంతకాదిని
ర్జరనుతనామ పాతకవిరామ విహంగమయాన చారుక
ర్బురపరిధాన పాండవవిరోధివిభంజన నిర్మలాత్మ కా
యరుచిజితాభ్రఖంజన జనార్దన కైటభదైత్యమర్దనా. 156

ఆరణ్యపర్వమునందు:—

చ. నగినగియేనియు న్వినుజనార్దన యెన్నఁడు బొంకు వల్కఁ డు
త్యగణితవిక్రమోరుబలధైర్యసమగ్రుల మట్లుగాక కౌ
లగతి దొలంగఁ ద్రోవఁగఁ దలం బగునే యగుఁ గాక నీకు నెం
చ్చుగ నిదె పాణి మిచ్చెదము సుక్కము చావున కొత్త నేమియున్. (4-397)

1 మ్రొగ్గ...మాఁటికి (ప). 2 యదిర్చి.

వ. నాకశబ్దమునకు, న విద్యతే అకం దుఃఖ మత్రేతి నాకః. "స్వ రవ్యయం స్వర్గనాక త్రిదివత్రిదశాలయా" ఇత్యమరః.

గౌరకరాజుచాటుధారః:—

ఉ. ప్రాకటదర్పులై సకలరాయని అక్కన్నపాలు నాజిలో
డాకునవిరోధిసైన్యము ముదం బొదవ న్వరియింప నచ్చుచో
నాకస మెల్లఁ గ్రమ్మికొను నంచితదివ్యవిమానసంచర
న్నాకవిలాసినీచరణహంసకభూరిఝణంఝణధ్వనుల్. 158

విరాటపర్వమునందు:—

క. మును వెఱతు నేయ మీరలు, నను నేసినఁ గాని యనుడు నాకేశసుతుఁ
ధనురాచార్యుఁడు డెబ్బది, సునిశితబాణముల నేసెఁ జూపఱు వొగడన్. (5-124)

కావ్యాలంకారచూడామణియందు:—

క. నీకరవాలము పాల్లై, నాకంబున కేఁగి రాజి నారాయణ యా
భూకాంతు లెట్టిచునవో, నాకవిటోత్తములఁ దూల నడఁతురు కడిమిన్. (7-66)

వ. నఞ్ సమాసశబ్దము లెన్ని యున్నను అన్నిటికిని ఇటువలెనే అని తెలిసికొనునది.

విశ్వామిత్రశబ్దమునకు రంగనాథునిరామాయణమునందు:—

ద్వి. ఎక్కడా గురుఁడని యెఱుఁగనిసిక్క, నక్కటా గురుఁడు విశ్వామిత్రుఁడయ్యె. 161

రామాయణమునందు:—

మ. హరకోదండవిఖండనుండు జనకక్ష్మాధీశుజామాత భా
స్కరవంశాగ్రణి జానకీప్రియుఁడు విశ్వామిత్రయాగావితా
సురసంహారి విరాధకాలుఁడు ఖరాసుధ్వంసి మారీచసం
హరుఁ డన్యప్రమదాపరాఙ్ముఖుఁ డయోధ్యానాయకుం డాదటన్. (సుం. 263)

ఆపోశనశబ్దమునకుఁ జగన్నాథరామాయణమునందు:—

క. ఓశశిముఖి లోపాముద్రేశుఁడు కలశభవుఁ డుండు నిట నతఁడు తపో
రాశి మహాత్ముఁడు మును ప్రాపోశనముగఁ గొనియె సాగరాంబువు లెల్లన్. 163

శృంగారషష్ఠమునందు:—

సీ. గీ. తత్తరమున నాపోశన మెత్తఁ బోయి, భూసురుం డెత్తు నుత్తరాపోశనంబు. 164

స్వాంతశబ్దమునకు శృంగారనైషధమునందు:—

గీ. అధికశోపకషాయితస్వాంతుఁ డైన, నరపతికి విన్నవింపను నాయవస్థ
పైత్యదోషోదయంబునఁ [1]బరుస నైన, జిహ్వకును బంచదారయుఁ జేఁదు గాదె.
(2-82)

1 పగును.

విరాటపర్వమునందు:—

ఉ. స్వాంతము బాహుగర్వమున సంతమసాంధము గాఁగ శంక యొ
వంతయు లేక కీచకుఁ డహంకృతి మ్రుంగలినాగమంటపా
భ్యంతరసీమఁ జొచ్చి దరియం జని యారసి సెజ్జఁ గాంచి య
త్యంతముదావహం బగుడు నంప రయంబునఁ గేలు సోఁపఁగాఁ. (2-331) 166

ఏకాంతశబ్దమునకుఁ బారిజాతాపహరణమునందు:—

ఉ. అంతట నొక్కనాఁడు ధవళాంబుజనేత్రుఁడు వచ్చి రుక్మిణీ
కాంతగృహంబులోన శశికాంతశిలామయవేదిమీఁద నే
కాంతమునందుఁ గొందఱు మృగాయతనేత్రలు గొల్వ జూద మ
త్యంతవినోదకేళి మెయి నాడుచు నుండఁగ నద్భుతంబుగాఁ. (1-43) 167

ఆదిపర్వమునందు:—

సీ.గీ. కామసుఖసంగములకు నేకాంతగృహము, పాలిచిపాలిచియు ధర్మార్థములకునిదియ
యాస్పదంబన వర్గత్రయానురమ్య, జైనజనుల కెంతయునొప్పు నప్పురంబు. (8-74)

వ. సిద్ధాంత రాద్ధాంత లతాంత స్వాంత నిశాంతాదిశబ్దములు కన్నిటికిని ఇటువలెనే
రెండును నడచును. 169

వ. నారాయణశబ్దమునకు, నారాః ఆపః అయనం స్థాన మస్య నారాయణః. 'విష్ణు
ర్నారాయణః కృష్ణ' ఇత్యమరః.

ఆదిపర్వమునందు:—

ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు దాను ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁ డీకృతి కిష్టుఁడు న్సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగాఁ. (1-25) 170

వాతాయనశబ్దమునకుఁ జారుదేష్ణచరిత్రమునందు:—

గీ. అచ్చరలు నందనంబునఁ దెచ్చుకొనుసు, రాగసుమములు హర్మ్యవాతాయనముల
చెంతఁ గాలూఁది తత్పురస్త్రీలకొసఁగి, వేఁడికొనిపోవుదురు కప్రవీడియములు. 171

విరాటపర్వమునందు:—

సీ.పా. తరుణులుఁ బతులు వాతాయనమ్ముల నల్లసులయ వేఁబోకలమలయపవనము. (2-238)

ఉపాయనశబ్దమునకు సుదక్షిణాపరిణయమునందు:—

చ. సలఁ బడి యున్న జక్కవకవం బురుణింపుచు సన్నపైటలో
పల బిగిగుబ్బదోయి కనుపండువు సేయఁగ మోడ్పుఁజేతు లొ

దలను ఘటించి (మొ) క్కిడి పదంపడి మెల్లన డాయఁ బోయి తో
య్యాలి విరిబంతి దోయిట నుపాయన మాయన కిచ్చి యిట్లనున్. 173

అష్టమహిషీకల్యాణమునందు:—

ద్వి. ఇంతులమేల్బంతియిడినసేవంతి, బంతి చేదోయి నుపాయన మిచ్చి. 174

రసాయనశబ్దమునకు వసంతునిఛందమునందు:—

ఆ. నాస్తి యనక మహి వసంతసంపదలు న్నారాయణుం డొసంగు రమ్య మగుర
సాయనంబు బుధుల కతఁ డన నిత్యస్వమాసయుతులు రెంటి నంటియుండు. (1-21)

జైమినిభారతమునందు:

సీ. గీ. మట్టిమాత్రంబె పిల్లలమట్టిపేరు, పేరువలెఁగాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరువాక్యసరణి, సరసులకు నెల్లఁ గర్ణరసాయనంబు. (1-22)176

రామాయణశబ్దమునకు రాఘవపాండవీయమునందు:—

ఉ. ఏయెడ నర్థగౌరవసమృద్ధియు శబ్దవిశుద్ధియుం [1]దిరం
బై యనవద్యతం బరఁగ నంధ్రవచస్స్థితి భారతంబు రా
మాయణమున్ రచించినమహాత్ముల నాత్మఁ దలంచెద న్జగ
ద్గేయుల నన్నపార్యునిని [2]దిక్కన నెఱ్ఱన భాస్కరాఖ్యునిన్. (1-4) 177

జైమినిభారతమునందు:—

తే. మానిజల్పిత మైనరామాయణంబు, స్వరలయగ్రామమూర్ఛనాసరణు లెఱిఁగి
గానశక్తుల మెఱసి సాక్షాత్కరింపఁ, బాడిరాలాపములఁ బ్రసక్తములు మట్ట. (8-96)

వ. పరాయణ, పలాయన, బాదరాయణ, సాంఖ్యాయన, శాకటాయన, కాత్యాయన, వాత్స్యాయన, బోధాయన, దక్షిణోత్తరాయణాదిశబ్దములకును ఇటువలెనే [3]గ్రం
థము గలవు. 179

మార్తాండశబ్దమునకు శృంగారషష్ఠమునందు:—

సీ. గీ. వల్లవను భయంబు వారెంతవార లైన, నట్టివారలు మన కగ్గ మైనవారు
వారు నిరయంబునకుఁ గాఁపు వచ్చువార, లనుచు బుద్ధిగఁ జెప్పె మార్తాండసుతుఁడు.

ద్రోణపర్వమునందు:—

మ. ధరణీచక్రము ద్రిద్దిరం దిరిగె మార్తాండుండు కుంఠీభవ
త్కిరణుం డయ్యె దిశావితానము వడంకె [3]న్మిన్ను దర్పైన్ మహీ

1 దృఢంబై (ప). 2 దిక్కసుధీమణి నెఱ్ఱసత్కవిన్ (అచ్చుప్రతి). 3 మిన్నె
దిర్చెన్ (వా); మిన్ను (మో) సెన్ (ప).

ధరసంతానము లోన గ్రక్కదలె [1]నుద్భ్రాంతంబు లై యంబుధుల్
పొరలె న్గట్టులమీఁద బెట్టుపిడుగుల్ [2]మోసె న్నితాంతధ్వనిన్. (5-877) 181

వ. బ్రహ్మాండాదిశబ్దములకును ఇటువలెనే అచ్చును హల్లును జెప్పఁదగును. 182

ఉపసర్గసంధికిఁ జంద్రికాపరిణయమునందు:—

ఉ. అంతట రుక్మబాహువసుధాధిపనందన యొక్కనాఁడు శు
ద్ధాంతగృహంబు వెల్వడి విహారరతిం జనుదెంచె నెచ్చెలుల్
చెంతలఁ గొల్వ గుంజదళిశింజితరంజితకుంజమంజుల
ప్రాంతగళత్ఫలాసవరతాంగజఘోటికిఁ బుష్పవాటికిన్ 183

కవిజనాశ్రయమునందు:—

ఉ. మానుగ విశ్రమాక్షరసమంచిత మై స్వర మాఁదినం దదీ
యానుగుణాక్షరంబ కొని యైనను జెప్పఁగ నొప్పు నిక్క్రియన్
భానుసహస్రభాసి వృషభాధిపుఁ డన్నటు లర్థయుక్త మై
పూనినచో నఖండపడి పొల్పగు నాదికవిప్రణీత మై. (సం.66) 184

వ. ద్వారశబ్దమునకు, ద్వే అరే పార్శ్వే యస్య తత్ ద్వారమ్. 'పృషోదరాదీని యథోపదిష్ట' మితిసూత్రేణ ద్విశబ్దాంతస్య ఇకారలోపః అకారాదేశః.

ఉ. వారక వారకామినులవర్తులచారుకుచోపగూహముల్
గోరక కోరకోల్లసితకుంజములం జిగురాకుపానుపుల్
చేరక చేరకేరళకళింగకుళింగనరేంద్రమందిర
ద్వారవిహారులై సిరుల నందక నందకపాణిఁ గొల్వరో. 185

హల్లులకు నిర్వచనోత్తరరామాయణమునందు,—

ఉ. వారలు వారిపూరిపరివారముతోన విమాన మెక్కి రాఁ
గా రఘునందనుం డరిగి కాంచనతోరణచిత్రమైన త
ద్వారనికాయ మైననిజపట్టణ ముత్సుకవృత్తిఁ జొచ్చె నిఁ
డాయమనంబున న్భరతునాకృతి బాలిశవృత్తిఁ గ్రాలఁగాన్. (1-84) 186

## క్యజ్ప్రత్యయాంతములు.

వ. కుమారవదాచరితా శక్తిః కుమారాయితశక్తిః కుమారాయితయా శక్త్యా శాలత ఇతి కుమారాయితశక్తిశాలీ. కుమారసమానపరాక్రమద్యోతవా నిత్యర్థః.

1 నుత్క్రాంతంబులై (ముద్దరాజు రామన్న కవిసంజీవని). 2 మ్రోసె న్మహోగ్రతన్; మఱికొన్ని పాఠభేదములును గలవు.

ఆదిపర్వమునందు.—

ఉ. అయము గర్వము న్విడిచి యన్యపతు ల్పని సేయ నిట్లు గాం
గేయభుజాశ్రయంబున నికృత్తవిరోధిసమాజుఁ డై కుమా
ర్ప్రాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె న
త్యాయతకీర్తితోఁ దనకు హస్తిపురంబది రాజధానిగాఁ. (5-6) 187

వ. భద్రవ దాచరితా మూర్తి ర్యస్య తత్ భద్రాయితమూర్తిః శోభనమూర్తిమ దితి
యావత్, అయ మపి క్యజ్ ప్రత్యయాన్తః.

విరాటపర్వమునందు:—

ఉ. శ్రీ యన గౌరి నాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తి యై హరిహరం బగురూపము దాల్చి "విష్ణురూ
పాయ నమ శ్శివాయ" యని పల్కెడుభక్తజనంబు కైదిక
ధ్యాయిత నిష్ఠఁ బొల్చుపరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్. (1-1) 188

వ. ఈరెండుపద్యములయందును నన్నయ తిక్కనగార్లు కుమారభద్రశబ్దములు క్యజ్
ప్రత్యయాంతములు చేసి సంయుక్తవిశ్రామంబులుగాను బ్రయోగించిరి. అది గనుక
గొందఱా రెండుశబ్దములమీఁదను, అకారము లున్నవి నిత్యసమాసవిశ్రాంతు లని
భ్రమయుదురు. శబ్దసూత్రమువలన వానికే దీర్ఘములు వచ్చినవి గాని అందులో
పల అత్తులు లేవు. 189

## ౯. దేశ్యనిత్యసమాసవిశ్రాంతులు.

తే. శబ్దశాసనముఖకవీశ్వరకృతప్రబంధములలక్ష్యములఁ గనుపట్టుకతన
దేశ్యనిత్యసమాససంధికిఁ బొసంగు, వడి స్వరం బైన వ్యంజనవర్ణ మైన. 190

క. రూపఱఁ బెంపఱఁ బెల్లఱ, రేపఱచుట గ్రిక్కిఱియుట నిలఁ గ్రచ్చఱయుం
జూపటి యుక్కఱి మొదలుగ, జూపతి యివి దేశ్యనిత్యసమసనపదముల్. 191

వ. కొందఱు వీనిపేరే దేశ్యాఖండములును అందురు. 192

అనంతునిఛందమునందు:—(పేజీ. 81)

తే. అఱి యనంగను బోవుట కర్థ మెన, సంధి నిత్యసమాసోక్తి జరుగు రెంట
నసురవిభుల నెల్ల నుక్కఱ వధంచ, భానుకులుఁడు రావణుని నేపఱచె నన౯

ఆరణ్యపర్వమునందు:—(౩-౩45)

క. ఎఱకలు గలపుల శైలము, [1] తెఱఁగున నై ంయుము ఎఱయ దివిక నెగసె బి

[1] ఱఱఁగు ఎఱయ నింల విఱఁడు.

ట్టఁబులు మజలధరము క్రియ న్సుకర్కొఱఁ దద్వన మెల్ల నద్రువ నార్చుచుఁ గడిమిన్.

యుద్ధకాండమునందు:-

చ. ఎఱిఁగియెఱింగి మున్నతఁడె యెగ్గొనరించినదానికై కదా
చెఱఁ గొని వచ్చితిం బిదప సీత వృథాకథ లింక నేల పెం
పఱ బ్రతు కింత తీయనె ఖరాదులచావున కేమి చింత నీ
మఱఁదలిబన్న మేపగిది మానిని యీఁగుదు సంధిఁ జేసినన్. (784) 195

వశిష్ఠరామాయణమునందు:-

ఉత్సాహ. మఱియుఁ బెక్కుయోనులందు మహితచిత్రగతులఁ బెం
పఱ జనించి దుఃఖభాజి యై చరించి వెండియున్
వఱలువిత్రవరునియింట వాసుదేవుఁ డనఁగఁ దా
నెఱుక గలిగి పుట్టె వేల్పుటేటితీరభూములన్. 196

విరాటపర్వమునందు:—

చ. చిఱునగ వొప్ప గాండివము చెచ్చెర సజ్యముఁ జేసి సేన లు
క్కఱ రభసంబుమై నడరఁ గప్పడి ద్రోణియు నీడువోక య
త్తఱిఁ దఱుమంగ నస్త్రములు దందడి దార్కొని మండుచుండెఁ జి
చ్చఱపిడుగు ల్వడిం దొరఁగుచాడ్పున నంబరవీథి నుగ్రమై. (5-148) 197

లక్షణసారసంగ్రహమునందు:—

తే. అచ్చుహల్లును దేశీయమనియెడి వఱ్ఱయొన్నవొక్కొక్కచోట గ్రిక్కిఱియెఁ గృతుల
సరసలక్షణకవులు గ్రచ్చరనొనర్ప, భంజితాసురసముదాయ యాంజనేయ. 198

నిర్వచనోత్తరరామాయణమునందు:—

చ. ఎఱుఁగవు గాక భోగముల కెల్లను నెచ్చెలి జవ్వనంబు ని
త్తఱి నడివోవ కుండ నుచితంబుగ జక్కవదోయిఁ బోలి క్రి
క్కిఱిసినచన్నుఁగవ యిం పెసలారఁగ నాదుచిత్తము
న్వఱలుసరోవరంబున నవారణకేళి యొనర్పు కోమలీ. (5-14) 199

అరణ్యపర్వమునందు:—

చ. ఎఱిఁగితి నిన్ను నేను విబుధేంద్రుఁడ వీవు జగత్త్రయంబు గ్ర
చ్చఱ భవదీయరక్షణమునంద వెలుంగుచునుండు నట్టిని
న్నెఱుపుగ నేను వేఁడుకొన నుత్తుఁడఁ గాక మొఱంగి నన్ను న
క్కఱపడి నీవు వేఁడు టిది కర్జమె నిర్జరభర్త చెప్పుమా. (7-367) 200

ఉద్యోగపర్వమునందు:—

చ. తజి యగునంతవు న్రిపునదగ్రత సై చుట నీతి నీవు నా
కలపినయట్లు సేయుము తగం జని యాతనిఁ గాంచి [1]నన్ను నె
త్తెఱఁగున నైనఁ బొందఁగ మదిం గలదేనియు నింత యేల క్ర
చ్చఱ మునివర్గవాహనుఁడనై చను చెమ్మను మంతఁ దీఱెడుఁగా. (1-176) 201

ఉ. నన్నయముఖ్యసత్కవిజనంబులకావ్యములందు లేఖకుల్
గొన్నియుఁ బాఠకాధములు గొన్నియుఁ బోకడఁ బెట్టి తక్కువై
యున్నెడఁ గాంచి జానపదు లోడక దిద్దినతప్పు త్రోవ లె
ల్లన్నిజ మంచుఁ గైకొనిన లక్షణవేత్తలు సమ్మతింతురే. 202

వ. అది యెట్లనిన సులక్షణసారంబునందు లింగముగుంటతిమ్మన వ్రాసినయప్రశస్తంబు
లగులక్ష్యంబులకు నాశ్చర్యంబు నొంది బహుపుస్తకంబులు నిరీక్షించి వానినెల్లను
బ్రక్షిప్తంబులుగా నెఱింగినవాఁడనై లక్షణవంతంబు లగుపురాతనకవిప్రోక్తం
బులు వివరించెద. 203

ఆదిపర్వమునందు:

క. నావచనమున నపత్యము, గావించును నిను గొంతి కడు నెయ్యమునన్
నీవగచినయాయర్థము, నూనె మనంబునఁ దలంతు సుందరి యెప్పుడున్. (5-135)

ఉద్యో॥

క. తమతె ... క్తిఁ జేసి సజ్జనసుతమా
రము: ... ప్రకొడుకుల టరయఁ జనున్. (2-74) 205

అను॥

క. అతిథి ... పడక యోలమాస పడక నీ
వతనికిఁ బ్రియంబు సలుపుము, సతికిం బతిపనుపు సేయఁ జను నెల్లవియున్. (1-68)

రామాయణమునందు:—

ఉ. అన్నవు తండ్రియట్ల విను మంతియ కాదటమీఁద రాజ వే
మన్నఁ గొఱంత లేదు మణిహారము లాదిగఁ బెక్కుకానుక
లున్నగ సీత నిచ్చి జనలోకపతిం గని మమ్ముఁ బ్రోవు మీ
సన్నపుకార్యము ల్వలదు సంధియ మే లటు గాక తక్కినన్. (యు. 142) 207

1 నిను. (పా. ప).

మఱియు, దానియందే:—

ఉ. ఓకపివీరులార సుగుణోదధి నీరఘురాము సర్వలో
కైకశరణ్యునిం గొలువ నిప్పుడు వచ్చితి నొండు గాదు నా
రాక మహాపరాధి యగురావణుతమ్ముడ నే విభీషణా
ఖ్యాకుఁడ మీరు నాసచివు లర్కకులాగ్రణితోడఁ జెప్పరే. (యు.165) 208

దేవకీనందనశతకమునందు:—

మ. చతురంభోధిపరీతభూవలయరాజన్యాలికోటీరరం
జితమాణిక్యవిరాజితచ్చరణరాజీవుండు ధర్మాత్మజుం
డతికార్పణ్యముతోడ మత్స్యపతిఁ డా నాసింపఁడే [1]నీదుకా
శ్యతకారుణ్యము గల్గునంతకును గృష్ణా దేవకీనందనా. 209

ఆరణ్యపర్వమునందు.—

చ. ఉరమున రెండు గన్నులు పృథూదరదేశమునందు నోరు ప్ర
స్ఫురితభుజద్వయంబును సముజ్జ్వలదున్నతభావముం గరం
బరుదుగ నుగ్రమైనవికృతాకృతితోడ నశేషసత్త్వసం
హారుఁ డగుచున్నవాని దివిజారిఁ గబంధుని గాంచి రచ్చటన్. (3-357) 210

ఉద్యోగపర్వమునందు.—

చ. అని మది నిశ్చయించి తగ నందఱఁ బిల్వఁగఁ బంచి వారితో
ననిచినమాటలాడి వినయంబునఁ బ్రార్థన చేసి మీరు మా
కొనరిన సైన్యము ల్పదునొకొంటికిఁ బ్రాభవ మాచరింపఁ జొ
చ్చిన సకలంబు నొప్పు నభిషేకముఁ గైకొనుఁ డుత్సవంబునన్. (4-140) 211

వ. దీనిమూఁడవపాదంబునందు "పదునొకొంటికి" నని యున్నచోట సంధి గూర్చి స్వరప్రధానవడిగాను సోమయాజులు ప్రయోగించినారు. ఇది తెలియక కొందఱు మూఢులు దేశ్యనిత్యసమాసవడి యని యనుకొందురు. 212

## 6. నిత్యయతులు.

క. ఏని యను నాంధ్రశబ్దము,తో నతికినపూర్వపదము తుదివ్రాయికి న
చ్చైనను వ్యంజనవర్ణం, బైన రచింపుదురు నిత్యయతు లనుచుఁ గవుల్ 213

శేషధర్మములయందు

క. పెట్టఁడు నారకమార్గం, బెట్టిమహాఘోరకర్ముఁ డేనియుఁ దుద ని
ట్టట్టనక నెమ్మనంబున, నెట్టన హరి తలఁపు గలిగెనేని మహాత్మా. 214

1 తావకాయత (ప).

## 7. రాగమసంధివళులు.

తే. ఆ లనుపదంబు మొదలను రాగమంబు, వచ్చుసంధికి నుభయంబు వళికిఁ జెల్లు
నతివ జవరాలు బాలింతరాలు ముద్దరాలు ధర్మాత్మురా లన రాత్మసారి. 215

మనుచరిత్రమునందు:—

ఉ. ఇంతలు కన్ను లుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్నజవరాండ్ర నెపం బిడి పల్కరించుటల్
గింతియె కాక నీ వెఱుఁగవే మును వచ్చినత్రోవ చొప్పు నీ
కింత భయంబు లే కడుగ నెల్లిద మైతిమె మాట లేటికిన్. (2-41) 216

చారుధేష్ణచరిత్రమునందు:—

క. ఈలలన వేలుపుంజవరాలో యచ్చరయొ కిన్నరవధూమణియో
వ్యాళాంగనయో కా కీ, భూలోకస్త్రీల కిట్టిపొంకము గలదే. 217

## 8. విభాగవళులు.

క. తులసీభూషణ సూక్ష్మయుఁ, దెలుఁగునఁ బరిమాణసంజ్ఞ దేటపఱచుప
ట్టుల నేసి యనుపదమునకు, నలరు విభాగవడి యనఁగ నచ్చును వాల్లున్. 218

కాశీఖండమునందు:—(2-104)

తే. అప్పటికి నియ్యకొంటిఁ గా కంబుజాక్షి, ఋషులపాలిటివే యింతలేసిపనులు
కొతుక కాఁబోతు నాఁబోతుఁగుమ్ములాడ, నడిమియాఁబెయ్య దెస వచ్చె నాకుఁజూడ.

కావ్యచింతామణియందు:—

ఆ. కృష్ణుఁ డిచ్చు నాలుగేసిచీరలు కూర్మి, నింతులకును నాలుగేసిమణులు
శ్రీవితోడ దోసెడేసిమాడలు కడు, నింపెసంగ గంపెడేసిసొమ్ము. 220

## 9. నామాఖండవిశ్రమములు.

ఆ. అప్ప అయ్య అన్న [1]అర సవ్వ అమ్మక్క, ఆయి యనుపదంబు లదుకుసంధు
లుభయమునకుఁ జెల్లుచుండు నామాఖండ, వళు లనంగ నూఁదఁబడక యైన. 221

అప్ప యనుటకు నందితిమ్మన చాటుధార:—

క. ఇప్పటిదాతల సరిగాఁ, జెప్పకురా భట్టుకర్ణశిబిఖేచరులన్
జెప్పుము మూర్తిఘనుని వెం, కప్పను దానమున నిర్భయంబున సభలన్. 222

---

1 అరుసు (వా).

హాలికి - భాస్కరునిచాటుధార:—

క. అప్పు లిడునతఁడు ఘనుఁడా, యప్పు డొసఁగి మరలఁ జెందునాతఁడు రాజా
చెప్పగ వలె సాహిణిమా,రప్పను దానమున ఘనుఁడు రాజా నటంచున్. 223

అన్న అనుటకు పొట్లూరిగోపన:—

క. అన్నలుఁడు రూపమున సిరి, యన్న కళాయుక్తి భరతునన్న కరుణచే
నన్న సముద్రపుపెదచిన్నన్నకుమారుండు వెంగళామాత్యుఁ డిలన్. 224

తెనాలి రామలింగము:—

క. చిన్నన్న ద్విపద కెఱుఁగును, బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెఱుఁగు
న్మిన్నంది మొరసె నరసిం, గన్న కవిత్వంబు పద్యగద్యశ్రేణిన్ 225

తేలఁబలుకుటకు విక్రమార్కచరిత్రమునందు:—

చ. అనఘుఁడు సింగనార్యునకు నబ్బయ గోపయమంత్రి చిక్కనా
రనయును గల్గి రాత్మజులు రాములు మువ్వురు దోఁచినట్లు పెం
పున వెలయంగ నబ్బయకుఁ బుత్రులు పుట్టిరి రామరాజుఁ గే
సనయును బాచిరాజు గుణసంగుఁడు లింగనయుం గ్రమంబునన్. 226

అయ్య అనుటకు.

కాశీఖండమునందు:—

సీ. గీ. నైషధాదిమహాప్రబంధములు పెక్కు, చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ
యపుడు సెప్పఁదొడంగిన యీప్రబంధ, మంకితము సేయు వీరభద్రయ్యపేర. 227
(1-13)

ఊఁదఁబడక ఉన్నందునకు నవంతునిఘంటువునందు:—

తే. ఒరుల నప్పయ్య యనుచోట నూఁదఁబడక
ద్వివిధ మగుఁ బ్రభునామాంతవిరమణంబు
మహి నయోధ్యకు రాజు రామయ యనంగ
నతని[1]పట్టంపుదేవి సీతమ యనంగ. (1-120) 228

రుక్మాంగదచరిత్రమునందు:

ద్వి. శ్రీకరగుణసాంద్ర చిరయశోరంద్ర
ఆకారచంద్ర రామయభాస్కరేంద్ర. 229

1 పట్టంపు (వా).

అగసు అనుటకు ఆంధ్రకవితాపితామహుఁడు:—

క. చేపట్టిన ధుర్వు లగుదురు, కోపించిన రంభఁ గూడుకొందురు జగతిన్
స్థాపింపఁ బోడవఁ జాలని, యాపందలు సాల్వకోన మగసున కెనయే. 230

పలకలూరిగోపన:—

ఆ. గోలకొండమలక గోవుల భక్షించుఁ, గొండవీటివిప్రకులము నెల్ల
బాచమరసు చేరి భక్షించుచున్నాఁడు, మలక మేలొ బాచమరసు మేలొ. 231

అప్ప అనుటకు.—

... ... ... ...

అమ్మయనుటకు ఈవని పెద్దిరాజు రామరాజు చాటుధార:—

క. ఇమ్మహిలో మహనీయగుణమ్ముల నీపాటి గలరె నానావిధదే
శమ్ముల శ్రీరాముని సీతమ్మా మాయమ్మ నిత్యహర్షము లిమ్మా. 232

క. ఇమ్మా మదభీష్టంబులు, కొమ్మా మామ్రొక్కు లెల్ల సుమమతితో మా
యమ్మా రఘునందనుసీతమ్మా సౌభాగ్యసిద్ధిదాయిని నమ్మా. 233

అక్క యనుటకుఁ జాటుధార:—

క. ఇక్కలియుగశక్తులలో, లెక్కింపను భట్టుశంక లేక ధరిత్రిన్
మిక్కిలి మల్లేశునియం,బక్కకు సరివేల్పు గలదె యవనిస్థలిలోన్. 234

క. చొక్కపు శ్రీగిరినిలయుని, మక్కువ మదిలో నెఱింగి మనుజులఁ బ్రోవన్
దిక్కయి నిల్చినమాయం,బక్కకు సరిగలదె సకలభాగ్యస్ఫురణన్. 235

ఆయి యనుటకు రాచపూడి వెంకటయ్య చాటుధార:—

క. వ్యాయామజనితమాయో, పాయసమస్తాఘములు నివారణ మగు దు
ష్కాయంబు పూత మగు గం,గాయిని బొడగన్నఁ దాన మాడినమాత్రన్. 236

వణుకూరిగుర్వరాజు శమంతకమణిచరిత్రమునందు:—

ఉ. కాయవచోమనఃస్థలనకల్పితదోషము లెల్లఁ బాయఁగా
నాయెదలోన నిత్యము సనాతనధర్మముఁ బూని యర్మిలిన్
బాయక కొల్తు రామనరపాలనిరంతరసౌఖ్యదాయి సీ
తాయి సమస్తశోభనవిధాయి [1]మహత్ఫలసిద్ధిదాయిఁగన్. 237

1 మహాఫలసిద్ధి అనియుండవలెను. లేకున్న 'మహతాం ఫలసిద్ధిః' అని షష్ఠీ సమాసము చేసికొనినయెడఁ దృప్తిఁజెందనగును.

## 10. పంచమీవిభక్తివిరామము.

ఆ. తత్సమంబుఁ జేయుతఱిని బంచమి కన్న, నంటె ననువిభక్తు లనుసంధి
మెలఁగుఁ గృతులఁ బంచమీవిభక్తివిరామ, మనఁగ నచ్చునకును హల్లునకును. 238

చమత్కారరామాయణమునందు:—

క. నిన్నుఁ జెఱఁ గొన్న హైహయు, కన్నన్ దోర్వీర్య మెక్కుడగుభార్గవు లీ
ల న్నిర్జించినరాముని, కన్నను శూరుండు మూఁడుజగంబులఁ గలఁడే. 239

ఆదిపర్వమునందు:—

చ. వితతమఖప్రయోగవిధివిత్తము లుత్తమధీయుతు ల్జగ
న్నుతసుమహాతపోధను లనుగ్రహనిగ్రహశక్తియుక్త శ్రీ
క్రతువున ఋత్విజుల్ కమలగర్భసమానులు పూర్వదిక్పతి
క్రతువున యాజకోత్తములకంటెఁ బ్రసిద్ధులు సర్వవిద్యలన్.(2-227) 240

## 11. కాకుస్వరవళులు.

క. పలుకులతలఁ గలవ్రాలకు, వల నగుచోఁ బ్లుతము నిలిపి వానికి రెండున్
వళులుగఁ జెప్పినఁ గావ్యం,బుల నది కాకుస్వరంబుఁ బ్లుతవళియు నగున్ 241

ఆ. ఏకమాత్ర హ్రస్వ మినుమడించిన దీర్ఘ, మయ్యె మూఁడుమాత్ర లయినఁ బ్లుతము
భీతశోకతర్కగీతదూరాహ్వాన, సంశయార్థములను జరుగుఁ బ్లుతము. 242

భీతిప్లుతమునకు భాస్కరునిరామాయణమునందు:—

ఉ. ఏ జనకాత్మజ న్దశరథేశ్వరుకోడల రాముభార్యఁ బం
క్తోజనులార యడ్డపడరో సురలార సురారి కంచు వం
భోజదళాక్షి శైలవనభూములు దాఁటుచు భీతి నేఁగుచో
నీజలరాశిఁ జూచి మది నెంత దలంకెనొ యేమి సేయుదున్. (యు.41) 243

మనుచరిత్రమునందు:—

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించె దోట లే
కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ దప్పితిం
ద్రొవ్వన నిన్న గాగ్రమునకుం జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ జెప్పఁ గదవే తెరు వేది శుభంబు నీ కగున్. 244

శోకప్లుతమునకు రామాయణమునందు:—

శా. అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధి నే నజ్ఞాననై పల్కితి
వ న్నా పాపము వచ్చి ముట్టుకొనియె న్నా పాలిదె వంబ వె

యున్నచుం బరిమార్ప వేగఁ బఱతేవే నన్ను రక్షింపు మీ
యన్నం గ్రక్కునఁ జీరవే యరుగవే యత్యుగ్రశీఘ్రంబునన్. (అర. 2-111)

తర్కప్లుతమునకు హరిశ్చంద్రోపాఖ్యానమునందు.—

శా. ఓరీ రాజకులాధమా నృపులు లేరో వేఁట రారో మద
క్రూరాభీలమృగావళిం దునుమరో ఘోరాటవుల్లేవొ నా
యారామంబు గలంచి జంతుతతి మాయం జేసి యస్మత్కుమా
రీరత్నంబులు వేఁడ వచ్చినను వారి న్నొంచినా వేమిరా. (2-147) 246

శాంతిపర్వమునందు.—

మ. అనుమానింపక తోడఁబుట్టులనె కాదా తున్మి తూఁటాడె నెం
దునుఁ గ్రొన్నెత్తురు లేలు లై పఱవ నింద్రుం డుగ్రతన్ దైత్యులన్
మును లవ్వీరు భజింపరో క్రతువు లామోదంబుతో నమ్మహా
త్మునిఁ జేయింపరొ యూర్ధ్వలోక మది కాదో నాక మూహింపుమా. (1-287)

రంగనాథునిరామాయణమునందు.—

ద్వి. అట్టినామీఁద నీవా యలిగెదవు, పట్టి చెట్టలు వాపి పాలైతి చెదను. 248

అనుశాసనికపర్వమునందు.—

ఉ. ఆనరనాయకుం డొకమహాధ్వర మెంతయు వేడ్కఁ జేయఁగాఁ
బూని మహీసురావలికిఁ బూజ యొనర్పఁగఁ దాను బ్రాహ్మణుం
డై నయ మారఁగా ననలుఁ డాతనిపాలికి వచ్చి నాకు నీ
వే నృప నీదుపుత్త్రిఁ గృప యేర్పడ దానముగాఁగ నావుడున్. (1-58) 249

దూరాహ్వానప్లుతము:—

తే. ఆదితేయార్చితాంఘ్రిపద్మా యనంగ, ద్వారకాపురమధ్యపద్మా యనంగ
నసురకులవైరివీరులారా యనంగ, రసికచిత్తాబ్జవాసులారా యనంగ. 250

కళాపూర్ణోదయమునందు:—

మ. అకటా యే మని దూరుదాన నిను నాథా వేగుజా మయ్యెఁ బొం
దికగాఁ బాదము లొత్తి రమ్మనుట గాన్ని యొంటి యేమో కదా
నికటస్థ్సోణికిఁ జేర రమ్మనుట గాన్ని కొంత నెయ్యంపుపూ
నికతోఁ గన్నుల విచ్చి చూచుటయ కాని లే దొకింతేనియున్. (4-112) 251

సంశయప్లుతము:—

ఆ. హరి యనంగ నాతఁడా నిన్నుఁ గంసు నడంచెఁ గృష్ణుఁ డీతఁడా యశోద
సంతభాగ్యమబ్బెనే బోటి నాబోటి. నెలఁత కటు గలుగునే తలంప. 252

రామాభ్యుదయమునందు:—

సుగంధి. అంగనాలలామః గానవా లతాకుడుంగమా
తంగమా భుజంగమా పతంగమా కురంగమా
లుంగమా లవంగమాతులుంగమాధవీనట
ద్భృంగమా వసీరమా కరీరమా సమీరమా. (5-239) 253

విజయసేనమునందు:—

ఉ. వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిదెసం దగు లూఁది యిమ్మెయిన్
దల్లడ మంద దేల యుచితస్థితికి న్ననుఁ బాపఁ జూపినన్
దల్లియు బంధులోకమును దండ్రియు నే మనువా రెఱింగి రే
నల్లమ యిట్లు నీకుఁ దగునో తగదో పరికించి చూడుమా. 254

రామాయణమునందు:—

క. జనకజను సుమిత్రా నందనునకుఁ బ్రణమిల్లి సముచితస్థితి దర్శ
నమున నుండఁగ రఘుపతి, యనుజన్ముని జూచి సేమమా [1]జనపతికిన్. (అ:258)

12. ప్లుతయుగవిశ్రామములు.

క. తా మేవర్ణము లైనను, క్ష్మామండలమునను బ్రాణమైత్రి గలిగినన్
దా వాదర ప్లుతయుగవి, శ్రామము లనఁగాఁ బ్లుతాక్షరద్వయ మమరున్. 256

వజ్రపంజరశతకమునందు:—

ఉ. శ్రీగజగామినీమణిని సీతనుగా నిరపాయిఁగాఁ ద్రిలో
కీగృహమేధిఁగా గరుడకేతనుఁగా భవరోగవైద్యుఁగా
నాగురువాన నిన్నె మది నమ్మితి వేయ్యొకవేల్పుఁ గొల్వ నీ
వే గతి కావవే రఘుపతీ శరణాగతవజ్రపంజరా. 257

ఈపండ్రెండును నుభయవళిభేదంబులు.

ఇంకం బ్రాసయతు లెట్టి వనిన:

ప్రాసయతులు.

గీ. గీతముల సీసములను సంగీతములను, విరతి విడనాడి యొక్కొక్కచరణమునను
రెంటికిని బ్రాసవర్ణంబు నంటఁ బలుకఁ, బ్రాసవిశ్రాంతు లండ్రు కబ్బముల వాని

ఆ. దేవకీకుమార గోవర్ధనోద్ధార, తోయజాక్ష పాండవేయపక్ష
ఘనవినీలగాత్ర మునిజనస్తుతిపాత్ర, యదుకులాబ్ధిసోమ కదనభీమ. 259

అగ్రాహ్యవిరామంబులు:—

ఆ. వికటకవులు కొన్ని వింతలు గల్పించి, కవిజనాశ్రయమునఁ గలిపినారు

1 రాజునకున్.

వానిఁ గైకొనంగ వల దప్రయుక్తంబు, లేల సెప్ప భీముఁ డెటిఁగియెటిఁగి. 260

వ. అవి యెవ్వి యనిన.

క. వెలయఁ గకారాదులు భూతలమున నైదైదువళులు దా మగు ననుచుం
లలనామదనుఁడు రేచన, నలినభవనిభుండు గుణవతంసుఁడు చెప్పెన్. 262

వ. ఈపద్యములోఁ జెప్పినయయిదువర్గములయందును మొదలివర్ణములు నాల్గింటికి వ
ర్గవళ్లు గనుకఁ జెల్లుబడి యవి యన్నియుఁ దాపలఁ బూర్ణబిందువు లేకుండిన నను
నాసికములకుం జెల్లవు. అబిందువు లున్నట్లాయెనా బిందుయతులు గనుక నవియు
చెల్లును. ఈభేదము చెప్పనందుచేత నీపద్య మగ్రాహ్యము. 263

## అగ్రాహ్యసంబంధవళులు.

క. దడలకు భేదము లెంచక, వడియును బ్రాసంబు నిలుప వచ్చును గృతులం
దది యెట్లన్నను శ్రీహరి, దొడిబడి దానవులఁ జంప దులి యాయె ననన్. 264

వ. ఈచెప్పినదడలకు పదాదినున్న చతుర్థవర్గసరళము ఆదేశమై వచ్చునప్పుడు ఆదేశ
యతిగాఁ జెప్పవచ్చును. అదియుఁ గాక ఆరెంటికిని దాపలించి నెఱసున్నలున్న
ప్పు డనుస్వారసంబంధయతులు గనుక అటుపలెను జెప్పవచ్చును. అవి గలుగఁ
జెప్ప లేదు గనుక నిదియు సమ్మతము గాదు. 265

## అగ్రాహ్యవర్ణచతుష్టయవళులు.

క. యరలవ లనునీనాల్గును, వరుసం దమలోన వళ్లు రయమునఁ జెల్లుం
ధరశషసహావర్ణంబులు, సరవి నొకటి కొకటి చెల్లు హరినిభ రేచా. 266

వ. ఈమొదలను జెప్పినయరలవలకు నాల్గింటికిని చెల్లుబడి గాదు. శషసహాలలోపలను
తొలుతటివిమూఁడును ఊష్మవిశ్రాంతులు గనుక చెల్లును. వానికి హాకారము చెల్ల
దు. ఇవి తెలియక చెప్పినకతంబున ఇదియు అప్రయుక్తమే అయెను. 267

## అగ్రాహ్యభేదవర్గయతులు.

క. ధరఁ బఫబభమాక్షరములు, పరువడి నీయేనుగూడ వాతోఁ జెల్లుం
సరి సంభావన వడి యన, మరుదీమము లేమ కీరవాణి యనంగన్. 268

వ. పంచమవర్గాక్షరము లైదింటిలోనున్న వబల కభేదయతి గనుకను ప్రథమద్వితీయ
చతుర్థవర్ణములు వకారమునకు నభేదవర్గయతులు గనుకను అవియుఁ నిలుచును. మ
కారము నడవదు. ఇది విచారించక చెప్పినాఁడు గనుక నిదియు అబద్ధమని తెలిసి
కొనునది. 269

తే. భరితభువనార్ణవంబుతో వ్రంత సరియొ, రమ్యమణిరాజరాజితో లక్క సరియొ
లలితవీణారవంబుతో ఛక్క సరియొ, యనఁగఁ జెల్లు నభేదాఖ్య నమరుపళ్లు. 270

వ. ఈమూఁటిలోపలను భకార వకారములకు నభేదవర్గవిరతి గనుక ప్రయోగించవ
చ్చును. లవర్ణ ధవర్ణములకు నభేదవర్గయతులును గావు. కనుక ప్రయోగించరాదు.
రేఫమునకును లకారమునకును గ్రాహ్యంబు గాదు. వానికిని లక్షణవిలాసమువారు
తెలియక *కొన్ని యుదాహరణంబులు వ్రాసినారు. అవియును వివరించెద. 271

శృంగారనైషధమునందు:—

క. కైలాటరాయ యభినవ, లీలామకరాంక చంద్రరేఖాంకురచూ
డాలంకారపదాంబురు, హాలింగితసుఖితనిర్మలాంతఃకరణా. (1-110) 272

రామాయణమునందు:—

క. దానవసుందరు లత్తఱి, జానకి నందలము మీఁద సమ్మద మొదవన్
గా నిలుప శారదాభ్రవి, లీనత నేపారుచంద్రరేఖయ పోలెన్. (యు.2328)273

వ. సంస్కృతమునందు రేఖాలేఖాశబ్దములు రెండును గలవు గనుక ఈరెండు పద్య
ములయందును చెప్పినరేఖాశబ్దము మొదల ద్వితీయాంతస్థమని యెఱుఁగునది. 274

హరిశ్చంద్రునికథయందు:—

ద్వి. చీఁకటి విరియించుఁ జిఱునవ్వు పసిఁడి, రేకలతో నెదిరించుచెక్కులును. 275

వ. కొందఱు రేకలతో మురాళించుచెక్కులును అని చదువుదురు అది వ్రాఁతతప్పు
గాని కవిహృదయము గాదు. 276

వసుచరిత్రమునందు:—

శా. ఓలంబాలక యోల యోల యనినో లోలంచు మేలంబునన్
లోలంబాలక యొత్తు గ్రుంకి బిసవల్లు ల్గ్రుంకి తూఁటాడి కెం
గేలం బూని తటాలున న్నెగసె నక్షీణాంబునాథాంబుజా
క్షీలోకంబు జయించి వారలయశశ్శ్రీఁ దెచ్చుచందంబునన్. (3-162) 277

వ. ఈపద్యము రెండవచరణము మొదలను లోలంబాలక గ్రుంకి యనికవిహృదయము;
ఇది గానక కొందఱు "ఇందిందిర శ్చంచరీకో రోలంబో బంభరోపిచ" అని నిఘం
టువ నున్నదని రోలంబాలక యని చదువుదురు. ఇట్లని రామరాజభూషణుము తలం
పుగాదు. 278

క. నణ లనురెండక్కరములు, కును వడి ప్రాసంబుఁ బెట్టుకొన వచ్చుఁ గృతిన్
వినుఁ బరల కిట్లు పెట్టం, జను లళల కభేద మరయ సర్వజ్ఞనిధీ. 279

* (వా) వ్రతిలో 'సుప్రాశ్వానునిర్ణయము' అని ఈతావున 'తలసీల' కలదు.

వ. ఈచెప్పినమూఁటిలోపలను మొదలం జెప్పినవణలకును సరసవడియు కడను జెప్పిన
లళలకు అభేదవిరతియుఁ గనుక నీరెండును గూర్పవచ్చును. నడుమను జెప్పినరలలకు
"రయోస్తునిత్యంస్యాత్" అని శబ్దశాసనసూత్రముకలిమింజేసి యేకతరయతు ల
గుటనుం గూర్పరాదు అటుగనుక ఈపద్యమును బ్రశస్తము గాదు. 280
ఇవి నలువదియొక్కటియు యతిభేదంబులు.

ఇంకఁ బ్రాసస్వభావం బెట్టి దనిన.

మూ. సూ:—ద్వితీయో వర్ణః ప్రాసోఽత్రపాదపాదేషు, కించ ప్రాస
స్సర్వేషు చైక ఏవ స్యాత్. 22

తే. ప్రథమపాదద్వితీయాక్షరంబు ప్రాస, మయ్యెఁ బదపద్యముల నడుగడుగునందు
నదియు రెండవవర్ణ మై యమరు సీస, గీతదండకమంజరీకృతులఁ దక్క. 281

ప్రాసపూర్వాక్షరనిర్ణయము.

క. గురులఘువులలో నెయ్యది, మురహార తొలిచరణమునకు మొదల నిలుచు ని
ద్ధర నాపై నిడుఁ బ్రాసాక్షరములఁ బూర్వమున నదియ కదియింప నగున్. 282

ఆ. దాసపారిజాత వాసవావరజాత, ఘనఘనాఘనాంగ దనుజగర్వ
భంగ యనుచు నిట్లు ప్రాసాదులను గూర్పవలయు నొక్కభంగి వ్రాలు కృతుల.

ఆ. క్రింద జడ్డలును బిఱుంద బిందువులును, నూఁది ప్రాసములకు నుండె నేని
హ్రస్వ మొకటి నిడుదయక్కరం బొక్కటి, వాని మొదల నిలుప వచ్చు నెందు.

ఆ. పక్షిరాజపత్ర రాక్షసతృణదాత్ర, దంతిభయవిరామ శాంతిధామ
యింద్రనీలమూర్తి సాంద్రపాండురకీర్తి, యనఁగఁ బ్రాసమాత్ర కాదు లొప్పు.

ఆ. వేదవేద్య యసమవృత్తపాదములను, బ్రాసనియమరహితపాదములను
వలసినట్లు మొదలి వ్రాలు సెప్పఁగ నొప్పు, నొక్కదానగురువు నొకట లఘువు.

స్వస్థానార్ధసమవృత్తోపజాతివృత్తము.

క్షమాకళత్రుఁడ వనజాతనేత్రుఁడ, గామేపలీశుం డ్రిజగత్ప్రకాశుఁడ
దమాలనీల స్సముదారశీలుఁడ, హేమాక్షవైరి న్భజియింతు శౌరిన్. 287

ఆ. వారిజాతగర్భవామదేవసహస్ర, నయనముఖ్యపుణ్యనామ యనుచుఁ
బ్రాసనియతి లేనిసీసాదిపదముల, మొదల రెండు నిట్లు గదియుచుండు. 288

ప్రాసాక్షరమైత్రి.

తే. ప్రాసముల కెల్లఁ దుల్యాక్షరంబు లైనఁ, జాలు స్వరభేద మైన దోషంబు లేదు
చరణములకడఁ గూర్చుప్రాసముల కెల్ల, నన్నియును సమస్వరంబు లై యమరవలయు.

ఆ. సరసిజాతనేత్ర దురితగుల్మలవిత్ర, హరితనూజమిత్ర గరుడపత్త్రి
ధారుణీకళత్ర, నీరదానితగాత్ర, యనుచుఁ గూర్ప వచ్చు నచ్చు లెల. 290

క. దురితద్విపహర్యక్షా, నరకమురాసురవిపక్ష నాళీకాక్షా
శరధిసుతాలయవక్షా, కరినాయకరక్ష హరముఖసురాధ్యక్షా. 291

తే. *వట్రువసుద్విత్వమును గలవ్యంజనంబు, ప్రాస మైయుండు నెడఁ బెఱప్రాసములకు
వ్యంజనంబు సమాక్షరం బైనఁ జాలు, వానిపై నేస్వరం బైనఁ బూన వచ్చు. 292

ఆ. సకియ పూర్వజన్మసుకృతఫలంబునఁ, గాక తనువిభానిరాకృతాభ్రి
నిక్కువ పాపరోధి దక్కఁగఁ గొనుటకుఁ, దరమె భోజసుతకుఁ దక్క ననఁగ.

శల్యపర్వమునందు:—

క. చావరు నొవ్వరు పాండవు, లేవ్వరు నని నీవు సెప్ప నిప్పలుకులు దుః
ఖావేశకరము లై చేతోవృత్తిఁ గరంపఁ జొచ్చె దుర్భరభంగిన్. (1-14) 294

కవికర్ణరసాయనమునందు:—

మ. అమరీవిభ్రమరీతిలోలనయనావాస్తాబ్జదోదూయమా
నమణీదండకచామరాగ్రపవమానాస్పందనాందోళన
క్రమశోభాన్వపకుంతలప్రకర ముత్కర్షార్హ మయ్యేం దదీ
యమృదుస్పర్శసుఖోన్నతిం బరవశం బై తూఁగుచందంబునన్. (1-64) 295

క. విరమము స్వరప్రధానము, ధరఁ బ్రాసము వ్యంజనప్రధానము నగుటన్
స్వరసంధిఁ జెందునపుడును, బ్రరుచిరముగ హల్లు దాన ప్రాసము లయ్యెన్. 296

క. అనలు వెట్టిన నిలువకఁ, దా నూరక యలిగి యాసుదంతిని జేరన్
దానవసంహరుఁ డేక్రియ, చే నిఁకఁ జనుదెంచు నాకుఁ జెప్పవె యనఁగన్. 297

## ప్రాసభేదంబులు. 17

సీ. 1 అర్ధబిందుసమాహ్వయము 2 బూర్ణబిందుఖండాఖండములు 4 సంయుతాక్షరంబు
ధర సంయుతాసంయుతము రేఫయుతలఘుద్విత్వవికల్పముల్ వెస నుభయము
వసునాసికప్రాసమును బ్రాసమైత్రియుఁ బ్రాసవైరంబు స్వవర్గజంబు
ఋప్రాసలఘుయకారప్రాసములు నభేదంబును సంధిగతంబు ననఁగఁ

తే. బదియు నేడు దెఱంగులఁ బరిఢవిల్లు, బ్రాసములు పూర్వసుకవిప్రబంధములను
గ్రమత లక్షణలక్ష్యయుక్తంబుగాఁగ, దేటపఱిచెద వాని నిశాటదమన. 298

## సమప్రాసములు.

తే. పూర్వమున నర్ధమైనను బూర్ణమైన, దిగువ జడ్డక్షరం బైనఁ దగిలి మొదలి
ప్రాస యుండినయెడ సమప్రాస మనఁగఁ, బిదప నన్నియు నట్లనఁ గదియవలయు.

---

* నైత్వము (ప. పా).

### సమప్రాసములం దర్ధబిందుప్రాసము.

ఆ. వీఁకఁ బక్షిముఖుని డాఁకి కోసలవల్లభుఁడు బలాసురాంతకుఁడు పెలంగ
నవనిఁ గూల్చె ననుట నర్ధబిందుప్రాస, మిట్లు గూర్ప వలయు నెల్లకడల. 300

### పూర్ణబిందుప్రాసము.

క. పొందింప వలయు నెల్లెడ, బృందావనచారి పూర్ణబిందుప్రాసం
బిందీవరాక్షి భీష్మక, నందనఁ జేకొనియె నందనందనుఁ డనఁగన్. 301

### ఖండాఖండప్రాసములు.

క. నిడుపులు వరసున్నలు దమ, కెడమను గలకచటతపల కిలఁ బ్రాసము లై
దొడరును నిర్బిందువు లొక్కెడ ఖండాఖండసంజ్ఞ నిశశినయనా. 302

ఆదిపర్వమునందు:—

క. వీఁక [1]బఱతెంచునిరుగడఁ, దాఁకినఁ గడు నలిగి ఘోరతరశరహతి న
మ్మూకలు విరియఁగ నర్జునుఁ, [2]డాఁకతమున నేసె నుగ్రుఁడై రణభూమిన్.(8-203)

విరాటపర్వమునందు:—

క. నాకొఱఁత దీర్చి వచ్చితి, [3]నీకొఱఁతయు నింక సూతుని న్నైగఁ జూడ
న్లోకము వంచింపఁగఁ దగు, చీఁకటిరే యొదవె నేమి సేయుదొ చెప్పుమా.(2-271)

ద్రోణపర్వమునందు:—

*సీ. పా. మూకలువిరియించి వీఁకనాచార్యాదియోధుల కెల్లను నొక్కదెసను.(2-136)

రుక్మాంగదచరిత్రమునందు:—

ఉ. ఓకరుణాకలాప వికచోత్పలలోచన యిప్పు డియ్యెడన్
గాకులు చంప కుండ ననుఁ గైకొని కాచిననీకృపాగుణం
బే కలిగె న్వసింపఁ దగునే తొలిపుట్టువునందు భర్తపైఁ
గాఁకలు సేసినట్టిఘనకల్మషము ల్విన నీకుఁ జెప్పెదన్. (4-99) 303

ఆదిపర్వమునందు:—

మత్త. తీఁగయుయ్యెల నూగుఁ జల్లనితియ్యమామిడిమోకలం
డాఁగుఁ బువ్వులతేనెసోనలఁ దారుఁ గేతకిఁ జేరుఁ బు

---

1 బఱతెంచినల్లడ (పూ. ము). 2 డాఁకతమున (ప. వా. పె). 3 నీకొఱఁదవయ (వా. ప). * మూకశబ్దము శబ్దరత్నాకరములో సార్ధానుస్వారముగఁ జేర్చి యీసీసపాదమునే యుదాహరించినాఁడు; కాని యప్పకవిమతమున సార్ధానుస్వారము గాదు.

న్నాగపూగమహాగవీథుల నాట్యము ల్పచరించు నా
భోగనాగలతాగృహంబుల భోగము ల్గనువేడుకన్. 307

రామాయణమునందు.—

ద్వి. మూఁగి చరించున మ్మికరితుమ్మెదలు, బా గొప్పఁ గొప్పునఁ బరఁగినవాని. 308

వరాహపురాణమునందు:—

క. ఆచింతామణి ముని తన, పేఁచ మడఁచుదాఁక నీక పృథులోభముచే
దాఁచుకొనుఁ గాక నాచే, నీచే నీఁక మోసపోవునే నరనాథా. 309

ఉద్యోగపర్వమునందు:—

క. [1]మీటుగతి రథికులను నొక, నాటికి వేవుర వధింతు నరుశరములు నో
నాటి పడవైచునంతకు, వేటాడెదఁ బ్రతిబలంబువీరుల నెల్లన్. (4–407) 310

ఆ. బోఁటి యొకతె పెండ్లిపాట పాడఁగఁ జొచ్చె, నాప రానివిరహతాపమునను
జేరు గూర్చి తాను బెండ్లికూఁతురు గాఁగ, గోత్రధరుఁడు పెండ్లికొడుకు గాఁగ.

ఆదిపర్వమునందు:—

క. అపన్నగముఖ్యులఁ దనవీఁపునఁ బెట్టుకొని పఱచి విపినములు మహా
ద్వీపములు గిరులు సకలదిశాపాలపురములుఁ జూపెఁ జని వారలకున్ (2–42)

సంయుతాక్షరప్రాసము.

తే. సంయుతాక్షరప్రాస మై జగతి వెలయు, గర్గుఁ దర్చించు దైవంబు భర్గుఁ డనఁగఁ
బక్షతేక్షణకొనతినూత్న మనఁగఁ, జంద్రవంశ్యుఁడు భోగదేవేంద్రుఁ డనఁగ. 313

సంయుతాసంయుతప్రాసము.

తే. రలలు తమక్రింద జడ్డ లైఁ గ్రాలువ్రాలు, ప్రాసవర్ణంబు లై వానిఁ బాసియైనఁ
గూడియైనను బెఱయక్షరులను నిలుచు, సంయుతాసంయుతప్రాససంజ్ఞఁ దనరి.

తే. పాఁడి దప్పఁగ నిమ్ము నాతండ్రి కృష్ణ
వేఁడుకొనియెద నంచాఁకఁ బండ్లు దినుము
దుండగపుచేష్టలును నోటిగాండ్ర తనము
మెండుగాఁ జొచ్చె నీకు నై దేండ్లు కనఁగ. 315

రేఫశ్లిష్టమునకు నాదిపర్వమునందు:—

ఉ. క్షత్రియవంశ్యు లై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియవైశ్యశూద్రు లనఁగాఁ దగు నాలుగుజాతుల న్నిఁకా

1 నిటుగల; మీటులగు (అచ్చ. భా).

రిత్రము దప్ప కుండఁగఁ బరిక్షితు కాచినయట్లు రామమాం
ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబునన్. (అ. 2-173) 316

వ. మాంధాతృశబ్దము ఋకారాంతము గనుకఁ దకారముక్రింద నున్నది వట్రువ
సుడిగాని కొమ్ముకవడి కాదు. అందులకు. 317

కవికర్ణరసాయనమునందు:—

సీ.గీ. దానగుణశాలి భూసముద్ధరణదక్షుఁ
డనిశమఖదీక్షితుండు మత్తారిహారిణ
విహృతినిరతుఁడు యువనాశ్వవిభుసుతుండు
ఘనుఁడు మాంధాత నృపుఁడైనకాలమునను. (2-58) 318

సోమునిహరివంశమునందు:—

శా. నాతో మార్కొన లేరు నిర్జరపురీనాగేంద్రబృందారకా
రాతుల్మున్నగ దేవసంఘములు పోర స్థిరసంగ్రామకుం
డీత్రైలోక్యమునందుఁ గల్గఁడు రణం బెచ్చోట లేకుండఁ గాఁ
జేతుల్వేయు వృథాభరం బగుచు వచ్చె న్దేన యీమేనికిన్. 319

దేవీవిజయమునందు:—

తే. వాక్త్రినేత్రాంగనాశచీశక్తు లధిక
సంభ్రమంబునఁ గుంభనికుంభదైత్య
హంత్రిఁ బూజింపుదురు త్రయీమంత్రములను
స్తోత్రములు చేసి మంగళారాత్రిక లిడి. 320

పద్మపురాణమునందు:—

క. శ్రీకరచక్రాంకితు లగు, లోకులు శుద్ధులును బుణ్యులును నగుదురు వా
రీక్రియలు లేక యుండిన, బ్రాకృతు లనఁ బతితు లనఁగఁబడుదురు జగతిన్. 321

లకారశ్లిష్టమునకు రాఘవపాండవీయమున:—

శా. లోకత్రాణరతిం దదాదిమమహీలోకప్రవేశోత్కభా
షా*క్లప్తప్రథమద్వితీయపదగుంజన్మంజుమంజీరగ
ర్జాకల్పామలరామభారతకథాసర్గంబుల న్మించువా
ల్మీకివ్యాసులఁ గొల్చెదం దదుభయశ్లేషార్థసంసిద్ధికిన్. (పీఠిక. 3) 322

రేఫయుతప్రాసము.

ఆ. నుడులు తెలుగులందుఁ బొడమ వావైవడి, వ్రాలుకొమ్ము కొమ్ముకవడులు గాన

---

* 'క్లప్త' లో 'క్ల' లకారశ్లిష్టము గాదు. అప్పకవి యీపద్యములను లకార
శ్లిష్టమున కుదాహరణముగ నిచ్చుట ప్రమాదము.

రేఫయుతసమాఖ్యఁగృతులఁ బ్రాసము లగు, సొరిదిఁ దమకుఁదామె సుడులఁబాసి.

క. సంగ్రామరంగమునఁ జెల్వుచం గ్రొమ్మించుచున్న సాల్వజగతీవరుమే
నం గ్రుచ్చిపార నాటించెం గ్రూరాస్త్రములు వాల్గు శ్రీకృష్ణుఁ డొగిన్. 324

క. ఈకారిర పలుకునకు మొదలై క్రాలుచుఁ దేలిప్రాస మగుఁ దనతనకే
శ్రీకృష్ణుడిసౌందర్యము, వాక్రువ్వం దరమె యురగవరునకు నైనన్. 325

## లఘుద్విత్వప్రాసము.

తే. భువి లఘుద్విత్వసంజ్ఞికంబు లయి కొన్ని
యూఁదఁ బడని కారిరలతోడ నొకటి కొకటి
ప్రాసము లగుఁ దమలోనఁ బత్త్రయుగము
విద్రుచె వినతాత్మజుఁడు దిక్కు లద్రువ ననఁగ. 326

## వికల్పప్రాసములు.

తే. పంచవర్గంబులను గనుపట్టునట్టి
పొల్లు లనునాసికాక్షరంబులను గదిసి
తమదుపంచమములఁ దృతీయములు నగుచు
నమరుఁ బ్రాసంబులకు వికల్పాహ్వయములు. 327

తే. ప్రాజ్ఞనగసమానధృతి సుధారుఙ్నిభాస్య, స్రజ్నిచయసక్తకంఠ దావాగ్నిపాయి
వాఙ్మనోహారనుత యసదృఙ్మహాత్మ, దిఙ్మహితకీర్తి యజ్జనయుఙ్మఖభేది. 328

## ఉభయప్రాసము.

ఆ. ధాత్రిఁ బాణినీయమాత్రములను దృతీయోష్మమును ద్రుతంబు నొక్కచోటఁ
గ్రమత షాక్షరము ణకారము నై ప్రాస్యములకు నుభయసంజ్ఞఁ బొసఁగు రెండు.

త్రైశంకవోపాఖ్యానమునందు:—

క. ఝుషకేతుద్విషునకుఁ గిల్బిషపర్వతవృషున కమృతవిషనిధిజామా
త్రిషునకు ఋషిపూజితునకు, విషమాక్షున కింద్రముఖదివిజపతునకున్. 330

సాంబవిలాసమునందు:—

క. వసుధాకళత్రునకు స్మారసజదళనేత్రునకు మరుదరాతిమదతమో
విసరాంబుజమిత్రునకు, న్వ్యష్టమశిలీముఖసమాస్త్రనిభగాత్రునకున్ 331

తే. ప్రాణములఁ బాపె నాహవక్షోణియందుఁ, బ్రాణవల్లభఁ గొని చన్న దానవేంద్రుఁ
ద[illegible]ఁడును దాను గీశజాతముతోడ, శరధి బంధించి దాఁటె దాశరథి యనఁగ.

ఉద్యోగపర్వమునందు:—

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యులున్
ప్రాణము లాసుయోధనునిపాలివి యంద్రు నిజానుజన్ముల
క్షీణపరాక్రము ల్మతు లజేయులు బాహ్లికసోమదత్తు లా
స్థాణున కైన నోడరు వశంబె జయింపఁగ వారి నేరికిన్. (1-299) 333

కాళహస్తిమాహాత్మ్యమునందు:—

మ. ప్రణతుల్ సేయుచుఁ గాంచెఁ గుంభజుఁడు లోపాముద్రతోఁ గూడి ద
క్షిణకైలాసము నంబికాహరకృతశ్రీపాదుకాన్యాసమున్
మణిమంత్రౌషధవాసమున్ భవమహామాయావిపర్యాసమున్
గణనాతీతనటీవిలాసమును సమగ్రశ్రీసముల్లాసమున్. (1-109) 334

కాశీఖండమునందు:—

క. †త్రిణయనునిరాణివాసము, నణిమాద్యైశ్వర్యవితరణామరతరువున్
మణికర్ణిక ముక్తివధూ, మణికర్ణికఁ దలఁచె మౌని మానసవీథిన్. (2-160) 335

రామాయణమునందు:—

చ. రణమున నుగ్రసాయకపరంపర భానుకులం బరామల
క్షణము జగం బవానరముగా విలునేర్పును మద్భుజావిజృం
భణమును జూపి తండ్రి మదిఁ బట్టినచింత దొలంగఁ బెట్టి శూ
ర్పణఖకు నిట్లు వాటిలినబన్నము నీఁగుదు నే నవశ్యమున్. (యు. 544) 336

మధుసేవనమునందు:—

క. పోనుద్యోగముఁ జేసిన, ప్రాణంబా యింక నీకుఁ బాథేయం బీ
మానినిమందస్మితమధు, రాననచంద్రికలు గ్రోలి యరుగుము పిదపన్. 337

శృంగారషష్ఠమునందు:—

క. అనుటయుఁ గృష్ణద్వైపా, యనతనయుం డిట్టులనియె నవహితమతివై
విను మతిగుహ్యము నారా, యణకవచము భక్తవాంఛితార్థప్రదమున్. 338

అరణ్యపర్వమునందు:—

చ. కనకగిరిం బ్రదక్షిణముగా శశిభాస్కరతారకాగణం
బనవరతంబు ద్రిమ్మఱు మహామునిసప్తకమండలంబుతో

---

* †ఇచ్చట ణత్వము కాదు; కాని శ్రీనాథుఁడు ప్రయోగించినందున సాధుత్వము కల్పనీయము. లేక సామాన్యముగ నణలకుఁ బ్రాసమైనను ఒప్పుకొనవలసివచ్చును.

వనఘ తదీయశైలశిఖరాగ్రమున ... ... ...శిసన
*త్రిణయనవిఘ్ను లుండుదుర దేవగణంబులు గొల్చుచుండఁగన్. (4-38) 339

అనునాసిక ప్రాసము.

తే. తమకుఁ దాము ద్విత్వంబులై తనరునవియుఁ
బూర్ణబిందులు దాపలఁ బొరయునవియుఁ
గలని యనునాసిక ప్రాసము లనుపేర
నవి యమరుఁ గావ్యములయందు దమకుఁ దాము.

క. మిన్నెఱు పాదమున ధ్యాతన్నాభిని గుసుమశరు నెదం గాంచినని
సాన్నిధ్యము దొరకుటకై, సన్నుతి సేయుదురు నిన్ను సనకాదు లజా. 341

క. తమ్ములను మల్లికాకుసుమ్ముల మరువాదిపత్రమాలికలను భ
క్తి మ్మురసంహారపూజలు, సమ్మదమున సలుపఁ గలుగు సకలార్థంబుల్. 342

ప్రాసమైత్రిప్రాసము.

తే. గట్టిబిందువుమీఁది బకారమునకు, జమిలిమా ప్రాసమైత్రి నా జరుగుచుండఁ
గమ్మతావులు వెదచల్లునంబుజములు, శంబరారాతిచేతివాలమ్ము లనఁగ. 343

ప్రాసవైరము.

తే. కబ్బములు రేఫమునకు ఱకారమునకు, మైత్రి గలుగమిఁ గవిశిఖామణులు ప్రాస
వైర మనుచును గలపరు వాని నెందుఁ, గూర్తు రారెండు నెఱుఁగక కుకవిజనులు.

స్వవర్గజప్రాసము.

తే. గ్రంథమంథశబ్దంబులఁ గలద్వితీయ, వర్ణములు రెండును నఘోషవర్ణము లగు
నైన నిజవర్గభవచతుర్థాక్షరములఁ, గలియుఁ బ్రాసంబులను స్వవర్గజము లనఁగ. 345

వ. 'గ్రంథ గ్రంథసందర్భే' యను ధాతువులవలను 'శాస్త్రప్రవిణయో ర్గ్రంథః' అని నా
మలింగానుశాసనమందు నానార్థవర్గములోపలను దవర్గద్వితీయాంతములయందే
అమరసింహుఁడు చెప్పుటచేతను గ్రంథిశబ్దము తనయందు రెండవ్రాయి తవర్గ
మునందు ద్వితీయాక్షర మైనఁగాని ప్రాసములయందు చతుర్థాక్షరములకు మహాకవి
ప్రయోగములు గలుగుటవల్లను చెల్లును. 346

అరణ్యపర్వమునందు.

ఉ. అంధకవృష్ణిభోజకుకురాన్వయభూపతు లెల్ల నీదెసన్
బాంధవసౌహృదప్రణయభక్తివిశేషము గొప్ప సీమనో

*ఇచ్చట ణత్వప్రాప్తి కవకాశములేదు; కాని వ్రాఁతప్రతులయందు ణత్వమే
కనఁబడుచున్నది.

గ్రంథి యడంగఁ జేయు నెసకంబునఁ బూనినవారు లోభమో
హాంధులు ధార్తరాష్ట్రులు నయమ్మున నెయి న్మన కుర్వి యిత్తురే. (అ. 4–160) 347

విరాటపర్వమునందు.—

ఉ. బాంధవశాత్రవా కలితభావభవా భవపాశబంధసం
బంధవిరామకామపరిపక్వవివేకనిరూఢభక్తహృ
ద్గ్రంథివిభేదనా పరమకారుణికా పరిమాణదూర దుః
ఖేంధనపావకాయితసమీక్షణ[1]చైత్యమహాద్భుతాత్మకా. (1–333) 348

వ. మంథ విలోడనే యనుధాతువు కవికల్పద్రుమమునందుఁ దవర్గద్వితీయాంతధాతువులలోను బరిగణిత మైనది గనుక మంథశబ్దములోని రెండవవ్రాయి తవర్గమునందు ద్వితీయాక్షర మైనను ప్రాసములపట్లను బూర్వకవిప్రయోగములు గలుగుటచేతను జతుర్థవర్ణములకుఁ జెప్పవచ్చును. 349

ద్రోణపర్వమునందు.—

క. సింధురము మదోద్రేకమ్మదాంధం బై వచ్చునోజ నాచార్యునిపై
గంధవహసుతుఁడు [2]గవయఁగ, మంథరగతి నెవ్వఁ డాఁగు మనయోధులలోన్. (1–88)

ఆముక్తమాల్యదయందు.—

ఉ. కంధరనీలవర్ణ మధుకైటభనాగసుపర్ణ యోగిహృ
ద్గ్రంథిభిదోర్థభోగివనితాస్వనవచ్ఛ్వసనప్రవచ్ఛిర
స్సంధివసన్నిశాపతిరసస్రుతిదుగ్ధపయోధివీచికా
మంథరకేళికాధర సమాశ్రితపక్షిశిరోధిసోదరా. (5–158) 351

వ. బుధ అవగమనే అనుధాతువువలనను బుధశబ్దములోని రెండవవ్రాయి తవర్గమునందు చతుర్థాక్షర మైనను ప్రాసములపట్లను బూర్వకవిప్రయోగములు కలుగుటచేతను దృతీయవర్ణమునకుఁ జెప్ప వచ్చును సుధాశబ్దము మొద లైనవానికిని ఇటువలెనే యని తెలిసికొనునది. 352

ఆదిపర్వమునందు.—

ఉ. కాదన కిట్టిపాటియపకారము తక్షకుఁ డేకవిప్రసం
బోధనఁ జేసి చేసె నృపపుంగవ నీవు ననేకభూసురా
పాదితసర్పయాగమున భస్మము సేయుము తక్షకాదికా
కోదరసంహతిన్ హుతవహోగ్రమహోగ్రశిఖాచయంబులన్. (2–200) 353

1 దైత్య (అచ్చు. భా). 2 గవయఁగ, మంథరగతి (వా. ప).

నరసింహపురాణమునందు.—

క. వేదము లాదిగఁ గలయష్టాదశవిద్యలకు నీవ స్రష్టవు తత్త
ద్బోధకులును భవదాజ్ఞాపాదకులు సమస్తధర్మపాలనచతురా. 354

విరాటపర్వమునందు.—

క. ముద మొదవ రమ్యహర్మ్యాగ్రమున, తుది నిలువున నిష్టసఖులతోడ విహా-
స్పద మగు[1]నెఱవున మెలఁగెడు, సుధేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్. (1-301.

ద్రోణపర్వమునందు.—

క. వింధ్యాద్రివోలె నాప్రతి, వింధ్యుఁ డచలితోగ్రమూర్తి వెలయ నిలిచి గ
ర్వాంధ్య మలరఁగను దీప్తాసంధ్యాభ్రము లక్కుమారవరుపైఁబఱపెన్. (1-135)

విరాటపర్వమునందు.—

ఉ. ఎండకు వాన కోర్చి తనయిల్లు ప్రవాసపుచోటనాకనా
కొంటిమి నలంగితి న్నిదురకుం దఱి దప్పెను దప్పి పుట్టె నో
క్కండను నెట్లకో యనకఁ గార్యము గల్గినవేళ నేలినా
తండొకచాయఁ జూపినను దత్పరతం బని సేయఁ టొప్పగున్. (1-135) 357

ఋప్రాసము.

తే. స్వరము లెల్లను బ్రకృతిభావంబులందు, రావెనుక బ్రాయి యగుఋస్వరంబొకండు
తగుయణాదేశమున రేఫ మగుటఁజేసి, ప్రాసముల కట్ల యగు వళిపట్ల గాదు. 358

క. ధారుణి ఋప్రాస మనం, గా రేఫాక్షరమునకు ఋకారము చెల్లన్
నారికి నై నాకకుజం, బా ఋభుపతిఁ గెలిచి తెచ్చె నచ్యుతుఁ డనఁగన్. 359

ఆరణ్యపర్వమునందు:—

క. ఆఋషిపుత్త్రుఁడు గట్టిన, చీరలు మృగచర్మములు సవ్యశిష్టములు మనో
హరులు నాతనిపృథుకటి, భారంబున నొక్కకనకపట్టము వ్రేలున్. (3-104) 360

లఘుయకారప్రాసము.

తే. ప్రకృతిభావంబుఁ జెందినప్రాణములకు, మొదలియంతస్థములు ప్రాసములకు నిలుచు
నటమటలులేక లఘుయకారాహ్వయములు, నాయజానితండ్రికి ఫణిరాజశాయి యనఁగ

కళాపూర్ణోదయమునందు:—

ఉ. ఏయెడ నెన్నఁడుం గననియింపులు గుల్కెడుఁ దద్గళస్వనం
బాయత మైనకౌతుకము నద్భుతము న్నొలపింప నెయ్యఁ దె

1 నెఱన (పూ.ము).

ద్దీ యిది చాలఁ గ్రొత్త బళి యింకొకనాఁ టికి నొక్కమాఁ టటం
చాయలనీలవేణి నలకౌధిపసూనుఁడు వేఁడె వేఁడినన్. (1-92) 362

అభేదప్రాసము.

తే. రేఫమునకుఁ బై నుండుమాత్రకకుఁ బెద్ద, లా యభేదాహ్వయప్రాస మై యెసంగు
ఖలజనవిపక్ష జలరుహదళనిభాక్ష, శౌరియోరగమదవనకేలి యనఁగ. 363

రాజశేఖరునిచరిత్రమునందు:—

శా. కేళీకాంచనసౌధవీధికలచక్కిన్ బొట్టిలోఁ బెట్టి యో
ప్రాలేయాచలకన్యకాధవకృపాపాంగతా నిద్ర వో
వే లావణ్యపయోనిధీ యనుచు నావిర్భూతమోదంబుతో
జోలల్పాడుదు రక్కుమారకునకున్ శుద్ధాంతకాంతామణుల్. (2-4) 364

రామాభ్యుదయమునందు:—

ఉ. పాలును నీరు నేఱుపఱుపం గలమాన్యుల వేదవీధి వా
హ్యాళి యొనర్చు నేర్పులికులాలక తా సితవర్ణ యయ్యు నే
బాల సువర్ణదేహమున భాసిలు నానలుమోమువేల్పు ప్రో
యాలు ప్రవీణ మామకమహాకృతినాథుఁ గృతార్థుఁ జేయుతన్. (1-8) 365

తే. పెద్దలాకును దనకు నభేద మగుట, లళలకు నభేద మట్లను గలుగుకతన
క్షితిని మూఁడవసరళంబు యతులఁ బ్రాస, ములను లఘ్వలఘులకారములకు నిలుచు.

ప్రభావతీప్రద్యుమ్నమునందు:—

క. జలనిధి యను తెరమఱుఁ గటు, వెడలి నిలిచినట్టియాటవెలఁదియపోలెన్
గడు నింపులు గులుకుచుఁ దన, రెను సిరులక్ష్మీ యవధరించితె యధిపా. (1-57)

ఉద్యోగపర్వమునందు:—(1-2?)

క. కొడుకులు దానును గుఱ్ఱపు, దళములు కరిఘటలు భటరథవ్రాతములుం
బుడమి చలింపఁగ ద్రుపదుఁడు, గడు వేడుకఁ దోడు నూపెఁ గౌంతేయులకున్.

భీష్మపర్వము:—

క. కొడుకులు దమ్ములు గుఱ్ఱపు, దళములు పెక్కైనబలవితానము తగు మై
నడపింపుచు మెలపున సం, గడములతో నడుచుశకుని కడు నొప్పారెన్. (1-93)

శృంగారనైషధమునందు:—

చ. చిలుకలు గూయునో చెవులు నిల్లులు వోపఁగ నంచు నెన్నఁడు
న్వైపలఁడు నందనోపవనవీథుల కే యట మాళిభాగని

ర్మ లశశిరేఖ చేయునపరాధమునన్ గజదైత్యశాసనుం
గొలువఁడు పాకశాసనుఁడు కోమలి నీ దెసఁ గూర్మి యెట్టిదో. (4–24) 370

కూర్మపురాణమునందు:—

తోటకము. తొలిమి దూలినతాపసపత్నుల్, వ్రీడమనంబున వీడ్కొని జాలిన్
లోలమదాలసలోచనపఙ్క్తిన్, జాలఁ దలిర్చిరి శంకరులీలన్. 371

## సంధిగతప్రాసము.

తే. సంధిఁ గూడినవ్రాలు ప్రాసంబు లైన, నవియె సంధిగతాఖ్యల నమరుచుండు
దివిజు లాశ్చర్య మొంద శౌరి నడపై చెఁ, జెంగి పోనీక మధురలోనం గరి నన. 372

శల్యపర్వమునందు:—

క. కవదొనలును గాండీవము, నవల నిడం బనుపు మంద రరదము డిగు మే
న్న విడప డిగియెద శుభకర, మవు నిర్విఘ్న మిట్లు సేయుమ మనుడు నతండున్. (2–334

కళాపూర్ణోదయమునందు:—

శా. ఆవాలుంగనుదోయి యానగు మొగం బాగుబ్బ పాలిండ్ల పెం
పా వేణీభర మాతనూవిలసనం బా యొప్పు లేఁ జెప్పినం
గైవారం బగుఁ గావె కేవలశిరఃకంపంబు గల్పించి యూ
హా వుట్టింపఁగదె యిత్తుధన్వునకు నయ్యబ్జాక్షి వీక్షించినన్. 374

విరాటపర్వమునందు:—

శా. సింగం బాఁకటితో గుహాంతరమునన్ జేడ్పాటు మై నుండి మా
తంగస్ఫూర్జితయూధదర్శనసముద్యత్క్రోధ మై వచ్చునో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్. (4–95) 375

లకారప్రాసము, కాకుత్స్థవిజయమునందు.—

శా. మారుం డద్భుతశంఖ మొక్కటిని సంపాదించి దోర్మధ్యక
స్తూరీచర్చ నెపంబునం దనదుకేల్దోపన్ సువర్ణత్వరే
ఖాలిప్సన్ శశికత్తిఁ జూప నతఁ డుత్కంఠోత్థుఁ డై చేర నీఁ
పారన్ బట్టుట దోఁచెఁ దద్గళము శేశౌఘంబు మోమూం గనన్. 376

వ. ఈపద్యములోను 'రేఖాలిప్సన్' అన్నచోటను రభరాభస్య యనుధాతువువలనఁ
బుట్టినది లిప్సాశబ్దము గనుక సంధిగతప్రాసమాయెను. 377

## అప్రశస్తప్రాసము.

ఆ. అప్రశస్తము లగు ప్రాసజాలము లలం,కారవిస్మితములు గావు గానఁ

దివిరి ధూర్తులైనకవులు కల్పనఁ జేసి, యొప్పినంబు లనుచుఁ జెప్ప రాదు. 378

వీథినాటకమునందు:—

ఉ. కందుకకేళి సల్పెడుప్రకారమునం బురుషాయితక్రియా
తాండవకేళి సల్పెడువిధంబునఁ బాపరభామ లేఁతనీ
రెండఁ బ్రభాతవేళ రచియించెను గుబ్బలమీఁదిహారముల్
కుండలముల్ కురుల్ గదల గోమయపిండము లింటిముందటన్. 379

రామాయణమునందు:—

చ. కడుకొని వేడిబాష్పములు గ్రమ్మి పయిం బడి పర్వ భీతితో
నడరుచు విన్ననైనహృదయంబునఁ బొల్పగుహారయష్టి ప
య్యెద దటియంగఁ గానఁబడి యంచితనిర్మలరత్నభూషలన్
దదుదితదృశ్యమానమణిధామసముజ్జ్వలభాతి దోఁపగన్. 380

ఇవి పదియేడును బ్రధానప్రాసంబులు.

ఇంక శబ్దాలంకారంబు లగువిశేషప్రాసంబు లెఱింగించెద:—

సీ. ప్రాసంబు సులభాక్షరం బైన సుకరంబు దుర్లభం బైనను దుష్కరంబు
తగ రెండుమూఁడునాలుగువర్ణములపదంబుల నెల్ల నొకభంగిఁ బొసఁగె నేని
వరుసఁ గావ్యముల ద్వంద్వప్రాసమును ద్వ్యక్షరప్రాసమునుజతుఃప్రాసము నగుఁ
బదములఁ దుది నొక్కపగిదియక్షరములు దనరు నంత్యప్రాసమునకు నెందు
తే. బడిబడిని వర్ణ మొక్కఁడుకడకు నెడలఁ, బలుకఁబడు నేని యది యనుప్రాసమయ్యెఁ
గంజలోచన యవి యలంకారశాస్త్ర, కథితములు వీని నెడింటిఁ గానవలయు. 381

సుకరప్రాసము.

క. కమలదళనయన సకలా, గమవేద్య పురాణపురుష కరుణాకర యు
ద్రమహీశప్రియతనయా, రమణ యనుచుఁ బలుక సుఖకరప్రాస మగున్. 382

దుష్కరప్రాసము.

క. దుష్కృతగిరివజ్రాయుధ, పుష్కరసదనాధినాథ బుధనుత దవశో
చిష్కేశాహార యనన్, దుష్కర మని దీనిఁ బలుకుదురు ప్రాసజ్ఞుల్ 383

ద్వంద్వప్రాసము.

క. వ్యాసమునివినుత గోప, స్త్రీసముదయమానహరణ శృంగారరసా
వాసమ్మగ నిట్లు ద్వంద్వ, ప్రాసము కావ్యములఁ జెప్పఁబడు నెల్లెడలన్ 384

త్ర్యక్షరప్రాసము.

క. తిర మగుఁ ద్రిప్రాసము సుందర మగుమారవైరియాపు తరుణులకు మనో

హార మగు దానవులకు భీకర మగుఁ దపసులకు ముక్తికర మగు ననిశన్. 385

చతుష్ప్రాసము.

క. ధీరుఁడు కమనీయశుభా,కారుఁడు కమలావధూటికామృదుహృదయా
ధారుఁడు కుమతిజనాధిక,దూరుఁడు కమలాక్షుఁ డనఁ జతుష్ప్రాసమజా. 386

అంత్యప్రాసము.

క. తొలుతను గురులఘువులతో,పల నెయ్యది పదముతుదిని ప్రాసమనకుఁ డాఁ
పల నిచ్చు నదియె నాల్గడు,గులకడఁ బ్రాసముల మొదలఁ గూర్పఁగవలయున్. 387

తే. అంఘ్రితుదిప్రాయి డాఁపలియక్షరంబు
గురు వయినఁ బ్రాస మొక్కయక్కరమ యగును
గాక లఘువైన వర్ణయుగ్మంబు నడుచు
స్వరవిభేదంబు గాక కావ్యంబులందు. 388

క. నందాంగనాకుమారా, మందరగిరిధీర దనుజమదసంహారా
బృందావనవిహారా, కందర్పాకార రాధికాస్త్రీజారా. 389

క. గోపవధూజనమదనా, గోపాలనచతుర కుందకుట్మలరదనా
గోపారివిజితకదనా, గోపతివాహాప్త ధవళగోసమవదనా. 390

అనుప్రాసము.

క. నందసుత పురందరముఖ, బృందారకవంద్య దాసబృందావన గో
విందా యన ననుప్రాసం, బందం బగు నెందుఁ గృతులయందు ముకుందా. 391

క. పదములకుఁ బ్రాసంబులకును, విడువక చెల్లుబడు లెల్ల వివరించితిఁ బా
ల్పడి వీనిలోన సత్కవు, లొడఁబడి కావలసినవి ప్రయోగింపఁ దగున్. 392

మత్తేభవృత్తకందగీతగర్భసీసము.

సీ. వినయసంపన్నరవిప్రభూతరమణీనాథా పయోజేక్షణా నరాప్త
విభయదాకారహావిర్భగాయతరిపుప్రాణానిలాహీశ్వరా రమేశ
విలయకాలానలవిక్రమ ప్రథితసాల్వగ్రావవృద్ధశ్రవా వరేణ్య
విజయశీలా యదువీర కౌస్తుభధరా చక్రీ యశోదాత్మజా ముకుంద
తే. కరివరద పూతనాంతక గరుడగమన, సత్త్వసహిత కామజనక శంకరసఖ
కనకవసనసుందరదేహ వనధిశయన, సనకమునివినుతచరణసరసిజయుగ. 393

గర్భమత్తేభము.

నయసంపన్నరవిప్రభూతరమణీనాథా పయోజేక్షణా
భయదాకారహావిర్భగాయతరిపుప్రాణానిలాహీశ్వరా

జయకాలానలవిక్రమప్రథితసాల్వగ్రీవపృథక్శ్రవా
జయశీలా యదువీర కౌస్తుభధరా చక్రీ యశోదాత్మజా. 394

గర్భకందము.

కరివరద పూతనాంతక, గరుడగమన సత్త్వసహిత కామజనక శం
కరసఖ కనకవసనసుందరదేహా వనధిశయన సనకమునినుతా. 395

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజసగోత్ర కామెపల్లిపురమందిరనందనందనచరణారవిందవందనాభిలాష మనీషాప్రాభవవేంగనార్యతనూభవ విద్యావిశేషసురాచార్య కాకునూర్యప్పకవివర్యవిరచితం బైనయాంధ్రశబ్దచింతామణి యను వ్యాకరణశాస్త్రంబునందు వళిస్వరూపంబును నేకచత్వారింశన్సంఖ్యావిశ్రామంబులును నగ్రాహ్యవిశ్రామంబులును, ప్రాసలక్షణంబులును, సప్తదశప్రధాన ప్రాసనిర్ణయంబును, ఉభయప్రాసంబులును, శబ్దాలంకారనిరూపణంబునుం గల వళిప్రాసపరిచ్ఛేదం బను తృతీయాశ్వాసము సంపూర్ణము.

# చతుర్థాశ్వాసము



సహ్యాత్రత్యంతో
ర్వ్యసంభృత్పవిత్రభవకృష్ణవేణీతటభూ
[1]వాసైకేశ్వరపూర్వా
శా[2]సత్తసుయోజనప్రసన్న నమస్తే

క. అవధారు శబ్దశాసను, డనని గలియుగమున కాది నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పినయం, ధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దెనుఁగింతుౘ. 2

తే. ఘనుఁడు వాగనుశాసనకవివరుండు, ముందు వర్ణపరిచ్ఛేదమునకుఁ దుదిని
బద్యలక్షణ మెల్ల నేర్పడఁగఁ బల్కె, సారది సంక్షేపముగ నైదుశ్లోకములను. 3

పద్యపరిచ్ఛేదమూలసూత్రంబులు:—

ఆర్యావృత్త శ్లోకంబులు.

వృత్తం జాతి శ్చేతి ద్వివిధం పద్యం గణై ర్నిసర్గాఖ్యైః,
సంబద్ధం వృత్తం స్యా దుపగణమాత్రాభి రన్వితా జాతిః.
శాస్త్రార ఏకమాత్రాం లఘో ర్ద్విమాత్రే గురో రితి వదన్తి,
గౌలౌ గగలలసంజ్ఞౌ గ్లో హాగణో లఘుగురూ లగో వగణః.
గత్రితయం లత్రితయం మనసంజ్ఞా వాద్యమధ్యమాన్త్యార్ణా,
గురువ శ్చే ద్భజసగణా లఘవో యది యరతసంజ్ఞికాః [3]క్రమశః.
మిత్రౌ నగలా వింద్రా నలనగసలభరతా శ్చంద్రా మలఘుః,
రలరగతలతగనవనహాభలభగసలలనలలనగగసవసహాః.
దీర్ఘ స్సంయుక్తాద్యః పూర్ణానుస్వారపూర్వవర్ణ శ్చ,
ఏతే గురవ శ్శేషా స్సర్వే లఘ్వక్షరా ఇతి జ్ఞేయాః.

1 వాసైలేశ్వర (వా); వాసైరేశ్వర (పె); వాసైవేశ్వర(పూ. ము. 1859).
2 సప్త (పూ. ము). 3 క్రమతః (పూ. ము).

వ. ఈశ్లోకంబు [1]లైదును తొమ్మిదినూత్రంబు లయ్యె నవి యెల్ల నిందు వివరించెద. 4

[2]ఆ. సకలభాషలందు ఛందంబు దెలియక, పద్యములు రచింపఁ బాటి గామిఁ
దద్విధం బెఱుంగఁదగుఁ గావ్యములు సేయు, దలఁపు గలిగినట్టిధన్యులకును. 5

మ. హరభక్తుం డగుభీమసత్కవి ననంతామాత్యునిం బెద్దన
ద్యరునిం బాతనఁ గాచిరాజు బసవప్ప స్వైరవు స్సీధరుం
బరమోత్సాహమునం దగం దలఁచి చెప్పం బూనితి న్వారిచే
త రచింపంబడినట్టిఛందములచందం బెల్ల నందంబుగాన్. 6

క. భువి నీఛందముఁ దెలియక, [3]కవితను రచియింతు ననుచుఁ గడఁగుట లెల్లన్
వివరింప నిత [4]నెఱుఁగక, తవిలి యమున దాఁటి పోవఁ దలఁచుట గాదే. 7

ఛందః ప్రభావము.

తే. ఆదిమూలస్వరూపుఁ డైనట్టివేద, పురుషుఁ డాఱు ప్రధానాంగముల వెలుంగు
వాని నెఱిఁగింతుఁ జేదిభూవరకృతాంత, తంగెడాహ్వయదేశమధ్యమనిశాంత. 8

తే. శిక్ష నాస నిరుక్తంబు చెవులు ఛంద్యమం ఘ్రియుగ్మంబు కల్పంబు హస్తయుగము
జ్యోతిషము నేత్రయుగళంబు శబ్దవిద్య, సురుచిరానన మామ్నాయపురుషునకును.

తే. వేదమునకుఁ బాదంబు లై వెలయుకతన
ఛంద మన్నిటిలో నవశ్యంబు గాదె
పురుషుఁ డఖిలాంగయుతుఁ డయ్యుఁ జరణయుగము
లేక నడవ సమర్థుఁడే లోకమునను. 10

క. ఛందశ్శాస్త్రంబులచేఁ, తం దగఁ గూర్పంగఁబడి కడు వాక్యమణుల్
చెందుఁ జతుర్దశవిద్యా, సుందరహారంబు లై యజానిసతిగళమున్. 11

ఛందోవ్యాపకసంప్రదాయము.

తే. అట్టిఛందంబు నంది దా నందె ముందు, శివునిచే నంత నొక్కనిచేత నొకరు
వడసిరి సనత్కుమారకుంభజబృహస్ప, తీంద్ర నాసుకిపింగళాహిప్రముఖులు. 12

క. గురుఁడయి పింగళకాఖ్యో, దరపతి వెసఁ జెప్పె మానిదానవవిద్యా
ధరనిర్ఝరగంధర్వా, ప్సరోభుజగయక్షసిద్ధసాధ్యుల కెల్లన్. 13

వ. తత్స్వరూపం బెట్టి దనిన. 14

క. ప్రేమమున [5]బ్రహ్మ గాయత్రీమహిమగ్రంథకథితదివ్యచ్ఛందో
నామము లింకను దెలిపెదఁ, గామెపల్లీపురనివేశ కంసవినాశా. 15

---

1 లేనును (పె). 2 ఈపద్యము (పె) లో లేదు. 3 కవిత్వము రచింతు (ఓ.; పూ. ము). 4 నేరక (ఓ.; పూ. ము). 5 ధర (ప. పె).

## అనుష్టుప్ [1]శ్లోకత్రయము.

ఉక్తాత్యుక్తా తథా మధ్యా ప్రతిష్ఠా స్యా త్సుపూర్వికా,
గాయత్రు ష్ణిగనుష్టుప్చ బృహతీ పఙ్క్తి రేవ చ. 1
త్రిష్టుప్చ జగతీ చైవ తథా తిజగతీ మతా,
శక్వరీ చాతిపూర్వా స్యా దష్టి రత్యష్టి రేవ చ. 2
ధృతి శ్చాతిధృతి శ్చైవ కృతిః ప్రకృతి రాకృతిః,
వికృతి స్సంకృతి శ్చైవ తథా భికృతి రుత్కృతిః. 3

## పదవిభాగగద్యము.

ఉక్తా, అత్యుక్తా, మధ్యా, ప్రతిష్ఠా, సుప్రతిష్ఠా, గాయత్రీ, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతీ, పఙ్క్తిః, త్రిష్టుప్, జగతీ, అతిజగతీ, శక్వరీ, అతిశక్వరీ, అష్టిః, అత్యష్టిః, ధృతిః, అతిధృతిః, కృతిః, ప్రకృతిః, ఆకృతిః, వికృతిః, సంకృతిః, అభికృతిః, ఉత్కృతిః, ఏతాని షడ్వింశతి శ్ఛందో నామాని.

క. [2]యదుతిలక కామెపలిపుర, సదనా యివి యిరువదాఱుఛందంబులకుం
మొదలంకొని వరుస వెంబడి, సదమల నామములు వీనిఁ జనుఁ దెలియంగాన్. 16

## ఇతిహాసాదిస్వరూపము.

ఆ. కవిత యనుచు నొకటి కల్పించి వాల్మీకి, చెలఁగి రామకథ రచించె మొదల
నతనిఁ జూచి చెప్పి రామీఁదికవు లెల్లఁ, గామెపల్లిగోపకామినీశ. 17

వ. అది యెట్లంటేని. 18

తే. ఎఱుక మును క్రౌంచమిథునంబు నేయఁ గాంచి
వగచి వాల్మీకి దాఁ బల్కువాక్యములను
బద్య మైనను నేర్చి చెప్పంగఁ దొడఁగెఁ
బూర్వరామాయణము నాఁడు పుట్టెఁ గవిత. 19

క. విను మితిహాసము కావ్యము, నన ద్వివిధం బయ్యెఁ గవితయం దితిహాసం
బనుపమచాతుర్యపురా, తనవృత్తం బయ్యె భారతం బదియు కదా. 20

క. పుడమిని గవిచేఁ జెప్పం, బడునది కావ్యం బటంచుఁ బలుకుదు రార్యుల్
తొడిబడ నదియె కదా యిప్పుడు రామాయణ మనంగ భూసుతచరితా. 21

---

1 చ్ఛన్దః (పూ. ము). 2 యదుపతి కామెపలీపుర (పె).

ఆ. ద్వివిధ మయ్యెఁ గావ్య మవని సంగీతసాహిత్యసంజ్ఞలను మహేంద్రవంద్య
సప్తతాళభవము సంగీత మాజయ, దేవకావ్య మదియె పో వచింప. 22

మ. ధర సాహిత్యము గద్యపద్యము లనం దా రెండుభేదంబు లై
పరఁగు న్గద్యమునందుఁ బాదనియతు ల్భావింపఁగా లేవు వా
క్స్ఫురణం బై విలసిల్లఁగా నుడువ నొప్పుం గావ్యుఁ డెంతేనియు న్
మరతంద్రీ మఱి దీనికే వచననామం బయ్యె నాంధ్రంబునన్. 23

గద్యము. శ్రీవిలాసినీపతిశౌరుపాద్యయగిరిదుర్గసర్వాధ్యక్ష, పద్మజాండానేకభరణదక్ష
దక్షజామాతృధాతృప్రథమవిశాలనేత్రప్రముఖనిఖిలబర్హిర్ముఖప్రస్తూయమానశుభ
శీల ధరణీతనూజాదిదైత్యకాలకాలయవనజరాసుతప్రభృతిముఖక్షితిపతినిగ్రహోపా
యపారీణ, సౌందర్యవిజితారవిందబాణ, బాణాభిధానపూర్వగీర్వాణేంద్రసహస్ర
బాహురంభాస్తంభసునిశితకుఠార, ద్వారకాపట్టణవిహార, హారాంగదవలయమకర
కుండలకిరీటాద్యశేషవిశేషభూషణభూషితగాత్ర, భూమిధరారాతిపుత్త్రమిత్ర, మి
త్రకుమారీకాంతికాంతారాంతరలతానిశాంత సంచరణ చరణసముల్లాస, యోగీం
ద్రహృదయపయోజవాస, వాసవరత్నాభ, వారిజనాభ, నాగారిస్యందన, నందగోప
నందన, కరుణాలవాల, కాంచనచేల, భుజగేంద్రశయన, పుండరీకనయన, ఆర్తరక్షణ
పరాయణ, గోవింద, ముకుంద నమస్తే నమస్తే పునస్తే పునస్తే. 24

వ. అని యివ్విధంబున గద్యరూపంబుగా నాదిమధ్యాంతశూన్యుండును, చతుర్దశభువన
మాన్యుండును, సకలసద్గుణసంపన్నుండును, సజ్జనాసన్నుండును, భవబంధమోచనుం
డును, పంకజలోచనుండును, కందర్పకోటివిలాసుండును, గామెపల్లినివాసుండును
నగు గోపాలుని వినుతించుజనంబులకు ధర్మంబు కరతలామలకం బర్ధంబు ముం
గొంగుబంగారంబు, కామంబు తంగేటిచెట్టునం బట్టినజుంటితేనియ పెరయ, మోక్షం
బంగణంబునం గలవేల్పుటా వివి. నిశ్చయం బని విపశ్చిద్వచనంబులు ప్రచురంబు
లై వెలయుచుండు. 25

తే. కొంగను నిషాదుఁ డేయఁ గన్గొనినవామ్మ, లూరుభవునిశోకంబు లకారసహిత
మై కదా శ్లోక మయ్యెఁ బద్యంబు నండ్రు, దానిఁగొంద ఱునాల్గుపాదములకలిమి.

మూ-సూ:—వృత్తం జాతి శ్చేతి ద్వివిధం పద్యం గణై ర్నిస
ర్గాఖ్యైః, సంబద్ధం వృత్తం స్యాదుపగణమాత్రాభి రస్యత్తు జాతిః. 1

తే. పాదనియమంబు గలయట్టిపద్యసమితి
వృత్తములు జాతులును నన ద్వివిధ మయ్యె
నిట నిసర్గగణంబుల వృత్తము లగు
జాతు లుపగణమాత్రల జరగుచుండు. 2

## ప్రథమప్రత్యయోద్ధారణ[1]క్రమము.

క. అత్యాశ్చర్యము లగుషట్ప్రత్యయములు దాన యైనప్రస్తారాఖ్య
ప్రత్యయమువలన గణములు, దైత్యాంతక తెలియఁ జెప్పెద న దెట్లన్నన్. 28

మూ.సూ:—శాస్త్రార ఏకమాత్రాం లఘో ర్ద్విమాత్రే గురో
రితి వదన్తి. 2

క. భరితేందిర కౌమోదకిపురమందిర యొక్కమాత్ర భువి లఘువునకున్
గురువు ద్విమాత్రాయుత మీ, [2]యురవువలన రెండులఘువు లొకగురువునకున్. 29

తే. మహిని లఘువులు నిడుపుగా మఱి శరముల, వైఖరిని వ్రాయ నగు గురుల్ వానిరెట్టి
యగుట రెండేసి రేఖలు దిగువకొనలు, గలయఁగాఁ గ్రొన్నెలలభంగి నిలుపఁదగును.

క. సమవృత్తప్రస్తారక్రమ మిది యో యుక్త మొదలుగా నెన్నవఛం
దము వలయు నన్నిగురువులు, కమలాప్రియ యడ్డచాలుగా నిడి పిదపన్. 31

ఆ. బంతిబంతిమొదల భాన్లిలు గురు వెంచు, దానిక్రింద లఘువు దానిపడిని
బైకి సమము వామభాగోర్వి గురువులు, నయ్యె సర్వ[3]లఘువు లైనదనుక. 32

తే. ఇట్టుల వ్రాయంగ నేఛంద మెన్నిబంతు
లన్నిసమవృత్తములు దానియందుఁ బుట్టె
బంతి యొకొక్కసమవృత్తపాదగణము
లయ్యె నాలుగుపదముల నవియె నిలుచు. 33

ఇందునకుటీక. ప్రస్తార ప్రత్యయ మనంగా: ఇన్నవఛందంబున నెన్నిసమవృత్తంబులు పుట్టెను? వానిలోపల నిన్నవసమవృత్తంబునకు నేయేగణంబు అని యడిగిన సరి చెప్పెడువిధము:—వా రెన్నవఛందమున నడిగిన నన్నిగురువులు అడ్డపఙ్క్తిగాను వ్రాసి ప్రస్తరించునది. అదియెట్లనిన: అబంతి మొదల ఎక్కడ గురు వుండునో దానికిక్రిందగా లఘువును వ్రాయునది. ఆలఘువునకు వలపలను మీఁదను గురువుండిన గురువును లఘువుండిన లఘువును నిలుపునది. ఏమియు లేకుండిన నేమియు వ్రాయక ఊరకుండునది. ఈబంతిని ముందుగా వ్రాసినలఘువునకు ఎడమదిక్కునను మీఁదను గురులఘువులలోపలను ఏది యున్నను దానికిక్రింద గురువే నిలుపుచు వచ్చునది. మీఁదను ఏదియు లేకుండినఁ గ్రిందను వ్రాయఁబనిలేదు. ఇప్పుడు వ్రాసిన క్రమమునసే క్రిందిబంతి చూచి యాక్రిందట దిగుగాఁ దిగుగా బంతిని అన్నియు

1 చక్రము (పె. ప). 2 యొరవు (పూ.ము). 3 గురువు (పె. ప).

లఘువులు వచ్చినదనుక ప్రస్తరించి అన్నిబంతులను లెక్కఁబెట్టఁగా నెన్నియగునో యాఛందమున నన్నిసమవృత్తములు పుట్టిన వనునది. ఎన్నవవృత్తమడిగిన నన్నవ బంతి నున్నగురువులు లఘువులు గణములు చేసి అవృత్తమునకు ఏకపాదమునకు అవిగణము లని చెప్పునది. నాలుగుచరణములకును ఆగణములే నిలుచు నని తెలిసి కొనునది. ఇరువదియాఱుఛందములకును ప్రస్తరించుక్రమము ఈలాగుననే యని తెలిసికొనునది. 34

క. భూమి నిసర్గోపగణస్తోమము వివరింతు వినుము సురరిపుభీమా
కామెపలీపుటభేదనధామా సుగుణాభిరామ శైవలలామా. 35

క. ఉక్తాత్యుక్తా మధ్యల, వ్యక్తం బగునాప్రతిష్ఠయందును గణముల్
సూక్తిమయము లై పుట్టెను, భక్తపరాధీన కామెపలిపురవాసా. 36

## నైసర్గికగణములు, ప్రథమచ్ఛందోజాతగణములు.

క. గా యనఁగ నొక్కగురు వగు, లా యనఁగా ధాత్రి నొక్కలఘునామం బా
నీయక్షరములు గణముల, పై యోగం బైనఁ గలయఁ బలుకఁగ వలయున్. 37

## ద్వితీయఛందోజాతగణంబులు.

మూ-సూ:—గౌ లౌ గగలలసంజ్ఞౌ గ్లౌ హాగణౌ లఘుగురూ లగౌ వగణః. 3

క. గగ మాయె రెండుగురువులు, లగమును వగణంబు నయ్యె లఘువును గురువున్
జగతిని లఘుయుగ్మము లల, మగు గురువును లఘువు గలము హాగణంబు నగున్.

## తృతీయచ్ఛందోజాతగణంబులు.

మూ-సూ.—గత్రితయం లత్రితయం మనసంజ్ఞా వాద్యమధ్యమా న్త్యాన్తాః । గురవ శ్చే ద్భజసగణా లఘవో యది యరతసంజ్ఞకాః క్రమశః. 4

తే. మూఁడు గురువులు లఘువులు గూడిన మన, లాదిమధ్యాంతముల గురు లైనభజస
లవియె లఘ్వక్షరము లైన యరత లయ్యెఁ, గ్రమము దప్పక నెనిమిదిగణములకును.

## ఉపగణోత్పత్తిప్రకారము.

మూ సూ.—మితౌ నగలౌ విం,ద్వౌ నలనగసలభరతా శ్చం,ద్రా

మలఘుః, రలరగతలతగనవనహాభలభగసలలనలలనగగసవనహాః. 5

క. ద్వివిధం బయ్యెను గణచయ, మవని నిసర్గములు నుపగణాలియు ననఁగా
నివి నైసర్గగణంబులు, రవిశక్రశశాంకు లివి ధరణి నుపగణముల్. 40

తే. గరిమ నత్యుక్త మొదలుగాఁ గలుగునట్టి, మూఁట రెండేసిపంక్తులు మొదల విడిచి
మొదల లఘువున్న పంక్తుల మొదల లఘువు, వెండియునునిల్ప రవిశక్రవిధుగణములు.

వ. దీనికి తెలివిడి: అత్యుక్త యను రెండవఛందము ప్రస్తరించిన నాలుగుపంక్తులు వుట్టె
ను, మధ్య యనుమూఁడవది లిఖించిన ఎనిమిదిచాళ్లవును. ప్రతిష్ఠ యనునాలవది వ్రా
సినఁ బదహాఱువీథులవును. ఈమూఁడుఛందములయందును మొదలివి రెండేసిపం
క్తులు విడిచి మిగిలినవీథులలోను ఏవీథి మొదలను లఘువు వుండిన ఆవీథిని ఆలఘువు
నకు మొదలను, మఱియు ఒక్కొక్కలఘువు నిలుపునది. ఇటువలెనే ప్రస్తరించి
యొక్కొక్కచాలునఁ గలగురులఘువులు గణములు చేసిన అత్యుక్తయందలిరెం
డుబంతులవియు సూర్యగణము లవును. మధ్యయందలి ఆఱుచాళ్లవియు ఇంద్రగ
ణము లవును. ప్రతిష్ఠయందలి పదునాలుగువీథులవియు చంద్రగణము లవును. 42

క. నగణమును గురువు నగ మగు, నగణము తుదిలఘువు గదియ నల మనఁ బరఁగుఁగా
నగణముపై గగ ముండిన, నగగం బగు మఱియు నుపగణము లిట్లొప్పుఁగా. 43

క. హాన లర్కగణము లనఁగాఁ, జను నింద్రగణములు భరత సలనలనగముల్
పనివడి జాతులయం దివి, కనఁబడు నక్కరలు మొదలుగా శశి కొప్పుఁగా 44

క. భలభగురుతలతగములును, మలఘురలరగములు నేడు మఱి నవనహాలుఁగా
నలలనగగములు నాల్గును, సలలసవసహాములు మూఁడు చంద్రగణంబుల్. 45

స్వభావగణప్రస్తారము.

ఉక్తాఛందోజాతగణంబులు.

U గగణము.
I లగణము.
వెరసి ౨ ఉభయమున్ను.

అత్యుక్తాఛందోజాతగణంబులు.

UU గగ గణము.
IU లగ గణము.
UI గల గణము(ఇదే హగణము)
II లల గణము.
వెరసి ౪ గణములు.

మధ్యఛందోజాతగణంబులు.

UUU మగణము.
IUU యగణము.
UIU రగణము.
IIU సగణము.
UUI తగణము.
IUI జగణము.
UII భగణము.
III నగణము.
వెరసి ౮ గణములు.

## సూర్యేంద్రచంద్రగణప్రస్తారము

### సూర్యగణములు:—

{ ∪∪ , |∪ }

∪ | గలగణము.

| | | నగణము.

వెరసి ఉభయమున్ను.

### ఇంద్రగణములు.

{ ∪∪∪ , |∪∪ }

∪ | ∪ రగణము.

| | | ∪ నగము.

∪∪ | తగణము.

| | ∪ | సలము.

∪ | | భగణము.

| | | | నలము.

వెరసి ౬ గణములు.

### చంద్రగణములు.

{ ∪∪∪∪ , | | ∪∪∪ }

∪ | ∪∪ రగగణము.

| | | ∪∪ నగగగణము.

∪∪ | ∪ తగణము.

| | ∪ | ∪ సవగణము.

∪ | | ∪ భగురుగణము.

| | | | ∪ నవగణము.

∪∪∪ | మలఘుగణము.

| | ∪∪ | సహగణము.

∪ | ∪ | రలగణము.

| | | ∪ | నహగణము.

∪∪ | | తలగణము.

| | ∪ | | సలగణము.

∪ | | | భలగణము.

| | | | | నలలగణము.

వెరసి ౧౪ గణములు.

### గురులఘువర్ణనియమము.

క. గురువు పరమేశ్వరాకృతి, యరయ లఘువుగిరికుమారి కాకృతి గణముల్
పరికింపఁగఁ దత్ప్రకృతులు, మురహర గణములకు లక్ష్యములు వర్ణంబుల్. 46

మూ. సూ:— దీర్ఘ స్సంయుక్తాద్యశ్చపూర్ణానుస్వారపూర్వవర్ణశ్చ,
ఏతే గురవ శ్శేషా స్సర్వే లఘ్వక్షరా ఇతిజ్ఞేయాః. 6

క. ఇల జమిలియక్కరములకుఁ, బలుసున్నకు నెడమ మూఁది పట్టెడువర్ణం
బులుఁ జూపి పలుకునవియును, లలి గురువులు కడమ లిప్పులు లఘువు లఘారీ. 47

క. విను తన్వంగి యని పల్కిన మూఁడును గురువు లయ్యె గిరిజ యనుచుఁ బ
ల్కిన మూఁడు లఘువులయ్యెను, దనరు లిప్పుల కెల్ల నిట్లు దనుజవిభేదీ. 48

తే. కొమ్ము క్రారలు ద్విత్వా[1]క్షరంబు లగుట, వానిరెండవవి గురువులు వట్రుసుడులు
ప్రాణములు గాన వానిఁ బాపలను గల్గు, నక్కరము లెల్ల లఘువులు నిక్కముగను.

1 వర్ణము (పూ. ము).

ఆ. వ్యంజనాక్షరంబులందుఁ గ్రిందటివ్రాత, లైనవట్రసుడులు నైత్వములును
వాని గూడి యున్న స్వరములు గాని జడ్డక్కరములు గావు యజ్ఞరూప. 50

ఆ. అమృతసదృశ మగు మహావృజినంబును, బిత్రుసమర్చఁ బోలునతిసుకృతము
నమృతసింధుశాయిసమమగు దైవంబు, గలుగ దనఁగ లక్ష్యములు ముకుంద. 51

ఆ. ఆంధ్రకృతులమాట కాదివర్ణము క్రింద, నూఁదఁబడనిజడ్డ లుండెనేని
వానియెడమ నున్న వ్రాలునందును గూడి, గురువు లనుచు గణము గూర్ప వలదు. 52

తే. భవవినుతనామ వ్రజధామ ప్రథనభీమ, కంజదళనేత్ర స్తుతిపాత్ర క్ష్మాకళత్ర
శౌరి ప్రధ్వస్తవైరి భ్రాజత్కిరీట, హారకేయూర యనఁగ లక్ష్యంబు లయ్యె. 53

## సర్వగణలక్ష్యంబులు.

క. ఇలఁ బద్మా యన గగ మై, పొలుచు రమా యనిన వగణమును లగమును నై
వెలయు గిరి యనఁగ లల మగు, లలి లక్ష్మి యనంగ నగు గలము హగణంబుల్.

క. మయరసతజభనగణముల, భయమునఁ బింగళుఁడు దొల్లి పక్షీంద్రునితో
రయమునఁ బల్కినమాటలు, పయిపొల్లు లటంచుఁ జెప్పఁబడు నెనిమిదియుల్. 55

వ. అవి యెయ్యవి యనిన: ధీశ్రీస్త్రీమ్, వరాహాయ్, కాగుహార్, వసుధాస్, సా
తేక్వత్, కదాసజ్, కింపిదభ్, నసహాన్, అనియెడు నీయెనిమిది వాక్యంబులయం
దు నొక్కొకదానికి మొదల నుండెడుమూఁడక్షరంబులకు నైనగురులఘువులకు
నాలవది యగుపొల్లు గణసంజ్ఞాక్షరం బని వియద్గంగాతరంగిణీరంగదుత్తుంగభంగ
శృంగారసంగతోత్తుంగదయాపాంగసుధారసైకపావనాంగుం డగుపింగళభుజంగ
మపుంగవుండు వేదాంగంబునందు మూఁగల నెఱింగించె నట్లు గావున. 56

క. శ్రీరామా యన మగణం, బారయ ఘనుఁ డనఁగ నగణ మగు మధ్యాప్ర
స్తారాద్యవసానంబుల, నీరెండును వెలయుఁ గ్రమత నెఱుఁగఁగ వలయున్. 57

క. ధీరుఁ డన భగణ మొప్పు మురారి యనం జగణ మయ్యె ననఘా యనఁ జె
న్నారు సగణంబు వీనికి, నారయ గురు లాదిమధ్యమాంతగతంబుల్. 58

క. సారది నుపేంద్రా యనినన్, బరుపడి యగణంబు వల్లభా యన రగణం
బరుదగ గోవింద యనన్, ధరఁ దగణము క్రమత లఘుయుతము లీమూఁడున్.

తే. నరమృగా యన నగమగు నరసఖ యనఁ, దలఁకొను నలంబు నరకజైత్రా యనంగ
నగగ మైగను గిరితి జగతి నింద్ర, చంద్రగణములు మఱియును జను నుపేంద్ర.

## గణాధిదేవతాఫలంబులు.

తే. కంసమర్దన కృతమునిగ్రామ్యవర్గ, మాత్రమున శబ్దశాసనసూరివరుని

చేత సంక్షేపముగ మును జెప్పఁబడిన, శుభగణము లిచ్చట వచింతు సుకవు లలర.

మూ. సూ:—యే చ శుభగణా స్త ఏవ కావ్యాదౌ గ్రాహ్యాః. 7

క. తలఁపఁగ శుభఫలదాయక,ములు మంగళదేవతాకములు నగుగణముల్
నిలుపఁ దగు గృతిముఖంబునఁ, దెలిసి కవీశ్వరుఁడు పతి కతిశ్రేయముఁగాన్. 62

ఆ. బాలచంద్రనిభము పార్వతీవల్లభ, దాని యుచ్చరించుతతి ద్విమాత్ర
హారలఁ దక్క— గణములం దెల్ల మొదలను, భూతిదాయి గురువుఁ బొగడ వశమె.

క. శరసన్నిభము లలసజే,తరగణముల మొదల భద్రదాయి పలుకుచో
ధర నేకమాత్ర హిమభూ,ధరనందన దాని లఘువు తరమే పొగడన్. 64

ఆ. గగము భూమిగణము లగ మంబుగణమును, లలము వాయుగణము గలము పావ
కమును మధ్య నైనకతమునఁ దత్సమా,నంబులై శుభాశుభంబు లొసఁగు. 65

క. మయరసతజభనలకు భూ,పయోగ్నిపవనగగనరవిపద్మారిన్ఫణి
వ్యాయు లీశులు శివజయలయ, భయశుభరుగ్ధనముదములు ఫలములు వరుసన్. 66

వ. అది యెట్లనిన నథర్వణవేదముఖంబున మగణంబు వసుమతీదేవతాకంబు గావున శివ ప్రదంబని మహానాటకంబునందు "విఘ్నేశో నస్సహాయః" త్తని హనుమంతుం డును, సూర్యశతకంబునందు, "జంభారాతీభకుంభోద్భవ" మని మయూరుండును, మేఘసందేశంబునందు "కశ్చిత్కాంతావిరహగురుణా" యని కాళిదాసుండును, కాలామృతమునందు "శ్రీమద్వేంకటనాయక" మ్మనిమదీయాన్వయప్రభవుం డగు తిరుమలభట్టారకుండును, భారతంబునందు "శ్రీవాణీగిరిజా" యని నాగనుశాసనుం డును, కవిజనాశ్రయమునందు, "శ్రీకాంతా" యని వేములవాడభీమకవియును, ఛందంబునందు "శ్రీరామాస్తనమండలీమిళితకాశ్మీరార్ద్రవక్షంబుతో" నని య నంతుండును మొదలం గదియించిరి. యాజుషామ్నాయాద్యం బగుయగణంబు జీవ నదేవతాకంబు గాన జయప్రదం బని యాదికావ్యంబునందు, "తపస్స్వాధ్యాయ నిరత"మ్మని వాల్మీకియు, ప్రథమశైవస్తవంబునందు "మహిమ్నః పారంతే" యని పుష్పదంతుండును, సౌందర్యలహరియందు "శివ శ్శక్త్యాయుక్తో" యని శంకరా చార్యభారతులును తొలుత నిలిపిరి ఋక్సామంబులకుం బ్రథమం బగురగణ మా శ్రయాళదేవతాకంబు గాన లయప్రదం బని యెల్లవారు నాది నిడ నోడిరి. కవి కంఠపాశంబునందు "వ్యోమసూర్యం వితనుతే" యనిపల్కి—నకలంబునఁబంచత్వంబు నొందె. సగణంబు దహనసఖదేవతాకంబుగాన భయప్రదంబని కవివరులు మొదలం గూర్చి వెఱచిరి. వెఱపక 'శాలినీసహాకారంబు' నందు "అవలంబ్యాస్వహేరంబ" మని సార్వభౌముండును, వృత్తరత్నాకరమునందు "సుఖసంతానసిద్ధ్యర్థ" మని కేదా రకవియును రచియించి పంచత్వంబునొందిరి. 67

తే. గగన మేలిక గావునఁ దగణమునకు, ఫలము శూన్యం బటంచు రాపలుకు
యఖిలభూతంబులందు నిత్య మయి నిల్చు, వ్యోమము శుభ ప్రదంబుగాకుండు టెట్లు.

ఆకాశము నిత్యమైనందుకు భాగవతము ద్వితీయస్కంధమునందు.

ఉ. సర్వఫలప్రదాతయును సర్వశరణ్యుఁడు సర్వ[1]శక్తియుక్
సర్వజగత్ప్రసిద్ధుఁడును సర్వ[2]గుణుండును నైనచక్రి యా
సర్వశరీరులు [3]న్విగతసంగతిఁ జెంది [4]విశీర్యమాణు లై
పర్వినచో [5]నభంబుగతి బ్రహ్మము దాఁ జెడ కుండు నెప్పుడున్. 69

తే. ఎల్లరను శుభదము లని యెన్నినట్టి, గణములకు వ్రాయు చోపాటి? కాని వనిన
దజలు మంచివిగా వ్రాయఁ దగు మహాకవి ప్రయోగలక్ష్యంబులు వెదకి చెప్ప.

వ. అవి యెయ్యవి యనినఁ బ్రక్రియాకౌముదియందు "యేనాక్షరసమామ్నాయ" మని ధర్మకీర్తియు, తర్కభాషయందు "బాలోపి యో న్యాయనయే" యని కేశవమిశ్రుండును, మంత్రదర్పణమునందు "అధారపద్మవనఖేలనరాజహంసీ" మనిపృథివీధరాచార్యుండును, కృష్ణవిజయంబునందు "పాయా దపాయా" త్తని వసుమాయాధుండును, సామసాంకంబునందు "అవ్యాత్సవో" యని పరిమళుండును కావ్యాదిని బ్రతిపాదించిరి. మఱియు "ఆరోగ్యం భాస్కరా [6]దిచ్ఛేత్" యని మనువచనంబు గలుగుటంజేసి. 71

తే. అరయ నారోగ్యకరుఁ డైనయరుణుఁ డేలు
జగణమున నెట్లు రోగంబు సంభవించుఁ
గాంతి యగుఁ గాని రోగంబు గాదు దుక్క
దార్థ మనుచు నెల్లంకితాతప్ప చెప్పె. 72

వ. కావున శిశుపాలవధంబునందు "శ్రియః పతి శ్శ్రీమతి" యని వణిజ్మాఘుండును, కిరాతార్జునీయంబునందు "శ్రియః కురూణా" మని భారవియును, మణిదర్పణమునందు "దివాకరంనమస్కృత్య" యనియును [7]శాకుననామగ్రంథంబునందు "విరించి నారాయణశంకరేభ్య" యనియును చప్పన్నంబునందుఁ "బ్రణమ్య లోకకర్తార" మనియును భోజరాజీయంబునందు "సునీతిశాస్త్రసద్విద్యా" యనియును మందరం

1 శక్తుఁడున్ (అచ్చు. భా). 2 గతుండగు చక్రపాణియా. 3 విగమ. 4 విశీర్య. 5 నభంగ. (అచ్చు. భా.) ఈపాఠము అప్పకవిమతమున కాధారము గాదు. నభంబుగతి యన్నచో యాకాశమునకు బ్రహ్మమునకు సమానధర్మమగు నిత్యత్వమేర్పడును. 6 దిచ్ఛేత్ (ప). 7 లాకునలనామశాకునగ్రంథంబునందు (పె); లూకుండును శాకునవనామ (ప).

బొందించిరి. భగణంబు సుధాకరదేవతాకంబు గాన ధనప్రదం బని శుభ మపేక్షించి భారతశేషమగువిరాటపర్వము ప్రారంభించునప్పుడు, "శ్రీ యన గౌరి నాఁబరఁగు" నని తిక్కనయును, శ్రీమద్రామాయణమునందు "రామునిశుభచరితములను" అని భాస్కరుండును, యుద్ధకాండమునందు లంకాదహనముపట్టుకథ ఉపక్రమించుచును "శ్రీయుతమూర్తియైన" యని యయ్యలభట్టారకుండును, నృసింహపురాణమునందు "శ్రీకి నిరంతరం" బని ప్రబంధపరమేశ్వరుండును, రుక్మాంగదచరిత్రమునందు "శ్రీమయపత్రముల్ జడలు" అని ప్రౌఢకవిమల్లనయుం బ్రయోగించిరి. నగణం బమృతాంధోనాథదేవతాకంబు గాన సకలభోగప్రదం బని నలోదయమునందు "హృదయసదా" యని కాళిదాసుండును, శివభద్రంబునందు "ప్రణమితశిరసి" యని కవివరుండును, ఆరణ్యపర్వావశిష్టంబునందు భీమకవిశాపభయంబున జయము గోరి "స్ఫురదరుణాంశురాగరుచి" యని శంభుదాసుండును, త్రిస్థలీదండకమునందు "విజయనగరహేమకూటంబున న్నిల్చి" యని నందితిమ్మనయుం జెప్పిరదియునుం గాక. 73

సీ. గ్రహములలోన భాస్కరునిచందంబునఁ దరులలోఁ బారిజాతంబుకరణి
క్ష్మాధరంబులలోనఁ గనకాద్రికైవడి నదులలో జహ్నుకన్యకవిధమున
దైవతంబులలోన దైత్యారిచాడ్పునఁ బ్రమథులలో శూలపాణిపగిది
[1]మృగములలోన గరిద్వేషిభాతిని వివిధవిద్యలలోన వేదముక్రియ

తే. క్షేత్రములలోన వారణాశీస్థలంబు, శ్రీవిభవములలోన నైరావణంబు
రీతి గణములలోనఁ జర్చించి చూడ, నగణ మొప్పారు శుభనిధానంబు గాన. 74

. కృతి మొదల నిలిచినప్పుడు, మతిఁ దలఁపఁగ నుపగణములు మగణాదులతో
జత గూడి యూఫలంబులె, పతి కిచ్చు రవీంద్రశీతభానులమహిమన్. 75

## అష్టగణ[2]లక్షణంబులు.

సీ. చంద్రసూర్యాగ్నిలోచనుఁ డగుముక్కంటిమూఁడునేత్రములను మూఁడుగురువు
లావిర్భవించి మధ్యాహ్నందమున కాదియై మగణం బయ్యె నంమవలన
జనియించెఁ బ్రస్తరించినక్రమమున యరసతభజన లనంగ సప్తగణము
లివి. మగణముఁ గూడ నెనిమిదిగణము లై తనరు వీటికి రూపదైవతర

తే. కులరసస్వరదిగ్వామగోత్రయోని, గణభరాశిగ్రహాతదీయకాంతిజనక

1 'మృగములలోఁ గరిద్వేషిభాతినిజూడ' అనిపూర్వముద్రణములం దన్నిటఁ గలదుగాని యతిభంగము. 2 పూ. ము. అన్నిటను 'లక్ష్యంబు' లనియున్నది; గాని తప్పు.

తనయఫలములు నాఁబడునెనిమిదియును, దెలిసి కృతిముఖమునఁ గూర్పవలయుఁ గృష్ణ.

### మగణలక్షణము.

సీ. అలఘుత్రయంబు కాశ్యపము గోత్రము వన్నె పచ్చన సంతతి పాదజంబు
ధరణి దైవంబు రౌద్రము రసంబు శుభంబు ఫల మాదియామ మూత్పత్తివేళ
స్వరము మధ్యమము శంబరయోనియును దైత్యగణమును నగువృషర్క్షంబు తార
వృశ్చికాఖ్యము రాశి విపులాకుమారుండు గ్రహము వానిశరీరకాంతి యెఱుపు
తే. ప్రమథనాథునిలోచనత్రయము జన్మభూమి గారాపుపట్టి యంభోగణంబు
మందిరము శంభుకోణంబు మగణమునకు, దానవవినాశ కాంచెపల్లినివేశ. 77

### యగణలక్షణము.

సీ. ఆదిలఘువు ద్వితీయప్రహరము జన్మవేళ బ్రాహ్మ్యంబు భావింపఁ గులము
గౌతమగోత్రంబు కారుణ్యము రసంబు జలము దైవమ్ము పంచమము స్వరము
కపియోని మర్త్యంబు గణము పూర్వాషాఢ నక్షత్ర మిష్వాసనంబు రాశి
గ్రహము గురుండు తత్కాంతి పీతాభంబు పడుఁబునిదిక్కు నివాసభూమి
తే. తండ్రి ధరణి గణంబు సంతాన మగ్ని, దేవతాకంబు ఫల మతిభావుకంబు
హరిణవర్ణంబు తనుకాంతి యగణమునకు, దానవవినాశ కాంచెపల్లినివేశ. 78

### రగణలక్షణము.

సీ. మధ్యమలఘువు యామంబు మూఁడవయది క్షాత్రంబు కులము రక్తంబు ఛాయ
దైవతంబు స్వరంబు దైత్యంబు గణము దస్రము యోని శతతార జన్మభంబు
రాశి కుంభము వికర్తనసుతుండు గ్రహంబు ఖంజనాభంబు తత్కాయకాంతి
శృంగారము రసంబు కృష్ణవర్త్మ యధీశుఁ డాంగిరసము గోత్ర మంబుగణము
తే గణుతి సేయంగఁ గడుపారఁ గన్నతండ్రి, యనఁగఁ బట్టి సకారంబు వ్యథఫలంబు
రచ్చపట్టు హుతాశాశ రగణమునకు, దానవవినాశ కాంచెపల్లినివేశ. 79

### సగణలక్షణము.

సీ. గురు వంత్యవర్ణంబు ఘోరంబు రసము వంశంబు పంచమము తేజంబు నలుపు
ధవుఁడు మారుతము గోత్రంబు కౌశిక మునిక్కుపట్టు వాయువ్యంబు ఫలము లయము
నాకేశము గణంబు హస్త తారక యోని మహిష మంగనరాశి గ్రహము బుధుఁడు
వానిదేహము పీతవర్ణంబు స్వరము గాంధారంబు యామంబు నాలవయది
తే. యొడుచేతులు గలదయ్య మేలునట్టి, వ్రాయి జనకుఁడు గగన దైవత్య మూర్తి
సంభవుం డెంచి చూడంగ సగణమునకు, దానవవినాశ కాంచెపల్లినివేశ. 80

తగణలక్షణము.

సీ. అవసానమున లఘు వాకాశ మీశుఁడు రసము శాంతంబు భార్గవము గోత్ర
మనిలదైవత్యంబు జనకుఁడు వనజబాంధవదైవతాకుండు నందనుండు
జనన మగ్రజము పంచమము యామము వర్ణ మసితంబు ఫలము శుభాభివృద్ధి
సౌరంబు గణము పుష్యమి తార బస్తంబు యోని రాశి కుళీర ముడువిభుండు
తే. గ్రహము తద్విగ్రహచ్ఛవి తుహినశైల, సన్నిభంబు నిషాదసంజ్ఞంబు స్వరము
తావు దేవేంద్రభాగంబు తగణమునకు, దానవవినాశ కామెపల్లినివేశ. 81

జగణలక్షణము.

సీ. నడుచక్కి నుండునర్ణము గురు వాలివయది యామ మన్వావాయంబు క్షత్రి
యము రుక్కు ఫలము శోణాభంబు రుచి నభోగణ మయ్యుశీతాంశుగణము కొడుకు
నరసంజ్ఞికంబు గణంబు యోని వృషంబు రెండవఫల్గుని రిక్క రసము
వీరంబు రాశి కంఠీరవం బాత్రేయగోత్ర మంబరచారి కువలయారి
తే. యతనిమైచాయ కెంపు పూర్వాశ యిరవు
ఋషభసంజ్ఞంబు స్వరము త్రియీతనుండు
జలజబంధుఁడు వేలుపు జగణమునకు
దానవవినాశ కామెపల్లినివేశ. 82

భగణలక్షణము.

సీ. ప్రథమాక్షరము ద్విమాత్రము కాపిలము గోత్ర ముత్తరం బిరవు మహోరగంబు
యోని మృగోత్తంబు లుడురాసు లుశనుఁడు ఖచర మాతఁడు మల్లికానిభాంగుఁ
డూరుజంబు కులంబు నూరదైవత్యంబు జనకుఁ డైంద్రము చూలు స్వరము షడ్జ
మధిపతి జాబిల్లి యాదితేయంబు గణంబు సప్తమము జన్మప్రహారము
తే. రసము హాస్యంబు వన్నియ రజతనిభము, ఫలము ధనహేమమణివస్త్రపశుతనూజ
పరిజనాశ్వాదిసంప్రాప్తి భగణమునకు, దానవవినాశ కామెపల్లినివేశ. 83

నగణలక్షణము.

సీ. ఏకమాత్రలు మూఁడు నింద్రుఁడు పతి యద్భుతము రసంబు నిశితదైవతాక
మారయ్యఁ దండ్రి బృందారకాధీశునిదంతావళం బుండుతావు నెళవు
దివ్యభోగం బీగి తెలుపు వర్ణము జాతి విప్ర ముద్భవవేళ వేగుజాము
రవము షడ్జము ప్రవరంబు వాశిష్ఠంబు చుక్క రేవతి గాము సురగురుండు
తే. వాని తేజంబు పచ్చన యోని గజము, రాశి మీనంబు గణము సుధాశనంబు
నందనుఁడు లేఁడు మధ్యను నగణమునకు, దానవవినాశ కామెపల్లినివేశ. 84

### దేవతాంకితనియమంబులు.

క. స్వరమును జామును దిక్కును, బరికించి కవీశ్వరుండు పదపద్యంబుల్
సురనామాంకితములుగా, విరచించినఁ గలుగు సకలవిభవము లెపుడున్. 85

### స్వరకూటము.

క. నిరతము నిషాదముఖ్య, స్వరములపదములు రచించుచక్కని దత్త
త్స్వరగణములె మొదలను గూ, ర్తురు గానకళాయుగంధరులు భద్రేచ్ఛన్. 86

### యామకూటము.

క. పనివడి పద్యం బేజా, మునను రచింపంగ వలయు మొనలను నాజా
మునఁ బుట్టినగణ మిడఁ దగు, ఘననికాశ ప్రకాశ కౌమెపలీశా. 87

### దిక్కూటము.

క. ఏదిక్కున నెలకొను గణ, మాదిని గూర్పంగఁబడియె నపుడు కృతికిఁ దా
నాదిక్కున కభిముఖమై, మోదంబునఁ జెప్ప వలయు మురనరకహరా. 88

### నరాంకితనియమంబులు; దగ్ధాదితారలు.

తే. దగ్ధమును జ్వలితము ధూమితంబు మృతము, గదయుతము నగుతారలగణము లాది
నిడఁగ నొల్లరు విభునకు నిష్టసిద్ధి, గలుగఁ గోరెడునట్టిసత్కవులు కృతుల. 89
వ. వీనిలక్షణం బంతయు ముందర రెండవపరిచ్ఛేదంబున వర్ణదుష్టతారానిర్ణయంబు
నందు విస్తరింపఁబడియెఁ గావున నది చూచి తెలిసికొనునది. 90

### నాయకకూటంబులు.

చ. అలయక కబ్బపుందొరకు నాదిగణంబునకుం గ్రమంబునన్
గులములు యోని లింగములు గోత్రములు న్మతి కాంతులు న్గణం
బులు నుడురాశి ఖేటములు బొందిక లై శుభదాయకంబు లై
వెలయ నరాంకితంబులు గవిప్రవర ల్రచియింపఁగాఁ దగున్. 91
క. కుతలమున వధూవరులకుఁ, జతురత దైవజ్ఞమణి విచారించుగతిన్
కృతికన్యానాయకులకు, హితమతిఁ దెలియఁ దగు సుకవి యివి తొమ్మిదియున్.

### గణకులకూటము.

తే. నాథుకులమును మొదలిగణంబుకులము, నొకటి గాక విజాతు లై యుండె నేని
భిన్నకులజాత యగుచంద్రబింబవదన, గేలు వట్టినపగిది దుష్కీర్తిఁ జెందు. 93

### గణయోనికూటము.

క. జా నగునాయకతారా, యోనియుఁ గృత్యాదిగణభయోనియు వైరం
బూనక యుండ వహాల్యా, జానివచనమున నెఱుంగఁ జను సుకవులకున్. 94

తే. తత్తదాఖ్యాముఖార్ణసంతతికి నైన, తారకలు గావు ఛందోమతంబునందు
జన్మతారక లని బహుజనము లాడు, కతన నవియె వచించితి గణములకును. 95

క. వర్ణపరిచ్ఛేదంబున, వర్ణములకుఁ గూటనిర్ణయం బంతయు వి
స్తీర్ణముగా మును జెప్పితిఁ, గర్ణాహితమిత్ర దానిఁ గని తెలియ నగున్. 96

గణలింగకూటము.

క. మొనగణమురిక్కలింగంబును బతినక్షత్రలింగమును వైరముఁ జెం
దిన నాయకుధన మెల్లను, మనుజపతి హరించుఁ బంచమాసంబులకున్. 97

గణగోత్రకూటము.

క. పతిగోత్రప్రవరములో, సతతంబును బలుకఁబడిన సన్మునిగోత్రం
కితము లగుగణము లతినింద్యితములు కావ్యాది [1]నాదితేయసహాయా. 98

గణకాంతికూటము.

తే. నాయకునికాయ మేచాయ నలువు మీఱు, నరసి తద్వర్ణమునఁ దనరారునట్టి
గణము పద్యాదిఁగూర్చినఁగలుగు శుభము,వ్యత్యయంబయ్యెనేని దేహంబుచెడును.

క. శ్వేతము నీలము నేకము, భూతలమున రక్తపీతములకు నభేదం
బై లసరు నరతనుద్యుతు, లీతెఱఁగునఁ దెలియవలయు నిభపతివరదా. 100

గణదేవాదికూటము.

తే. గద్యపద్యాదిగణతారకాగణంబు, భర్తృనక్షత్రగణమును బంధు లైన
వత్సరశతంబు బ్రతుకుఁ గావ్యప్రభుండు, మైత్రి లేకున్న నెలకు ధర్మపురిఁ జేరు.

గణనక్షత్రదూరము.

ఆ. ఆదిగణమురిక్క కధిపతినక్షత్ర, మెన్నఁ బదియు మూఁటి కెక్కుఁడైన
బ్రతుకు నూఱువత్సరంబులు కృతినేత, తక్కువైన వేగఁ దనువు విడుచు. 102

గణరాశికూటము.

క. పదపద్యగద్యముఖమున, [2]గదియు గణమురాశి[3]నుంచి గణుతించిన నా
రదనుత విభురాశి శుభప్రద మై యుండంగ సుకవి పరికింపఁ దగున్. 103

గణఖేటకూటము.

క. మహిమన్నధినాయకురాశి, గ్రహమును గృతిముఖగణోడురాశిగ్రహమున్
మిహిరేంద్రదులు దమగతిలో, సుహృత్తు లై యున్న సరియ చుట్టము గాదే. 104

1 నాడె నేనసహాయా (పూ. ము). 2 గదయు (వె.ప. పూ. ము.) లోను, ఆ. 126 వ పద్యములోనున్నది. 3 తాటాకుపుస్తకములలో 'నుంచి' అనియేయున్నది.

# చతుర్థాశ్వాసము.

క. కొందఱు జ్యోతిశ్శాస్త్రము, పొందు వదలి భిన్నమార్గముల గణములకుం
బొందింతురు గ్రహముల నా, చందమునకు గణము శాస్త్రసాధక మెందున్. 1

## కృత్యాదిగణద్వయకూటములు.

తే. మొదల నుండుగణద్వయంబునకు లెస్స, జూడఁ దగు యోనిలింగగణోడురాశి
ఖచరతత్కాంతినైసర్గికరసనామ, కూటములు తొమ్మిదియును నిశ్చటదమన. 1

ఆ. ప్రథమగణము వధువు పైగణంబు వరుండు, నగుట నాగణద్వయంబునకును
బొత్తు గలిగినట్టిపొత్తంబు ముంగిటఁ, గలుగువేల్పుటావు గాదె పతికి. 1

ఆ. తొలుత నేడుకూటములు మాత్ర కొపరి, చ్ఛేదమునను దెలియఁ జెప్పఁబడియెఁ
గాన వాని మాని కడమవి రెండును, వివరపఱుతు నిచటఁ గవులు వొగడ. 1

## గణనైసర్గికకూటము.

ఆ. తండ్రికొడుకు లగుచుఁ దనరారుగణములు, గలసి మెలసి కృతిముఖమున నిలుప
[1]రసలనడుమఁ బచ్చికసవు మేచిన మందు, నగ్నిపవనగణము లగుట నేమొ. 1

క. సుతజనకులు [2]గదిసిన ధన్యయుతుఁ డగుఁ గృతిభర్త రెండు నొకగణ మైనన్
గుతలాధినాయకుం డగు, నితరగణద్వయము గూడ నిలపైఁ గూలున్.

## గణరసకూటము.

క. మొగదలఁ గలగణయుగమున, కగపడురసములకు వైర మగుపాత్రము భ
ర్తగళంబునఁ జుట్టినపాముగతిం దత్ప్రాణపవనములు భక్షించున్.

తే. తలఁప శృంగారబీభత్సములకుఁ బగలు
హాస్యకృపలకుఁ బోరు రౌద్రాద్భుతముల
కధికవైరంబు వీరభయానకముల
కీను శాంతంబునకుఁ జెలు లెనిమిదియును.

క. రసములకు రెంటికిని సమ్యరసమైన శుభంబు వైరరససంగతి సా
ధ్వస మొకరసమైనను సంతస మన్యరసములు గూడినను ముద మొదవున్. 11

## ప్రశస్తకూటంబులు.

తే. క్షితిసురల కాఱు ధారుణీపతుల కైదు, వైశ్యులకు నాల్గు శూద్రాంత్యవర్ణములకు
మూఁడురెండును శుభకరంబులయియున్నఁ, జాలుననియె సంహితలోన శౌనకుండు.

తే. విప్రులకు గ్రహమైత్రి మర్త్యపతులకు, గణవిధము వైశ్యులకు రాశిగణన శూద్ర
నీచులకు యోనితార లిన్నింటిలోనఁ, గడుఁ బ్రశస్తము లివి వృద్ధగర్గమతము.

## దోషాదోషబాహుళ్యఫలంబులు.

ఆ. స్వల్పదోషములును సమధికగుణములు, నైన నుత్తఫలము లధిక మగును

1 పసల (పె.ప). 2 గలసిన (పె)

సద్గుణంబు లిచ్చు సప్తాశ్వపవమాన, కీలిగణము లిడవు కృతిముఖమున. 116

తే. గుణము లవగుణములకన్నఁ గొంచె మైన, నాథునకు మెండు దుష్టగణంబు లిచ్చు
పోఁకనీయ వొకింతయు శుభగణములు, నిజఫలములను బద్యాది నిలిచినపుడు. 117

మగణద్వయయోగమునకు:—

1. యోనికూటము, రెండును హారిణయోనులే కాన ఏకయోనులే కనుక మంచిది. 2. లింగకూటము, జ్యేష్ఠ ప్రథమయోని గానఁ బుల్లింగనక్షత్రము రెండును బుల్లింగతారలే అయెను. పోరుపుట్టినఁగాని మొదలిగణము వధువును రెండవగణమువరుఁడును గనుక స్త్రీకి పుల్లింగతారఅయినందుచేతను అదోషముపనిలేదు. 3. గణకూటము, రెండును రాక్షసగణములే కనుక ఉత్తమము. 4. ఉడుకూటము, మొదలిగణము తారనుండి రెండవగణము తారదనుకను లెక్కపెట్టవలెను గనుక రెండింటికిని జ్యేష్ఠయొక్కటే అయెనుగనుక లెక్కకు మొదలిదేఅయెను. పదమూఁడులోపలఉండుటచేతను కృతిపతికల్పాయువు. 5. రాశికూటము, ప్రథమగణరాశినుండి ద్వితీయగణమురాశిదనుకను నెన్నవలెనుగనుక రెండునువృశ్చికరాసులే కనుక సంఖ్యకుఁదొలుతటిదేఅయెనుగనుక సామ్రాజ్యము. 6. ఖేటకూటము, రెంటికినికుజుఁడేకనుక మంచిది. 7. గ్రహాకాంతికూటము, అంగారకుఁడెఱుపుగనుక పాపియాయెను. అరెంటికిని పాపగ్రహమైనను వతఁడొక్కఁడే కనుక సుఖము. 8. నైసర్గికకూటము, రెండును మగణాలే కనుక కుతలాధినాయకత్వము. 9. రసకూటము, రెండును రౌద్రరసములేఅయెను గనుక సంతసము. వీనికి తేరుగడవివరము: ఉడుకూటమొకటి చెడ్డదియు, కడమకూటము లెనిమిదియు మంచివిగనుక దోషము కొంచెమును గుణములు చాలానుగాన అదినున్నమగణము తనమీఁద మగణమునిల్చినప్పుడు తానిచ్చుశుభఫలమధికముగానిచ్చును.

మగణయగణయోగమునకు:—

1. యోనికూటము, హరిణకపులు భిన్నయోనులుగనుక కొంతమేలు. 2. లింగకూటము రెంటికిని పుల్లింగతారలే కనుక పోరు పుట్టును. అయిన నేమి? మొదలిగణము వధువు గనుక స్త్రీకిఁ బుంలింగతార అయినందుచేతను అదోషముపనిలేదు. 3. గణకూటము, రాక్షసమనుష్యగణములు గనుక నాశనము. 4. ఉడుకూటము, జ్యేష్ఠకు పూర్వాషాఢ మూఁడవనక్షత్రముగనుక పదమూఁటికి లోపలనుండుటచేతను కృతిపతి కల్పాయువు. 5. రాశికూటము, వృశ్చికమునకు ధనుస్సు రెండవరాశి గనుక నిర్ధనము. అయిన నేమి? వృశ్చికాధిపతి యైనకుజుఁడును ధనురధిపతి యైన గురుఁడును నన్యోన్యమిత్రులుగనుక నారదమతమున అదోషము పనిలేదు. 6. ఖేటకూటము, కుజగురు లన్యోన్యమిత్రులు గనుక మంచిది. 7. గ్రహాకాంతికూటము, కుజుఁ డెఱుపుగనుక పాపియు, గురుఁడు పచ్చనగనుక శుభుఁడునుగాన పాప

శుభయోగము గనుక జగడము వచ్చును. 8. నైసర్గికకూటము, ప్రస్తరించునప్పుడు మగణమువలనను యగణము పుట్టుటచేతను మగణము తండ్రియు యగణము కొడుకును గనుక సుతజనకయోగమున నిధనము. 9. రసకూటము, రౌద్రకారుణ్యరసము లన్యములు గనుక సుఖము. 10. వీనికిఁ దేరుగడవివరము: గణోడుగ్రహకాంతికూటములు మూఁడును చెడ్డవియుఁ గడపకూటము లాఱును మంచివి గనుక దోషము కొంచెమును గుణములు చాలాను గనుక మగణము తనమీఁదను యగణము నిల్చినప్పుడు తా నిచ్చుశుభఫల మధికముగా నిచ్చును.

మగణరగణయోగమునకు:—

1. యోనికూటము, హరిణతురగములు భిన్నజంతువులు గనుక కొంతమేలు. 2. లింగకూటము, పుంలింగ స్త్రీలింగతారలుగనుక ఉత్తమము. 3. గణకూటము, రెండును రాక్షసగణములే కనుక మంచిది. 4. ఉడుకూటము, జ్యేష్ఠకు శతతార యొనిమిదవ నక్షత్రము గనుక పదమూఁటికి లోపలనుండుటచేతను కృతిపతి కల్పాయువు. 5. రాశికూటము, వృశ్చికమునకుఁ గుంభము నాలుగవరాశి గనుక సామ్రాజ్యము. 6. ఖేటకూటము, కుజునకు శని సముఁడు ఆమందునకు భౌముఁడు శత్రుఁడు కాఁగాను సమశాత్రవముగనుక కీడు. 7. గ్రహకాంతికూటము, కుజుఁడెఱుపును శని నలుపును గనుక నిద్దఱును పాపగ్రహములే కాన మృత్యువు. 8. నైసర్గికకూటము, మగణతగణము లితరగణములు గనుక మరణము. 9. రసకూటము, రౌద్రశృంగారము లన్యరసములుగనుక ముదము. 10. వీనికిఁదేరుగడవివరము: ఉడుఖేటగ్రహకాంతి నైసర్గికకూటములునాలుగును చెడ్డవి కడపకూటములయిదును మంచివి గనుక దోషములు కొంచెమును గుణములు చాలాను గనుక ఆదినున్నమగణము తనమీఁదను రగణము నిలిచినప్పుడు తా నిచ్చుశుభఫల మధికముగానిచ్చును.

మగణసగణయోగమునకు:—

1. యోనికూటము, హరిణమహిషములు గనుక కొంత మేలు. 2. లింగకూటము, పుంలింగ స్త్రీలింగతారలు గనుక నుత్తమము. 3. గణకూటము, రాక్షసదేవగణములు గనుక నధమము. 4. ఉడుకూటము, జ్యేష్ఠకు హస్త యిరువదినాలుగవనక్షత్రముగనుక పదుమూఁటికిపై నుండుటచేతను కృతిపతికి శతాయువు. 5. రాశికూటము, వృశ్చికమునకుఁ గన్యపదునొకొండవరాశి గనుక దైన్యము. 6. ఖేటకూటము, కుజునికి బుధుఁడు శత్రుఁడు ఆసౌమ్యునకు భౌముఁడు సముఁడు కాఁగాను సమశాత్రవము గనుక కీడు. 7. గ్రహకాంతికూటము, కుజుఁ డెఱుపు గనుక పాపి బుధుఁడు పచ్చ గనుక శుభుఁడు అయినను క్రూరగ్రహముతోఁ గూడినప్పుడు తానును క్రూరుండే కావునను ఖలద్వయయోగము గనుక మృత్యువు. 8. నైసర్గికకూట

ము, మగణసగణము లితరగణములు గనుక మరణము. 9. రసకూటము, రౌద్రభయానకము లన్యరసములు గనుక మధ్యము. 10. వీనికిం దేరుగడవివరము: గణరాశిఖేటగ్రహతత్కాంతికూటము లైదును జెడ్డవియుఁ గడమకూటములు నాలుగును మంచివి గనుక దోషములు చాలాను గుణములు కొంచెమును గనుక మగణము తనమీఁదను సగణము నిలిచినపుడు తా నిచ్చుశుభఫలము అధికముగా నియ్యదు.

మగణతగణయోగమునకు:—

1. యోనికూటము, హరిణమేషములు భిన్నజంతువులు గనుక కొంత మేలు. 2. లింగకూటము, పుంలింగస్త్రీలింగతారలుగనుక నుత్తమము. 3. గణకూటము, రాక్షసదేవగణములు గనుక అధమము. 4. ఉడుకూటము, జ్యేష్ఠకుం బుష్యమీనక్షత్రము పందొమ్మిదవది గనుక పదుమూఁటికిం బై నుండుటంజేసి కృతిపతికి శతాయువు 5. రాశికూటము, వృశ్చికమునకుం గర్కాటము తొమ్మిదవరాశి గనుక నపత్యము. 6. ఖేటకూటము, కుజునకుం జంద్రుఁడు మిత్రుఁడు ఆశశికి మంగళుఁడు సముఁడును గాఁగాను సమమిత్రము గనుక భద్రము. 7. గ్రహకాంతికూటము, కుజుఁ డెఱుపు గనుక పాపియుఁ జంద్రుఁడు తెలుపుగనుక శుభుఁడునుగాఁగాను పాపశుభయోగము గనుక జగడము వచ్చును. 8. నైసర్గికకూటము, మగణతగణము లితరగణములు గనుక మరణము. 9. రసకూటము, రౌద్రశాంతములు మిత్రములు గనుక శుభము. 10. వీనికిఁ దేరుగడవివరము: రాశిగ్రహకాంతి నైసర్గికకూటములు నాలుగును జెడ్డవియుఁ గడమకూటము లయిదును మంచివి గనుక దోషములు కొంచెమును గుణములు చాలానుగనుక యాది నున్నమగణము తనమీఁదఁ దగణము నిలిచినప్పుడు తా నిచ్చుశుభఫల మధికముగా నిచ్చును.

మగణజగణయోగమునకు:—

1. యోనికూటము, హరిణవృషభములు భిన్నజంతువులు గనుక కొంతమేలు. 2. లింగకూటము, రెంటికినిఁ బుంలింగతారలేకనుక పోరువుట్టును. అయిననువధూగణమునకుఁ బుంలింగతారయయినందుచే నాదోషముపనిలేదు. 3. గణకూటము, రాక్షసమనుష్యగణములుగనుక నాశనము. 4. ఉడుకూటము, జ్యేష్ఠకు నుత్తరయిరువదిమూఁడవనక్షత్రముగనుక పదుమూఁటికిఁ బై నుండుటచేతను కృతిపతికి శతాయువు. 5. రాశికూటము, వృశ్చికమునకు సింహము పదవరాశిగనుక దుఃఖము. అయిననేమి? వృశ్చికాధిపతియైనకుజుఁడును సింహాధిపతియైనసూర్యుఁడును అన్యోన్యమిత్రులుగనుక నారదమతమున నాదోషము పని లేదు. 6. ఖేటకూటము, కుజసూర్యులన్యోన్యమిత్రులుగనుక మంచిది. 7. గ్రహకాంతికూటము, మంగళభాను లిద్దఱును ఎఱుపే కనుక పాపగ్రహములే కాఁగాను ఖలద్వయయోగమునను మృత్యువు. 8. నైసర్గికకూటము,

మగణజగణము లితరగణములుగనుక మరణము. 9. రసకూటము, రౌద్రవీరము లన్య రసములు గనుక మోదము. 10. వీనికిఁ దేరుగడవివరము: గణగ్రహకొంతి నైసర్గిక కూటములు మూఁడును జెడ్డవియుఁ గడమకూటము లాఱును మంచివి గనుక దోష ములు కొంచెమును గుణములు చాలాను గనుకను ఆది నున్న మగణము తనమీఁదను జగణము నిల్చినప్పుడు తా నిచ్చుశుభఫల మధికముగా నిచ్చును.

మగణభగణ యోగమునకు:—

1. యోనికూటము, హరిణభుజగములు భిన్నజంతువులు గనుక కొంత మేలు. 2. లింగ కూటము, పుంలింగస్త్రీలింగతారలుగనుక నుత్తమము. 3. గణకూటము, రాక్షసదేవ గణములు గనుక నధమము. 4. ఉడుకూటము, జ్యేష్ఠకు మృగశిర పదియాఱవనక్షత్ర ముగనుక పదుమూఁటికిఁ బై నుండుటచేత కృతిపతికి శతాయువు. 5. రాశికూటము, వృశ్చికమునకు వృషభ మేడవది గనుక సామ్రాజ్యము. 6. ఖేటకూటము, కుజ శుక్రు లన్యోన్యసములు గనుక మధ్యమము. 7. గ్రహకొంతికూటము, కుజుఁ డె ఱుపు గనుక పాపియు, శుక్రుఁడు తెలుపు గనుక శుభుఁడును గాన పాపిశుభయో గముగనుకజగడము. 8. నైసర్గికకూటము, మగణభగణము లితరగణములుగనుక మర ణము. 9. రసకూటము, రౌద్రహాస్యము లన్యరసములు గనుక ముదము. 10. వీనికిఁ దేరుగడవివరము: గణఖేటగ్రహకొంతినైసర్గికకూటములు నాలుగును జెడ్డవియుఁ గడమకూటము లయిదును మంచివి గనుక దోషములు కొంచెమును గుణములుచా లానుగనుక ఆది నున్న మగణము తనమీఁదను భగణము నిలిచినపుడు తా నిచ్చు శుభఫల మధికముగా నుండును.

మగణనగణ యోగమునకు:—

1. యోనికూటము, హరిణగజములు భిన్నజంతువులు గనుక కొంత మేలు. 2. లింగ కూటము, పుంలింగస్త్రీలింగతారలు గనుక నుత్తమము. 3. గణకూటము, రాక్షస దేవగణములుగనుక 'నధమము. 4. ఉడుకూటము, జ్యేష్ఠకు రేవతి పదునొకొండవనక్ష త్రముగనుక పదుమూఁటికి లోపలనుండుటచేతను కృతిపతి కల్పాయువు. 5. రాశి కూటము, వృశ్చికమునకు మీన మయిదవరాశి గనుక సామ్రాజ్యము. 6. ఖేటకూట ము, కుజబృహస్పతులన్యోన్యమిత్రులు గనుకమంచిది. 7. గ్రహకొంతికూటము, మం గళుఁడెఱుపుగనుక ఖలుఁడును గురుఁడు పచ్చ గనుక శుభగ్రహముకాఁగాను పాప శుభయోగము గనుక జగడము వచ్చును. 8. నైసర్గికకూటము, మగణనగణము లితర గణములుగనుక మరణము. 9. రసకూటము, రౌద్రాద్భుతములు నిత్యవైరములుగనుక సాధ్వసము. 10. వీనికిఁ దేరుగడవివరము: గణోడుగ్రహకొంతినైసర్గికరసకూటము

తైదును జెడ్డవియుఁ గడమకూటములు నాలుగును మంచివి గనుక దోషములు చాలాను, గుణములు కొంచెమును గనుక ఆది నున్న మగణము తనమీఁద నగణము నిల్చినపుడు తా నిచ్చుశుభఫలము నియ్యదు.

తే. మగణమున కెల్ల వ్రాసితి మిగిలినట్టి, గణములకు నిట్లు వ్రాసిన గ్రంథ మధిక
విస్తరం బగు నని వ్రాయ వెఱచినాఁడఁ, దెలిసికొనఁ దగుఁ గవులు యాదులకు నిట్లు.

వ. ఇది కావ్యముఖంబున నుండు రెండుగణంబులకుం గవిరాక్షసమతానుసారంబు లగు యోన్యాదినవకూటఫలంబులు. ఇంక నథోక్తజాచార్యమతానుసారంబులగు గణనాథయోగఫలంబు లెఱింగించెద. 119

తే. అష్టగణములు శివవిష్ణునష్టమూర్తు, లయి వెలిం గెడుతమతమయధిపతులకుఁ
జెల్లుచుండెడు నామంబు లెల్లఁ దామఁ, దాల్చి ఛందంబులం దెల్లఁ దనరుచుండు.

ఆ. ధరణిపై స్థిరాంబుదహనమారుతవిష్ణు, పదరవీందుదేవపతులు గదియఁ
బ్రమదవిత్తతాపభద్రార్థజయసౌఖ్య, శత్రునాశనము లొసంగు వరుస. 121

క. తోయముపై భూజలశిఖి, వాయుగగనసూర్యచంద్రవాసవు లున్నన్
శ్రీయోవ్యాధిక్లేశా, ల్పాయుస్థరణసుఖభోగహర్షము లబ్బున్. 122

ఆ. వీతిహోత్రుమీఁద విశ్వంభరాంభోగ్ని, వాయుగగనసూర్యవారిజారి
వృషులు గదియఁ గుశలవిభవాగ్నిభయరాజ్య, శోకరోగయుద్ధశుభఫలములు. 123

చ. అవనిజలాగ్నివాయుగగనార్కశశీంద్రులు డాయఁ గల్గు గం
ధవహుపయిన్ స్వరాజ్యగృహదాహమృతార్తిగదార్థభోగముల్
దివిపయిఁ గీర్తిశర్మలయదీప్తిబలక్షయభద్రమోదముల్
రవిపయి ఖేదముద్భయపరాభవభోగమృతిస్వరాజ్యముల్. 124

క. హిమకరుమీఁద నిలాంభో, గ్నిమరుద్వియదర్కసోమనిర్జరనాథుల్
క్రమమున నిత్తురు జ్వరభయ, సమరశుభాశుభగదార్థసౌఖ్యము లెపుడున్. 125

సీ. శర్కరతోఁ గూడి చవి గానివస్తువు లెంతయు మధుర మై యొనసినట్లు
గంగోదకంబులఁ గలసి పల్వలతోయము పవిత్రం[1]బునఁ బొందునట్లు
పరుసము సోఁకంగఁ బడి యయఃపిండంబు బంగార మై కనుపట్టునట్లు
చందనవృక్షంబుసంగతి నిర్గంధతరువు నామోది యై పరఁగినట్లు

తే. నిర్జరేశ్వరగణముపై నిలిచి దుష్ట, మగుగణంబును శుభకారి యై వెలంగ
శోభనగణంబు గదసినచోట నిష్టు, దండమునఁ బండుపండుచందంబు గాదె. 126

వ. మఱియుఁ గొందఱుకవిపురందరులు నిజకృతచ్ఛందంబులందుఁ గొన్నివిశేషంబులు చెప్పి రవియెల్ల వివరించెద. 127

---

1 బయి తనరినట్లు (వ్రా. ము).

తే. భువనముల కెల్ల నాధారభూత మైన, జగతి యధిదైవతంబుగాఁ జనుమగణము
తమకుఁ గారణ మగుటచే దానిఁ గూడి, ధన మొసఁగు నేడు నని పల్కెఁ దాతనొజ్జ.

తే. చందనోదకమూలను నిచ్చలును బెంపఁ, బడియు వెల్లుల్లి తనకంపుఁ బాయనిగతి
శుభగణము గూడియును నిజకార్యఫలము, తగణము త్యజింప దనియెనధర్వణుండు.

ఆ. ఇది గణప్రపంచ మింక నీగణములచేతఁ గూర్పఁబడుచుఁ జెల్వు మీఱు
వృత్తముల తెఱంగు విదితంబు గాఁగ షట్ప్రత్యయములు తేటపఱుతు మొదల.

## షట్ప్రత్యయములు.

తే. వృత్తసంఖ్యయుఁ బ్రస్తారవిధము నష్ట
లబ్ధియును వెస నుద్దిష్టలఘుగురుక్రి
యాధ్వభాగము లనఁగఁ బ్రత్యయము లాఱు
వెలయు వానిఁ గవీంద్రులు దెలియ వలయు. 131

## 1. వృత్తసంఖ్యాప్రత్యయము.

ఉ. ఇన్నవదాన నెన్ని జనియించెను వృత్తము లన్న ధాత్రిపై
నన్నిగురుల్ లిఖించి యొకఁ డాదిగ నిబ్బడి వాని క్రిందటన్
సన్నుతలీల వ్రాసి తుదిసంఖ్యలు రెట్టిగఁ జేయు నెన్ని యా
నన్నియె దానియం దుదయ మౌ సమవృత్తము లన్నఁ జెన్నగన్. 132

తే. ప్రత్యయము లాఱు నీ చెప్పు పద్యములను, దెలిసికొన నెంతవారికి నలవి గామి
వరుస నన్నింటికిం డీక వ్రాయ వలసెఁ, దెనుఁగుమాటలఁ గడు తేటతెల్ల గాఁగ.

టీ. వృత్తసంఖ్యాప్రత్యయ మనఁగాను ఇన్నవఛందమునందు ఎన్నిసమవృత్తములు పుట్టినవిఅని యడిగిన సరిచెప్పెడివిధము: వా రెన్నవఛందమున కడిగినఅన్నిగురువు లడ్డవరుసగా వ్రాసి వానిక్రింద నొకటి మొదలుగా నినుమడించుచును లెక్కలు వరుస వెంబడిని గడకు వెడల వ్రాసి తుది లెక్క లినుమడింపఁగా నెన్ని ఆయెనో అన్ని సమవృత్తము లాఛందమునందుఁ బుట్టినవి యని చెప్పునది. 134

తే. అక్షరం బొక్కటియె యుక్త కంతకంత, కవలి వానికి నేకోత్తరాధికంబు
లుక్తయం దెల్ల సమవృత్తయుగము పుట్టె, నదియె మొద లంతకంతకు నయ్యె రెట్టి.

## తత్తచ్ఛందోవృత్తసంఖ్యాసీసమాలిక.

ఉక్తను గరము లత్యుక్తను వేదముల్ మధ్యను వసువులు మఱి ప్రతిష్ఠ
వలనను రాజు లవ్వలి సుప్రతిష్ఠను నేత్రపావకులు గాయత్రియందు

విద్యు లుష్ణిక్కున వేదండలోచనక్షమ లనుష్టుప్పున శాస్త్రబాణ
పాణులు బృహతిని [1]బాహుభూశరములు పఙ్క్తిని గతికరాంబరజగతులు
త్రిష్టుప్పునందు దంతియుగాభ్రనయనముల్ జగతి నంగవిరించిగగనయుగము
లతిజగతిని లోచనాజభూవసువులు శక్వరిని గతీభసలిలయోని
శాస్త్రకుంభిను లతిశక్వరిని గజర్త్తుమునిబాహురాము లష్టిని రసాగ్ని
సాయకభూతరసంబు లత్యష్టిని హస్తగోత్రనభోధరాగ్నిశశులు
ధృతియందు గతియుగక్షితిపక్షరసబాహు లతిధృతిని వసుద్విపాక్షినిగమ
శయబాణములు కృతిచ్ఛందంబున రసాద్రిపర్వేభవేదాభ్రపద్మరిపులు
ప్రకృతిని నేత్రనారాచసోమాహార్యగీర్వారాభ్రాత్మ లాకృతిని ధాత్రు
వదనాంతరిక్షపావకయుగబ్రహ్మచంద్రశ్రుతు ల్వికృతిని నాగశూన్య
తర్కసింధురవసుదహనకుంజరములు సంకృతిని రసాంబుజాతవైరి
హస్తాద్రిగిరిపర్వతాంగోడుపతు లభికృతిని, బాహుకృశానుగతియుగాస్త్ర
తే. రతిపశరశిఖివహ్ను లుత్కృతిని వేద,శాస్త్రసామజగజనభశ్చంద్రశైల
రసము లిట్లుద్భవం బయ్యెఁ [2]బ్రస్తుతింప, సమపదము లగువృత్తముల్ఛందములను. 137

టీ. ఇవి అన్నియు ఉక్తాదిషడ్వింశతిచ్ఛందంబులకును ద్వితీయాదిద్విగుణితంబులై యొ
క్కొక్కఛందంబునం బుట్టినసమవృత్తసంఖ్యలకు గణితశాస్త్రోక్తసంజ్ఞలు గావున
జ్యోతిశ్శాస్త్రానుసారంబున కుడినుండి యెడమకు పద్యక్రమంబున ఆయాసంజ్ఞలు
లెక్కలువైచి యుగ్గడించి వామాదిగాను దెలిసికొనునది.

## ఉక్తాదిజవృత్తసంఖ్య.

తే. ఛందమున నొక్కటను వృత్తసంఖ్య మడపి, రెండు వెలియ నుక్తాదిజవృత్తసంఖ్య
యటుల నుత్కృతివృత్తసంఖ్యయును జేయ, సర్వసమవృత్తసంఖ్య భుజంగశయన.

టీ. ఉక్తాదిజవృత్తసంఖ్య అనఁగా ప్రథమచ్ఛందం బగునుక్త మొదలుకొని యున్నవ
ఛందమువద్దికి ఈ వెనుకటిఛందము లన్నిటియందును పుట్టినవృత్తములు అన్ని
యు ఎన్నియాయెనని యడుగఁగా సరి చెప్పెడువిధము: వారు ఎన్నవఛందమువద్ది
కడిగిన అఛందమునను బుట్టినసమవృత్తసంఖ్య యినుమడించి ఆ లెక్కలో రెండు
దీసివేయఁగా నెంత లెక్కనిలిచె నన్నిసమవృత్తములు మొదలిఛందమువద్దినుంచి
వారడిగ్గిన దానివద్దికి అయె నని చెప్పెడిది. ఉక్తాదిషడ్వింశతిచ్ఛందంబుల నన్నిం
టను పుట్టినసమవృత్తములన్నియు కలయఁ గూడ నెన్ని యయ్యె నని యడిగిన సరి
చెప్పెడువిధము: మొనుపటివలెనే కడపటిఛందమగునుత్కృతియందుఁబుట్టినసమవృ

1 బాధ (పూ. ము). 2 ,బ, సరింప (ప).

త్తసంఖ్య రెట్టించి అందులోను రెండు కడకు దీయఁగా ఎన్ని నిలిచె నన్నిసమవృ
త్తములు ఇరువదాఱుఛందములయందును బుట్టిన వని చెప్పినది. 139

క. పదుమూఁడుగోటులును నలువదిరెండును లక్ష లవలఁ [1]బదియే డ్వేలుక్
దుది నేడునూటిపై నిరువదియాఱు సమాంఘ్రివృత్తపద్యములు హరీ. 140

తే. అందులో నొకకొన్ని వేదాంగమైన, ఛందమునఁ బల్కఁబడి యుండె నందులోనఁ
గొన్ని తెనుఁగుగఁ జేసె భీమన్న మొదల, నవియె వెసఁ జెప్పకొని రనంతాదికవులు.

## 2. ప్రస్తారప్రత్యయము.

సీ. పరఁగ నేఛందంబు ప్రస్తరింపు మటన్న నాఛందమునఁ బుట్టినట్టిసర్వ
సమవృత్తసంఖ్యకు సెమ మగునందాఁక దొంతిగాఁ గ్రిందుక్రిందులను వ్రాయ
నగు మీఁదగురువును వాక్రింద లఘువును నొప్పారఁ దొలుబంతి నొక్కటొకటి
తరువాత నది మొదలప్పక రెట్టించి ఛంద మెన్నవ దన్ని చాళ్లుగాఁగఁ

తే. బొడవునకు నడ్డవరుసలు వ్రాసఁగ నిలుప, నందనందన వేడినఛంద మగును
ధారుణీమండలమునఁ బ్రస్తారమనుచు, దీనినామంబు కవులచేఁ దేటపడియె. 142

టీక. ప్రస్తారప్రత్యయ మనఁగాను: ఇన్నవఛందంబునందు పుట్టినసమవృత్తంబులకు
ఏయేగణంబు లని యడుగఁగా సరి చెప్పెడువిధము. వారు ప్రస్తరింపు మన్నఛం
దమునందు ఎన్ని సమవృత్తములు పుట్టె నన్ని గురులఘువులు దొంతరగా ఒకదాని
క్రింద నొకటి వ్రాయునది. అది యెట్లనిన: తొలిదొంతరకు నొకగురువును నొక
లఘువును, రెండవదానికి రెండుగురువులును రెండులఘువులును, మూఁడవదానికి
నాలుగుగురువులును నాలుగులఘువులును, ఇటువలెనే యినుమడించుచు ఎన్నవఛం
దమైన అన్ని నిడుద చాళ్లుగాను అడ్డవరుసలు సరిపోవునట్లుగాను పొడవునకును
వ్రాసి వా రెన్నవసమవృత్తమునకు నడిగిన అన్నవయడ్డవరుస నున్నగురులఘువులు
గణములు చేసి ఆవృత్తమునకు నొక్కొక్కచరణమునకు ఆగణంబు లని చెప్పినది.

## ప్రస్తారద్విగుణము.

క. అందముగా నేఛందము, క్రింద మఱియు నదియె నిలిపి రెండర్థములం
బొందుగ గురులఘువులకడ, బందునఁ జెఱిసగము వ్రాయఁ బైఛంద మగుక్. 144

టీక. ఎదియేని యొకఛందము ప్రస్తరించి యాఛందమే దాని తరువాతిదిగాను బ్ర
స్తరించు మనఁగాఁ బ్రస్తరించెడివిధము. ఆఛందము క్రిందను తిరిగి అఛందమే
ప్రస్తరించి కుడికడను మీఁదినుండి క్రిందుక్రిందులను నిడుపుగా, సగమునకు
గురువులును కడమ సగము లఘువులును వ్రాసిన ఆమీఁదటిఛంద మవును 145

1 బదిహే డ్వేలుక్ (ప. పె).

### 3. నష్టలబ్ధిప్రత్యయము.

సీ. జలజాక్ష యిన్నవఛందంబులోపల నిన్నవసమవృత్త మెట్టి దనిన
నావృత్తసంఖ్య చా నందంద యర్ధించి వ్రాయంగ దిగుదానివైపు దెలిసి
సరిలెక్క లేడనేడ సగము గావించువేళల నెల్ల నొక్కొక్కలఘువు నిలిపి
విషమంబులను [1]బాలు వెలయ మఱొక్కటి, గలిపి యర్ధము సేయుకాలములను
తే. గురుశుభాకార యొక్కొక్కగురువు నిడుచు, నడిగి రెన్నవఛందమునందు వారు
దన్ను. గురువులు లఘువులు నన్నియైన, మాననగు నష్టలబ్ధి రమాసహాయ! 146

టీక. నష్టలబ్ధిప్రత్యయ మనఁగా: ఇన్నవఛందంబున ఇన్నవసమవృత్తమునకు నేయేగణంబు లని యడుగఁగా సరి చెప్పువిధము. వా రెన్నవసమవృత్త మడిగిన నన్నవలెక్క నుండి తేపతేపకు నర్ధించుకొనుచును గురులఘువులు వ్రాయునది. అది యెట్లన్నను: సరిలెక్క యర్ధించునప్పు డెల్లను ఒక్కొక్కలఘువు పెట్టునది. బేసిలెక్కయైనప్పు డర్ధించుటకుఁ బాలుపోదు గనుక మఱి యొక్కటి కలియఁ గూడి సరిగాఁ జేసి యర్ధించునది. ఒకటి కూడి యర్ధించునప్పుడెల్లను నొక్కొక్కగురువు పెట్టునది. తన్ను వా రెన్నవఛందములోని సమవృత్త మడిగిన అన్నియగునట్టుగాను గురులఘువులు వ్రాసి అవి గణములు చేసి ఆఛందమున అన్నవసమవృత్తమునకు ఒక్కొక్క పాదమునకు అవి గణము లని చెప్పునది.
147

### 4. వృత్తోద్దిష్టప్రత్యయము.

సీ. తనయిచ్ఛ వచ్చినట్టును గురులఘువులు జగతిపై నడ్డచాలుగ లిఖించి
యేఛందమునఁ బుట్టె నెన్నవసమవృత్త మిది యన్న నొక్కఁడు మొదలుగాఁగ
రెట్టించుచును వానిక్రిందను లెక్కలు వరుస దప్పక యుండ వైచియందు
లఘువులక్రింది వెల్లను గూడి వెండియు నొక్కటి [2]గలుపక యుగ్గళింప
ఆ. నైనవృత్తసంఖ్య మది గురులఘువుల, సంఖ్య ఛందమునకు సంఖ్య యిట్లు
దెలిసి చెప్పవలయు దీని వృత్తోద్దిష్ట, మండ్రు ప్రత్యయజ్ఞు లంబుజాక్ష. 148

టీక. ఉద్దిష్టప్రత్యయ మనఁగాఁ దనమనస్సునకు నచ్చినట్లు గురువులఘువులు అడ్డచాలుగా వ్రాసి యిది యేఛందమునఁ బుట్టినది, ఆఛందమునం దిది యెన్నవసమవృత్తము అనియడిగిన సరి చెప్పెడువిధము. అతఁడు వ్రాసినగురులఘువులక్రిందను వరుసక్రమ ఒకటి మొదలుకొని లెక్క లినుమడించి వ్రాసి వానిలోపలను గురువులక్రిందివి అన్నియు విడిచిపెట్టి లఘువులక్రిందిలెక్క లన్నియుఁ గలయఁ గూడి

1 బోలి (ప్రా. ము). 2 గలుపకో (వె).

అందులోపలను మఱి యొకటి కలిపిన నెన్ని అయెనో అన్నవృత్త మనునది. అతఁడు వ్రాసిన గురులఘువు లెన్ని యైన అన్నవఛందమునఁ బుట్టినది యనునది. ఇరువదియాఱింటిలోపల నెన్ని గురులఘువులు వ్రాసినను ఇటువలెనే వ్రాసి సరి చెప్పునది. 149

## 5. లఘుగురుక్రియాప్రత్యయము.

సీ. రెండిండ్లు వ్రాసి యాక్రింద వెంబడి [1]నిరుమేల నొక్కొకయిల్లు మించి యుండ
మొదలనుంచియు నిరువదియాఱడ్డవీథు లమర్చి రెండుకోపులను గల్గు.
గీముల నన్నింట సోముల నిడి మధ్యగృహములయందుఁ బైయిండ్లరెంట
నిలుచు లెక్కలు గూడి విలిఖింప [2]సిమేరుచక్ర పార్శ్వద్వ్యంతసదనములను

తే. వెలయునవి సర్వగురులఘువృత్తసంఖ్య
లగు ద్వితీయాదిగృహములయందుఁ దనరు
సంఖ్య లేకాదిలఘువృత్తసంఖ్య లయ్యె
నన్నియును వానివృత్తసంఖ్య లగుఁ గృష్ణ. 150

టీక. మేరుచక్ర మనఁగాః ఇన్నవఛందమునందు ఎన్నెన్నిలఘువులవృత్తములు ఎన్నిఁయని యడిగిన సరిచెప్పెడివిధము. మొదల అడ్డవీథిగా రెండిండ్లు వ్రాసి యాక్రిందను వెంబడిగాను రెండుపార్శ్వములయందును ఒక్కొక్కయిల్లు మించియుండునట్టుగా మొదటివీథితోఁగూడ నిరువదియాఱడ్డవీథులుగా గీటులు తివిచి యుభయపార్శ్వములయందు మించియున్న కడపటియిండ్లను మీఁదియిండ్లు మొదలుకొని యన్నియిండ్లను దప్పకుండను ఒక్కట్లు పెట్టి మీఁదివీథి నున్న లెక్కల క్రిందను దిగువవీథియందు నిడువుగా ఒక్కొక్కయింటను ఆలెక్క లకుఁ గ్రింద నుండునట్టుగా వ్రాయునది. ఇటుల వ్రాయఁగా మీఁదివీథికంటెఁ గ్రిందివీథి ఒక్కొక్కయి ల్లెక్కువ అవుచును వచ్చును. ఈక్రమమున వ్రాయఁగా ఈమేరుచక్రమునందుఁ బైవీథి మొదలుగా అడ్డవీథు లన్నియు ఉక్త మొద లైనయిరువదియాఱు ఛందములను గ్రమముననే యవును. ఆవీథులయందు మొదలియిండ్ల నున్నయొక్కటొక్కటియు సర్వగురువృత్తములు. తుదియిండ్లనున్న ఒక్కొక్కటియు సర్వలఘువృత్తములు. రెండవయిండ్ల నెన్ని యుండిన అన్ని ఒంటిలఘువృత్తములు. మూఁడవయిండ్లవి రెండేసిలఘువులవి. నాలవయిండ్లవి మూఁడేసిలఘువులవి. ఈప్రకారముననే ముందరను అన్నియిండ్లకు నని తెలిసికొనునది. ఆవీథిని నున్న లెక్క లన్నియుఁ గలయఁ గూడ ఆఛందమునఁ బుట్టినసమవృత్తసంఖ్య

1 నిరుమైల (పె). 2 నిరుమైల (ప, పె.).

యావును. వా రెన్నవఛందమున కడిగిన నన్నవయడ్డవీథి చూచి యిప్పుడు చెప్పిన చొప్పున సరి చెప్పునది. ఏఛందముదనుకను వ్రాయు మన్నను అఛందముదనుక వ్రాయ వచ్చును. 151

## లగనిర్ణయశకటచక్రము.

సీ. ఒకమందిరంబులో నొకలెక్క వైచి యాదిగ నడ్డంబిండ్లు దిద్దుకొనుచుఁ
క్రమతఁ బైవీథిలెక్కలు ద్విగుణింపుచుఁ దొలుసారి యవి యెల్లఁ గలుపు వ్రాసి
వెండియు రెట్టించువేళ నొక్కొక్కటి విడిచి వ్రాయుచు దాని వృత్తసంఖ్య
కెచ్చైన మానుచు నీరీతి నావృత్తసంఖ్యపఙ్క్తికిఁ దొలిసదనమునను
తే. నిలుచునందాఁక బంతు లెన్నన్ని వ్రాయ
శకటచక్రంబు నాఁగఁ బ్రశస్త మయ్యె
వరుస నాద్యంతములు సర్వగురులఘువులు
కడమ వేకొదిలఘునియుక్తంబు లిందు. 152

టీక. శకటచక్ర మనఁగా: ఇన్నవఛందమునందు ఒకలఘు వాదిగా ఎన్నెనిలఘువృత్తములు. ఎన్నవ వెన్నవయవి యని యడిగిన సరి చెప్పెడువిధము. వారడిగినఛందమువృత్తసంఖ్యనిర్ణయించుకొని ముందుగాను ఒకయిల్లువ్రాసి యాయింట లెక్క యొక్కటి వైచి దానిక్రిందనుండి యడ్డముగా ఇండ్లు వ్రాసికొంచు ఆయిండ్లలో వానికి మీఁద నున్న యడ్డవీథియిండ్ల మొదలియిల్లు మొదలుకొని వరుస వెంబడి నొక్కొక్కయింట నున్న లెక్క సారెసారెకు నినుమడించుకొంచు వ్రాయుచు వచ్చునది. అది యెట్లంటేని: తొలుసారి ద్విగుణించునపు డెంత లెక్క యైనను అంతయు వ్రాయునది. అంతటనుంచి అవి యెన్నిమాఱు లినుమడించినను ఒక్కటొక్కటి కడకుం బుచ్చి చిక్కినలెక్క వేయునది. ఇటువలెను వ్రాయ నాఛందంబునం బుట్టినవృత్తసంఖ్య యెప్పుడు మించునో అప్పు డది విడిచి మీఁదివీథిని ఆతరువాతను ఇండ్లలెక్కలు ఒక్కటొక్కటి యిప్పుడు వ్రాసినట్లే రెట్టించుచును వ్రాయునది. ఏదియైనను వృత్తసంఖ్యకు నధిక మయ్యెనేని అది విడిచిపెట్టునది. పైవీథిలెక్కలయ్యెనేని అంతటను ఆవీథిని వ్రాయక చాలించునది. ఇప్పుడు వ్రాసినబంతిలెక్కలు మునుపటియట్లనే చేయునది. ఆక్రింద తిరుగాను ఇండ్లు వ్రాసి ఆయిండ్లలో నిప్పటివలెనే లెక్క నిలుపునది. ఇటువలెనే ఒక్కొక్కబంతి వ్రాసి అదిచూచి దానిదిగువను మఱొక్కబంతివ్రాయుచును రాఁగా బంతికి మొదలియింట ఆఛందమునఁ బుట్టినవృత్తసంఖ్య యెక్కడ వచ్చిన నక్కడనుండి వ్రాయక మానునది. ఈతీరున వ్రాసిన ఏయింటనువచ్చినలెక్క[1]రాక వచ్చును. దీనిపేరు శకటచక్ర మని

1 రావచ్చును (పె. ప).

పించుకొనును. ఈచక్రమునందు మొదలిబంతిది సర్వగురువృత్తము. కడపటిబంతి యెంతయుండినను అన్నవయది సర్వలఘువృత్తము. రెండవబంతియిండ్ల ఎన్నియుండిన అన్నవయవి ఒంటిలఘువృత్తములు. మూఁడవయడ్డవీథిని నెన్నియుండిన అన్నవయవి రెండేసిలఘువులవృత్తములు. నాల్గవచాలున నెన్నియుండిన అన్నవయవి మూఁడు మాత్రలు గలవృత్తములు. ఈచక్రమునను ముందర ఎన్నిబంతు లున్నను రెండవ బంతి మొదలుగా బంతిబంతికి ఒక్కొక్కలఘు వెక్కువయని తెలిసికొనునది. ఇండ్లు అన్నియులెక్కింప ఎన్ని అయినవో అన్నివృత్తము లాఛందమునం బుట్టిన వని యెఱుఁగునది. ఈరెండుచక్రంబులయందును జెప్పిన లఘుసంఖ్యాఛందస్సంఖ్య లో తివిసివేయఁగాను ఎన్ని మిగిలిన నన్నిగురువులు ఆయావృత్తములకు గలవు గాన ఈచక్రములు రెండును లఘుగురుక్రియాచక్రములని యనంబడును. కొందఱు లగనిర్ణయచక్ర మందురు. 153

## 6. అధ్వభాగప్రత్యయము.

క. నందసుత యధ్వభాగము
ఛందస్సంఖ్యయును వృత్తసంఖ్యయు రెంటఁ
బొందుగ గుణించి యొక్కటి
యందుఁ దిగియ నెన్ని యన్ని యంగుళములగుఁ. 154

టీ. అధ్వభాగప్రత్యయ మనఁగా : ఇన్నవఛందము ప్రస్తరించుటకు ఎన్నియంగుళములపొడవుభూమి కావలె నని అడిగిన సరిచెప్పెడువిధము. ఎన్నవఛందమున కడిగిన నంతయు లెక్కపెట్టి యందులో ఆఛందమునఁ బుట్టినవృత్తసంఖ్య గలియఁగూడి యినుమడించి యందులో ఒకటి తివిసి వేయఁగా నెంతయైనదో అన్ని యంగుళములపొడవు భూమి ఆ ఛందమునకుఁ బ్రస్తరించుటకుఁ గావలె నని చెప్పునది. 155

### సమవృత్తసంఖ్యాజ్ఞానము.

### అయిదవఛందమునం దెన్నిసమవృత్తములు
### పుట్టిన వని యడిగిన సరిచెప్పెడువిధము.

U U U U U

౧ ౨ ౪ ౮ ౧౬

ఈకడపలిలెక్క పదునాఱునరెట్టించిన ముప్పదిరెండు అగును. అటుగనుక ఐదవ ఛందమునందు ముప్పదిరెండుసమవృత్తములు పుట్టిన వని చెప్పెడిది. ఏఛందమున కడిగినను ఇటువలెనే వ్రాయునది. ప్రస్తరించి చూచిన అన్నివృత్తములే పుట్టుచున్నవి. 156

## పంచమచ్ఛందమునకుఁ బ్రస్తారము.

∪∪∪∪∪ ౧ ∪∪∪∪| ౧౭
|∪∪∪∪ ౨ |∪∪∪| ౧౮
∪|∪∪∪ ౩ ∪|∪∪| ౧౯
||∪∪∪ ౪ ||∪∪| ౨౦
∪∪|∪∪ ౫ ∪∪|∪| ౨౧
|∪|∪∪ ౬ |∪|∪| ౨౨
∪||∪∪ ౭ ∪||∪| ౨౩
|||∪∪ ౮ |||∪| ౨౪
∪∪∪|∪ ౯ ∪∪∪|| ౨౫
|∪∪|∪ ౧౦ |∪∪|| ౨౬
∪|∪|∪ ౧౧ ∪|∪|| ౨౭
||∪|∪ ౧౨ ||∪|| ౨౮
∪∪||∪ ౧౩ ∪∪||| ౨౯
|∪||∪ ౧౪ |∪||| ౩౦
∪|||∪ ౧౫ ∪|||| ౩౧
||||∪ ౧౬ ||||| ౩౨

పంచమచ్ఛందము ప్రస్తరించినాను. ముప్పదిరెండుసమవృత్తములు పుట్టెను.

| ఛందస్సంఖ్య | సమవృత్తసంఖ్య | ఛందస్సంఖ్య | సమవృత్తసంఖ్య. |
|---|---|---|---|
| ౧ ఉక్తయందు | ౨ | ౧౪ శక్వరియందు | ౧౬౩౮౪ |
| ౨ అత్యుక్త | ౪ | ౧౫ అతిశక్వరి | ౩౨౭౬౮ |
| ౩ మధ్య | ౮ | ౧౬ అష్టి | ౬౫౫౩౬ |
| ౪ ప్రతిష్ఠ | ౧౬ | ౧౭ అత్యష్టి | ౧౩౧౦౭౨ |
| ౫ సుప్రతిష్ఠ | ౩౨ | ౧౮ ధృతి | ౨౬౨౧౪౪ |
| ౬ గాయత్రి | ౬౪ | ౧౯ అతిధృతి | ౫౨౪౨౮౮ |
| ౭ ఉష్ణిక్కు | ౧౨౮ | ౨౦ కృతి | ౧౦౪౮౫౭౬ |
| ౮ అనుష్టుప్పు | ౨౫౬ | ౨౧ ప్రకృతి | ౨౦౯౭౧౫౨ |
| ౯ బృహతి | ౫౧౨ | ౨౨ ఆకృతి | ౪౧౯౪౩౦౪ |
| ౧౦ పఙ్క్తి | ౧౦౨౪ | ౨౩ వికృతి | ౮౩౮౮౬౦౮ |
| ౧౧ త్రిష్టుప్పు | ౨౦౪౮ | ౨౪ సంకృతి | ౧౬౭౭౭౨౧౬ |
| ౧౨ జగతి | ౪౦౯౬ | ౨౫ అభికృతి | ౩౩౫౫౪౪౩౨ |
| ౧౩ అతిజగతి | ౮౧౯౨ | ౨౬ ఉత్కృతి | ౬౭౧౦౮౮౬౪ |

ఇవి యన్నియుఁ గలియఁగూడిన సర్వసమవృత్తసంఖ్యయగును.

వెరసి ౧౩౪౨౧౭౭౨౬

## ఉక్తాప్రభృతిచ్ఛందోజాత వృత్తసంఖ్యావివేకము.

ప్రథమచ్ఛందం బగునుక్త మొదలుకొని చతుర్థచ్ఛందమువద్దికి నీలాగుఛందముల యందుఁ బుట్టినసమవృత్తము లన్నియు నెన్నియాఱొ నని యడిగిన సరిచెప్పెడువిధము.

### నాలవఛందమువృత్తసంఖ్య.

UUUU

౧ ౨ ౪ ౮

[1]పదునాఱుసమవృత్తములు పుట్టెను.

ఈవృత్తసంఖ్య యినుమడించిన ముప్పదిరెండాయెను. అందులోను రెండువు చ్చిన ముప్పది గనుక ఉక్తనుండి ప్రతిష్ఠవద్దికి నాలుగుఛందములయందును ౩౦ సమవృత్తములు పుట్టినవి. ఏఛందమువద్దికి అడిగిన నిటువలెనే చూచునది. వెరసివేసి కూడినను సరే. 158

### సర్వవృత్తసంఖ్య.

[2]ఇరువదియాఱుఛంధములయందును ఎన్ని సమవృత్తములుపుట్టె నన సరిచెప్పె డువిధము. ఈఉత్కృతిచ్ఛందమువృత్తసంఖ్య మునుపటివలె ద్విగుణించి రెండుతివిచి వైచిన ౧౩౪౨౧౭౭౨౬ ఆయెను. కనుక ఇరువదాఱుఛందములయందును ఇన్ని సమ వృత్తములం పుట్టె నని చెప్పునది వెరసివేసి కూడినను సరి. 159

### వృత్తప్రస్తారవిధము.

### నాలవఛందం బగుప్రతిష్ఠయందుఁ బుట్టినసమవృత్తంబుల కేయేగణంబు లని యడిగిన సరిచెప్పెడువిధము.

| | | | |
|---|---|---|---|
| UUUU | ౧ మగము | UUU। | ౯ మలఘువు |
| ।UUU | ౨ యగము | ।UU। | ౧౦ యలము |
| U।UU | ౩ రగము | U।U। | ౧౧ రలము |
| ।।UU | ౪ సగము | ।।U। | ౧౨ సలము |
| UU।U | ౫ తగము | UU।। | ౧౩ తలము |
| ।U।U | ౬ జగము | ।U।। | ౧౪ జలము |
| U।।U | ౭ భగము | U।।। | ౧౫ భలము |
| ।।।U | ౮ నగము | ।।।। | ౧౬ నలము |

ఇవియన్నియు అడ్డబంతులుగాఁజేసి ఆయాబంతిసమవృత్తమునకు ఆయాగణంబు లనునది నాలుగుపాదములకును అగణములే యని చెప్పునది. ఏఛందమునకడిగినను ఇటు వలెనే వ్రాయునది. 160

1 పదహారు (వా. పె. ప.). 2 ఇరువైయారు (వా. పె. ప.).

## ద్విగుణప్రస్తారలేఖనక్రమము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ∪∪∪ | మగణము | ౧ | ∪∪∪ | మగణము | ౧ |
| I∪∪ | యగణము | ౨ | I∪∪ | యగణము | ౨ |
| ∪I∪ | రగణము | ౩ | ∪I∪ | రగణము | ౩ |
| II∪ | సగణము | ౪ | II∪ | సగణము | ౪ |
| ∪∪I | తగణము | ౫ | ∪∪I | తగణము | ౫ |
| I∪I | జగణము | ౬ | I∪I | జగణము | ౬ |
| ∪II | భగణము | ౭ | ∪II | భగణము | ౭ |
| III | నగణము | ౮ | III | నగణము | ౮ |

ఈమూఁడవఛందము నాలవయదిగాఁ బ్రస్తరించువిధము. ఒకప్రతికడ గురువును లఘువును వ్రాయునది. ఏఛందమున కడిగినను ఇటువలెనే వ్రాయునది. 161



## నష్టవృత్తప్రస్తారము.

ఆఱవఛందమున నలువదినాల్గవసమవృత్తమునకు నేయేగణము లని యడిగిన సరి చెప్పెడివిధము. వారు నలువదినాల్గవదియడిగిరి గనుక సరిలెక్క గనుక నవి యర్ధించి లఘువు పెట్టునది. నిలిచినయిరువదిరెండును సరిగనుక నవి యర్ధించి లఘువుంచునది. చిక్కిన పదునొకొండును బేసిగనుక మఱియొకటి కలియఁగూడి పండ్రెండుచేసి యర్ధించి గురువు పెట్టునది. మిగిలినయాఱును సరిగనుక నవి యర్ధించి లఘువు పెట్టునది. చిన్న మూఁడును బేసిగనుక మఱియొకటి గూర్చి నాల్గుచేసి యవి యర్ధించి గురువు పెట్టునది. కడమరెండును సరిగనుక నవి యర్ధించి లఘువు పెట్టునది వారాఱవఛందమున కడిగిరి గనుక గురులఘువు లాఱయినఁ జాలింపవలయు. ఏవృత్త మడిగినను నిటువలెనే సరి చెప్పవలయును. 162

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౪౪ | I | | | ౩ | I |
| ౨౨ | I | | | ౧ | |
| ౧౧ | I | స | | ౪ | |
| ౧ | | | | ౨ | ∪ |
| ౧౨ | | | | ౧ | I |
| | ∪ I | | | | |

## ఆఱవఛందమునకుఁ బ్రస్తారము.

| | | | |
|---|---|---|---|
| ∪∪∪∪∪∪ | ౧ | ∪II∪I∪ | ౨౩ |
| I∪∪∪∪∪ | ౨ | III∪I∪ | ౨౪ |
| ∪I∪∪∪∪ | ౩ | ∪∪∪III | ౨౫ |
| II∪∪∪∪ | ౪ | I∪∪II∪ | ౨౬ |
| ∪∪I∪∪∪ | ౫ | ∪I∪II∪ | ౨౭ |
| I∪I∪∪∪ | ౬ | II∪II∪ | ౨౮ |
| ∪II∪∪∪ | | ∪∪III∪ | ౨౯ |
| III∪∪∪ | | I∪III∪ | ౩౦ |
| ∪∪∪I∪∪ | | ∪IIII∪ | ౩౧ |
| I∪∪I∪∪ | ౧౦ | IIIII∪ | ౩౨ |
| ∪I∪I∪∪ | ౧౧ | ∪∪∪∪∪I | ౩౩ |
| II∪I∪∪ | ౧౨ | I∪∪∪∪I | ౩౪ |
| ∪∪II∪∪ | ౧౩ | ∪I∪∪∪I | ౩౫ |
| I∪II∪∪ | ౧౪ | II∪∪∪I | ౩౬ |
| ∪III∪∪ | ౧౫ | ∪∪I∪∪I | ౩౭ |
| IIII∪∪ | ౧౬ | I∪I∪∪I | ౩౮ |
| ∪∪∪∪I∪ | ౧౭ | ∪II∪∪I | ౩౯ |
| I∪∪∪I∪ | ౧౮ | III∪∪I | ౪౦ |
| ∪I∪∪I∪ | ౧౯ | ∪∪∪I∪I | ౪౧ |
| II∪∪I∪ | ౨౦ | I∪∪I∪I | ౪౨ |
| ∪∪I∪I∪ | ౨౧ | ∪I∪I∪I | ౪౩ |
| I∪I∪I∪ | ౨౨ | II∪I∪I | ౪౪ |

ప్రస్తరించినను నగణజగణములే అయెను.

## ఉద్దిష్టవృత్తనిర్ణయము.

U U I U U I U        I I U I U I

౧ ౨ ౪ ౮ ౧౬ ౩౨ ౬౪        ౧ ౨ ౪ ౮ ౧౬ ౩౨

| | |
|---|---|
| ౪ | ౧ |
| ౩౨ | ౨ |
| ౩౬ | ౮ |
| ౧ | ౩౨ |
| ౩౭ | ౪౩ |
| | ౧ |
| | ౪౪ |

“ ఇది యెన్నవఛందమునందుఁ బుట్టినది? ఆఛందమునం దెన్నవసమవృత్తము? ” అని యడిగిన సరిచెప్పెడువిధము. వారు వ్రాసినగురులఘువుల క్రిందను వరుసవెంబడిని ఏకాదిద్విగుణితముగా వ్రాసినలెక్కలలో లఘువులక్రిందిలెక్కలన్నియు వెరసువేసి వానిక్రింద మఱొకటి పెట్టి కలయఁగూడ ముప్పదియేడాయెను. కనుక అన్నవసమవృత్తమనునది వారు వైచినగురులఘువులు లెక్కపెట్టఁగా నేడు అయెను. గనుక నేడవఛందమునను బుట్టినది యనునది. 163

## సప్తమచ్ఛందః ప్రస్తారము.

| | | | |
|---|---|---|---|
| UUUUUUU | ౧ | IIUUIUU | ౨౦ |
| IUUUUUU | ౨ | UUIUIUU | ౨౧ |
| UIUUUUU | ౩ | IUIUIUU | ౨౨ |
| IIUUUUU | ౪ | UIIUIUU | ౨౩ |
| UUIUUUU | ౫ | IIIUIUU | ౨౪ |
| IUIUUUU | ౬ | UUUIIUU | ౨౫ |
| UIIUUUU | ౭ | IUUIIUU | ౨౬ |
| IIIUUUU | ౮ | UIUIIUU | ౨౭ |
| UUUIUUU | ౯ | IIUIIUU | ౨౮ |
| IUUIUUU | ౧౦ | UUIIIUU | ౨౯ |
| UIUIUUU | ౧౧ | IUIIIUU | ౩౦ |
| IIUIUUU | ౧౨ | UIIIIUU | ౩౧ |
| UUIIUUU | ౧౩ | IIIIIUU | ౩౨ |
| IUIIUUU | ౧౪ | UUUUUIU | ౩౩ |
| UIIIUUU | ౧౫ | IUUUUIU | ౩౪ |
| IIIIUUU | ౧౬ | UIUUUIU | ౩౫ |
| UUUUIUU | ౧౭ | IIUUUIU | ౩౬ |
| IUUUIUU | ౧౮ | UUIUUIU | ౩౭ |
| UIUUIUU | ౧౯ | | |

ప్రస్తరించినను రెండుతగణములు నొకగురువు నాయెను.

## మేరుచక్రోద్ధారము.

నాలవ ఛందమునకు ఎన్నేసిలఘువుల వృత్తములు ఎన్నెన్ని పుట్టినవఁగా సరి చెప్పెడువిధము. వీథివీథి ఒక్కొక్కఛందము గనుక ఈచక్రమునకు నాలుగడ్డచాళ్లు గాన నాలవఛందముపర్యంతము ఆయెను. దీని నాలుగవబంతి చూచి చెప్పునది. 164

౧ | ౧

| ౧ | ౨ | ౧ |

౧ | ౩ | ౩ | ౧

| ౧ | ౪ | ౬ | ౪ | ౧ |

నాలవబంతి మొదలింటి దొకటియు సర్వగురువృత్తము. రెండవయింటినాలుగును ఒంటి లఘువృత్తములు. మూఁడవయింటియాఱును రెండేసిలఘువులవృత్తములు. నాలవ యింటినాలుగును మూఁడేసిలఘువులవృత్తములు కడపలియింటి దొక్కటియు నాలుగులఘువుల సర్వలఘువులవృత్తము. 165

## శకటచక్రోద్ధారము.

ప్రతిష్ఠాఛందమునందు ఎన్నేసిలఘువులవృత్తములు ఎన్నవయెన్నవయవి యని యడిగిన సరి చెప్పెడువిధము. 166

౧

౫

౪ ౧౩ ౬|౧౧|౧౦

౮ ౧౫|౧౪|౧౨

|౧౬

ఈచక్రమునందు మీఁదియింటి దొకటియు నాలుగుగురువుల సర్వగురువృత్తము

రెండవయడ్డవీథినున్న ౨ వది, ౩ వది, ౫ వది, ౯ వది ఒంటిలఘువృత్తములు. మూఁడవచాలున నున్న ౪ వది, ౭ వది, ౧౩ వది, ౬ వది,౧౧ వది, ౧౦ వదియు రెండేసి లఘువులవి. నాలుగవబంతి నున్న ౮ వది, ౧౫ వది, ౧౪ వది, ౧౨ వది, మూఁడేసిలఘువుల వృత్తములు. కడపటి ౧౬ వది యొక్కటియు నాలుగులఘువుల సర్వలఘువృత్తము. 167

## పద్యలక్ష్యోపయోగిసంజ్ఞలు.

ఉక్తాఛందం బొక్కటియక్షరంబుననుండి యొండొంటికివచ్చునక్షరంబు షడ్వింశాక్షరపర్యంతంబుగా జరుగు నందు నుక్తకుఁ బ్రతిపాద మేకాక్షరం బౌను. 168

| ఛందస్సంఖ్యలు. | | వృత్తసంఖ్యలు. | ఛందస్సంఖ్యలు. | | వృత్తిసంఖ్యలు. |
|---|---|---|---|---|---|
| ౧ | శ్రీవృత్తము | ౧ | ౭ | లోల | ౨౪ |
| ౨ | స్త్రీవృత్తము | ౨ | | హంసమాల | ౨౫ |
| | నారీవృత్తము | ౩ | | మదరేఖ | ౨౬ |
| | మృగి | ౪ | | కుమారలలిత | ౨౭ |
| | వినయ | ౫ | | సరసిజము | ౨౮ |
| | కన్య | ౬ | | విభూతి | ౨౯ |
| | వ్రీడ | ౭ | | మధుమతి | ౩౦ |
| | సుకాంతి | ౮ | | మదనవిలసిత | ౩౧ |
| | బింబము | ౯ | ౮ | విద్యున్మాల | ౩౨ |
| | ప్రీతి | ౧౦ | | వితానము | ౩౩ |
| | ప్రగుణ | ౧౧ | | విమానము | ౩౪ |
| | సతి | ౧౨ | | సింహరేఖ | ౩౫ |
| | పఙ్క్తి (సుందరి) | ౧౩ | | చిత్రపదము | ౩౬ |
| | నంద | ౧౪ | | హంసరుతము | ౩౭ |
| | అంబుజ | ౧౫ | | నారాచము | ౩౮ |
| | సావిత్రి | ౧౬ | | ప్రమాణి | ౩౯ |
| | విచిత్ర | ౧౭ | | నాగరము | ౪౦ |
| | తనుమధ్య | ౧౮ | | మాణవకము | ౪౧ |
| | చంద్రవదన | ౧౯ | | సమాని | ౪౨ |
| | శశివదన | ౨౦ | ౯ | భుజంగశిశురతము | ౪౩ |
| | సురలత | ౨౧ | | ఉత్సుకము | ౪౪ |
| | వసుధ | ౨౨ | | భద్రకము | ౪౫ |
| | వసుమతి | ౨౩ | ౧౦ | పణవము | ౪౭ |

ప్రథమచ్ఛందం బగునుక్తయందుఁ బ్రతిపాదంబునకు నొక్కొక్కయక్షరం బై రెండువృత్తంబులు పుట్టె నందు శ్రీ యనువృత్తము.

శ్రీవృత్తము. ౧-౧

U గ.

శ్రీ
గో
పా
లా

ద్వితీయచ్ఛందంబగు నత్యుక్తయందుఁ బ్రతి పాదంబునకు రెండేసి యక్షరంబు లై నాల్గు వృత్తంబులు పుట్టె నందు:—

స్త్రీవృత్తము. ౨-౧

UU గగము.

స్త్రీనా
గాని
త్రానిం
పూనున్.

తృతీయచ్ఛందం బగుమధ్యయందుఁ బ్రతి పాదంబునకు మూఁడేసియక్షరంబు లై యెనిమిది వృత్తంబులు పుట్టె నందు:—

నారీ. ౩-౧

UUU మగణము.

శ్రీనాథున్
నే నెంతున్
మా నోపం
గా నాదిన్.

మృగీ. ౩-౩

U I U రగణము.

భూమిలో
శా మహో
ద్రామ వోఁ
దా మృగిన్

అందు వినయవృత్తము. ౩-౪

I I U సగణము.

వినయం
బనఁగాఁ
జను సా
ననఘా.

చతుర్థచ్ఛందం బగుప్రతిష్ఠయందుఁ బ్రతి పాదంబునకు నాలుగేసియక్షరంబు లై ౧౬ వృత్తంబులు పుట్టె నందు:—

కన్య. ౪-౧

UUUU మగ.

భావింప స్త్రా
గావాప్తి న
న్యావృత్తంబీ
కేవలోల్బన్.

వ్రీడ. ౪-౨

I UU య U గ

యగల్ చెప్పం
దగు వ్రీడన్
నగోద్ధర్తా
జగద్భర్తా.

సుకాంతి. ౪-౩

I U I జ U గ.

జకారమున్
గకారమున్
సుకాంతికిన్
శుకస్తుతా.

బింబ. ౪-౪

U I I భ U గ.

ఇష్టహేలోఁ
గ్రమ్మ భగల్
బింబమునం
గంబుధరా.

పంచమచ్ఛందం బగుసుప్రతిష్ఠయందుఁబ్ర
తిపాదంబునకు నైదేసియక్షరంబుల ము
ప్పదిరెండువృత్తంబులు పుట్టె నందు:

ప్రీతి. ౫-౩
U I U ర UU గగ.

ప్రీతికి స్నేహా
న్వితగద్వంద్వం
బై తగుఁ దైత్యా
రాతివర్ణింపన్.

ప్రగుణ. ౫-౪
I I U స UU గగ.

ప్రగుణాఖ్యం బొ
ప్పగుఁ జెప్పంగా
సగ గాస క్తిన్
నిగమస్తుత్యా.

సతి. ౫-౭
IUIUU గగము.

క్షితిం జగాసం
గతిం దనర్చున్
సతీసువృత్తం
బతిప్రసిద్ధా.

పఙ్క్తి (సుందరి). ౫-౭
U I I భ UU గగము.

ఏకభకారం
బేకగగంబున్
గైకొనుఁ బఙ్క్తిన్
శ్రీకమలాక్షా.

నంద. ౫-౧౩
UU I త I U వగణము.

దేవనుత నం
దావృత్తమునన్
శేవ న్నిలుపం
గా వచ్చుఁ దకల్.

అంబుజము. ౫-౧౫
U I I భ I U లగము.

ఇమ్ముల భకా
రమ్ము లగయు
క్తిం బరఁగుఁ దా
నంబుజమనన్.

షష్ఠచ్ఛందం బగుగాయత్రియందుఁబ్ర
తిపాదంబునకు నాఱేసియక్షరంబు లై
యఱువదినాల్గువృత్తంబులు పుట్టెనందు:

సావిత్రి. ౬-౧
UUU మ UUU మ.

గోవిందస్తోత్రంబుల్
దైవారు న్మాయుక్తిన్
సావిత్రీవృత్తంబుల్
గావింపంగా నొప్పున్.

విచిత్ర. ౬-౧౦.
I UU య I UU య.

తనర్చు న్విచిత్రం
బనంగా యయాప్తిన్
ఘనశ్యామగాత్రా
మునిస్తోత్రపాత్రా.

తనుమధ్య. ౬-౧౩
UU I త I UU యగణము.

కామేపలివాసున్
మే మెంతు మనంగన్
స్వామీ తనుమధ్యన్
భూమిన్ దయ లొప్పన్.

చంద్రవదన. ౬-౧౫
U I I భ I UU య.

చంద్రవదనన్ దే
వేంద్రవినుతా ని
స్సంద్ర తభయంబుల్
సాంద్రముగఁ జెప్పన్.

శశివదన. ౬-౧౭.

।।। న । ◡◡ య.

శశివదనాఖ్యన్
విశదము లయ్యెన్
దిశల నయంబుల్
దశముఖవైరీ.

*సురలత. ౬-౧౭.

।।। న । ◡◡ య.

మురహరుఁ దేవే
సురనుత నాఁగా
ధరణి నయంబుల్
సురలత యొప్పున్.

అందు వసుధావృత్తము

వసుధ. ౬-౨౮.

।। ◡ స ।। ◡ స.

వసుదేవసుతున్
బొసఁగింపు మనన్
వసుధావ్యయ మిం
పెసఁగున్ ససలన్

వసుమతి. ౬-౨౯.

◡◡। త ।। ◡ స.

బృందావనవిహా
రిం దర్శించెద నం
చందు న్వసుమతిం
బొందింతురు తసల్

వ. సప్తమచ్ఛందం బగునుష్ణిక్కనందుఁ బ్ర తిపాదంబునకు నేడేసియక్షరంబులై నూట యిరువది యెనిమిది వృత్తములు పుట్టె నందు:—

లోల. 8-౧౦

।◡◡య।◡◡య◡గ.

ధరిత్రీసుతారాతిన్
సరోజాతపత్రాక్షున్
హరిన్ యాగలన్ లోలన్
గరం బొప్ప వర్ణింతున్.

హంసమాల. 8-౨౦

।। ◡స◡ । ◡ర◡గ.

సరగంబుల్ రచింపన్
బరఁగున్ హంసమాలా
నరసింహావతారా
సురవిద్విడ్విదారా.

మదరేఖ 8-౨౫

◡◡◡మ ।। ◡ స ◡ గ.

గోపాలాఖ్యుఁడు నిచ్చల్, మాపాలం గలఁ డంచున్
రూపింప న్మసగంబుల్, దీపించు న్మదరేఖన్.

కుమారలలిత 8.౩౦

। ◡ । జ ।। ◡ స ◡ గ.

సుమాంశుధనిభాంగా, రమాహృదయనాథా
కుమారలలితావృ, త్త మొప్పు జసగాప్తిన్.

* 'సురలత' కును, 'శశివదన' కును భేదము లేదు. కాఁబట్టి లక్షణమును మరలఁ జూప నవసరము

సరసిజము ౭-౩౧

U ॥భ॥ U స U గ.

శౌరి సరసిజం బిం, పార భసగయుక్తిన్
నారదనుతిపాత్రా, నీరదనిభగాత్రా.

విభూతి ౭-౪౩

U । U ర । U । జ U గ.

ఇమ్మహిన్ రజంబులం, దమ్మునం గకారమున్
గ్రమ్మి యుండునట్టిదే, త్తమ్ము డా విభూతి యౌ.

మధుమతి ౭-౫౬

। । । న U ॥ భ U గ.

సుధరవైరికడన్, విధుఁడు దా నమరున్
మధుమతి న్నవము, న్మధశరీర హరీ.

మదనవిలసితము ౭-౬౪

। । । న । । । U గ.

పదపడి ననగల్, గదసి వెలసినన్
మదనవిలసితం, బది యదుతిలకా.

వ. అష్టమచ్ఛందం బగుననుష్టుప్పునందుఁ బ్రతిపాదంబునకు నెనిమిదేసియక్షరంబులై
యిన్నూటయేఁబదాఱు వృత్తంబులు పుట్టె నందు.

విద్యున్మాల ౮-౧

U U U మ U U U మ U U గగము.

శ్రీదేవీధాత్రీప్రాణేశా, యాదిత్యజ్యోత్స్నాదిస్తుత్యా
వేదోద్ధర్తా విద్యున్మాలం, బా దైత్యాగ్రాప్తిం బొల్చున్.

వితాన ౮-౬

। U । జ U U U మ U U గగము.

క్షితి జ్జగాయుక్తం బైనన్, వితానవృత్తం బై యొప్పున్
బితామహాద్యాదిత్యప్రస్తుతప్రభావా సర్వేశా.

విమానము ౮-౩౮

U । జ U U । త U U గగము.

క్షమన్ జతాంతస్థగాయుక్తమై రచింపం బొసంగున్
విమాన మంభోరుహాక్షా, రమాంగనావాసవక్షా.

సింహరేఖ ౮-౪౩

U । U ర । U । జ U U గగము.

ద్వారకాపురీవిహారా, మేరుధీర పంచబాణా
కార సింహరేఖకుం బెం, పార రేఫజల్ గగంబున్.

చిత్రపదము ౮-౫౫

U । । భ U । । భ U U గగము.

చిత్రపదం బనువృత్తం, బత్రిమునిస్తుతు శౌరిన్
స్తోత్రము సేయఁగ నొప్పున్, ధాత్రిని భాగగయుక్తిన్.

హంసరుతము ౮-౫౭

U U U మ । । । న U U గగము.

శ్రీవత్సాంకితసువక్షా, దేవా హంసరుత మెందున్
భావింప న్మనగా ప్తిన్, గావింపం దగు ధరిత్రిన్.

నారాచము ౮-౮౫

U U । త U । U ర । U వగణము.

క్షీరాబ్ధికన్యకాపతిన్, నారాయణుం ద్రవంబులన్
దోరంబుగా నుతించినన్, నారాచవృత్త మై చనున్.

† ప్రమాణి ౮-౮౯

। U । జ U । U ర । U వగణము.

అమిత్రలోకసంహారా, సమగ్రకాంతి భాసురా
క్షమన్ జరేభగంబులన్, ప్రమాణివృత్త మొప్పగన్.

నాగరము ౮-౮౭

U ।। భ U । U ర । U వగణము.

బా గమరున్ భరేఫసం, యోగలగంబుల న్మహా
యోగినుతు న్వినంబడున్, నాగరనామవృత్త మై.

మాణవకము ౮-౧౦౩

U । । భ U U । త । U వగణము.

శోణమయూఖప్రవిభా, బాణసుపర్వారిహరా
వేణుధరా భత్వములన్, మాణవకం బై తనరున్.

---

†ఇది (పూ. ము.) లో లేదు. దీనిపేరుమాత్రము సంజ్ఞలపట్టీలోనున్నది (చూ. ౮. ౩౯.).

సమాని ౮-౧౦౭

U I U ర I U I జ I U వగణము.

నారదాదిమౌనివరుల్, చేరి శౌరిఁ గొల్తు రనఁగ
గోరి రేఫముం జవముల్, ధారుణి స్సమాని కగుఁగ.

వ. నవమచ్ఛందం బగుబృహతియందుఁ బ్రతిపాదంబునకుఁ దొమ్మిదేసియక్షరంబు లై యేనూటపండ్రెండు వృత్తంబులు పుట్టె నందు:—

భుజంగశిశురుతము ౯-౧౨౮

I I I న I I I న I U U యగణము.

నిజమున ననయ లొప్పఁగ, భుజగశిశురుత మయ్యెఁగ
సుజనవినుతచరిత్రా, వృజినతృణఘనదాత్రా.

ఉత్సుకము ౯-౧౮౩

U II భ U II భ U I U రగణము.

వాసవముఖ్యసురస్తుతా, దాసమనోంబుజషట్పదా
వాసిగ భారము లొందినఁగ, భాసిలు నుత్సుకవృత్తముల్.

భద్రకము ౯-౧౮౭

U I U ర I I I న U I U రగణము.

కాద్రవేయశయనా సము, న్నిద్రదైత్యమదభంజనా
రుద్రమిత్ర రనరేఫముల్, భద్రకంబునకు భాసిలుఁగ.

హాలముఖి ౯-౨౫౧

U I U ర I I I న I I U సగణము.

కింకరీకృతసురవరా, పంకజాతదళనయనా
పొంక మౌ రనసగణముల్, శంక లేక హాలముఖికిఁగ.

ఆ. పఙ్క్తినుంచి కృత్తి•పఙ్క్తి కిన్నవ్రాయి, వడి యటంచుఁ జెప్పఁ•బడియె నిచట
సంస్కృతంబునందుఁ•జనుఁ బదవిచ్ఛేద, మడుగు మొదలివర్ణ•మగుఁ దెనుఁగున. 177

క. ధర గణితశాస్త్రసంజ్ఞల, శరరసగిరిదంతినిధిది•శాశంకరభా
స్కరవిశ్వమనుదినోర్వీ, శ్వరనామములు యతివర్ణ•సంఖ్యార్థంబుల్. 178

వ. దశమచ్ఛందం బగుపఙ్క్తియందుఁ బ్రతిపాదంబునకుఁ బదేసియక్షరంబు లై వేయు నిరువదినాల్గువృత్తములు పుట్టె నందు:—

*సంజ్ఞలపట్టీలో ‘భుజంగశిశు’ అనియేయున్నది; గాని ఇచ్చట (పూ. ము)లో ‘భుజంగశశి’ అని తప్పుగనున్నది.

పణవము ౧౦-౧-౨౧

∪∪∪ మ | | | న | ∪∪ య ∪ గ.

ఊర్వి న్మన్యగ ♦ యుతపాదంబుల్, పర్వ న్షడ్యతిఁ ♦ బణవం బయ్యెన్
గీర్వాణాహిత♦గిరినాకేశా, సర్వేశా రవి♦శతసంకాశా.

మయూరసారి (మయూరభాషిణి) ౧౦-౧౭౧

∪ | ∪ ర | ∪ | జ ∪ | ∪ ర ∪ గ.

వెక్కసించె శైల ♦ విశ్రమంబు, ల్పొక్క రేఫజంబు♦లు న్రగంబుల్
చక్కఁగా మయూర♦సారి కొప్పున్, నిక్క మంబుజాత♦నేత్ర శౌరీ.

రసాలి ౧౦-౧౮౭

∪ | ∪ ర | | | న ∪ | ∪ ర ∪ గ.

గోత్రవిశ్రమము ♦ గూడి భక్తిన్, ధాత్రి రేఫనగ♦ణంబు లొప్పైఁ
బోత్రిరూప రగ♦ము ల్రసాలం, జిత్రభంగి నుతి♦సేయు నిన్నున్.

రుగ్మవతి ౧౦-౧౯౯

∪ || భ ∪∪∪ మ || ∪ స ∪ గ.

అంగయతిం బొం♦దై భమస ల్పూర్వం గురుయుక్తి ♦ న్రుగ్మవతి న్స
త్యాంగనకై తేఁ♦డా సురశాఖిం, బొంగుచు గోపీ♦పుత్త్రుఁ డనంగన్.

*చంపకమాలి ౧౦-౧౯౯

∪ | భ ∪ ∪ ∪ మ | | ∪ స ∪ గ.

భూమిధరక్రాంతు ♦ లొప్పలుపారన్, బ్రేమ భమంబు ల్గో♦రి సగంబుల్
దామ నుతించు న్నం♦దసుతు న్బ్రా, మామకరాంకుం జం♦పకమాలిన్.

మణిరంగము ౧౦-౨౮౧

∪ | ∪ ర || ∪ స || ∪ స ∪ గ.

అంగనామణు ♦ లంగయతుల్గా, సంగ మెచ్చ ర♦సాగురుయుక్తిన్
బొంగుచు న్మధు♦పుంగవు వేఁడన్, రంగగున్ మణి♦రంగ మనంగాన్.

మత్త (హంసశ్రేణి) ౧౦-౨౮౧

∪∪∪ మ ∪ || భ || ∪ స ∪ గ.

శైలక్రాంతి న్మభ♦సగ లొంది, న్రాల న్మత్తాఖ్యను ♦ గనుపట్టున్
బాలించె న్యాదవ♦పతి యాపాం, చాలిం గౌరవ్యుల♦సభ నాఁగన్.

---

*రుగ్మవతికిని, చంపకమాలికిని గణములలో భేదము లేదు; యతిస్థానమునమాత్రము భేదము గలదు గాన వేఱుగఁ జెప్పఁబడినది.

## చతుర్థాశ్వాసము.

### కౌముది ౧౦-౨౯౬

I I I న U U I త U U I త U

మునినుతా కౌ♦ముదీవృత్త మొప్పును నతాగం♦బులన్
దునిమెఁ బౌల♦స్త్యు భూపుత్రికై, కినుక రాము♦క్షితీశుం డనన్.

### భోగివిలసితము (విలసితము) ౧౦-౩౫౧

U I I భ I I U స I U I జ U గ.

సాగభసములన్ ♦ జగంబులున్, జా గగు నగవి♦శ్రమంబులన్
భోగివిలసితం♦బుఁ జెప్పఁగా, సాగరతనయా♦సమన్వితా.

### మనోరమ ౧౦-౩౪౪

I I I న U I U ర I U I జ U గ.

నరజగంబుల ♦ న్మనోరమల్, సరవి శైలవి♦శ్రమంబులన్
దురితదూరు సిం♦ధుజాపతిన్, సొరిది సన్నుతిం♦చు నెంతయున్.

### *శుద్ధవిరాటి ౧౦-౩౪౫

U U U మ I I U స I U I జ U గ.

చా లొప్ప న్మస♦జ గ్గకారమున్, గ్రాలు న్శుద్ధవి♦రాటిన్ సద్యతిన్
నీలాంగా రమ♦ణీమనోభవా, నాళీకాసన♦నందనస్తుతా.

### నందిని ౧౦-౩౫౯

U I I భ U U I త I U I జ U గ.

శ్రీరమణా ని♦ర్జితదానవా, సారసపత్రే♦క్షణ సద్యతిన్
సార భతంబు♦ల్జగము ల్దగన్, ధీరులచే నం♦దిని నాఁ జనున్.

### పఙ్క్తి ౧౦-౪౩౯

U I I భ U I I భ U I I భ U గ.

గ్రావవిరామము♦గా విబుధుల్, భావజుతండ్రి ని♦భాభగురుల్
గా వినుతించినఁ♦గావ్యముల, న్బావిరిఁ బఙ్క్తి య♦నం బరఁగున్.

వ. ఏకాదశచ్ఛందం బగు త్రిష్టుప్పునందుఁ బ్రతిపాదంబునకుం బదునొకం డేసి యక్షరంబు లై ౨౦౪౮ వృత్తంబులు పుట్టె నందు:—

---

* (పూ. ము.) సంజ్ఞలపట్టీలో 'వరాటి' అనియున్నది; (పె)లో విరాటి. విరాట (ప).

### ఇంద్రవజ్ర ౧౧-౩౫౭

UU । త UU । త । U । జ UU గగము.

ఇంతు ల్పదా పాడుదు♦రింద్రవజ్రల్, స్వాంతంబున న్సోమము♦సంధిలంగన్
దంతావళ శ్రాంతిని♦ తా జకార,ప్రాంతంబునం గద్వయ♦మంద మందన్.

### ఉపేంద్రవజ్ర ౧౧-౩౫౮

। U । జ UU । త । U । జ UU గగము.

జపాచరారు ల్జతి♦జ ల్గగంబున్, బ్రపూర్ణ మై దంతివి♦రామ మొప్పన్
ద్విపాధిపత్రాత ను♦తింపఁ జేరై, యుపేంద్రవజ్ర ల్వెల♦యు న్ధరిత్రిన్.

### ఉపస్థితము ౧౧-౩౬౫

UU । త । U । జ । U । జ UU గగము.

భక్తు ల్హరిమీఁద ను♦పస్థితం బౌ, సక్తి న్విరతు ల్కరి♦సంఖ్య సాగన్
సూక్తు ల్గాని చెప్పెడు♦చోఁ దజాగా,యుక్తం బగుచుం జెలు♦వొందుచుండున్.

### దోధకము ౧౧-౪౩౯

U ।। భ U ।। భ U ।। భ UU గగము.

తోరపువేడుక ♦ [1]దోదక మొప్పున్, భూరివిరామము ♦ భూధరసంజ్ఞం
బారుచు భాభగ♦గాన్విత మై లక్ష్మీరమణా విర♦చింప నెసంగున్.

### రథోద్ధతము (పరాంతిక) ౧౧-౬౯౯

U । U ర ।।। న U । U ర । U వగము.

అంది రేఫనర♦వా ప్తి నొప్ప గో,వింద భూమిధర♦విశ్రమంబులన్
జెంది కబ్బములఁ ♦ జిత్రభంగిఁ జె,న్నొందు నెంతయు ర♦థోద్ధతం బిలన్.

### భద్రకము ౧౧-౭౦౪

।।। న ।।। న U । U ర । U వగము.

నరకదమన ♦ నారవంబులన్, సరగఁ గుధర♦సమ్మితంబు లై
విరతు లమర ♦ వేడ్కఁ జెప్పినం, బరఁగుఁ గృతుల♦భద్రకం బనన్.[2]

### స్వాగతము ౧౧-౪౪౩

U । U ర ।।। న U ।। భ UU గగ—.

స్వాగతంబు దగు ♦ శైలవిరామం, బై గజేంద్రవర♦దా రనభంబుల్
పై గురుద్వయము ♦ భాసిలఁ జెప్పన్, యోగిమానసప♦యోజవిలాసా

1 తోటక / పా. పా. 2 చూ. చంద్రి.

కాంతి ౧౧-౨౭౭

UU । త । U । జ । U । జ । U లగము.

క్రాంతు ల్కఱిసంఖ్యను ♦ రాజిలఁగా, సంతోషముతోడఁ ద♦జాలగముల్
చింతింపఁ బదంబులఁ ♦ జెంద రమా, కాంతాహృదయేశ్వర ♦ కాంతి యగున్.

శ్యేని ౧౧-౬౮౩

U । U ర । U । జ U । U ర । U వగణము.

మానితాద్రివిశ్ర♦మంబుఁ బూనఁగా, శ్యేనికి న్రజ ల్వ♦యి న్రవంబులు౯
గాని యొండు గూర్పఁ ♦ గాదు రుక్మిణీ, ప్రాణనాథ కామి♦పల్లిమందిరా.

వాతోర్మి ౧౧-౨౧౭

UUU మ U । । భ UU । త । U వగణము.

ఆమోదం బొప్పఁగ ♦ వ్యాసాదికవుల్, భూమిధ్రక్రాంతులు ♦ పొంగార మహీ
భామాప్రాణేశ మ♦భంబుల్ తవలు౯, దా మీవాతోర్మిని ♦ బాటింతు రొగిన్.

కలితాంతము (గీతాలంబనము) ౧౧-౨౭౭

U U । త । U । జ । U । జ । U లగము.

సామోద్భవవిశ్రమ♦సంయుత మై, వేమాఱు తజాలగ♦విస్తృత మై
దామోదరదేవుక♦థ ల్పలుక౯, భూమిం గలితాంతము♦పూర్ణ మగున్.

శాలిని ౧౧-౨౮౯

U U U మ U U । త U U । త U U గగము.

ధీరశ్రేష్ఠు ల్సన్ను♦తింపం గవీంద్రా♦ధారం బై ధాత్రి న్మ♦తాగాగణాపేక్ష
దోరం బై భూభృద్య♦తుల్ సంఘటింప౯, నీరేజాక్షా శాలి♦నీవృత్త మొప్పున్.

సుముఖి ౧౧-౭౨౦

। । । న । U । జ । U । జ । U లగము.

ఖగపతివాహ ♦ కపర్దిసుతా, మృగపతిమధ్య ♦ హితార్తిహరా
నగవిరమం బొ♦నయంగ నజా, లగములచేఁ జె♦లఁగు న్సుముఖుల్.

భ్రమరవిలసితము ౧౧-౧౦౦౯

U U U మ U ॥ భ । । । న । U వగణము.

ఏయంఘ్రిం బార♦యి మగణభన, ల్వా యొక్కం డవ్వ♦లను నెలకొన౯
మాయాతీతా భ్ర♦మరవిలసితం, బై యొప్పం దర్క♦యతుల నిలుచున్.

వృత్త ౧౧-౨౮౮

I I I న I I U స U U I త U U గగము.

అనయమును వే♦దాంగంబు సెప్పఁగ, దనుజహార న♦ స్తంబు ల్గగంబుఁగ
బెనఁగొని ధరా♦భృద్విశ్రమంబుల్, దనరునది వృ♦త్తావృత్త మంచున్.

పృథ్వి ౧౧-౮౯౬

I I I న I I I న I U I జ I U వగము.

నలినభవనుత♦నాజలగం, బులు గలయతులఁ ♦ బొందుపడం
బెలుచఁ బలికినఁ ♦ బృథ్వి యనఁగ, వెలయు నొకసమ♦వృత్త మిలన్.

వృంత ౧౧-౨౫౬

I I I న I I I న I I U స U U గగము.

నగణయుగము సగ♦ణం బొందుఁగ, గగ మొకటియు జత♦గాఁ గూడఁగ
ఖగవిరమములను ♦ గల్పింపఁగ, దగుఁ గవులకు వసు♦ధ వృంతల్.

మౌక్తికమాల ౧౧-౪౮౭

U I I భ U U I త I I I న U U గగము.

భక్తజనత్రాత ♦ భతనగాసం, యుక్తము లై మౌని♦యుతయతుల్ సు
వ్యక్తము లై సూక్తు♦లమరఁ జెప్పఁగ, మౌక్తికమాలాక్ర♦మము లెసంగున్.

ఉపస్థితము (శిఖండివిరుతము); (స్త్రీ) ౧౧-౨౮౬

I U I జ I I U స U U I త U U గగము.

ఉపస్థితమునం ♦ దొప్పారుచుండుఁగ, దపస్వివిరతు ♦ ల్దాకం జకారం
బుపై సతగణం♦బు ల్గద్వయంబుఁగ, గపిధ్వజసఖా ♦ కామేపలీశా.

ఏకరూప ౧౧-౭౩౭

U U U మ U I I భ I U I జ U U గగము.

ఏపారుం గావ్యముల ♦ నేకరూపల్, త్మాప్రతీశుఁగ మభజ♦గాగణంబుల్
బ్రాపించుం గుంజరవి♦రామ మొప్పఁగ, జాపంబుల్ వాయుటకుఁ ♦ బ్రస్తుతింపన్.

చంద్రిక ౧౧-౭౦౪

I I I న I I I న U I U ర I U వగము.

అగసరధర నార♦వాన్వితం, బుగఁ గృతులను జెప్పఁ ♦ బొందిపై
తగ నిధివిరమంబు ♦ డాఁకఁగా, జగతిని నెగడొంచుఁ ♦ జంద్రికల్

వ. ద్వాదశచ్ఛందం బగుజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బండ్రెండేసియక్షరంబు లై రఁగ నవృత్తంబులు పుట్టె నందు.

స్రగ్విణి ౧౨-౧౭౭౧

U I U ర U I U ర U I U ర U I U ర.

కామెపల్లీమహా♦గ్రామమధ్యంబునన్
భూమిదేవోత్తము ♦ ల్బ్రాజ సేయంగ నా
స్వామియున్నాఁడనన్ ♦ స్రగ్విణిన్ శైలవి
శ్రామయుక్తిం జతు♦ష్కంబగున్ రేఫముల్.

భుజంగప్రయాతము ౧౨౫౫౧

I U U య I U U య I U U య I U U య.

భజింతున్ సదా కామె♦పల్లీనివాసున్
వ్రజస్త్రీవిటున్ యాద♦వశ్రేష్ఠు నంచున్
భుజంగప్రయాతాఖ్య♦ము ల్నాల్గు యాలన్
గజవ్రాతవిశ్రాంతి♦గాఁ జెప్ప నొప్పున్.

తోటకము ౧౨-౧౭౫౬

I I U స I I U స I I U స I I U స.

తగుఁ దోటకవృత్తము ♦ ధాత్రియతిన్, సగణంబులు నాలుగు ♦ సాగినఁ బ
న్నగపుణ్యనదీసుర♦నాథదిశా, జగతీద్విజపట్టణ♦సంచరణా.

జలధరమాల ౧౨-౨౮౧

U U U మ U I I భ I I U స U U U మ.

ధీరుల్ మెచ్చం గృతుల న♦తిశ్రీదం బై, మారాకారా జలధర♦మాలావృత్తం
బై రాజిల్లున్ భువిఁ జతు♦రాస్యక్రాంతుల్, సారం బేరన్ మభసమ♦సంయుక్తం బై.

వంశస్థము ౧౨-౧౭౩౨

I U I జ U U I త I U I జ U I U ర.

జతల్ జరేఫంబులు ♦ సామజాతస, మ్మితాక్షరక్రాంతుల ♦ మెప్పు పుట్టఁగాఁ
బతంగరాజధ్వజుఁ ♦ బద్మలోచనున్, నుతింప వంశస్థ మ♦నూన మై చనున్.

ఇంద్రవంశము ౧౨-౧౭౩౧

U U I త U U I త I U I జ U I U ర.

ఇందీవరాక్షుల్ తగ ♦ నింద్రవంశ మౌ, నందంబునం బాడిరి ♦ నందనూతి పై
డెందంబుల న్మోహము♦ దేర భామినుల్, బొందు గజక్రాంతులు♦పూనఁదాజలన్

### ద్రుతవిలంబితము ౧౨-౧౪౬౮

।।। న ∪।। భ ∪।। భ ∪।∪ ర.

ద్రుతవిలంబిత•రూప మగుం గుభ్ర, ద్యుతి నభారయు•తంబుగఁ జెప్పినన్
నతజనా ర్తిశ•నశ్వసనప్రియా, వితతభూసుర•వీరపురాలయా.

### తోదకము (తామరసము) ౧౨-౭౭౦

।।। న । ∪। జ । ∪। జ । ∪∪ య.

సలలితతోదక•సామజవిశ్రాం, తులను నజాయలఁ• దోదకవృత్తం
బలవడుఁ గేశవ•రాసురకాష్టో, జ్వలనవకోశర•సాస్థలవాసా.

### ప్రియంవద ౧౨-౧౪౦౦

।।। న ∪।। భ । ∪। జ ∪।∪ ర.

విభు శమీరపృథి•వీజరక్షభా, గభవనాలయునిఁ గామెపల్లికా
ప్రభు నభజ్రలను • బ్రస్తుతింప నౌ, నిభవిరామమున • నీప్రియంవదల్.

### ప్రమితాక్షరము ౧౨-౧౬౬౨

।।∪ స ।∪। జ ॥∪ స ।।∪ స.

ప్రమితాక్షరం • బమరుఁ బద్మజవి, శ్రమ మొప్పమీఱ • సజసాయుతమై
యమునానదీతటవి•హార పృథా, ప్రమదాకుమారసఖ • భద్రయశా.[1]

### జలోద్ధతగతి ౧౨-౧౭౭౬

।∪। జ ।।∪ స ।∪। జ ॥∪ స.

జలోద్ధతగతిం ది•శాగజయతిన్, మెలంగు నినుమూఁడు • మెచ్చుగ జసల్
ఫలానుభవ కామె•పల్లినిలయా, ఖలాంబుదసమీర • కామజనకా.

### విశ్వదేవి ౧౨-౫౬౬

∪∪∪ మ ∪∪∪ మ । ∪∪ య । ∪∪ య.

శ్రీవత్సాంకా పద్మాధ•రిత్రీకళత్రా, దేవేంద్ర స్తోత్రా విశ్వ•దేవీసమాఖ్యం[జెప్పన్.
బై విప్రేంద్రు న్మాయాగ•ణావాప్తి దిక్సం, ఖ్యావిశ్రామంబుల్ చోద్య•మైయుండఁ

### చంద్రవర్త్మ ౧౨-౧౯౭౯

∪।∪ ర ।।। న ∪॥ భ ॥∪ స.

ఇంద్రవంద్య జగ•దీశ ఘనయశ, స్సాంద్ర కామెపలి•సద్మ యదువరా
చంద్రవర్త్మ యగు • శైలవిరతి ని, స్సంద్ర మై రనభ•సంబు లమరినన్.

---

1 (ప. పె) లో ౧౬౬౨ అనియే ఉన్నది. (పూ. ము) లో ౧౬౪౦ ఉన్నది. ఇదిచూచి యిటీవలివారు వ్రాతప్రతులలో సరిగానున్న సంఖ్యను తప్పుగాదిద్దినారు.

### ప్రహేయము ౧౨-౫౭౬

। । ।న। । ।నUUUమ।UUయ.

కరివిరమణముల్ ♦ గా నామయంబుల్, బరఁగ నిలుపఁ జా♦పట్టుం బ్రహేయం
బురగశయన భో♦జోర్వీశపుత్రీ, వరపరమకృపా♦వారాశి కృష్ణా.

### ప్రముదితవదన ౧౨-౧౨౧౬

। । ।న। । ।నU।UరU।Uర.

మమత నిభవిరా♦మముల్ గూడఁగా, జమిలినరములన్ ♦ సదా చెన్నగన్
బ్రముదితవదనల్ ♦ రమానాయకా, సుమశరజనకా ♦ సుపర్వస్తుతా.

### కుసుమవిచిత్రము ౧౨-౯౭౬

। । ।నUUయ। । ।నUUయ.

కుతలములోనం ♦ గుసుమవిచిత్రం, బతిశుభదం బై ♦ యగయతు లన్నం
దతనయ యొప్పున్ ♦ నయ లినుమా రై, సతతము విద్వ♦జ్జనులు నుతింపన్.

### మణిమాల ౧౨-౭౮౧

UU।త।UUయUU।త।UUయ.

కామేపలినామ♦గ్రామస్థలవాసా, స్వామీ తయకార♦ద్వంద్వంబు పొసంగన్
శేమాఱుమహీభృ♦ద్విశ్రాంతులతోడన్, భూమండలిఁ గూర్పం♦బొల్చున్ మణిమాలల్.

### మేఘవిలసితము ౧౨-౨౦౪౧

UUUమ । । ।న । । ।న । । U స.

కాళిందీముఖ♦కమలమధుకరా, నాళీకాసన♦నతరసవిరతు
ల్గాల న్మేఘవి♦లసితము దనరు, న్వాలాయంబు మ♦ననసగణములన్.

వ. త్రయోదశచ్ఛందం బగునతిజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదుమూఁడేసియక్ష
రంబు లై యెనిమిదివేలనూటతొంబదిరెండువృత్తములు పుట్టె నందు:—

### మత్తమయూరము ౧౩-౧౬౩౩

UUUమUU।త।UUయ। ।UసUగ.

శ్రీగోపాలా తంగెడ♦సీమావనిగేహా
వాగీశాదిస్వర్గని♦వాసస్తుతిపాత్రా
యోగిధ్యేయా మత్తమ♦యూరంబున కొప్పున్
నాగక్రాంతు ల్మత్యగ♦ణంబు ల్సగ మొందన్.

ప్రహర్షిణి ౧౩-౧౪౦౧

∪∪∪మ।।।న।∪।జ∪।∪ర∪గ.

ధీరుల్ సింధురవిర • తిన్ మనజ్ఞ గంబుల్, సారెం బాదములను • సంఘటించుచుండన్
గ్రూరారి ప్రహరణ • కుం బ్రహర్షణుల్పెం, పారం జెప్పెదురుమ • హామోదంబుతోడన్.

ప్రభాతము ౧౩-౧౩౯౨

।।।న।∪।జ।∪।జ∪।∪ర∪గ.

మునిని నజారగ • ముల్ ప్రభాతవృత్తం, బునకు మదేభస • మూహవిక్రమంబుల్
దనరఁగ నిల్పుఁ బృం • దాకురాజతల్పా, కనకమయాంశుక • కామెపల్లివాసా.

జలదము ౧౩-౩౫౪౩

∪।।భ∪।∪ర।।।న∪।।భ∪గ.

బంగరుచుంగుపచ్చడము • పైఁ గలయయ్యా, తంగెడదేశవాసు జల • దంబులచే
తం గడు పన్నుతింతు నవ • తారయతిన్, బొంగుచు సారె భర్నభగ • ముల్ గదియన్.

మంజుభాషిణి ౧౩-౨౭౯౬

।।∪స।∪।జ।।∪స।∪।జ∪గ.

ఉరగాపగాదిహరి • దుర్వారాలయా, కరుణాసముద్ర మర • గర్వభంజనా
యిర వొందుచుండు సజ • లిబ్బడింపఁ బ్రల్మరగా ప్రీతిధాత్రియతి • మంజుభాషిణుల్.

రుచిరము ౧౩-౨౮౦౬

।∪।జ∪।।భ।।∪స।∪।జ∪గ.

గదాధరున్ జభసజ • గంబులన్ గవుల్, సదా పితామహయతి • సాగుచుండఁ గా
ముదంబుతోడ రుచిర • ము ప్రచింతు రి, ట్లుదారభక్తిఁ గృతుల • నుర్వరాస్థలిన్.

క్షమ (క్షప) ౧౩-౨౩౬౮

।।।న।।।న∪∪।త∪∪।త∪గ.

క్రమమున నిభవి • క్రాంతి నాతాగయు, క్షమగ సుకవిప • ద్యంబు లూహించినన్
క్షమ నవఁ బరఁగుం • గంజపత్రేక్షణా, సుమశరజనకా • సూరవంశోత్తమా.

చంచరీకావళి ౧౩-౧౧౫౩

∪∪∪మ∪∪∪మ∪।∪ర∪।∪ర∪గ.

కంబుగ్రీవా సత్యా • కామినీప్రాణనాథా, బింబోష్ఠామారాగ • శ్ఛిద్భూభృద్వ్యతుల్గాం
చుంబాదం బైశ్యాత్రిం • జంచరీకావళీనా, మంబొందుం గావ్యశ్రీ • మాన్యనిభూషణంబై.

# చతుర్థాశ్వాసము.

## మత్తహంసిని ౧౩-౨౯౯౦

।U।జUU।త॥U।స।U।జU।గ.

మనోహరాకార ♦ మధుదైత్యసంహారా, వినాయకారూఢ ♦ విబుధేంద్రవందితా
జనార్దనా జత్స♦జగురుల్ సభృద్యతిఁ, దనర్చుం బద్యంబు♦దగు మత్తహంసినిన్.

## సుమంగలి ౧౩-౧౮౮౨

॥U స।U।జ॥U స॥U స U గ.

సారిదిఁ ధరిత్రిని ♦ సుమంగలివృత్తం, బరయంగ సామజ ♦ యతిఁ సజసాగల్
తిర మొంద నొప్పు వి♦ధిపూజితపాదా, బురహద్వయా ఖర♦మురాసురవైరీ.

వ. చతుర్దశచ్ఛందం బగుశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాలుగేసియక్షరంబులై ౧౬౩౮౪ వృత్తములు పుట్టె నందు:—

## వనమయూరము ౧౪-౩౬౨౩

U॥భ।U।జ॥U స।।।న UU గగము.

శ్రీకర ధరాధర♦జిష్ణునుత పుణ్యా, శ్లోక భజసన్నగగ♦లుఁ ద్రుహిణసంఖ్యన్
సోఁకువిరమంబుగను♦చున్వనమయూరా, ఖ్యాకమనువృత్తమిల♦నత్తమిలుచుండున్.

## వసంతతిలక (సింహోన్నతము, ఉద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి) ౧౪-౨౯౩౩

UU।తU॥భ।U।జ।U।జUU గగము.

శ్రీమేదినీరమణ♦సింధుతరంగరంగ, ధ్రామాహితల్ప విన♦తాసుతవాహ రాధా
కామా వసంతతిల♦కఁ దభజాగగంబుల్, సామప్రభూతయతి♦సాగిధరం జెలంగన్.

## భూసుతము ౧౪-౩౫౧౫

।U।ర।।।నU॥భU।।భ UU గగము.

ముష్కరించి రనభాగగ♦ముల్ దశవిశ్రా, మంబుభూతలమునందున♦మానితమయ్యెన్
జాంబవత్యధిప కేశవ♦సారసనేత్రా, కంబునందకగదాధర♦ఖండితసాళ్వా.

## సుందరి ౧౪-౪౭౧౫

U।।భU।।భU।U ర।। Uస।Uవగణము.

సూరిజనప్రకరంబు సుందరి నెన్నఁగా
భారసవంబులు రత్న♦భాసితవిశ్రమా
ధారమగాఁ దనరారుఁ దార్క్ష్యతురంగమ
శౌరి ముకుందమునీంద్ర సన్నుతకేశవా.

## ప్రహారణకలిత ౧౪-౮౧౯౨

౹౹౹ న ౹౹౹ న ᑌ ౹౹ భ ౹౹౹ న ౹ ᑌ వగణము.

పవిగొను నెపుడుం ♦ బ్రహారణకలితక్, ననభనవలు మం ♦ దగజవిరమముక్
ఘననిభఘనవి ♦ గ్రహ బకమురమ, ర్దన మధునరక ♦ ప్రహారణకలితా.

## నవనందిని ౧౪-౩౭౨౦

౹ᑌస౹ᑌజ౹ ౹ᑌస౹ ౹౹నᑌᑌగగము.

నవనందినిక్ సజగణ ♦ స్నగగ లాదొక్, నవవిశ్రమంబును ద ♦ నర్చి చెలువొప్పక్
నవనీతచోరకు జ ♦ నార్దనునుపేంద్రుక్, భవదూరు నెంతురు స ♦ భాసదులుభక్తిక్.

## అపరాజితము ౧౪-౭౬౨౪

౹౹౹ న ౹౹ ౹నᑌ౹ᑌర౹౹ᑌస౹ᑌవగణము.

ననరసలగ లొందిన ♦ న్నవవిశ్రమం, బును గలిగి కవీంద్ర ♦ భూషిత మై జనా
ర్దన నిగమకుగోచ ♦ రా యపరాజితం, బనఁగఁ దనరు శ్రావ్య ♦ మై వినువారికిక్.

## అసంబాధ ౧౪-౨౦౧౭

ᑌᑌᑌమᑌᑌ ౹ త ౹౹౹ న ౹౹ ᑌసᑌᑌ గగము.

వాలాయంబుక్ సత్కవిజనములు ♦ వాక్రువ్వక్
వాలారుక్ గోవింద వరద ధురీవ ♦ వాత్సల్యా
కాళిందీప్రా మతనసగ ♦ గప్రాప్తిక్
జాలాభాస్వద్విశ్రమమునను న ♦ సంబాధల్.

## కమలవిలసితము ౧౪-౪౦౯౬

౹౹౹ న౹ ౹౹ న ౹౹ న౹ ౹నᑌᑌగగము.

క్రమమున ననన ♦ గగములు గూడక్, గమలవిలసితము ♦ కమలజవిశ్రా
మము జగతిని నగు ♦ మహితచరిత్రా, కమలదళనయన ♦ కడుఁ బొగడొందుక్.

వ. పంచదశచ్ఛందం బగునతిశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదిహేనేసి యక్ష
రంబులై ౩౨౭౬౮ వృత్తంబులు పుట్టినందు.

## మాలిని ౧౫-౪౬౭౨

౹౹ ౹ న ౹౹ ౹నᑌᑌᑌమ౹ᑌᑌయ౹ᑌᑌయ.

కనకకశిపుహర్తక్ ♦ గానలోలుక్ శుభాంగుక్
దనుజహరణదక్షుక్ ♦ ధర్మమార్గానుసారిక్
మనసిజగురు నెంతుక్ ♦ మాలినీవృత్త మందుక్
ననమయయగణంబుల్ ♦ నందివిశ్రాంతి గూడక్.

## సుకేసరము (భద్రకము) ౧౫-౧౧౧౮౪

ll న।ᑌ।జᑌ।।భ।ᑌ।జᑌ।ᑌర.

సురుచిరధర్మమూల మయి♦సొంపు మీఱు నా, గిరిధర నాభిపంకజసు♦కేసరంబువై
ఖరి నజభ జ్రము ల్గదియుఁ♦గల్పనంబునన్, గిరిశవిరామసంగతి సు♦కేసరంబునన్.

## మనోజ్ఞ ౧౫-౧౧౬౩౨

।।। న। ᑌ ।జ।ᑌ। జᑌ। ।భᑌ।ᑌర.

అజమృడవాసవసంత♦తార్చితపాదపం
కజయుగళున్ హరి నిర్వి♦కారు మనోజ్ఞ నా
బుజు వగువృత్తమునందుఁ ♦ బ్రీతి నుతింపఁగా
నజజభరంబులు వొల్చు ♦ నచ్చిన దిగ్యతిన్.

## మణిభూషణము ౧౫-౧౧౭౦౭

ᑌ। ᑌ ర ।।। న ᑌ ।। భ ᑌ ।। భ ᑌ । ᑌ ర.

వింత యైనమణిభూషణ♦వృత్తమునందు న
త్యంతమోదమున నెన్నను ♦ నద్దశవిశ్రమా
క్రాంత మయ్యు రనభారలఁ ♦ గంజదళాక్షుఁ గం
సాంతకు న్నరకసంహరు ♦ నార్యసమూహముల్.

## సుగంధి (*శాలినీ, చామర, ప్రశాంతి) ౧౫-౧౦౯౨౩

ᑌ।ᑌర।ᑌ।జᑌ।ᑌర।ᑌ।జᑌ।ᑌర.

రంబు జంబు రంబు జంబు ♦ రంబు చెన్నుమీఱఁగాఁ
దొమ్మిదింట విశ్రమంబు ♦ తోర మై సుగంధికిన్
క్రమ్మఁగా నుతింప నొప్పుఁ ♦ గానలోలుఁ డచ్యుతుం
డంబుజాక్షుఁ డాదిదేవు ♦ డక్షరాఖ్యుఁ డెప్పుడున్.

## ఇల ౧౫-౧౬౩౬౪

।।ᑌస।ᑌ।జ। । న। । న।। ᑌస.

గజవిశ్రమంబునఁ ♦ గనలు నిల యనఁగా, సజనాస లుండిన♦సకలకవిక్నుత మై
భుజగాశవధ్వజు♦భుజగపతిశయనున్, వ్రజసుందరీముఖ♦వనజమిత్రుఁ బొగడన్.

---

౧౧న ఛందములో నజిరియొకశాలినీవృత్తము గలదు. (249 పుట)

చంద్రరేఖ ౧౫-౮౬ ౨౫

UUU మ | U | U ర UUU మ | UU య | UU య.

మత్తేభక్రాంతిచే ర♦మ్యం బౌ నుహిం జంద్రరేఖా
వృత్తం బౌ మ్రమ్యయంబుల్ ♦ వేడ్కన్ హృషీకేశుఁ బార్థ
క్షత్త న్నారాయణు న్వి♦శ్వామిత్రయాగారిదైత్య
చ్ఛేత్త స్థాశార్హు లక్ష్మీ♦చిత్తాబ్జవాసు న్నుతింపన్.

నలిని ౧౫-౧౮౦౮౮

II U స II U స II U స II U స II U స.

ససపాసలచే దశవి♦శ్రమయుక్తతచేఁ, బొసఁగ న్నలినిన్ మణికం♦బు సుదర్శనహ
స్తసరోరుహువామనుఁ గే♦శవు శౌరినజున్, వసుదేవనృపాలతనూ♦భవుఁ బాడుదురా.

అలసగతి ౧౫-౭౬౮౭

II I న I I U స II I న U I I భ I UU య.

అలసగతి నాఁ జను స♦భాంతరమునందు, న్విలసదవతారయతి ♦ నిండి నసనభ్యల్
గలయ శకటాసురవి♦ఘాతను విశిష్టున్, బలుమఱుఁ గవీశ్వరులు♦ ప్రార్థనలు సేయన్.

మణిగణనికరము ౧౫-౧౬౩౮౪

I I I న I I I న I I I న I I I న I U స.

మణిగణనికరమా♦మను లఘుగురు వై, మణివిరమణ మయి ♦ మధుదనుజహరున్
ఫణిపతిశయనునిఁ ♦ బ్రమథితనరకు, న్గుణిమదయుతనిభు♦ని బొగడఁ దనరున్.

వ. షోడశచ్ఛందం బగు అష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాఱేసియక్షరంబు లై ౬౫౫౩౬ వృత్తములు పుట్టె నందు:—

ప్రియకాంత ౧౬-౧౩౨౬౮

I I I న I UU య I I I న I UU య I U స U గ

అమరులు భృత్యు♦లనయ వి ♦ యద్గంగ ధరిత్రి
కమలలు [1]పెండ్లాములు రవి ♦ కంజారులు గన్నుల్
శమితతృణావర్తున కని ♦ చాటుం బ్రియకాంతా
ఖ్యము శివసంఖ్యావిరమణ ♦ మై న్యన్యసగం బై.

పంచచామరము ౧౬-౨౧౮౪౬

I U జ U I U ర I U జ U I U ర I U జ U గ.

జరజ్రజంబులున్ గముం బొ♦సంగి తొమ్మిదింటిపై
విరామ మొంది సత్కవు ల్వి♦విస్తరంబు సేయఁగా

1 పెండ్లాములు.

బరాత్పరుండు మాధవుండు ♦ పంచచామరంబునన్
బ్రరూఢగుంభనంబులందుఁ ♦ బాడ నొప్పు ధాత్రిలోన్.

పద్మకము ౧౬—౨౩౪౧౬

I I I న U I I భ U I జ U I జ U I జ U గ.

నభజజాగగణయుక్తిఁ బి♦నాకివిరామక
ప్రభవ మై కృతుల నొప్పును ♦ బద్మక మంద మై
ప్రభుఁడు నక్రమును ద్రుంచి సు♦రక్షితుఁ జేయ సా
మభవపద్మకము చాడ్పున ♦ మానిత మై ధరన్.

చంద్రశ్రీ ౧౬—౧౦౧౭౮

I U U య U U U మ I I I న I I U స U I U ర U గ.

క్షమం జంద్రశ్రీతో యమనసర♦గ ల్భానువిశ్రా
మముల్ సంబంధించు న్నరహరి ర♦మాచిత్తచోరా
శమియామ్యాగారా శమనసహ♦జానాథకృష్ణా
ప్రమత్తక్రవ్యాదక్షణదళన ♦ రాధాభుజంగా.

మేదిని (వాణి) ౧౬—౧౧౧౮౪

I I I న I U I జ U I I భ I U I జ U I U ర U గ.

మృదయతి నజ్భజర్గములు ♦ మేదినిసమాఖ్యన్
దడబడుచుండఁగాఁ దనరు ♦ దంష్ట్రి పద్మనాభా
జడనిధితల్ప నందసుత ♦ సాళ్వరాట్కృతాంతా
కడు హితభక్తి నీకు నతి ♦ గావు మయ్య దేవా.

ఫలసదనము ౧౬—౧౬౩౮౪

I I I న I I I న I I I న I I I న I I U స U గ.

ననననసగములు ద♦నరఁగ దశవిశ్రాం
తిని ఫలసదనము ల♦లిశయ మగుచొప్పన్
మునిజనహృదయములఁ ♦ బొలుచువానిన్ (?)
గొనబుగముద మొదవఁ ♦ గొలిచెద మటంచున్.

అశ్వగతి ౧౬—౨౮౦౮౭

U I I భ U I I భ U I I భ U I I భ U I I భ U గ.

అందము లైనభకారము ♦ లైదును గాంతము నై
పొందిపదింట విరామముఁ ♦ బూనినయశ్వగతిం

గంధసమానమహోన్నత•గాత్రుని శౌరిని గో
విందునిఁ బ్రస్తుతి సేయఁగ • వేడుక యయ్యెఁ జామీ.

మదనదర్పణము ౧౬ - ౨౧౮౫౫

U||భ||U స|U|జ U|U ర|| |జ U గ.

చారుమదనదర్పణంబు భ•స్జర్గజము ల్దగుఁ
మారవిమతవిక్రమంబున • న్మహిం జెలంగు నా
భీరుల యమునాతటంబునం • బ్రియంబుఁ జేసి యా
ధీరవరుఁడు గూడె నంచు భ•క్తి సన్నుతింపఁగా.

గజవిలసితము ౧౬-౩౨౭౨౭

U||భ U|U ర|||న|||న|||న U గ.

బాలసరోజనాభ • వరద తనుమిళితజం, బాల దిగంబరా స•మస్తృణకబళకర లం
బాలక మంగళాన•హ గజవిలసితమున, గ్గాలు భ రేఫ నాన•నగము లిభవిరమ మై.

వ. సప్తదశచ్ఛందం బగు అత్యష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదియేడేసియక్షరంబులై ౧౩౧౦౭౨ వృత్తంబులు పుట్టె నందు:—

శిఖరిణి ౧౭-౫౯౩౩౦

| U U య U U U మ||| న|| U స U|| భ| U నగణము.

భజింతు న్నిత్యంబు న్మునిజనసదా•ప్రార్థనపరుఁ
గజేంద్రార్తిధ్వంసిం గృతకలలనా•గ్రాపు నజరుఁ
ద్విజశ్రేష్ఠుల్ మెచ్చ న్యమనస భవల్ • విశ్వవిరతి
ప్రజాతాహ్లాదం బై శిఖరిణి యనా • భాసుర మగున్.

పృథ్వి ౧౭-౩౮౭౫౦

| U | జ || U స | U | జ || U స | U U య | U వగణము.

జసల్ జసయవంబు లుణ్ణకర•సంఖ్యవిశ్రాంతులుఁ
బొసంగి కవిపుంగవుల్ పలుక • భూమిలోఁ బృథ్వి నా
నసంశయ మగుం గళిందతన•యామనోవల్లభా
ప్రసన్నవదనాంబుజా ధృత•పరశ్వధా మాధవా.

హరిణి ౧౭-౪౬౧౧౨

||| న || U స U U U మ U | U ర || U స | U వగణము.

హరిణి యనువృత్తం బొప్పు న్సభస్మ•రాత్తవిరామ మై
సరి నసమరేఫసం బై షోడ•శప్రమదాపహా

ప్రమణుఁ దృణావర్తక్రవ్యాద•సంహారు మస్తకో
పరిరుచిరపింఛాచూడుం బీత•వస్త్రు నుతింపఁగా.

### నర్కుటము (కోకిలకాకము) ౧౭-౫౬౨౪౦

IIIన IUIజ UIIభ IUIజ IUIజ IUవగణము.

కొలిచెద నాదిదేవుపద•కోకనదంబులు నేఁ
దొలఁచెదఁ దొంటిబామునఁ గు•దుర్వ్రడుపాపములం
దలఁచెద నామధేయ మతి•తత్పరత న్నజభజా
వలఁ దగునర్కుటంబునకు • భర్గవిరామములన్.

### మందాక్రాంత ౧౭-౯౭౧౩

UUUUమ UIIభ IIIన UUIత UUIత UUగగము.

మందాక్రాంత న్గిరిశవిరతు • ల్మభ్న తాగాగణంబుల్
పొందె న్సాందీపునివలన సం•పూర్ణవిద్యాచయంబుల్
క్రుందించె న్దారుణరణమునం • జాంద్రసాళ్వాదులం జే
యందెం జేరెం డడుకులకు నం•దాత్మజుం డంచుఁ జెప్పన్.

### పాలాశదలము ౧౭-౩౨౭౬౮

IIIన IIIన IIIన IIIన IIIన UU గగము.

ఆదనదనున హరిసుతు • లమర ధరఁ బాలా
శదళ మనఁ దనరుఁ గవి•జనులు వచియింపన్
బదునొకఁ డగునెడ యతి • పదిలమునఁ జేరన్
గదియు నగణములయిదు • గగము తుద నొందన్.

### వంశపత్రపతితము ౧౭-౬౪౯౮౩

UIIభ UIUర IIIన UIIభ IIIన I Uలగ.

బాగుగఁ జెప్ప నొప్పు వసుధన్ • భరనభనలగల్
సాగి పితామహక్రమమునన్ • సభలనుఁ గుదురై
రాగిలువంశపత్రపతిత • ప్రణముల నరకు
ప్రాగతనంబునం దునిమె నం•దతనయుఁ డనినన్.

చంపకకేసరి ౧౭-౪౬౮-౨౯

॥ U స । U । జ ॥ U స ॥ U స ॥ U స । U వ గ.

సనకాదియోగినుతు • జాంబవతీప్రియు నిర్వికా
ల్ప నమేయు నక్షరు వి•భు న్యమళార్జునభంజనుఁ
వనమాలిఁ గృష్ణు ముర•భంజను నెంతురు వారిజా
సనవిక్రమంబు సజ•సాస్వలు చంపకకేసరిఁ.

వ. అష్టాదశచ్ఛందం బగుధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునెనిమిదియక్షరంబు
లై ౨౬౨౧౪౪ వృత్తములు పుట్టె నందు:—

మత్తకోకిల ౧౮-౯౩౦౧౯

U । U ర ॥ U స । U జ । U జ U ॥ భ U । U ర.

అత్తమిల్లు మహేశవిక్రమ • మార్యసమ్మతి నొప్పఁగా
సత్తు లౌ రసజాభరేఫలు • చాకళింపుచు నొందఁగా
మత్తకోకిలవృత్తపద్ధతి • మక్కువం బొనరింపఁగా
హత్తి పూజ యొనర్ప వచ్చు జ•నార్దనాహ్వయు నెప్పుడుఁ.

కుసుమితలతావేల్లిత ౧౮-౩౭౮౨౭

U U U మ U U । త ॥ న । U U య । U U య । U U య.

వేమా రెన్నంగాఁ గుసుమితలతా•వేల్లిత మ్మత్నయాయల్
శ్రీమార్తండక్రాంతియుఁ గుదిరినం • జెన్ను మీఱు న్ధరిత్రిఁ
గామేపల్లీశుం గనకవసనుం • గంజనేత్రుఁ శుభాంగుఁ
గోమద్బాలుం గాలయవనహరుం • గుంజరేంద్రార్తిహానుఁ.

నిశి ౧౮-౭౪౯౪౪

॥ న ॥ న U । U ర U । U ర U । U ర U । U ర.

ప్రబలు నిశను నార•రారంబుల నర్తనవిశ్రాంతియుఁ
గబళితదవపావ•కాపూతనాజీవితాహారి కృ
ష్ణ బలసహజ పారి•జాతాపహారా యదుశ్రేష్ఠ దే
వబలదమనవంద్య • బింహిష్ఠ వార్ష్ణేయ శైనేయకా.

హరనర్తనము ౧౮-౯౦౯౭౧

U । U ర ॥ U స । U జ । U U య U ॥ భ U । U ర.

దావపావకఖాది మా•ధవ దాశార్హా•దనుజాంతకా
దేవకీప్రియనంద నా•దివిషద్బృంద్యా•ధుర్వసన్నుతా

భావగోచర విశ్వరూ•ప దగు న్వ్యాప్తి•న్వ నవర్తుసం
ఖ్యావిరామము రేఫస•జ్యభరేఫంబుల్ • వారన ర్తనన్.

త్వాహారము ౧౮-౩౦౪౭౧

UUUమ ।।। న । UU య UU । త ।।। నUUUమ.

బాహాబాహిని దమలో • భూతల్ డొడ్డ•పగలఁ బోరాడం
గా వాంపీరఁ డగుబుభు•త్వానూనన్ జ•గతిని గూలంగా
నాహా రేసినసరపా•లా రత్నేష•యతులు పొందంగా
త్వాహారంబు మనయత•న్మంబుల్ చెంది • [1]మనును నందం బై.

వ. ఏకోనవింశతిచ్ఛందం బగునతిధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బందొమ్మిదేసి య
క్షరంబు లై ౫౨౪౨౮౮ వృత్తములు పుట్టె నందు:—

శార్దూలవిక్రీడిత ౧౯-౧౪౯౩౩౭

UUUమ ।। U స । U । జ ।। U సUU।త UU ।తUగము.

నీరేజాంచితలోచనాయ హరయే • నీలాంబుదాంగాయ మా
యారాత్రించరఖండనాయ విభవే • వార్యత్నవక్త్రాయ తా
ర్క్ష్యారూఢాయ యటంచుఁ గూర్తురు నిరీ•హా విశ్వవిశ్రాంతి వి
స్తారింప న్మసజ స్తతంబులు గము • న్శార్దూలవిక్రీడితన్.

తరళ ౧౯-౭౪౭౦౧౨

।।। న U।।భU।Uర।।Uస।U।జ।U।జUగము

జలజలోచనుఁ గైటభాంతకు • శంఖచక్రగదాధరున్
గలశజాదిమునీంద్రసేవితుఁ • గాళియాంతకు నచ్యుతున్
బలుకుచోఁ దరళంబు లందుల • భానువిశ్రమపద్ధతిన్
గలియ నభ్రసజాగముల్ సమ•కట్టి చెప్పుదు రుత్తముల్.

మేఘవిస్ఫూర్జితము ౧౯-౧౮౬౭౪

। UUయUUUమ ।।। న ।। U సU । UరU।Uర Uగ.

క్షమాలక్ష్మీనాథున్ విదురవరదున్ • జాహ్నవీజాతపాదున్
సమామ్నాయ న్తవ్యున్ గరుడతురగున్ • సామజప్రాణదాతన్
మిముం దాఁ బేర్కొన్న న్నభలఁ దనరు • న్మేఘవిస్ఫూర్జితంబుల్
విమర్శం గూర్చన్ యమ్న సరరగము • ల్విశ్వవిశ్రాంతిచేతన్.

1 శివలు.

చంద్రకళ ౧౯-౧౮౬౭౪౭

U|Uర||Uస||UసUU|త|U|జ|U|జUగ.

తానకంబుగఁ జంద్రకళాఖ్య • వృత్తంబు కవు ల్విరచించిరన్
వీనులార మనోజ్ఞపదంబుల్ • పేర్చి కపర్ది విరామ మై
కాన వచ్చి రస త్తజజంబుల్ • గంబు దనర్చి కళిందజా
మానినీరమణ స్తవగాథా • మానితరత్నములం దగున్.

భూతిలకము ౧౯-౧౮౬౦౩౯

U|భU||భU|Uర||Uస|U|జ|U|జUగము.

భారసజాగగణంబులుం బఱ • వంగ భానువిరామవి
స్ఫారత భూతిలకంబు పాండవ • పక్ష దైవతవృష్ణి మిం
పార ధరిత్రికిఁ దెచ్చినట్టిమ • హాత్ము యంచుఁ గవీశ్వరుల్
చారుపదంబులు గూర్చి చెప్పిన • శ్రావ్య మా వినువారికిన్.

కవికంఠభూషణము. ౧౯-౧౭౭౯౦౦

||Uస|U|జ||Uస||Uస||Uస|U|జUగ.

నవరత్నవిశ్రమము • నన్ సజసాసజగంబులన్ గవుల్
గవికంఠభూషణము • గా రచియింతురు మాటిమాటికి
న్ర్పవణిల్లుకబ్బముల • నందకపాణి నుపేంద్రు రుక్మిణీ
ధవు సత్కథాసుధలఁ • దత్పరు లైన మహాత్ము లట్లుగాన్.

వ. వింశతిచ్ఛందం బగుకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదేసియక్షరంబు లై ౧౦౪౮౫౭౬ వృత్తములు పుట్టె నందు:—

మత్తేభవిక్రీడిత ౨౦-౩౯౮౬౭౬

||Uస||భU|Uర| ||నUUUమ|UUయ|Uవగణము.

మనువిశ్రాంతిని సభ్రినమ్యవములన్ • మత్తేభవిక్రీడితా
హ్వయము వృత్తంబు చెలంగె మానవతులా • రా వీఁడె యేతెంచె భ
క్తిని గాత్యాయనిఁ గొల్చునాఁడు యమునా • తీరంబునం బొంది వే
డ్కను మాచీరలు దోఁచుకొన్న పెడదొం • గం జూచినారా యనన్.

1 తనరారునట్లుగాన్.

### ఉత్పలమాల ౨౦-౩౫౫౭౯౯

∪||భ∪|∪ర|||న∪||భ∪||భ∪|∪ర|∪వగణము.

పేరిననేయిదుగ్ధములఁ ♦ బెర్గను మీఁగడయున్నదా వ్రజా
గారము సొచ్చి త్రాగి వెస♦గంతులు వైచుమురారి సెంచఁ గా
ధారుణి రూఢి కెక్కు నవ♦తారవిరామముచే లసద్భర
భారలగంబులుం గలయఁ♦బల్కిన నుత్పలమాల చెన్నగున్.

### అంబురుహము ౨౦-౩౭౨౧౫౧

∪||భ∪||భ∪||భ∪||భ∪|∪ర||∪స|∪వగము.

చారుతమాలదళాసితవర్ణునిఁ ♦ జక్రహస్తు సనాతను
న్దారితకంసముఖక్షితిపాలకు ♦ నందనందను నవ్యయున్
శూరకులోద్భవుఁ గైటభభేదిని ♦ జోలి చేసి నుతింప భా
భారసవంబులు విశ్వవిరామముఁ ♦ బల్కు నంబురుహం బగున్.

### ఖచరప్లుతము ౨౦-౩౭౩౧౭౬

|||న∪||భ∪||భ∪∪∪మ||∪స||∪స|∪వగ.

యమునలోఁ జొర నోడిననానా ♦ ప్రాకృతజంతువులం బ్రమో
దమునఁ బ్రోచుటకై కలఁచంగా ♦ దర్పమునం జనుదెంచి ఘో
రముగఁ జుట్టినకాళియు సంహా♦రం బొనరించినకృష్ణ య
*ర్యమవిరామముతోడ నభామ్సస్వల్ ♦ రాజిలనౌ ఖచరప్లుతన్.

### ప్రభాకలిత ౨౦-౩౭౨౦౮౦

|||న|∪|జ|∪|జ∪||భ∪|∪ర||∪స|∪వగము.

వళి పదమూఁడవయక్కరంబుగ♦వాని కెక్కు నజాభరే
ఫలు సలగంబు లమర్చి సొం పాద♦వం బ్రభాకలితాఖ్య మై
చెలు వగువృత్తమునందు సత్కవి♦శేఖరు ల్వినుతింతు రా
జలనిధిమీఁదను బవ్వళించిన♦జాంబవత్యధిపాలునిన్.

వ. ఏకవింశతిచ్ఛందంబగు ప్రకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియొక్క యక్షరంబులై ౨౦౯౭౧౫౨ వృత్తంబులు పుట్టె నందు:—

*ర్యమపరాఙ్ముఖమతోడ నభామ్స♦స్వల్వలయున్ (పూ. ము.). ఇందు యతి తప్పినది; ర్యమవిరామముతోడ నభామ్సస్వల్ ♦ రాజిలనౌ (ప. ఓ. పె.) ఇందు గణము తప్పినది.

చంపకమాల ౨౧-౭౧౧౬౦౦

|||న|U|జU||భ|U|జ|U|జ|U|జU|Uర.

చపలమనీషతోడ నొక ♦ సంయమి వే మొఱ వెట్టుచుండఁగాఁ
గృపను దదీయపుత్త్రి బ్రతి♦కించిన మేటివిభుండ పంచు నిజ
సపరిగణంబుతో నజభ♦జాజలు రేఫయుఁ గూర్చి సత్కవుల్
త్రిపురవిభేదనాఖ్యవిర♦తిం దగఁ జంపకమాలఁ గొల్తు రా.

వనమంజరి ౨౧-౭౪౪౩౦౪

|||న|U|జ|U|జ|U|జ|U|జU||భU|Uర.

మనువిరతు ల్నజజాజభర ల్వన♦మంజరిం గవిశేఖరుల్
దనరఁగ నాజయుఁడు న్విజయుం డను ♦ ద్వారపాలకు లిర్వురు
న్ననకనిశాపము దాఁకి నిశాటు ల♦నంగఁ బుట్టి సుపర్వులన్
జెనకినవాండ్రను జంపినకోలన్నృ♦సింహుని న్వినుతింతు రా.

* స్రగ్ధర ౨౧-౩౦౨౯౯౩

UUUమU|Uర U||భ|||న|UUయ|UUయ|UUయ.

మానొందున్ స్రగ్ధరాఖ్యన్ ♦ మరభనయయయల్ ♦ మత్తనాగాష్టవిశ్రా
మానూనప్రాప్తిలైనన్ ♦ హరిముఖదివిజుల్ ♦ యాతుధానవ్రజంబుల్
సానందాసక్తితోఁ దో♦యధికడ నమృతం ♦ బారగింపంగ నచ్చో
మానిన్యాకారతన్ స♦మ్మదమువొదలఁ బ♦ద్మాధవానందపుత్త్రా!

లాటీవిటము ౨౧-౩౯౪౯౭౨

||Uస||Uస||Uస||Uస UUUమUU|త|UUయ.

సగణంబులు నాల్గిట మత్యలవి♦శ్వశ్రాంతి న్లాటీవిటవృత్తం
బగు నంచుఁ గవీంద్రులు గొల్తురు స♦మ్యక్ప్రీతి న్యాచించి యథేచ్ఛం
దగునేర్పున మూఁడు పదంబులుగాఁ ♦ ద్రైలోక్యంబు న్గొల్చి మురారుల్
వొగలం బలిదానవుఁ ద్రొక్కినయా♦పొట్టిం దిట్ట న్వామనుఁ గృష్ణున్.

మణిమాల ౨౧-౯౬౫౩౫౬

||Uస|U|జ||Uస|U|జ||Uస|U|జ||Uస.

అజహాత్ప్రియోదధిఘృతంబు ♦ లమ్ముచు మురారిఁ బాడి రెలమిన్
వజాఁగాఁ దదీయచరణా♦త్తనవ్యహృదయారవింద లగుచు

* ఇది (పూ. ము)ల లో లేదు. (ప) లో నున్నది. 2 (పూ. ము.)లలో-గొల్వఁ గవ్యాగుల్,

వ్రజసుందరీజనము లొక్క ♦ నాఁడు మణిమాలయందుఁ బొసఁగ
స్రజము త్రివారము సముంచి ♦ నాకివిరమంబు పొందు దనరన్.

కరిబృంహితము ౨౧-౭౮౧౨౭౧

U||భ|||నU||భ|||నU||భ|||నU|Uర.

మూఁడు భనములు రేఫమును బదు ♦ మూఁట విరతియు సొంపుగాఁ
గూడుకొనఁ గరిబృంహితము సమ ♦ కూర్చి వసుమతి మండలా
పీడ మనుకరిబృంహితరవము ♦ పెల్లుగఁ బలుకుచుండఁగాఁ
గోడిగపు[1]చినవాఁడు శకటునిఁ ♦ గూల్చినహరి నుతించెదన్.

కనకలత ౨౧-౧౦౪౮౫౭౬

|||న|||న|||న|||న|||న|||న||Uస.

జవమున భగభగ యనుచు బ్ర ♦ జజనములఁ బొదవినం
దవశిఖి నుడిపినమధుమథ ♦ నరకదమన యని పే
లవముగఁ బలుమఱు నిరువది ♦ లఘువులు గము పదుమూఁ
డవయెడ విరతిఁ బొసఁగిన బె ♦ డఁ గడరుఁ గనకలతన్.

వ. ద్వావింశచ్ఛందం బగునాకృతియందుఁ బ్రతిపాదంబున కిరువదిరెండేసి యక్షరం
బులై ౪౧౯౪౩౦౪ వృత్తములు పుట్టెనందు:—

మహాస్రగ్ధర ౨౨-౬౦౪౯౮౭

||UసUU|తUU|త|||న||UసU|UరU|UరUగ.

స్తతనస్రాగ ల్విరించా ♦ ష్టవిరతులు మహా ♦ స్రగ్ధరం జెప్ప నొప్పున్
గ్రతువిఘ్నం బాపహిల్లం ♦ బ్రమదమున వ్రజ ♦ వ్రాతదత్తాన్న మెల్లన్
క్షితిభృద్రూపంబున స్మా ♦ క్కున రుష నమరా ♦ గ్రేసరుం డంప బ్రుబ్బల్
ధృతిపైఁ జాల్వావఁ [2]గూల్పన్ ♦ దివిరి కరుణతో ♦ [3]ధేనువృద్ధ్యద్రి మోఁచెన్.

భద్రకము ౨౨-౧౯౩౦౬౧౧

U||భU|Uర|||నU|Uర|||నU|Uర|||నUగ.

భంబు రనత్రయంబు గము నొంది ♦ భానుయతి భద్రకంబు దనరున్
బంబినపిల్లగోల కరయుగ్మ ♦ పాదములఁ బట్టి యూఁది పశువ
ర్గంబు నరణ్యమధ్యమధరిత్రిఁ ♦ గాచుసమయంబున న్యమున తీ
రంబున గొల్లలం గలసి యోగి ♦ రంబు దినెఁ గృష్ణుఁ డంచుఁ బలుకన్;

1 చినవాడుటకుసల. (పె). 2 గూల్పన్ (ఓ); గూల్వన్ (ప) గుర్వన్ (పూ.ము). 3 ధేనువర్ధాద్రి (పూ.ము).

మానిని ౨౨-౧౭౯౭౫౫౯

U||భU||భU||భU||భU||భU||భU||భUగ.

రాజిలు సప్తభము ల్గము విశ్వవి•రామము మానినియందు భర
ద్వాజముఖప్రమునీశ్వరు లందఱు • దైత్యగురుల్ భృగువాక్యమునన్
రా జలనాయకతల్పుని దైవత•రాజు నజస్రము గొల్తురు వి
భ్రాజితమోక్షము చేకుఱఁ బుణ్యధ•రాస్థలి నంచు వచించుటచేన్.

విచికిలిత ౨౨-౨౦౯౭౧౫౨

|||న|||న|||న|||న|||న|||న|||నUగ.

ప్రవిలయసమయమునను బద•పడి జలనిధినడుమ స
ద్భువనములు కడుపున నిడుక • భుజగపతిశయనముపై
నవిరళమతిఁ గురుకువరదుఁ • డని విచికిలితఁ బదుమూఁ
డవయెడ వడి యిరువదియొక•లఘువు గము బలుక నగున్.

తురగము ౨౨-౧౪౯౦౯౪౪

|||న|||న|||న|||న||Uస|U|జ|U|జUగ.

ననననసజజగలు తిథివిరమ•ణం బగు స్తురగంబునన్
గనలుచు నగరము పయి విడిసిన • గాంచి తా నొకరుం డెదు
ర్కొని దవులకుఁ గొని చని గిరిగుహఁ • గూర్కొను ముచికుందుచే
తను యవనునిఁ బొరిగొని తని వసు•ధ న్గణింతురు భూసురుల్.

[1]మద్రకము ౨౨-౧౯౪౭౦౯౫

U||భU|Uర|||నU|Uర||Uస||Uస|||నUగ.

అధ్వమునందు నడ్డ మయి వా•మనాకృతి నున్నబకాసురు మహా
సాధ్వసదు న్వ్రజార్భకవినా•శనక్షము వక్త్రముఁ జొచ్చి సురల్
బ్రాధ్వగులై నుతింపఁగఁ దదీ•యదేహము వెళ్లినఁ గృష్ణుసుతి న
క్రధ్వజమద్విరామము భర•న్రసానగలుం దగుమద్రకమునన్.

వ. త్రయోవింశతిచ్ఛందం బగు వికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదిమూఁడేసి
యక్షరంబులై ౮౩౮౮౬౦౮ వృత్తంబులు పుట్టె నందు:—

1 ఇది (ప) లో మహాస్రగ్ధర తర్వాత ఉన్నది.

కవిరాజవిరాజితము ౨౩-౩౫౯౫౧౨౦

IIIన IUIజ IUIజ IUIజ IUIజ IUIజ IUIజ IUవగణము.

కలయఁగ నొక్క న♦కారము నాఱుజ♦కారములు న్వము ♦ గాటముగా
నలరినచో ద్విర♦దాచలశైలము ♦ లై త్రివిరామము ♦ లంది నిర
ర్గళకవిరాజవి♦రాజితవృత్తము ♦ రాణ జనార్దన రమ్యకథా
వళులఁ గవీశులు ♦ వర్ణన సేయఁగ ♦ వ్రాలు నజస్రము ♦ వావిరిఁగన్

అశ్వలలిత ౨౩-౩౮౬౧౪౨౪

IIIన IUIజ UIIభ IUIజ UIIభ IUIజ UIIభ IUవగ.

సలలితవిశ్వవి♦క్రమము నజ్భ♦జల్భజభవంబు లశ్వలలితన్
జెలువుగఁ గూర్చి సత్కవులు తల్లి ♦ చిన్నిసమయంబునందున నులూ
ఖలమునఁ గట్టి వైచినను నిన్ను ♦ [1]కన్దరలి మద్దిచెట్లు ధరణిం
గలపినకృష్ణుఁ గీర్తనము సేయుఁ ♦ గాఁ దనరు సర్వకాలము ధరన్.

పద్మనాభము ౨౩-౧౧౯౮౩౭౩

UUIత UUIత UUIత UUIత UUIత UUIత UUIత UUగగము.

వేమాఱు నప్పద్మనాభంబున న్విశ్వ♦విక్రాంతియు న్వృత్తంబు ల్గగంబున్
గోమారుగా దేనశాత్రించరల్ క్షీర♦కూపారమధ్యంబున న్వేఁపుమీఁదన్
భ్రామంగ మంథాచలం బోపికం గచ్ఛ♦పస్వామి దైవై మోచె నీకృష్ణుఁ డంచున్
గామించి విద్వాంసు లెల్ల న్వచింపంగఁ ♦ గ్రాలు న్ధరిత్రి న్సదా మానితం బై.

మత్తాక్రీడ ౨౩-౪౧౯౪౦౪౯

UUUమ UUUమ UUIత IIIన IIIన IIIన IIIన IUవగ.

మత్తాక్రీడాఖ్యం బెంపారు ♦ న్మమతననవన ♦ మహిత మగుచు ర
త్నాత్తబ్రహ్మాణ్వింతు ల్గింబై ♦ యమరగ రణమున ♦ నధికబలు మదో
న్నత్తం జాణూరక్రవ్యాదు ♦ న్నహరనమునఁ బెడ ♦ మరలి పిడికిటన్
సత్తామాత్రం దుర్విం గూల్చె ♦ న్సకలజివిపదులు ♦ సమతను బొగడన్.

వ. చతుర్వింశతిచ్ఛందం బగుసంకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదినాల్గేసి య
క్షరంబు లై ౧౬౭౭౭౨౧౬ వృత్తంబులు పుట్టె నందు:—

1 (ప) లో పాఠము ఇందులకు భిన్నముగా నున్నది కాని దానిపై గీతలు గీచి యుండుటచే స్పష్టముగా లేదు. మఱికొన్ని తాటాకుపుస్తకములు చూడవలెను.

సరసిజము ౨౪-౮౩౮౮౧౯౩

UUUమUUIతUUIయIIIనIIIనIIIనIIIనIIUస.

సంబంధించు న్మత్యలు నానా♦సలు దశనిధియతి ♦ సరసిజమునకున్
గంబూర న్బృందాటవిలోనం ♦ [1]గవిసికొనినసుర♦కరువలిదనుజున్
శంబాభీలం జై తగుముష్టిం ♦ జదిపినయమపతి♦ స్తవములు ననురా
గం బూర న్శోభిల్లఁగఁ బ్రాంచ♦త్కృపవరు లభినుతిఁ ♦ గఱపున రవనిన్.

క్రౌంచపదము ౨౪-౪౧౯౩౪౭౯

UIIభUUUమIIUసUIIభIIIనIIIనIIIనIUUయ.

పంచమకేళుం డిచ్చినభాస్వ♦ద్వరమున మనమున ♦ బవరము గోరన్
వంచనతో బాణాసురహస్త♦వ్రజములు దరిగెను ♦ వడి హరి యంచు
న్బ్రాంచితలీల న్వంకరనంది♦ ప్రకటితవిరతులు ♦ భమసభనాన్యల్
క్రౌంచపదీవృత్తముఁ జెన్నా♦రఁగఁ బలుకుదు రిలఁ ♦ గవివరు లెల్లన్.

తన్వి ౨౪-౪౧౫౫౩౬౭

UIIభUUIతIIIనIIUసUIIభUIIభIIIనIUUయ.

దూడలతోఁ గాపరులను గుహాలో ♦ దొంగిలిదాచినవిధి నదలింపన్
గూడుక తద్రూపము లయి పసులం ♦ గోపవధూటులు మురిపము నొందన్
బాడి వినోదంబులు సలిపినగో♦పాలుఁ డటంచును భతనసభాన్యల్
దాడి గొన న్విశ్వవిరమణముతోఁ ♦ దన్విని జెప్పఁగఁ దనరుఁ గవీంద్రుల్.

అష్టమూర్తి ౨౪-౩౬౧౪౫౨౧

UUUమIIIనUUIతIIUసUIUరUIIభIUIజIUUయ.

శ్రీకృష్ణం గనకవస్త్రిం ♦ జితతృణావర్తదైత్యు ♦ న్సితకుశేశయనాభున్
వైకుంఠు న్వరదు బృందా♦వనచరు న్వాసుదేవు ♦ న్వసుమయుం బరమం బ
ద్మాకాంతు న్నిధినిధానా♦మలవిరామంబు లొప్ప ♦ న్మనతసరభజయంబుల్
సోకం జెప్పుదురు విద్వాం♦సు లిలలో నష్టమూర్తి♦న్సప్రతిభు లద్భుతచర్యల్.

వ. పంచవింశతిచ్ఛందం బగు నతికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియైదేసి
యక్షరంబులై ౩౩౫౫౪౪౩౨ వృత్తంబులు పుట్టినందు:—

బంధురము ౨౫-౧౪౩౬౮౭౬౮

IIIనIIIనIIIనIIIనIIUసUIIభUIIభUIIభUగ.

సారిది న్ననననసభభభగములతో ♦ షోడశసంఖ్యవిరామముతో
బరువడి దినదినమును బుధజను లీ♦బంధురవృత్తమునందు నుతిం

1 గవను (పు).

తురహిమకరకుసుమము నొసటను గ ♦ న్ను వ్వణిసోగయుఁ దాల్చినయా
ఘోరజడలనడుమనిలిచిన తెలుపుం ♦ దూకొనువాఁగుకుఁ దండ్రి యనన్.

భాస్కరవిలసితము ౨౫-౮౩౮౧౩౧౧

U॥భ॥న॥U॥జ॥UUయU॥భ॥న॥న॥Uస Uగ.

చెల్లెలి విజయున కిచ్చినవానిం ♦ జేరెడుపృథుకములు దినినవానిన్
గొల్లతలను వలపించినవానిం ♦ గొల్లకుఁ గొడుకనఁ బరఁగినవానిన్
మల్లుర రణమునఁ జంపినవాని ♦ న్భజ్జయభననసగలు పదుమూఁటన్
బల్లిద మగువిరమంబు దలిర్ప ♦ న్భాస్కరవిలసితములు గొనియాడున్

ధరణిధరగతి ౨౫-౧౬౭౭౭౨౧౬

॥న॥న॥న॥న॥న॥న॥న॥నUగ.

వసునములు గము ♦ వసువసుయతులు ♦ వల నగు ధరణిధరగతిన్
గన దొదవి సుడి ♦ కరువలిపగిదిఁ ♦ గదసి యదుశిశుచయముతో
క్షమస లెదు నెడ మురమథన నినుఁ గొని ♦ మదిని నలరుచు నెగసి యా
కసమున కెగయఁగ శకటదనుజు ♦ తృమఁ గలిపితి వని పలుకన్.

వ. షడ్వింశతిచ్ఛందం బగునుత్కృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదా ఱేసి
యక్షరంబు లై ౬౭౧౦౮౮౬౪ వృత్తంబులు పుట్టె నందు:—

భుజంగవిజృంభిత ౨౬-౨౩౭౪౮౮౮౪

UUUమUUUమUUత॥న॥న॥నUUర॥Uస Uవగ.

స్త్రాలు వ్రత్నేశానక్రాంతు ♦ వ్యాహి మమతననరస ♦ వల్ భుజంగవిజృంభితల
గాళిందీరోషం బెండ్లాడ ♦ న్ఖరదనుజుఁ దునిమెను శి ♦ ఖావలాంచితపింఛమున్
మాళిం దాల్చె న్భండిం ద్రోచె ♦ న్నమ్మఁదికి రథముఁ గడపె ♦ మద్దిచెట్టులు రెండు ని
ర్మూలించె న్దాలంబుల్గాల్చె ♦ న్మగుదలు భ్రమయమురళి ♦ మ్రోయఁజేసెవిభుండనన్.

వరాహము ౨౬-౮౩౮౮౬౦౧

UUUమ॥న॥న॥న॥న॥న॥న॥Uస UUగగ.

రాజిల్లు న్గశ కుధరవి ♦ రతులు మగణ ♦ రసనసగగలు వరాహాఖ్యన్
జేజే లందఱు పొగడ నుఁ ♦ డిచుఁ డని తలఁ ♦ చి భృగువు పలుకఁగ నిత్యంబున్
తేజశ్శ్రీ పెరుగఁగ మది ♦ దృఢము గ నిడి ♦ తిమురుచుఁ గొలిచిరి దాశార్హున్
గాశీవాత్మజుని నరహరి ♦ రవికులవరు ♦ రఘుపతి బలసహజున్ గృష్ణున్.

§ ఇచ్చట గణభంగము. 1 మద్దిచెట్టులఁ గూలఁ జేన్, దాలంబుల్గాల్చె న్వేగన్ ముగ్ధలు భ్రమయఁగను మురళిఁదాలి చెన్ సువిభుండనన్. (పూ. ము). 2 ధృవమాగ(ప)

### మంగళమహాశ్రీ ౨౬-౧౫౬౬౭౧౮౭౨౩౧

॥భ॥జ॥స॥న॥భ॥జ॥స॥ న గగము.

పొత్తు లెడఁబాయుటను♦బోరుసమయంబునను♦బొంగుచుఁ గురూద్వహుల నెల్లన్
దుత్తుమురు సేయఁగఁ గు♦దుర్చును మనీష నది♦దుష్టసమరావనిఁ గిరీటి
క్షత్త్రకు భజస్నభజ♦సానగలు మణ్యాజుల ♦ క్రాంతులును మంగళమహాశ్రీ
వృత్తములఁ జెన్నలర ♦ నిచ్చిరి సువాసినులు ♦ నిం పడర మంగళమహార్తుల్.

క. పొందుగ నిరువదియా ఱగు, ఛందములం దుదయ మైన♦సమవృత్తము లా
నందమునఁ గవులు పొగ డెదు, కందువల వచించినాఁడఁ ♦ గామెపలీశా. 178

వ. ఇవి సమవృత్తలక్షణంబు లింక ముఖ్యగౌణవృత్తలక్షణంబు లెఱింగించెద. 179

### ముఖ్యగౌణవృత్తలక్షణము.

సీ. సమవృత్తపఙ్క్తి-స్వ♦స్థానార్ధసమములు స్వస్థానవిషమాఖ్యఁ ♦ జనునవియును
బృథివిపై సమవృత్త♦భేదంబు లీమూఁటి కక్షరంబులు సమం ♦ బన్నికొల్ల
నివి వృత్తముఖ్యంబు ♦ లిఁకఁ బరస్థానార్ధసమవృత్తములు పర♦స్థానవిషమ
సంజ్ఞలఁ బద్యము ♦ ల్సర్వపరస్థానవిషమంబులును నివి ♦ విషమవృత్త
తే. భేదములు వీనినాలుగు♦పాదములను, సమముగాఁ జూపడవు వర్ణ♦సంఖ్య లెచ్చు
కడమ లై యుండు నీమూఁటి♦గౌణవృత్త, పద్యములటం డ్రు శ్రీకామె♦పల్లినిలయ.

### సమవృత్తవివేకము.

గీ. జగతి సమవృత్త మెన్నవ♦ఛందమునను, సంభవము నొందె నన్ని య♦క్షరము లమరఁ
బదపదంబున హెచ్చును♦గొదువ గాక, ప్రాసములు విరామంబులుఁ♦బరిఢవింప.

### స్వస్థానార్ధసమవివేకము.

ఆ. అక్షరములు సమము♦లయ్యె స్వస్థానార్ధ, సమములందు నాల్గు♦చరణములను
విషమపదము లొక్క♦విధముగణంబులు, సమపదంబు లొక్క♦సరిగణములు. 182

క. సగ మొక్కవిధంబునఁ జెలు, సగ మొక్క తెఱంగు గాఁగ♦సమకూర్పఁదగున్
జగతి నొకకొ లొకకరణి, నొగి మూఁడుపదంబు లొక్క♦యోజం దనరున్.

తే. సాధుకవికృతగ్రంథసం♦జాత మెల్ల, వెదకి సకలోపజాతుల♦విచ్చలవిడిఁ
గాళిదాసుఁడు రఘువంశ♦కావ్యమునను, జెలఁగి రెండవసర్గలోఁ ♦ జెప్పినాడు. 184

వ. అట్లుగాన స్వస్థానార్ధసమవృత్తంబులం దుపజాతి యనువృత్తము. 185

### ఉపజాతివృత్తము.

ఈపాటితో జేసుల ♦ నింద్రవజ్రం, బుపేంద్రవజ్రావ్యాయ ♦ మూర్విసర్గం
దాపించినంతం గరు♦ణాసముద్రా, జపిష్ఠలోలా గూసజాతి యయ్యెన్ 186

వ. ఇది పదునొకండవ త్రిష్టుప్ఛందంబునందలి యింద్రవజ్రాచ్ఛాయను బేసిపాదాలును నుపేంద్రవజ్రాఛాయను సరిపాదాలును నడుచును. [1]దీనిపేరే నిశి. 187

## మఱియు, వ్యత్యస్తోపజాతి.

తలంబులై బేసి జ•తజ్జగంబుల్, చాలొప్పసర్లందత•జల్గగంబుల్
జలంబుతోనిట్లు • సాగినంతన్, వాలారు వ్యత్యస్తము • వాసుదేవా ! 188

వ. ఇది ఉపేంద్రవజ్రచ్ఛాయను బేసిపాదాలును, ఇంద్రవజ్రచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియు, 189

## సమోపజాతి.

తాపింఛనీలాంగుఁ బృ•దాకుతల్పున్, గోపాలబాలు న్రవి•కోటితేజున్
గృపాసముద్రు న్నుతి•యించెద న్సు,కృత్యపాధిఁ గాంక్షించి స•మోపజాతిన్.

వ. ఇంద్రవజ్రాఛాయను మొదలిరెండు పాదములను నుపేంద్రవజ్రాఛాయను గడమ రెండుపాదములను నడుచును. మఱియు, 191

## వ్యత్యస్తసమోపజాతి.

తపంబుచేఁ గొల్తు వి•ధాతృతాతన్, గపాలికోదండవి•ఖండనాఖ్యున్
గోపీభుజంగున్ ధృత•గోత్రు సన్నో, క్షోపాయు వ్యత్యస్త స•మోపజాతిన్. 192

వ. ఇది యుపేంద్రవజ్రాచ్ఛాయను మొదలిరెండు పాదములును నింద్రవజ్రాచ్ఛాయను గడమ రెండుపాదాలును నడుచును. మఱియు, 193

## వైపరీత్యోపజాతి.

తాజ ల్గగంబొంట జ•తజ్జగంబుల్, గజిక్కున మ్మాఁటను•గంతువేయన్
వ్రజాంగనావల్లభ•వైపరీత్యో,పజాతివృత్తంబు స•భం బెలంగున్. 194

వ. ఇది యింద్రవజ్రాఛాయను మొదలిచరణమున నుపేంద్రవజ్రాఛాయను గడమ మూఁడుచరణములును నడుచును. దీనిపేరే[2]వాతాంగియు, మఱియు నీవృత్తమున నే యింద్రవజ్రాచ్ఛాయను ఏదైన నొకచరణమును నుపేంద్రవజ్రాచ్ఛాయను ఏదైన మూఁడుచరణములును జెప్పినను తప్పులేదు. మఱియును 195

## ఉపచిత్ర.

ఖిదురంచిసపావలు • బేసులన్, గాదిలి భాభగ•గంబులు సర్లన్
గుదురై రసికస్తుతి•గూడినన్, శ్రీదయితా యుప•చిత్ర చెలంగున్. 196

---

1 ఈవాక్యము పు. ము. లలో లేదు.

2. వారాంగిని (పు. ము); వారాంగి యందు వచ్చును. (చూ. అ. 4. 207)

వ. ఇది త్రిష్టుప్ఛందమునందలి వృత్తచ్ఛాయను బేసిపాదములను దోదకవృత్తచ్ఛాయను సరిపాదములను నడుచును. మఱియు, 197

నారీనుతము.

పేరెంబు ల్వారోరి•బేసి న్మతాగా, సారంబు సర్లన్ దత•జల్గగంబుల్
ధీరోదాత్తుల్ సన్ను•తింపన్ ధరిత్రిన్, నారీనుతం బయ్యె జ•నార్దనాఖ్యా. 198

వ. ఇది పదునొకొంటవ త్రిష్టుప్ఛందస్సునందలి శాలినీవృత్తచ్ఛాయను బేసిపాదములను నింద్రవజ్రాచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియు, 199

అజితప్రతాపము.

జలజాక్ష! బేసుల స•జల్ ససలున్, బలుమఱున్ సరి న•భజ ల్లొందఁగా
జలజోద్భవాబ్జజవి•శాలయతుల్, దళము లైన యజి•తప్రతాపమా. 200

వ. ఇది పండ్రెండవ జగతీచ్ఛందస్సునందలి ప్రమితాక్షరవృత్తచ్ఛాయను సరిపాదములను బ్రియంవదావృత్తచ్ఛాయను బేసిపాదములను నడుచును. మఱియు, 201

రతిప్రియము.

బేసి న్సజసగలు•పేర్చి సర్లజంబున్, భసజ్జగల్గదిసిన•పాదబద్ధ మై
యాసామోద్భవచతు•రాస్యవిశ్రమఖ్యాతి సన్నుతింపఁదగు ర•తిప్రియం బనన్.

వ. ఇది పదుమూఁడవ అతిజగతీచ్ఛందస్సునందలి ప్రహర్షిణీవృత్తచ్ఛాయను బేసిపాదములను రుచిరవృత్తచ్ఛాయను సరిపాదములును నడుచును. 203

ఇది స్వస్థానార్ధ సమవృత్తలక్షణం బింక స్వస్థానవిషమవృత్తంబు లెట్టి వనిన:—

స్వస్థానవిషమవృత్తవివేకము.

ఆ. చరణములను వర్ణ•సంజ్ఞలు దప్పక, నాల్గుపాదములగ•ణములు నాల్గు
విధము లై చెలంగు•వృత్తముల్ స్వస్థాన, విషమవృత్తసంఖ్య•వెలయుచుండు. 204

ధరణి.

రసపై సచతుష్కము • రాంసలున్, నాససల్ మాససల్ • నాటిన స్మణిశా
పసనగరస•పరిపక్వయతుల్, లాఱి సొంపారు న్యా•లాయము గా ధరణుల్. 205

వ. ఇది జగతీచ్ఛందస్సునందలి తోటకవృత్తచ్ఛాయను మొదటిపాదమునను గడమ మూఁడుచరణములును గవికల్పితము లై నడుచును. మఱియు, 206

వారాంగి.

తాజ ల్గయుక్తంబు జ•తగ్గగంబుల్, తజాగగంబుల్ మభ•తల్లగంబుల్
రాజిల్ల నిభేంద్రవి•రామయుక్తిన్, వాజిగ్రీవా నారి•వారాంగి దగున్. 207

# చతుర్థాశ్వాసము.

వ. ఇది యింద్రవజ్రాచ్ఛాయను మొదటిచరణమునను నుపేంద్రవజ్రాచ్ఛాయను రెండ
వచరణమునను గీతాలంబనవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను వాతోర్మివృత్త
చ్ఛాయను నాలవచరణమునను నడుచును. మఱియు, 208

## అంగజాస్త్రము.

రంగు భమస్గల్ ♦ గ్గాలు మసజ్గల్, పొంగై మన్యగ♦ము ల్రజర్గ లొ
ప్పంగా నార్త♦వగిరిన శైలైతే, నంగజాస్త్రవృత్త ♦ మందగించున్. 209

వ. ఇది రుగ్మవతీఛాయను మొదలిచరణమునను శుద్ధవిరాటిచ్ఛాయను రెండవచరణము
నను పణవచ్ఛాయను మూఁడవచరణమునను మయూరసారిచ్ఛాయను నాల్గవచర 210
ణమునను నడుచును. మఱియు,

## నదీప్రఘోషము.

పోలింపం రారరం♦బుల్ జతజ్రంబులున్
తలంచఁగా యాయతులున్ ♦ దతజ్రలున్
విలాసాచలాష్టే భ♦విశ్రాంతితోడన్ 211
దేలింప నొప్పారు న♦దీప్రఘోషముల్.

వ. స్రగ్విణీవృత్తచ్ఛాయను మొదలిచరణమునను వంశస్థచ్ఛాయను రెండవచరణము
నను భుజంగప్రయాతవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను ఇంద్రవంశచ్ఛాయను 212
నాలవచరణమునను నడుచును.

ఇది స్వస్థానవిషమవృత్తవివేకం బింకఁ బరస్థానార్ధసమవృత్తవివేకం బెఱింగించెద:—

## పరస్థానార్ధసమవృత్తవివేకము.

క. మానుగ సమాంఘ్రు లొకగతిఁ, బూనిక విషమాంఘ్రు లొక్క♦పోలికలిప్తై 213
హీనాధిక్యములు పరస్థానార్ధసమంబులందు ♦ సమవిషముల న్

## మనోహరవృత్తము.

పేరై నతజజ్వలు ♦ వేసియొనన్, సరులన్ సచతుష్కము ♦ సాగిన గం
భీరేభపితామహ♦విశ్రమముల్, పెరుగంగ మనోహర♦వృత్తము లౌ. 214

వ. ఇది కలితాంతవృత్తచ్ఛాయను వేసిచరణములును దోటకవృత్తచ్ఛాయను సరిచరణ 215
ములును నడుచును.

## కేతుమతి.

జత వేసుల న్స♦జనగముల్, భాతి సరిన్ భరే♦ఘనగగంబుల్ 216
యతి శైలసంఖ్య ♦ నమరఁగా, నాతతకేతుమ♦త్యభిధ మొప్పున్

## వేగవతి.

సగణత్రయగల్బను జేసిన్, బాగుగ సర్లను ♦ భత్రిగగంబుల్
వగవిశ్రమ మం♦దము నొందున్, వేగవతీసుత♦వృత్తమునందున్. 217

## వియోగిని.

సనజల్ గము♦సాగ జేసులన్, బసస్త్రల్గలు ♦ భాసిలున్ సరిన్
రసశైలవి♦రామసంగతిన్, బొసఁగు న్వియోగిని ♦ భూరమాధిపా. 218

## పరావతి.

ఓలి రజ్రజాంతగంబు♦లుంచి బేసులం,దులన్ జరజ్రగంబులుం [1]గు♦దుర్పరింపఁగన్
గ్రాలుచు న్నిధానదిగ్వి♦రామ మొప్పఁగా,నిలం బరావతీసువృత్త♦మింపుగాంచున్.

## ధృతమధ్య.

బారిగ బేసుల ♦ భాభగగంబుల్, సరుల నజాయలు ♦ సాగఁగమే ల
య్యారి శిలోచ్చయ ♦ హ స్తివిరామో, [2]దారత నొప్పను ♦ దా ధృతమధ్యన్. 220

వ. ఇది దోదకవృత్తచ్ఛాయను బేసిచరణములును తోదకవృత్తచ్ఛాయను సరిచరణములును నడుచును. 221

ఇది పరస్థానార్ధసమవృత్తవివేకం బింకఁ బరస్థానవిషమవృత్తవివేకం బెఱింగించెద:—

## పరస్థానవిషమవృత్తవివేకము.

క. దానవహర యొకచరణం, బైనను రెండడుగు లైన ♦ నక్షరగణసం
ధానములను బెఱితెఱ వగు, వీనికిఁ బేరు పరదేశ♦విషమము లయ్యెన్. 222

## శరభక్రీడ.

ఘనాదిత్యక్రాంతి న్యనునసర♦గ ల్గాఁడుకాశ్లన్
గనద్ధాత్మక్రాంతి న్మభసయజ♦గద్వంద్వ మొందన్
దనర్పంగాఁ బౌరాణికకథల♦దాశార్హ వాక్ప్ర
వృ నర్గం బై చెన్నార వనిశర♦భక్రీడసంజ్ఞన్ [3] 223

వ. ఇది చంద్రశ్రీఛాయను బ్రథమచరణమునను విశాలచ్ఛాయను మూఁడుచరణములను నడుచును. 224

1 గుదిరింపఁగా (వ్రా. ము) ఛందోభంగము. 2 ఈచరణము రెండవచరణముపలె లేదు. అన్ని ప్రతులందును ఇది ఇట్లేయున్నది. 3 ఇందు నాలుగు చరణములును చంద్రశ్రీఛాయ నేయున్నవి. రెండవచరణము గనద్ధామక్రాంతిన్మభనయజ♦గద్వంద్వ మొందన్ (వ్రా. ము).

శ్రీరమణము.

ఆది భమస్గ•ల్లొత్తిన నాల్గై, గాదిలి భాభగ•గంబులు మూఁటన్
బాదుకొనం గవి•పల్కినచో నృత్తిమదయితా ధర • శ్రీరమణం బౌ. 225

వ. ఇది రుగ్మవతీఛాయను నాలిచరణమును దోదకచ్ఛాయను మూఁడుచరణములును న
డుచును. 226

రథగమనమనోహరము.

ప్రథితనరుగరల•గంబులుం బొసంగం, బ్రథమతృతీయచతుర్థ•పాదములం బొంపన్
విధిదళయతు లొందిన•వింతగా నచార్యుల్, రథగమనమనోహా•రం బగున్ ధరిత్రిన్.

ఇది పరస్థానవిషమవృత్తవివేకం బింక సర్వపరస్థానవిషమవృత్తవివేకం బెట్టి దనిన:-

సర్వపరస్థానవిషమవృత్తవివేకము.

క. ఊర్విని నాలుగుపదములఁ, బర్వినగణములను వర్ణ•పఙ్క్తిగణనయున్
సర్వము విపరీతం బగు, సర్వపరస్థానవిషమ•సంజ్ఞలను హరీ. 228

పిణారచనము.

దారిఁ దమసాగ ల్మిత•జ్ఞనగాలు, న్సారించి తజ న్భసలు భ•నాజనగంబుల్
జేర న్మణిదిగ్గశశి•శేఖరవళి పిణారచన ధరఁ దెలఁగును • నారదవినుతా. 229

[1]ఉద్ధతము.

ఆచార నుద్ధత మయ్యె, న్మరి సజసలున్ • నసజగలున్
జాయభవజగలు • సజ్పులున్, ధర మణ్మహీధ్రగజ • ధాత్రియతిన్ 230

సుధర.

వసమధురాఖ్యము • విన్న జారగల్ సా
రసలగములు మీఁద • రాగనమ్యయల్
నసజజజగ లొందన్ • దంతిరత్నా జతి[2]
కృపిసరవిరమంబు జెంది•రసందనరారజా! 231

వ. ఇది ప్రభాతచ్ఛాయను మొదటిచరణమువను అపరాజితచ్ఛాయను రెండవచరణము
వను మాలినిఛాయను మూఁడవచరణమువను నడుచును. నాలవచరణము కవికల్పితము.

మణిదీపిక.

గురుపితామహముఖ్యులఁ గినిసి • ఘోరరణములోఁ
జెరలిచె నరుఁ డని పలుక రత్న•దీపిక ల్దనరును న

1 ఉద్గతము (వ్రా. ము). 2 ఛందోభంగము-నారగణము యగణమై యుండవలెను.

త్కరనభభ్న భస ల్న నాసజ•కారభసలు నభర్సనసనసలు
స్ఫరసజాగలు భూపతు ల్వినఁ•భానువిక్రమయు క్తితోన్. 233

ఈ. ఈశసమవృత్తరాజి నుదయించువిరామములు న్గణంబులుం
బ్రాసము లెల్లఁ దప్పక న•మర్చి పచించిన నైదుత్రోవ లై
భాసిలు వృత్తపద్యము ల•పారము లై విషమాఖ్యయంబు లై
వానికి నెక్కు శిష్టజన•పాలన దుష్టనిశాటచాలకా. 234

ఇది పంచవిధవృత్తవివేకం బింక వైతాలీయజాతివృత్తంబు లెఱింగించెద:—

మ. ప్రకటింతు స్థర దక్షిణాంతికయు నౌ•పచ్ఛాందసంబుం బ్రవ
ర్తక యాపాతలికాపరాంతికలు వై•తాలీయము న్జారుహా
సిక ప్రాచ్యంబు నుదీచ్యవృత్తి యనఁగాఁ • జెన్నారువృత్తంబు లిం
దుకుల శ్రేష్ఠ యనేకము ల్గలుగు నం•దుం గొన్ని వాక్రుచ్చెదన్. 235

క. ఖ్యాతిగను రగడలందును, వైతాలీయాఖ్యవృత్త•వారములందున్
బీతాంబరగురువునకు, బ్రీతిగఁ గృతుల న్లఘువులు • రెండేసి యగున్. 236

దక్షిణాంతిక.

ఉరుసాజగ • లుండు బెసులన్, సరలం దూకొను • సప్రభవంబులన్
దొర లేడిటఁ • దొమ్మిదింట రా, ధరలోఁ జెన్నగు•దక్షిణాంతికల్. 237

ఔపచ్ఛాందసము.

ఇమిడి సలము•లేడు తొమ్మిదింటన్, సమకూఱు న్యతి•వర్జ రేఫయుంబుల్
సమత న్వసుల•సహా రేఫయుంబుల్, క్షమలో నౌప•చ్ఛాందసంబు మింమన్. 238

ప్రవర్తక (వర్తక).

స్థిర బేసి ను•దీచ్యవృత్తియున్, బరఁగు స్సర్గను • బ్రాచ్యవృత్తియున్
గిరిమణియతి•కీలితంబుగన్, బరముఁ గొల్పఁ బ్ర•వర్తకాఖ్య హా. 239

ఆపాతలిక.

లము లాఱు వలున్భగగంబుల్, లము లెనిమిదిటికడన్భగగంబుల్
క్షుహు గిరినవ•క్రాంతులుం దగున్, బ్రమథితముర యా•పాతలికాఖ్యల్. 240

పరాంతిక.

ఇలవర్తిక•వృత్తరీతితోఁ, దుల రై పాదచ•తుష్టయంబులన్
బలసినయది • పద్మనాభ చెన్నలరుం గృతులఁ బ•రాంతికాఖ్య చే. 241

## వైతాళీయము.

ఋతులఘువులు ♦ రేఫవంబులుఁ గా, ధృతవసులఘువులు ♦ రేఫవంబులుఁ గా
జత సమకొన ♦ సారసాక్షి పా, లితశుక వైతా♦ళీయవృత్తమా. 242

## చారుహాసిక.

[1]ప్రమదమునను ♦ వర్తకాఖ్యవృ, త్తముచందంబున ♦ ధాత్రి సత్కవుల్
సమకూర్చిన ♦ శార్ఙ్గకార్ముకా, సమత న్మిఱును ♦ జారుహాసికల్. 243

## ప్రాచ్యవృత్తి.

తొలి నేడిటఁ ♦ దొమ్మిదింట క్రాం, తులు పదునాలుగు♦దూఱు జేసులం
దులఁ బదాఱు♦తొంగలించు స్వర్ణలలి న్నాధన♦ప్రాచ్యవృత్తియా. 244

## ఉదీచ్యవృత్తి.

తమ కిర వగు♦దక్షిణాంతికా, ఖ్యము తేజంబున ♦ నందగించు మే
లిమికృతులఁ గ♦డింది వేలుపా, తిమురు ధాత్రి ను♦దీచ్యవృత్తికల్. 245

ఇది వైతాళీయజాతివృత్తవివేకం బింక మాలికావృత్తవివేకంబు లెఱింగించెద:

## మాలికావృత్తవివేకము.

తే. మాలికావృత్తము లనంగ ♦ మఱియు నైదు
దనరు నిరువదియాఱు ఛం♦దముల మించి
యల లయగ్రాహి లయవిభా♦తి లయహారి
గదసహ త్రిభంగియు దండ♦కంబు లనఁగ. 246

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదియక్షరములపద♦ములయంఘ్రులు నా
ల్గొప్పు యతిప్రాసంబులు, గుప్ప లయగ్రాహి యనఁగఁ ♦ గొమ రొందు హరీ. 247

## లయగ్రాహి.

ఇం బడరఁగా భజస♦నంబులతుద న్భజస♦నంబులపదంపడి భ♦యంబులు లయగ్రా
హిం బరఁగు ప్రాసవిర♦మంబున లుమాఱుగుదు♦రం బటుకవీశులు ని♦రంబుగ వచింపన్
వంబరముగా వలసి♦తొంబగలి దానవక♦దంబము సహాయముగఁ♦బంచి త్రిదశు ల్దు
గ్ధాంబునిధి ద్రచ్చి యమృ♦తంబు గొనఁజాలఁ సమ♦యంబు దొరకించితి ము♦దంబున
ముకుందా. 248

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదివార్లఘ్రముపద♦ముతదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్ప లయవిభాతి యనఁగఁ ♦ గొమ రొందు హరీ. 249

---

1 ప్రథమ (పూ. ము.) ప్రాసభంగము.

లయవిభాతి,

పెనిమిటులు భార్యలును•దనయులను గాంచిరకొ•మనమలర దొడ్డతప•మునవలదళ
స్యం,దనుఁడు పుటికోసలియుఁ•దనకడుపులోపల భు•వనము లఖిలంబు నిడు•కొనిన
కొడుకుస్రా,మునవినసనద్వయము•వెనుకనసగంబులును•జొనిపియతులుండునెడ•లన
లుమఱు ప్రాసం,బునిలిపి కవీశ్వరులు•మును లయవిభాతి నిటు•నినువినుతిసేయుఁదురు•
వనజదళనేత్రా. 250

క. ముప్పదితొమ్మిదిమాత్రలు, ముప్పదియేడర్ణముపద•ముతదంఘ్రిలు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్పిన లయహారి యనఁగఁ • గొమరొందు హరీ. 251

లయహారి.

నగణములుపదునొకడు•సగణమునుగురువునిడి•మిగులనలుమఱుయతులు•దగులులయ
హారిక౯, తెగడితద్ధృతిపరిప•రిగతుల నెఱయిడినము•రిగిర్ఘుపతనువుఁబొడివి•నిగిడి
చనియుంటక౯, నిగమములు గొనివెసను•జగము లద్రువఁబఱచి రయ•డిగికడపలిజడధి
ము•నిగినభయాతిక౯, తెగడుచునొడినికరిచి• తెగఁగొనినతురగగళుఁ•డగుహరివనఁగ
సుకవు•లగణుతిచెలంగు౯. 252

క. ఇది నేత్రాంబుధిలము ముప్పదినాలుగువర్ణములను • బాదం బగుఁ ద
త్పదచాతుర్థికములచే, నొదవుఁ ద్రిభంగి యనువృత్త • ముర్వరలోన౯. 253

త్రిభంగివృత్తము.

వినువక[1]సుకవులు•రసఁబ్రతిపదమున •హాసగగమూఁడొకతిరై మటిశెలైమూఁడొక
తిరై, రసనగణములును•ససభసగములును•పొసఁగినపద్యతిసంగ్రహణిరింగింజెల్లుఁద్రి
భంగిక౯, మనలెడువ్రజమున•దునికిలి మధురకుఁ•గనికిసమృద్ధశుభాంగిందగుభంగిం
జేరిత్రిభంగిక౯, వెసమనిచినవ•బిసరుహానయనయు•ని సభలవేడ్కగురింతు౯ విను
తింతు౯ నిచ్చలుఁగాంతు౯. 254

క. ఇదినియమము లేనిమహా, పథమునఁ గావలసినంత • [2]వక్కాణింప౯
గొద లేక నమరు దండక, మదధీంద్రశయాన తాప•హోత్తమసుతుల౯. 255

దండకము.

విద్వాంసు లెల్ల౯ మకారంబె కాని నకారంబె కాని సకారంబె కాని వచిం
పం దగున్మ్రదుగా నిందుఁ గాదేని యాదిం దకారంబు గల్పించి యామీఁది
వెల్లం దకారంబులే మెండుగా నిచ్చకు న్వచ్చునందాఁకనిర్మించి గుర్వంతముం జేసిన
న్దండకం బంద్రుభక్తానుయాయి భుజంగేంద్ర శాయీ పయస్త్రక్ర్దధ్యాదికత్రయి

1 సుపలుఁరస (పూ. ము). ఛందోభంగము. 2 వక్కాణింప౯ (వ); వక్కా
ణింప౯ (ఓ).

స్త్రైర్మల్యతాపింఛగుచ్ఛచ్ఛవిస్వచ్ఛమాయూరపింఛావచూడాసదాపూతబృందాట
వీ మధ్యరథ్యాసమారాధ్యతథ్యార్భకక్రీడహేమేక్షణా ఖర్వదోర్గర్వసంభూతస్వ
ర్వోర్వరాభారనిర్వాహకార్ధాంగితక్రోడ చండప్రభామండితానేకమార్తాండకోటి
ప్రతీకాశ నానావిధస్తోకలోకేశ వైకుంఠసంవేశ ఘోషాంగనాలోల కాదంబినీ
నీల గోపాలబాలా నమస్తే పునస్తే నమః. 256

క. దండిగ నేకపదంబున, నుండెడివిన్నాణ్ణుగుల • నుండెడివిన్ వే
దండావన దండకముల, పిండువు దనరారుఁ జండ•వృష్ట్యాదికముల్. 257

దండకము. ధూర్త ల్నకారంబులు రెంటిపై సప్తరేఫంబులుం గూర్చినం జండవృష్ట్యా
ఖ్య మయ్యె న్నకారంబులు రెంటిపై నష్టరేఫంబులుం గూర్ప నర్ణ్యాఖ్య మయ్యె
న్నకారంబులు రెంటిపై రత్నసంఖ్యాకరేఫంబులుం గూర్చిన [1]న్నర్ణవం బయ్యె
నోలి న్నకారంబులు రెంటిమీఁదం దశఖ్యాతరేఫంబులుం జెప్పినన్ వ్యాళ
మయ్యె న్నకారంబులు రెంటిపై రుద్రసంఖ్యాకరేఫంబులు న్నిల్ప జీమూత మయ్యె
న్నకారంబులు రెంటిపై నొప్పఁ బండ్రెండు రేఫంబులుం జెంది లీలాకరం బయ్యెఁ
జేర్చి న్నకారంబులు రెంటిపై మించు పద్మూఁడు రేఫంబులు న్నంత నుద్దామ
మయ్యె న్నకారంబులు రెంటిపై రూఢిఁ బద్నాల్గు రేఫంబుల న్శంఖమన్దండకం
బయ్యె నీరీతితోడ న్నకారంబులు రెంటితర్వాత నేడాదిగాఁ గారకారంబు లొప్పా
రఁగా నంఘ్రి నొక్కొక్క టెక్కించి కావించినం జండవృష్ట్యాది నానాలసద్దండ
కంబు ల్ప్రసాధించఁ గాకుండ నాల్గంఘ్రులుం జేయఁగా వచ్చు [2]నీరీతి నేకోన
సాహస్రపర్యంతముం గూర్చి యిచ్ఛావిధిం జెప్పఁగావచ్చు గాంతంబుగా రాధికా
జార శ్రీరుక్మిణీమానచోరా సుదంతాసునాథా కళిందాత్మజానాథవాఃకేళికాసక్త
గోపీజనోత్సృష్టవస్త్రాపహారాశు కాసోక్తవాక్యామృతాంభోధిచంద్రోదయా
సాంద్రదేవా నమస్తే పునస్తే నమః. 258

జాత్యుపజాతినామములు.

క. జాతులు నుపజాతులు నన, భూతలమున రెండు భేద•ములు జాతులలో
జాతులు కందాదిక మున, జాతులు గీతాదికములు • సరసిజనయనా. 259

సీ. కందభేదము లారు • గాక నుత్సాహంబు తరువోజ మధ్యాక్క•రలు నైదు
దీపించుమంజరీ•ద్విపదత్రిపదచతుష్పదపంచపాదిష•ట్పదవిధములు
తోమ్మిదంబధముల•తో నొప్పు రగడలు కళికలు నుత్కళి•కలును గూడ
జాతులు నవవిధ•గీతంబులును సీసపకంబును నుప•జాతు లయ్యె

1 న్నర్ణవం (మూ.ము.). 2 నిరీతి (ప).

తే. ననుచు నన్నయభట్టు భీ♦మనయుఁ బెద్ద
సచివుఁడును మూర్తి తాత[1]నా♦జులు ననంత
మంత్రియునుఁ దిమ్మరాజు ని♦మ్మాడిక్కఁ జెప్పి
రందముగఁ దాము చేసిన♦ఛందములను. 260

## జాత్యుపజాతినిరూపణము.

క. గురులఘువులలో నెయ్యది
మురసంహార ప్రథమపాద♦ముఖమున నిలిచెన్
ధర నుపజాతులు దక్కఁగఁ
బరఁగ నిలుచు నవియె నాల్గు♦పదములమొదలన్. 261

మ. ధరణిన్ జాతుల కాదివర్ణ మొకఁడే♦తప్పంగరా దెల్లెడన్
హరి తజ్జాతిగణంబులైన సరి యు♦ట్లైనఁ గావచ్చు మం
దరధారీ యుపజాతులం బ్రథమవ♦ర్ణంబు న్యథేచ్ఛంబుగా
సారదిం జెప్పఁగ వచ్చుఁ బ్రాసములు ని♦ల్చు న్వర్ణకై యొక్కచోన్. 262

క. తెలియఁగ వినుమీ కామే, పలినామగ్రామధామ ♦ ప్రస్తుతపద్యం
బులు గీతకందసీసా, దులు విరతిగణనియమములతో♦ వివరింతున్. 263

క. గురులఘువుల పేరిటియ,క్షరములు నష్టగణనామ♦కము లగులిపులన్
సురరిపుగర్వతమోభా,స్కర దీర్ఘము లైన రెండు♦గా నెన్నఁబడున్. 264

## కందషట్కాభిధానంబులు.

గీ. పరఁగఁ గందము పథ్యయు ♦ మరి విపులయుఁ
జపలయును ముఖచపలయు ♦ జఘనచపల
లనఁగ గందపద్యంబు లీ♦యాఱువిధము
లఖిలసుకవికృతులలోన ♦ నలరుచుండు. 265

సీ. నలగగభజసగ♦ణంబు లేనుసె కాని కందంబునకు నొందు♦గణము లారదు
[2]వ్వీఁటిలోపల నొక♦మూఁటిచే వడి లేనిహీనపాదము ముందుఁ ♦ గానఁబడును
దరువాత దీర్ఘపా♦దము పంచగణములఁ దగుదాని మూఁడవ♦తావునందు
నలజలు దక్కంగఁ♦గలయ వామీఁద నే యతి దాఁకునిజపదా♦ద్యక్షరంబు
తే. తుదినిగ్గాసలు దక్కంగఁ ♦ గదియ దొక్కటి, కొంచెపడుగుల బేసుల ♦ గొప్పకాల
సరుల జగణంబు గూడదీ♦చరణయుగము,భువిని సగమయ్యె రెట్టింపఁ♦బూర్ణమయ్యె.

1 నాజ్ఞు (మ). 2 వ్రాతప్రతులన్నిటిలో 'వీఁటి' అనియేయున్నది.

ఇది సమస్తప్రబంధములందుఁ జెప్పెడుసహజకందపద్యలక్షణము:—

పథ్య.

ధరలోఁ బథ్యాకందము, హరి యగు నాఱవయెడ నల • మాఱిటిక్కై
విరతియుఁ గూడఁగ మూఁటను, నెరయుఁ జతుర్గణములు గము • నిలిచినచోన్.

విపుల.

క్షమ వేసికోలు సుమహా, దములోఁ జోర శబ్ద మొకటి • తనరింపన్
సమధికపథ్యాకందము, గమనిక విపుల యన నలరు • కంద మగున్ 26

చపల.

[1]సమపదముల మొదలం జగ, ణముం గడయుడుగునను ద్విగ•ణలఘువుపై
[2]సమకోనువిరతియు పదిరోన్, లముల్ ముకుంద చప•లకు నమరున్. 269

ముఖచపల.

స్థిరఁ జపలాకందము పై, ఖరిన్ మొదలియుడుగు చెప్పఁ•గఁ గవులు పె
ట్టిరి ముఖచపల యనెడుపే, రరిదిగ వైకుంఠ వరద • యఘుజైత్రా. 270

జఘనచపలాకందము.

క్షమఁ బథ్యరీతిఁ బూర్వా, ర్ధము చపలాకందముక్రియఁ • దగు నపరా
ర్ధము జఘనచపలకు ముకుం, ద్రమానసమరాళ•దాశార్హా. 271

క. గురువొకటి రెండులఘువులు, సరియైనకతమున వృత్త•చయములఁ దర్కన్
చెరజా త్యుపజాతులు వి, బ్బరముగ నెవ్వైన నిలుప•వచ్చున్ గృతులన్. 272

ఉత్సాహలక్షణము.

[3]ఈవు మీఱ సూర్యగణము•లేడు గాంత మైన ను
త్సాహవృత్త మనఁగఁ గృతులఁ • జాగుచుండు సత్కవి
వ్యూహనుతుల గాంచి కృష్ణుఁ • డొడిసి కాళ్లు పట్టి పెన్
ద్రోహి చావు మనుచు ఖరునిఁ • ద్రోచెఁ గాళ్లు మీఁదుగాన్. 273

తరువోజ.

శతమఖప్రీతయుంబు•జలజాప్తుఁడొకఁడు శతమఖత్రయిమీఁదఁ • జనువిక్రమంబు
ప్రతిభ నియమనుగలా•ప్పఁగ రెండుగూర్పఁ బ్రతిమీఱనొక్కొక్క•పాదమైతనరుఁ

---

1 సమపదముల మొదలం జగ,ణముగడపాదమునను ద్విగ•ణలఘువుపై (ప.ఓ.). ఇందు రెండవపాదమున మొదటిగణము జగణము కాదు. 2 సమకోనుయతియౌ నవయది, లముల్ ముకుంద చప•లకు నమరున్ (పు.ము). 3 ఈవు కారక్ర (ప.ఓ.).

జతురంఘ్రి లీరీతిఁ ♦ జత గూర్చి సుకవి చతురవాచారూఢి ♦ జలజాక్షుసుతులఁ
గృతులందుఁ దరువోజ ♦ నమోజ నెసఁగఁ గృతకృత్యుఁడై చెప్పు ♦ క్షితి నెల్లసభల,
పంచవిధాక్కరంబు లెట్టివనిన:—

క. మధుదమన పురందరథా, మధిచంద్రగణాలిచే త్క ♦ మ మహా ♦ మధ్యా
మధురాంతరాల్పపూర్వ, గ్రిథితాక్కర లైన దనరు ♦ గ్రంథములందున్. *275

మహాక్కర.

నూరుఁ డొకఁడును సున్న గాఁ దర్వాత ♦ సుత్రాము లేవుర పిఱుఁద నొక్క
తారకేశుండుఁ జత యైన నిట్టిస ♦ ప్తగణంబు లొక్క పాదంబునకుఁ
జేరు రెండవచోట నాలవచోటఁ ♦ జిత్రభానుగణంబు గదియుచుండు
నోరసిలు నాలవగణంబుపై శ్రాంతి ♦ యుత్పలాంగ మహాక్కరంబునకు. 276

మధ్యాక్కర.

మునుపుగాఁ బ్రాసంబు గూర్చి ♦ మూఁటిపై విరమంబు నిల్పి
చన నింద్రయుగళంబుమీఁద ♦ కలజాప్త నొక్కనిఁ జేర్చి
యినుమడించిన నాఱుగణము ♦ లెనసిన నొక్కపాదంబు
దనర వక్కాణించినంతఁ ♦ దగు నిట్లు మధ్యాక్కరంబు. 277

మధురాక్కర.

మురనిశాటేంద్రసంహార ♦ మూఁటిపై విరతు లుంచి
తరణిశక్రత్రయంబు సు ♦ ధామయూఖునితోఁ గూర్చి
వసుతో నేనుగణముల ♦ పాద మొక్కటి యొనర్చి
దొరలఁ జెప్పిన నొప్పుఁ గృ ♦ తుల మధురాక్కరంబు. 278

* అంతరాక్కర.

[1]భానుఁ డిద్ద ఱాదిత్య ♦ పతులు చంద్రుండు
పూని నాలుగుచరణ ♦ ములఁ ద్రిగణాంత
మైనవర్ణంబు విరతి ♦ నంతరాక్కరంబు
భానుశీతాంశునేత్ర ♦ పద్మాకళత్ర. 279

---

1 భానుఁ డిద్ద ఱాదిత్య ♦ పతులు తమిస్రాపతియు, జానుమీర నివాలుగు ♦ చరణములకు త్రిగణాంత, మైనవర్ణంబువిరతి ♦ నంతరాక్కరంబు, భానుశీతాంశునేత్ర ♦ పద్మాకళత్ర (ప. ఓ.). *భానుఁ డిద్ద ఱాదిత్య ♦ పతులు చంద్రుండు, పూని నాలుగు చరణ ♦ ములఁ ద్రిగణాంత, మైనవర్ణంబువిరతి ♦ నంతరాక్కరంబు, భానుశీతాంశు నేత్ర ♦ పద్మాకళత్ర. ఛందోభంగములేనంత నిటు సవరణ చేయవలసెనా ?

అల్పాక్కర.

విరమంబు రెంటిపై • విస్తరిల్లి, సురపు లిద్దఱు నొక్క•సోముండు రాఁ
జరణ మీమూఁటిచే • సాగి యొప్పు, హరిపపర్యంక యల్పాక్కరంబు. 280

మఱియు, మంజరి.

తుద మొదళ్లను [1]నంటి•దూఁను శబ్దంబు, వర్జించి యతి మాఱు•ప్రాసంబు లిడక
ప్రాసంబులేనిద్వి•పద యై చెలంగఁ, బ్రాసంబుతుదలందుఁ • బదిలంబు చేసి
[2](సాగింపఁగాఁ జాల•సత్కవీశ్వరులు, మోదంబు పెంపార • భూమిలోపలను
బద్ధాక్షుఁ డెఫుడు చే•పట్టు మంజరుల, చందాన నలరారు•జగతి మంజరులు.) 281

ద్విపద.

సురపతిత్రితయంబు • సూర్యుఁ డొక్కండు
విరమంబు రెంటిపై • వెలయు నొక్కటికి
క్షితిఁ దగ నిరెంటి•చే నొప్పు ద్విపద
మితి లేక చెప్పిన • మేలండ్రు కవులు. 282

త్రిపద.

తొలుతను నల్వు రిం•ద్రులు రెంట మూఁటను
బలభిద్ద్వయంబును రవియు • వళి లేక నలరారుఁ ద్రిపద. 283

చతుష్పద.

జలజాసనవిశ్రమ•సంయుత మై, లలి షోడశమిత•లఘువులతోడన్
గలని చతుష్పద•గతులకు ధరలోన్, జెలు వగుఁ జౌపద • సేవకసులభా. 284

వితాళచతుష్పద.

[3]భానుయుగమ్ము పై•పయి నవల నిం, పూన మణివిరతి • నొంది ధరలో
జా నలరుఁ జతు•ష్పదవితాళా, ఖ్యానమున వినా•యకతురంగా. 285

కర్ణాటచతుష్పద.

మెంగిఁ బంచలఘుగణం•బులు మూఁడు రవియుఁ
దగుతుదఁ బ్రాసంబు•దాఁక రెంటిపయి
నగువిశ్రమమ్ము క•ర్ణాటచౌపద యె
సఁగుఁ గృతుల సత్కవుల•సమ్మతముతోడ 286

1 నంటితూఁను (ప); నంటుతూఁను (ఓ.). 2 ఈరెండుచరణములు వ్రాఁతపుస్తకములందు లేవు. పూ. ము. లలో 'బదిలంబుచేసి'తర్వాత కనఁబడుచున్నది. 3 ఈపాఠము పూ. ము. లోనిది (ప. ఓ.)లలో 'భానుగణయుగముపయినవలతిం' అనియున్నది. అర్థము విచార్యము.

పంచపద.

క. ఆది సమవృత్తములలో, నైదంఘ్రుల నెద్ది యైన ♦ నార్యులు వలుకన్
బాయక గొని కృతులలోపల, నాదరమునఁ బంచపాది ♦ యనఁగా నలరున్. 287

ఉ. ధన్య సుశీల యన్వనిత ♦ తత్పరత న్నదియొద్దనుండు స
త్కన్యలు సేయుసువ్రతము ♦ తానును వేడుక నాచరించి స
న్మాన్యత గట్టినట్టినవ♦మండితతోరము నూయ చేసి పె
న్దైన్యము నొంది కొనల వి♦ధాత్మకృతంబున సంచరించుకొం
డిన్యమహామునీశ్వరుఁ గ♦డిందిగఁ బ్రోచినరుక్మిణీశ్వరా. 288

షట్పద.

ప్రాసము లిమ్మాఱు ♦ వాసవు లాఱుఱి♦పై సుధా దీధితితో నిర్యతి
భాసిల్లఁగాఁ బాద ♦ మీనూటితో నాల్గుఁ ♦ జేసిన కృతులందు షట్పదాఖ్య. 289

నవవిధరగడలు.

వ. మఱియు వైతాళీయభేదంబు లైనరగడ లనేకంబులు గల నందుఁ బ్రసిద్ధంబు లైన హయప్రచారాదినవవిధంబులు ప్రబంధంబుల వర్తిల్లు నవి యెయ్యవి యనిన. 290

క. నరసఖ హయప్రచారము, వరుసఁ దురగవల్గనము వి♦జయమంగళమున్ (?)
ద్విరదగతి విజయభద్ర, మ్మధురహరి హరిణప్లుతగతులు ♦ దొరలుం గృతులన్. 291

క. ఆద్యంతప్రాసంబు లభేద్యంబులు రెంటరెంటఁ ♦ బెనఁచి పదంబుల్
హృద్యంబులు గూర్చిన నన, వద్యంబులు రగడ లెల్ల ♦ వాలుం గృతులన్. 292

క. కొదవ లేనినైపుణులఁ జూ, పద చేసుత్సాహవృత్త♦పద యుగ్మముచేఁ
దుద నాదిని ప్రాసంబుల, వదలక విరచింప వలయుఁ ♦ బ్రాజ్ఞులు రగడల్. 293

హయప్రచారము.

ఋతువిరామ ♦ మినులు నల్వ, రతుక నొక్క♦యంఘ్రి చెల్వ
దనర హయతఁ ♦ దాఙ్క్షిఁ డంచు, దనుజహారణ♦దక్షుఁ డంచు
ముని శుకాది♦మునులు వొగడ, జను హయప్ర♦చారరగడ. 294

తురగవల్గనము.

ఇరవుల హ్యయప్రచార ♦ మినుమడించి కృతులఁ జెప్ప
దురవి విస్తారితాగ్నివరణ ♦ తురగవల్గనాఖ్య మొప్పు. 295

విజయమంగళము.

తురగవలనంబు రెంటి♦తోడ విజయమంగళంబు
ధూర్తకంసతూలదహన ♦ తుహినహీరసదృశకీర్తి

పరఁగ దుగ్ధసింధుమధ్య♦భాసురాంతరీపవర్తి
వారివాహసదృశమూర్తి ♦ భక్తజనహృదబ్జపూర్తి. 397

ద్విరదగతి.

కర మొప్పఁ బంచలఘు♦గణచతుష్టయముచే
విరమంబు రెంటిపై ♦ ద్విరదగతి పేరిచే.

విజయభద్రము.

ద్విరదగతి రెట్టింప ♦ విజయభద్రము చెల్లు ♦
విదురపూజితపాద ♦ వేదసన్నుతనామ
దరచక్రకార్ముకగ♦దాఖడ్గధారణా ♦
తాపింఛసమగాత్ర ♦ దళితదైత్యస్తోమ. 299

మధురగతి.

[1]నాలుగుమాత్రలు ♦ నాటినగణములు, నాలుగు రెంటికి ♦ నడి విరమణములు
గలసి మధురగతి♦కనలును జగణము, తొలఁగిన ధృతకౌ♦స్తుభ కవిరమణము. 300

హరిగతి.

నలసభగగములలోపల నేదై♦నను నెనిమిది నాల్గిటిపై విరమము
గలసిన హరిగతి చెలు వగుఁ గృతులం ♦ గవివరులౌ నని చెప్పిననియమము. 301

హరిణగతి.

వరహరి పదియు ♦ నాలుగులములు, కరియతి హరిణ♦గతికి నెళవులు 302

వృషభగతి.

ఇరువదియొనిమిది లఘువులు [2]పది♦యేనిట విశ్రాంతియుఁ గూర్చిన
నిర వగు వృషగతి పద్మాధిప ♦ యిది విను మాదరమున మాదమున. 303

యక్షగానలక్షణము.

సీ. ఇద నేడులఘువులు ♦ తొలఁగించి చదివినఁ ద్రిపుటకు వృషభగ♦తిపదయుగము
లిఁ గడపల నొక్క♦లఘువు మానిన జంపె మనుద్విరదగతిస♦మపదయుగము
గురు తగురచ్చర♦కుఁ దురగ వల్గనాహ్వయ మేకతాళియా♦మధురగతికి (?)
నంఘ్రి కిర్వదినాలు ♦ గటతాళమున మాత్ర లోలి విశ్రాంతి ప♦ద్మాలుగింటఁ
తే. దెలియ నర్థంబు నర్ధచం♦ద్రికలు వీన
యక్షగానప్రబంధంబు ♦ లతుక వచ్చు
రగడభేదంబు లివి యంధ్రు ♦ రసఁ గవీంద్రు
లవితనిజసేవకస్తోమ ♦ యబ్ధిధామ. 304

1 నాలుగులఘువులు (మ). 2 పదవానలు (మ).

## ఉదాహరణలక్షణము.

సీ. సప్తవిభక్తులు ♦ సంబోధనంబును గూడ నెన్మివిభ♦క్తులు క్రమమునఁ
బతిపేరు దొరలంగఁ♦బద్య మొక్కటిఁ జెప్పి రగడభేదములు మా♦ర్గములఁ గాఁగఁ
గళికలు నెనిమిది ♦ దళములు గావించి దానిలో సగము ను♦త్కళికఁ జేసి
యది యొక్కసమసనం ♦ బయ్యెడు దళము లెన్నిదిఁ గూర్చి వానికిఁ♦దుద విభక్తి
తే. బయలు పఱచి కట్టకడను♦బద్య మొకటి, పలుక వలయును సార్వవి♦భక్తికముగ
నిర్వదాఱుపద్యములందు ♦ నిడిన ధాత్రి, నిది యుదాహరణ మటందు ♦ రిద్ధచరిత.
సీ. సంబోధనమునకు ♦ సరసాళి జయపతి ప్రథమకు వాణి వి♦రావళియును
క్షితి ద్వితీయకు స్ఫుట ♦ కీర్తిమతియుఁ దృతీయకుఁ గీర్తి సుభగయు ♦ నటఁ జతుర్థి
కిని దేవలాభిని♦యును భోగమాలిని పంచమికి నెసంగు ♦ వాణియును గ
ళావతి షష్ఠియు ♦ లలిత కాంతిమతియు సప్తమికిని ఘోణి ♦ సత్కమలయు
తే. నాదినూక్తులనామధే♦యములు వెనుకఁ, బలికినది వేల్పు లష్టవి♦భక్తులకును
వారుతమశక్తికొలఁదిని ♦ వ్రాలుఫలము, లిత్రు నాయకద్వయమున ♦ కిందిరేశ
సీ. సంబుద్ధి యెడలించి ♦ సప్తవిభక్తులు పలికిన భక్తిస♦ద్దలి యనంగ
సంబుద్ధితోఁ గూడ ♦ సప్తవిభక్తులు పలుక నొప్పారు బ♦ద్దలి యనంగ
సంబుద్ధితోడ వి♦షమవిభక్తులతోడఁ బలికినకృతియు వి♦ద్ధళి యనంగఁ
గళిక లుత్కళికలు ♦ గమకింపఁ బలికినకావ్యంబు నుత్ఫుల్ల♦కంబనంగ
తే. నవనిఁ జాటుప్రబంధంబు♦లందు మిగుల, నాటుకొనియొప్పుచుండుని♦నాల్గుదెగలఁ
గానఁబడు నుదాహరణము ♦ గ్గానలోల, కామెపల్లీశ వల్లవీ♦కాముకృష్ణ. 807
ఉ. శ్రీవనితాసనాథుఁడు వ♦శీకృతభక్తమనోంబుజాండు వి
శ్యావనుఁ డుగ్రసేనుఁ డురు♦శౌర్యుఁ డజేయుఁ డగణ్యసద్గుణ
ప్రావృతభూషణోజ్జ్వలుఁ డ♦హాగపతికోటిమరీచి భద్రదం
తావళనాయకావనుఁ డు♦దారుఁడు కృష్ణుఁడు మమ్ముఁ బ్రోవుతన్. 808

### కళిక.

మతియు దేవకీకౌరసేనిక♦మారనిర్మలరత్నరాజము
కలకుటాసురల నెల్లఁ దారుణ♦కదనధారుణి దునుము తేజము
బలిమి నందనవనములోపలి♦పారిజాతము ధరకుఁ దెచ్చెను
గోలఁది విఖ్యాతినసమ్మదంబునఁ ♦ గుండలంబులు తల్లి కిచ్చెను
జెలఁగి నరునకు సూతకృత్యము ♦ చేసి కౌరవులఁ బరిమార్చెను
దలఁపు మఱువనిదాసచయములఁ ♦ దవిలి తిరుగనిముక్తిఁ జేర్చెను

వెలఁదికొలకును బాణుచేతులు ♦ వేయు నఱికినవిక్రమోగ్రుఁడు
జలదములజిగి దెగడునొడలున ♦ జానుమీఱెడుశుభసమగ్రుఁడు. 309

ఉత్కళిక.

కమలనేత్రు నిరాకరించుచు ♦ యమునయొద్దనుఁ దపము సేయుచు
నున్న కాంతను జూచి రయమున ♦ నున్న సుద్ది వచించి ప్రియమున
నరుఁడు గూర్చినమిత్రు నానతి ♦ కరము పట్టెడుదానిఁ జానతి
విదళితాసురసార్వభౌముఁడు ♦ యదుకులాంబుధిపూర్ణసోముఁడు. 310

ఉ. మానవులార రోగములు ♦ మానును లేములు లేవు సంపదల్
జానగు దుఃఖము ల్దొలఁగు ♦ జాలు నఘంబులు మందబుద్ధులై
దీనత నొందనేటికి న♦తిస్థిరభక్తినిఁ గొల్వఁడే పరా
ధీనులుగాక మీరు వసు♦దేవకుమారకు ముక్తికోసమై. 311

కళిక.

[1]మఱియు త్రేతల నెల్ల ♦ మరులుకొల్పినవాని
మెఱసి కానను బసుల ♦ మేపి తిరిగెడువాని
భామతో దూర్వాసు♦బండియీడ్చినవాని
వేమఱదిరినమగధు ♦ విరగఁ దోలినవాని
బాలుఁడై తోలెక్క ♦ పాలు ద్రావినవాని
హేలతోఁ బదిరూపు ♦ లెలమిఁ దాల్చినవానిఁ
దాళవృక్షము లెల్ల ♦ ధరణిఁ గూల్చినవాని
గాలిరక్కసుఁ జావఁ ♦ గాలఁ దన్నినవాని
లీలఁ గొలను గడిఁది ♦ లేమిఁ బాపెడివాని. 312

మందుపావకుఁ గొల్చి ♦ కొండవాహుతి ద్రేల్చి
పార్థివేశ్వరుఁ గాంచి ♦ పార్థు నక్కడ నుంచి
దారకుం దమరించి ♦ చేరఁ దెచ్చినమంచి
యరద మె*క్కక పూని ♦ పురికి వచ్చినవాని. 313

1 ఇందు రెండవచరణము మొదలుకొని అయిదుపాదములు పూ. ము. లలో లేవు. (ప. ఓ.)లలోఁగలవు (పూ. ము.) లలో ఇందలి 1-7-8 పాదములున్ను (ప. ఓ.) లలో లేని 'లీలఁగొల్లను గడిఁదిలేమిఁబాపెడివాని' అను పాదమును ఇట్లు నాలుగుపదములు మాత్రమే కలవు. * 'కొను' పక.

చ. [1]పులకిల నేల మానవుల♦[2]పుట్టును పావన మయ్యె నెప్పుడున్
[3]గళవడ మేల రోగము ల♦కాలగతిం గడవట్టు నీతిబా
ధలును దరిద్రతావ్యథలు ♦ దవ్వులకేఁగును వాంఛితార్థముల్
గలుగు నమేయుచేతఁ గమ♦లాధవుచే వటపత్రశాయిచేన్ 814

కళిక.

మఱియు బ్రహ్మమాయఁ గెల్చి ♦ మసలుమంత్రవాదిచేత
నెఱిఁగి సాంభకునకు వరము ♦ లిచ్చి మెఱయుమోదిచేత
మృతతనయుని మరల గురున ♦ కిచ్చినట్టియచ్యుతుచేత
నతులరాసకేళి సలిపి♦నట్టియాదినటునిచేతఁ
బిండి రుబ్బునాతిమోము ♦ పెరుగు దుడుచుకొంటెచేత
మండుచున్నకారుచిచ్చు ♦ మరిగి త్రావునమరుచేత
నెలుఁగుతోడఁ బోరి మణియు ♦ నింతిఁ గొనినయదుజుచేతఁ
వెలయఁ దులసిపూసపేరు ♦ వేసికొనినజోగిచేత. 815

ఉత్కళిక.

గట్టిగిశరపంజరంబు ♦ గట్టఁ దలఁచి వేగిరంబు
చవుటికడలిచెంతఁ జేరి ♦ పవనతనయుతోడఁ బోరి
తన్నుఁ జీరినంత వచ్చి ♦ చెన్ను గెలుపు నరున కిచ్చి
మహిమ మెఱయకృష్ణుచేత ♦ మిహిరకోటిదీప్తుచేత. 816

శా. ఓలం బాసకుఁ దేక మత్సరముతో ♦ నుప్పొంగి పెక్కుడుల
భీలాకారమునం గొలంకు[4]నడుమన్ ♦ బేటాడునక్రంబుతోఁ
జాలం గయ్యము చేసి చిక్కినపుడ♦స్తంబేరమస్వామికై
కేలం బట్టి నిమిర్చినట్టిహరికై ♦ కృష్ణాంబుభృన్మూర్తికై. 817

మఱియునుఁ గౌమోదకియును ఖడ్గము ♦ మణియును శంఖముఁ బట్టినవారికై
మెఱయఁగ విద్యుచ్ఛేలముఁ దాల్చక ♦ మెలఁగెడుదధికణపరిధిగునకై
వెలుచం గదిసిన[5]మల్లుల నిరుపురఁ ♦ బిడికిటఁ బొడిచినబలుమల్లునకై
వెలయుఁగ యమునానదిలోఁ గాళియ♦విషధరుఁ దోలినయదుసింహునకై
విజయునిరథసారథి యై గురునృప♦భీష్మాదులఁ గెలిచినభూపతికై

1 పులసిల (ఓ. పూ. ము). 2 పుట్టువు (ఓ. పూ. ము). 3 గళవళ మేల (పూ. ము). 4 నడుమన్నిట్టాడు (పూ. ము); బేపాడు (ఓ.). 5 మఱర (పూ. ము).

గఱిగా యువనాభిధు ముదుసందునిఁ ♦ గనుదృష్టినిఁ జంపినశ్రీపతికై
బలువిడి దేవకితండ్రిని మధురకుఁ ♦ బట్టము గట్టినగోవిందునకై
గెల దాల్చినవైఖరి గోవర్ధన♦గిరి మోఁచినమహాబానందునకై. 318

ఉత్కళిక.

తొలిపుట్టువునోఁ [1]ఫలంబున వే, బలువిడి నగుపేదతికంబున వే
సరి కొండల మందుచుఁ బైనంబై, పురికిం బరమానందమునం బై
కొని యుబ్బుచు వచ్చి కలిమిపనికిం, గని యడుకు లొసంగినబాపనికి
న్గలి మిచ్చినబాలస్నేహునకై, కలుములచే నేలినకృష్ణునకై. 319

మ. పురిటింటం బసిబిడ్డచందమున నాఁపోవంగ నాఁ డాత్మలో
మురు వొప్ప న్విషపుష్టయుగ్మకుచ యై ♦ ముద్దాడు రాకాస్యచ
న్నిదకేలంగొని బాలుఁ ద్రావుమిషచే ♦ నిర్మైనకాలంబునన్§
ధరణిం గూల్చిననందపుత్త్రునలనం ♦ దార్క్షణధర్మస్థితుల్. 320

కళిక.

మఱి నీము గీతామృతస♦మగ్రసింధునివలన, మఱలు భవపటుతిమిర♦వనజబంధునివలన
బొంకు లెయ్యెడ లేని♦భూరిసత్యునివలన, జంకు లెన్నఁడు లేని♦సమరనిత్యునివలన
ఖేదము ల్బెడబాపు♦[2]కేశిమర్దనువలన, నాదికారణమూర్తి ♦ యగుజనార్దనువలనఁ
గాన రానిపదములు♦గానఁ పాసుపువలన, [3]బూని గొడ్రాలికిం ♦ బుట్టి కొనుపువలన.

ఉత్కళిక.

[4]తను బిల్వ మిగురు గూర ♦ దిని పాక మింపారఁ
జేసి ద్రౌపదిచేత ♦ వాస దీరఁగ మేత
యడిగినమునిశులకు ♦ నిడఁ గల్గుదాసులకుఁ
గల్పించుమాకిపలనఁ ♦ గల్పస్థాయివలన. 322

1 ఫలంబున నే—పూ. ము. అంత్యప్రాసనియమభంగము. 2 కెళి (పూ. ము.).
3 పూని గొడ్రాలికిఁ బుట్టు కొనుపువలన (పూ. ము.) ఛందోభంగము; బూని గొడ్డురాలికి (ఓ.ప). 4 తనుఁ బిల్వమిగుల—పూ. ము. ఈ చరణమున 21 మాత్రలున్నవి.

§ గుత్తిలోఁ గిఫ్టంబుగఁ......నిర్వైనకాలంబునన్—పూ. ము. ఇది "క్త్వార్థే కారసంధి" ఇది యప్పకవి యుపయోగించి యుండడు. కొబట్టి దీనిని సవరింపఁబట్యా యున్నాము. మహాలాక్షణికుఁ డైనయప్పకవియే యిట్టిదుశాస్త్రీయమైన సంధినిజేసినచో నాంధ్రభాషకు ముప్పువచ్చునను మతిశయోక్తిగాదు. మరియు "నిర్వైన" అను పదము మిక్కిలి కర్ణకఠోరముగనున్నది. తక్కినపద్యశైలినిచూడగా పదముల మార్దవము స్పష్టముగదా.

శా. [1]కారాగారమునందు వెల్వడి భుజం॰గస్వామి సుచ్ఛత్రమై
పై రాఁ దాక్షిణ్యఁదు నాఁకిన [2]త్రైలిఖ్య నం॰భ్రస్తోమముల్ గూఱి శ్రీ
స్ఫూర్త్యోద్భూతి పథం బౌసంగఁ దనుఁ గొం॰చుం దండ్రి యేతెంచి [3]జా
ల్వారేపల్లెను నిల్పఁ బొల్చు[4]హారికి ॰ న్వ్యాలార నేమ్రొక్కెదన్. 323

కళిక.

మఱియుఁ బెఱయు నెఱయు నుఱియు॰మధునిఁ గూల్చినట్టిహారికి
నఱిమి తఱిమి చఱిమి సుఱుము॰నశ్వుఁ గెల్చినవితకరికిఁ
గఱచి చఱచి యుఱచి పఱపుఁ ॰ గపినిఁ జంపినచ్యుతునకు
మఱిగి తిరిగి విఱిగి [5]సొరగు॰ముద్దులీడ్చినయమితునకు
[6]సరలి కెరలి నరలి మరలి ॰ సాళ్వుఁ జంపినక్షరునకు
గరిమ మెరిమె యొరిమి నెరిమి ॰ కామెపల్లిమందిరునకు
నయముఁ బ్రియము రయము జయము ॰ నరుని కిడినకేశవునకు
వ్యయము భయము అయము క్షయము ॰ వైరి కొసఁగుమాధవునకు. 324

ఉత్కళిక.

[7]గొల్ల లెల్లఁ దల్లడిల్లఁ ॰ బెల్లుజల్లు లల్లి రాళ్ల
సోనవాన మాన ప్రాని ॰ [8]కోన రాని కోనలోన
చుట్టి పట్టి గట్టి దిట్ట ॰ ట్టు గట్టు మట్టు సుట్టు
నూఁచి లోఁచి నోఁచి మోఁచి ॰ [9]బ్రోచినట్టివామనునకు. 325

మ. పృథులావంతివరస్వయంవరమున ॰ న్విందానువిందానులన్
బ్రధనక్షోణిని గెల్చి సద్గుణ సుభ॰ద్ర న్భద్రఁ గోకొంచు న
చ్చి ధరాధీశునను జ్ఞ చే ననలసా॰క్షికంబు గృహోక్తస
ద్విధిఁ బెండ్లాడినకృష్ణునందు నిలిచె ॰ [10]ధీరప్రతాపోన్నతుల్. 326

కళిక.

మఱియు నుగ్రసేనా॰మాత్యునందు, నెఱి మీఱు లయకాల॰నిత్యునందు
విసురార్చితపదార॰విందునందు, విదళితఘోరారి॰బృందునందు

*1 కారాగారమునుండి. పూ. ము. 2 త్రైలిఖ్య (ప). 3 చెల్వారంబల్లెను. (పూ. ము). 4 హారికివా గార (ప). 5 యొరగు (పూ. ము.). 6 సరలిమరలి కెరలినరలి సాల్వుఁ జంపినక్షరునకు (ప. ఓ). 7 ఇంను (పూ. ము) లలోను (ప.) లోను మూఁడు చరణములు మాత్రమేయున్నవి; (ఓ) లో నాల్గుచరణములున్నవి. 8 కొన-పూ. ము. 9 ద్రోచినట్టి వామనునకు (పూ. ము); బ్రోచినట్టి వామనునకు (ప) 10 దీర్ఘ (పూ. ము).

సాభీరువస్త్రాపహారునందు, బలిపట్టణద్వారపాలునందు
జలగాదిదశతనూచ్ఛాదునందు......... 327

ఉత్కళిక.

సజ్జరాగంబు, రజ్జునాగంబు, కంధియోగంబు, మందరాగంబు
రాపుతో నూచి, వీఁపుతో మోఁచి, వెలయుహరియందు, జలజాక్షునందు. 328

ఉ. ధర్మజుఁ డంపినం జరిగి దంతిపురంబున నాంబికేయుతో
ధర్మముఁ జెప్పి దుష్కృతుల [1]దగ్గఱ శాంతనవాదిసజ్జనుల్
నిర్మలచిత్తు లెల్లఁ గను నేరుపున న్సభఁ దాల్చినట్టిని
స్నర్మవహాకృతిం దలఁతు నాదుమనంబున నందనందనా. 329

కళిక.

మఱియుఁ జగన్మోహనమాయఁ దాల్చినజాల, జిలుగుతఱి ద్రౌపదికిఁ జీరలిచ్చినకాల
సఖులతో నదిలోనఁ జల్ది గుడిచినబాల, విఖనసుం డెదలోన వేఁదలిర్చినలోల
నరుతేరినొగలపై నాట్యమాడినవీర, సరకుగొని భీష్ముపైఁ జక్ర మెత్తినశూర
తరిని సద్గురుసుతుల దాపరించినసదయ, పెరిమెనాగపురంబు పెక్కలించినవిజయ.

ఉత్కళిక.

గురుభీష్మ రాధేయు లురుజన్యమున నేయు
శరవహ్ని బయ లెక్క యరద మెల్లను నెక్క
[2]తరి గొల్చునెడ పాండువరుల నేగురి మెండు
బ్రతుకఁ జేసినపుణ్య వితత దీనశరణ్య. 331

శా. నీ వొక్కండవు నిన్ను నమ్మి కొలుతు న్నీచే సుఖం బబ్బె నీ
కై వే దండ మొనర్తు నీవలన నిష్టావాప్తి చేకూరె నీ
కే విశ్వాసముఁ [3]జేర్చి తింక మదిలో హెచ్చయ్యె నీయందు నా
కైవారంబులు శౌరసేనతనయా కామేపలీవల్లభా. 332

ఉ. వామన విశ్వగింపు మిట నన్నయభట్టకృతాంధ్రశబ్దచిం
తామణికల్పనోక్తికల నాచతురోపమ లుల్లసిల్లని
చ్ఛామతి నర్పణంబుగ నొసంగితిఁ గామెపలీశ నీకు నై
రామయ మొ తగ న్భవదుదాహరణంబు జగత్ప్రసిద్ధిగాఁ. 333

1 దగ్గఱ (పూ. ము.) యతిభంగము. 2 తరుగాల్చునెడ పాండుతనయులేగురి మెండు(పూ.ము.); తరిగొల్చు(ఓ.); తరుగొల్చు(ప.); మఱికొన్ని తాటాకుపుస్తకములు చూచినగాని సరియైనపాఠము నిర్ణయించుటకు సాధ్యముగాదు. 3 జేర్చినింక(పూ.ము.).

వ. సీసంబు లనునవి సమవిషమంబుల రెండుదెఱంగు లయ్యె వానివిశేషంబు లెట్టివనిన

సీసమాలిక.

యతి నైనఁ బ్రాసంబు • నంద్రైన [1]నొకటితోఁ జెప్పి రేనియు సమ•సీస మగును
నియమము ల్దీనిపై • నిలిపిన సీసంబు లాఱుదెఱంగు లై • యతిశయిల్లు
నెనిమిదంఘ్రులఁ బ్రాస • మెక్కింప వళ్లకై సర్వతః ప్రాససీ•సం బనంగఁ
బ్రాస మాఱంఘ్రులఁ • బదిలంబు గావింప నక్కలిప్రాససీ•సాఖ్య మనఁగ
నాది నేవడి నిల్పి • రావడే పద మెల్లఁ జేయ నయ్యాదివడి•సీస మనఁగఁ
బదఖండములయందుఁ • బ్రత్యేకయతులుగా స్థిర నవకలివడి•సీస మనఁగఁ
గుదురుగా నుత్సాహ• తుదయందు గీతంబు చెప్పిన విషమాఖ్య•సీస మనఁగఁ
గడ వెల్ల లఘువులే • కల్పించి రెద్దాన సరవి సర్వలఘుసీ•సంబు ననఁగఁ

తే. సప్తవిధము లివియ శబ్ద•శాసనుండు, పంచమామ్నాయపక్కిలోఁ • బల్కెఁగాని
కడమకవు లాఱుసీసము • ల్విడిచిపెట్టి, చెలఁగి సమసీసపద్యమే • చెప్పినారు. 385

అందు సీసలక్షణ మెట్టి దనిన:—

క. సురపతు లాఱ్గురిపై భ్రాస్కరు లిరువురు గూడ నొక్క•చరణము పొల్పొం
బరఁగు నవి నాలుగడుగుల, విరమముపై రెంట రెంట • వెలయఁగ వలయుజా. 386

క. వానిఁ జరణములు నాలుగు, చేసి తుదిని గీత మొకటి • చెప్పఁగ నయ్యెజా
సీసము తంగెడదేశవి, భాసురశుభశీల కామ•పలిగోపాలా. 387

సమసీసము.

ప్రతికించె నెవ్వాఁడు • మృతగురుతనయుని మెలఁత వేఁడిన మెచ్చి • మేలు చేసెఁ
బోషించె నెవ్వాఁడు • పొదివినదారుణాపద లెల్లఁ దొలఁగించి • పాండుసుతుల
వెడలించె నెవ్వాఁడు • వెడపొడుబావిలో నూసరవెల్లి యై • యున్న నృగుని
మర్దించె నెవ్వాఁడు • మౌసలంబున వృష్ణియదుభోజసైన్యాంధ•కాదినృపుల
1. ప్రేల్చె నేవాఁడు ఖాండవ•విపిన మెల్ల, జాతవేదోత్థవిలసిత•జ్వాలమీఁద
నతనిఁ గీర్తింతు మదిలోన • ననుదినంబు, ననఁగ నలరారు సమసీస•మఖిలకృతుల

సర్వతః ప్రాససీసము.

వేదండవరదుండు • వేధోండగాంగుండు కాదేవశయనుండు • యాదవేంద్రుఁ
డాదిత్యవంద్యుండు • నాదాసులభుండు వేదాంతవేద్యుండు • కాదఁబలుఁ
డాదితేయుఁడు బిందు•నాదకళాతీతుఁ డాదిత్యకులజుండు • బాధితారి
మేదిప్రీశుండు • భూధరగాత్రుండు శ్రీదమిత్రసఖుండు • ద్వాదశాత్ముఁ

1. రెంటెతో (పూ. ము.)

తే. డాదిదేవుఁ డాశ్రితగంధ♦మాదనుండు, చేదిసాంభకవైదర్భ♦సూదనుండు
మేదురమురళీనాదవి♦నోదుఁ డనుచుఁ, జెప్పినను సర్వతః ప్రాస♦సీస మగును. 339

## [1]వృత్తప్రాససీసము.

శిక్షించె నెవ్వాఁడు ♦ [2]చేటువై సభలోనఁ జెడుమాట లాడిన ♦ చేదివిభుని
రక్షించె నెవ్వాఁడు ♦ ద్రోణిబాణముచేతఁ [3]జిదియకుండఁగఁ బరి♦క్షిన్నృపాలు
భక్షించె నెవ్వాఁడు ♦ పర్వతాకృతిచేత నాభీరు లర్పించు ♦ నారగింపు
వీక్షించె నెవ్వాఁడు ♦ వేడ్కతో సేవకుల్ బ్రతుకునట్లుగఁ గృపా♦పాంగదృష్టి
తే. దాక్షిణాత్యుని సాంభక♦ధారణీశుఁ, జంపె నెవ్వాఁడు పోరిలో ♦ సాహసమునఁ
బక్షిరాజతురంగుఁ డా♦వ్వాఁ డనంగఁ, జెలఁగుచుండు వృత్తప్రాస♦సీసము లిల. 340

## వడిసీసము.

విజయసారథిఁ గాని♦వినుతింపఁగా నొల్లఁ గిరినాయకునిఁ గాని ♦ కీర్తిసేయ
యాదవేంద్రునిఁ గాని యభినుతింపఁగ నొల్ల మధుసూదనునిఁగాని ♦ మదిని నిల్పఁ
బద్మనాభునిఁ గాని ♦ ప్రణుతింపఁగా నొల్లఁ బారీవపతిఁ గాని ♦ ప్రస్తుతింప
బాణసంహారుఁ గాని ♦ భజియింపఁగా నొల్లఁ బీతాంబరునిఁ గాని ♦ ప్రీతిఁ దలఁప
తే. నవితవేదండపతిఁగాని ♦ యనుసరింప, ననుచు నినుఁ గూర్చి యనురక్తి♦నాత్మ నెప్డు
పొగడుసత్కవి[4]ప్రజములఁ ♦ బ్రోచి తనఁగఁ, దనరు వడిసీసభేదంబు ♦ తాళిభేది.

## అవకలివడిసీసము.

సామాజికాహిత♦స్తోమంబు సామంబుగా మించి మైత్రికి ♦ నామతింప
నభిమానధారణీ♦విభులు దానంబుచే నక్కఱ లన్నియుఁ ♦ జక్కఁ జేయ
నతిరుక్షపక్షమా♦పతులు భేదంబుచే దినదినక్షీణత్వ♦మునకుఁ జెడఁగఁ
బదిలింపుటుద్దండు ♦ లాదిగి దండంబుచేఁ దనయాజ్ఞ యాదల ♦ ననిచి నడువ
తే. సంధియానాదిషాడ్గుణ్య♦బంధురముగ, [5]నోమి శక్తిత్రయోపేతుఁ ♦ డై మురారి
నేల ననురక్తి నీతితో ♦ నేలె ననుచుఁ, జేయ నవకలివడినామ♦సీస మగును. 342

## విషమసీసము.

అంచితముగ భీమునకు సహాయ మొసఁగు దెంచి తా
నించు కదిరి దురము నయము ♦ నయానంకుశంబు తా
కించుక నక కనుక వలనా ♦ గంల వనక ఘుల్తు మ
ర్దించినట్టిసవ్యసాచు ♦ లంఘు లుకాపలం

1 దీనికె (పూ. ము.) లో అకిలి ప్రాసశిషమనిపేరు. 2 చేట్కుయ్యొ (ప).
3 చిక్కకుండఁగ (పూ. ము). 4 జనముల (ప). 5 నాం (పూ. ము)

*ఆ. దోలుకృష్ణ యంచుఁ♦దోరంపుటుత్సాహ, మీఁద గీత మొకఁడు ♦ మేలవింప
విషమసీస మనఁగ ♦ వెలయుఁ గా మెప్పలీశ, జమ్మిచెంత నున్న ♦ చతురవచన. 343

## సర్వలఘుసీసము.

క. క్షమ షట్త్రింశల్లఘువులు, త్రిమహేశవిరామము గల ♦ దీర్ఘ పదచతు
ష్కముపై నొకగీతి మఱి, ప్రమథన సర్వలఘుసీస ♦ పద్యమన కగుఁజా. 344

సీ. చిఱుతయగు కొడుకున [1]కె♦దరయి మృతికి మొదలగు
[2]టౌరులవలన విని రుష♦[3]వరుషుఁ డగుచు
చరమశరధిజలముల ♦ తరణి మునుగక మునుపు
దురమున నురువడి బలు ♦ దురుసుపరచి
కెరలి గొనయము దురిమి ♦ మురిగుణము మొరయిడఁగ
నిరికిన శితశరములు ♦ పరువ విడువ
జరిగి సెళవెటిఁ గొదిగి ♦ మఱుఁగున నిలిచిన కురు
పతిమఱఁదిని సెరి నురు ♦ మగను దలఁచి
తే. చేసినట్టి ప్రతిజ్ఞ శా♦సింపఁగోరి, సవ్యసాచిశతాంగంబు ♦ సైంధవములఁ
దోలుగోవిందునుతులచేఁ ♦ దొడరుఁగృతుల, సర్వలఘుసీసపద్యంబు♦సాగుచుండు.
క. బలసోదరగీత్యుద్గీత్యార్యలు నా ల్గార్యాఖ్యగీతు ♦ లాటవెలఁదితే
టులురెండు సమము లెత్తుక, మలనాహ్వాయ పవడలు విష♦మంబులు మూఁడుఁజా.

## సమగీతి.

క్షమఁ బథ్యాకందముచం♦దమునఁజా రెండరలు దెలియఁ ♦ దనరింపఁజా
సమ మనుగీతిక౯తులలోఁ, గమలాహృదయాబ్జవాస ♦ కమలాక్షా. 347

కరవరద పరమకృప ♦ ధరణిధర సురవినుత కనకవసన నరహరి♦గరుడగమన
నళినకరపదనయన♦దళితఖరదనుజలయ నరసఖ పరగుణనిధి ♦ శరధిశయన
పరమపదనిలయ హరి♦పరమపురుష ప్రకృతికిఁ బరుఁడని నినునిగమని♦వహము పలుకు
నిరతమును హృదయమున♦నినుఁ దలఁతునను మనుపు మనియనఘచరిత జల♦దనిభత
తే. సర్వలఘుసీస మీరీతి ♦ సకలసుకవి, వరులు చెప్పుదు రిలమీఁద♦వరుస నెల్ల [నువ
వారు మెచ్చంగ సర్వేశ ♦ వారిజాక్ష, కామెపల్లీశ యచ్యుత ♦ కామజనక. 345

ఈపద్యము (పూ. ము.)లో నున్నది. 1 కెదరయి(ప). 2 ఊరుల(ప). 3 వరుషుఁడనుచు (ఓ).

### ఉద్గీతి.

మొదలిసగము చపలగతిం, దుద నృగము పథ్యగతిని ♦ దొడరంగా
నిది యుద్గీతి యనం దగు, విదురాకూర్రాదివరద ♦ వేణుధరా. 348

### ఉపగీతి.

ధరఁ జపలాకందము వై, తురి నృగం బైనఁ ♦ గావ్యములఁ
బరఁగు నుపగీతి పూర్వా,మర వ్రజతమిస్ర ♦ మార్తాండా. 349

### ఆర్యాగీతి.

సముదీరితపథ్యాకం,దముకన్నను నొక్కగురువు ♦ దాకించినచో
క్షమ నార్యాగీతి యగు, న్గమలాప్రాణేశ సహజ♦కందం బదియే. 340

### సమగీతులందు నాటవెలఁది.

మేలు మే లటంచు ♦ మిత్రులు ముగ్గురు, వింత వింత యనుచు ♦ విబుధు లిద్ద
ఱహహ యనుచు సూరు♦లయిదుగురును మెచ్చ,నాటవెలఁది మూఁట♦నలరు సగము.

మిత్రుఁ డొక్కఁడు వీణియ♦మీటుచుండ, విబుధవరు లిద్ద ఱర్థంబు♦విప్పి చెప్ప
నినులు నిద్దఱు వినుచుండ♦నేకగతిని, దేటగీతంబు మూఁటను ♦ వాట మయ్యె. 352

### విషమగీతులందు నెత్తుగీతి.

సురనాథుమీఁద♦సూరు లిరువురు రెంట విరతి
ధరణిఁ బ్రాసంబు ♦ [1]దనరు హరి యెత్తుగీతియందు. 353

### కమలః

హగణ మైనఁ జాలు నగణ♦మైనఁ జాలు హగణ
నగణములును రెండు గలవి ♦ నాటి యంఘ్రి కేడు
తగినవిరతి నాలుగింటఁ ♦ దనరఁ బ్రాస మొదవి
మిగుల మెఱయుచుండుఁ ♦ గృతులఁ గమలనాఖ్యగీతి. 354

### పవడగీతి.

అవని మూగురుభాను ♦ లాదిత్యపతు లిద్ద, అవల నేగు రర్కు ♦ లర్థమునను
బవడగీతియందుఁ ♦ బ్రాసముల్ సమకూఱు, నవియె యాటవెలఁది♦యందు లేవు. 356

వ. ఇది నవగీతివివేకం బింక బిరుదావళిలక్షణం బెఱింగించెద.

తే. క్షితి మహారాష్ట్రభాషచేఁ♦జెప్పఁబడెడు, భీకరోక్తులు బిరుదులై♦పెక్కు దనరు
[2]వాటబిరుదావళియొనర్ప♦వలయునండ్రు,బుధులు సంబుద్ధి పదములు♦పొసఁగఁగూర్చి.

---

1 దనరు నెత్తుగీతియందు--(పూ. ము) ఛందోభంగము. 2 వాని (పూ. ము). "వాట" అని వ్రాతప్రతులలోని పాఠము తప్పని దిద్దినయెడల "వాని" అనియుండవలెను.

చ. అతిభుజవిక్రమోద్భవము • లై రిపుకర్ణకఠోరకంబు లై
[1]యతులితవీరవాక్యము లయి • యాదిమపార్థివలాంఛనంబు లై
ప్రతిపదనూతనంబు లయి • భాసిలుసూక్తులు గూర్చి స్వస్తివా
క్యతతులఁ జెప్ప నొప్పు బిరు•దావళి సార్వవిభక్తికంబుగాన్. 358

చ. సలలితవాక్యగుంభనల • సర్వవిభక్తుల [2]దీపనంబులన్
జెలు వగుపద్య మొక్కటి ర•చించినపిమ్మట గౌడరీతి సం
కలితచతుష్కషట్కదళ•గద్యము లెన్మిదియుం బదాఱు నిం
పలరఁగఁ గూర్చి పేర్చి బిరు•దావళిఁ జెప్పఁగ నొప్పు నెంతయున్. 359

చక్రవాళము.

క. ఒకపద్యముపిదప దళా, ష్టకసందర్భాష్టగద్య • చతురం బగుచు
క్కకఁ బేరు చక్రవాళం, బకట చతుర్భద్ర మదియె • యచ్యుత మఱియున్.

క. తొలిసమసనాంత్యవర్ణయు, గళ మే పునరుక్తిఁ గాఁగఁ • గైకొని సామీ
ప్యలసత్సమాసము మొదల, నలరించినఁ జక్రవాళ • మగు దాశార్హా. 361

తే. అవధరింపుము దేవ ది•వ్యప్రభావ, భావనాతీత నిస్తుల•[3]పరమపూత
పూతనాజైత్ర సుత్రామ•పుత్త్రమిత్ర, మిత్రశశినేత్ర నిర్జర•స్తోత్రపాత్ర. 362

చిత్రకవిత్వము.

సీ. అనులోమమును విలోమ•మును నిరోష్ఠ్యమును దళ, కట్టును గుడులు శృం•గములు నక్ష
రవిలోపమును బద•భ్రమకంబు పద్యభ్ర, మకమును నల్లెంట్లు • మఱియు నేక
పదియు ద్విపదియుఁ ద్రి•పదియును నేకవర్ణంబును ద్వ్యక్షరి • త్ర్యక్షరియును
సరవి నిచ్ఛావాక్య•సంఘట్టనంబును, నాదిగాఁ గొన్ని ప•ద్యంబు లెల్ల
తే. క్షితినిఁ జిత్రకవిత్వప్ర•సిద్ధనామ, ధేయములచేతఁ బెం పొందె • తెలివి మీఱు
[4]వానిఁ దెలియఁగ వచియింతు • వాసుదేవ, నందగోపాంగనాపుత్త్ర•నరకజైత్ర.

అనులోమము.

క. దామోదరసామతనధ, రామాంసరసాకరదళ•రథమారిరాధా
శ్రామా సదయాతిపరమ, ధామా పరయాదవకుల•దారకరాసా 364

విలోమము.

సారాకరదాలకువద, యారపమాధామరపతి•యాదసమాశ్రా
ధారారిమాధరళదరక, సారసమారాధనతమ•సారదమోదా. 365

1 యతులనిరుద్ధ (ప.ఓ.). 2 దీపనోక్తులన్ (ప.ఓ.). 3 పరమమూర్తి-(పూ.ము) ప్రకరణక్రి నియమభేదగము. 4 వాఁటె యని తాటాకుపుస్తకములన్నిటను గలదు.

## నిరోష్ఠ్యము.

క. పావన సాఘాబాభా, మానా యనునాలుబలిపులు ♦ మతి పద్యములో
భావింప దొరల కుండిన, భూవలయమున న్నిరోష్ఠ్య ♦ము పిసాళించున్. 366

క. నరహర్యక్ష దయాకర, కరిరక్షణ చక్రహస్త ♦ కాంచనచేలా
గరుడతురంగ జనార్దన, ఖరదైత్యనికృంతన హరి ♦ కంజదళాక్షా. 367

## తలకట్లు.

క. హర కలశజ తపన పవన, శరభంగ మతంగ దక్ష ♦ సత్యావాసా
స్మరపదయుగ గరుడధ్వజ, ధరధర మమ్మరయు మనఁగఁ ♦ దలకట్టులగున్. 368

## గుడులు.

క. విరివిని నిలిచిరి విని చిక్కిరి చివి నిశిఁ దిరిగిరి తిరి♦గి మిడికి భీతి
ల్లిరి చింతిల్లిరి తివిరిరి, సిరికొలకు ధనాధ్యు లనఁగ ♦ క్షితి గుడుసు లగున్. 369

## కొమ్ములు.

క. గురుఁడును శుక్రుఁడు నుగ్రుఁడు
పురుహూతుండును శుకుండు ♦ బుధుఁడును గుహుఁడున్
బురుకుత్సుండును గుత్సుఁడు
గురుసుతు లొనరించి రనఁగఁ ♦ గొమ్ములు కృష్ణా. 370

## అక్షరవిలోపము.

క. రవికన్యాసుందరకర, మవలంబన మొర్చి యుండెదె ♦ నమ్యతుఁ డని రే
నవవర్ణవిలోపముగా, నవనిం బఠియింప నలయు ♦ నార్యులు వలరన్. 371

## పదభ్రమకము.

క. ధీరానానారాధీ, ధారాకరతాతరళిత ♦ తారకరాధా
ధారాసుతతసురాధా, ధారితతరిధావ నాఁ బఁదభ్రమక మగున్. 372

## పద్యభ్రమకము.

క. రాధానాథా తరళిత, సాధకరథతానరసుత ♦ సరసనిధానా
నాధానిసరసతసురవ, తాధరకధసాతళిరత ♦ ధానాథారా. 373

## నల్లెంట్లు.

క. నారదమునిశార్దూలము, నూరిమి నజినంబు గప్పు ♦ కొని వేడుకతో
నారాయణనామమున క, న్నారత మేతెంచు ననఁగ ♦ నల్లెంటు లగున్. 374

ఏకపాది.

తే. మతివినాయకభరితసమ్మానుఁ జనంగ, మతివినాయకభరితసమ్మానుఁ జనంగ
మతివినాయకభరితసమ్మానుఁ జనంగ, మతివినాయకభరితసమ్మానుఁ జనంగ. 375

ద్విపద.

తే. సౌమ్యగురుకవుల్ నినుఁ బ్రీతి • సరసిజాక్ష
భోగిభోగాసనుం డని • [1]పొలుచు టరుదె
సౌమ్యగురుకవుల్ నినుఁ బ్రీతి • సరసిజాక్ష
భోగిభోగాసనుం డని • పొగడ ద్విపద. 376

త్రిపద.

తే. దేవమునివంద్య గోవింద • దితిజహరణ
పుండరీకాక్ష యవ్యక్త • పుణ్యపురుష
యమరసన్నుత గోపాల • హరి ముకుంద
దేవ యవ్యక్త హరియు నాఁ • ద్రిపదయయ్యె. 377

ఏకాక్షరి.

క. నానాననానున్నన, నూననునిన్న నెను నేననునున్ననిననై
నానినను నానానును, నానూన యనంగ నొంటియక్షర మయ్యెన్. 378

ద్వ్యక్షరి.

క. మునినామా మమ్మును మన్నమున నూనిన నేమమునను • మొనమానను న
న్ననుమని మనననము మన్నన, ననుమానానామునిన [2]యనన ద్వ్యర్ణమగున్. 379

త్ర్యక్షరి.

క. మానితమతితో మమతను, నీనామము నేమమునను • నేను మననమునన్
మానమున మతిమ మానను, దానక మగఁ దలఁతు ననఁగఁ • త్ర్యక్షరి యయ్యెన్

ఇచ్ఛావాక్యసంఘట్టనము.

క. తోఁటలు లె స్సై యున్నవి, తాటాదూటములు గావు • తాపసు లుండన్
బేట్లలు దామోదరుచే, గ్లాటలకు స్నైళవులు మధురాపురిచెంతన్. 38

వ. ఈపద్యమునఁ దోఁట తాట పేఁట ఆట యనుమాట లర్థవంతములుగాఁ గూర్పుటం
జేసి దీనిపేరు ఇచ్ఛావాక్యసంఘట్టనము. 381

1 పొల్చు (పూ. ము); పొగడు (Ed.). 2 'యనం ద్వ్యర్ణ్యమగున్' అని యుండవలెను. యనద్వ్యర్ణ—అనుట 'న' గురువు కాదు గనుక ఛందోభంగము.

## బంధకవిత్వము.

సీ. గోమూత్రికాఛత్ర◆గుచ్ఛకుండలినాగ, కంకణమర్దల◆ఖడ్గచక్ర
పంకజసర్వతో◆భద్రమాలాక్షరీ, త్రిముఖబంధంబు లే◆ర్పడఁగఁ జెప్ప
వృత్తము ల్బంధక◆విత్వవిశ్రుతము లై, కవులకుఁ జెవులపం◆డువులు సేయఁ
బటుతరప్రౌఢిమఁ ◆ బండితపామర, సాధారణంబుగా ◆ జగతిలోన
తే. రాధికాకేళికాలోల ◆ రమ్యశీల, భూరిగుణసాంద్ర యదుకులాం◆భోధిచంద్ర
వల్లవీమానచోర దు◆ర్వారశూర, పరమవాచాల రాజగో◆పాలబాల.

తే. మొనసి రెండుచ్చరేఖల ◆ మూలలందు
వలయు బద్ధ్యంబు నాలుగం◆ఘ్రులను వ్రాసి
చదివిరేనియు సుకవులు ◆ సమ్ముదమున
ధాత్రి గోమూత్రికాఖ్యబం◆ధంబు దనరు. 384

## గోమూత్రికాబంధము.



మాలిని. కనకనయనవైరీ ◆ కాదపాహారవాహా
వనజనయనశౌరీ ◆ వాదవాహారివాహా
వనధనదవిధిజ్ఞా ◆ పాదసంభూతగంగా
వినయనరవిధిజ్ఞా ◆ వేదసంభూతగంగా



వితరణశూరదయార్ణవ, ధృతచక్రధరవరసింహా ◆ ధృవశోధిమహా
వితరణధీరదయార్ణవ, జితవక్రపరతరగాహా ◆ జీవనదీవహా.



### ఛత్రబంధము.

క. శారదమదనకవసుధర
నారద సమసమసకాసదరమారీచా
చారీమారశరాక్షా
క్షారావరదారధనువకనదమదరశా.



### గుచ్ఛబంధము.

మాణవకవృత్తము.—

గాదిలిత్రో మాలదిగా, గాదిలకించెక బదిగా
గాదిబకృష్ణుం డదిగా, గాదిడవాచా లిదిగా.

## కుండలినాగబంధము.

క. ఇలతో నెనబదినాలుగు, నిలయంబు లగుఁ బరోరాధంనిభసిలాంగా
మెలిగొన్న పాముపలె వెల్పుపలగుక్ దలతోకనాగంబంధంబునకున్.



చ. ద్యుతిధర దేవకీతనయంతో యభవస్తుత భూరమేశ సం
మితగుణసారభూతిదయంమేయబ్జాబ్జవపూరుపావనా

శ్రితపురహారకీతదవంపావకశ స్తుతరాణకోవిదా.

## కంకణబంధము.



సేవేగోపాలం కేళిఘ్నం, గోపృద్ధ్యద్రిధ్రంకంకంభుం
శ్రీదం భూనాథం వీనార్యం, కందాభాసం నిరాగారం.

## మర్దలబంధము.



రాజాలు రాజశేయానా, లాజాలు పద్మినయానజ
పూజాలు గావశేవ తీర్థా, రాజాలు రాజసుయజ్ఞ.



క. శూరవరద రఘువరముర, మారణ చాణూరకంస•మధుపౌండ్రహరా
శారాజత్కానకాంబర, ఘోరగ్రాహారి[illegible] • గో[illegible]జారా



క. శారదరసారమణదర, పారదరజనీశకీర్తి • పావనచరితా
తారకరిపువినుతహరియ, పారదయార్ణవముకుంద • భూసజతాతా.



సుగంధి:—

కోరితీరి వారిజాక్షు • గోరఁజేరఁజేరవే
వేరుపడ్డదైత్యుబొమ్ము • వేగిలించి తెప్పఁగా
గారవించి యతనిపుత్రు • గాంచి వేడ్కఁ బ్రోవవే
చేరవేర నింగినిల్చి • వేల్పులెల్ల మ్రొక్కఁగన్.

## చక్రబంధము.

లక్షణము:—

సీ. వర్తులాకృతులుగా పదిగీతలు లిఖించి యంతరితరమధ్యమాబ్జమున
నంటంగఁ గడలెల్ల నారురేఖలు గీసి, క్రిందిసందొమ్మిదోఁ ఖండమునను
బ్రోదిపుట్టినవృత్తమే యైన మూఁడంఘ్రు లటువ్రాసి నడిమింటి నాదివర్ణ
మేది యయ్యెను నది యిసుమారు రాఁజెప్పి, మూఁట నారిటి నామములరచించి
గీ. కడలు గలయంగ నాలవ• కాలువలిక్కి, చక్రబంధస్వరూపంబు • సభ్యులెల్ల
వ్రాయఁదగుఁ గాఁ జెప్పలేరొ • వారిజాక్ష, జన్మికదనున్న గోపాల•చారుశీల

## అష్టదళపద్మబంధము.



స్రగ్ధర. రాధాసత్కారసత్రా ♦ ప్రజగతితిలకా ♦ త్రాతకృత్వా
రాధేయత్రాసికృత్త్రా ♦ ప్రవిమలసుగుణా ♦ గ్రావవర్యా ప్రధీరా
రాధీప్రర్యావనత్రా ♦ ప్రకటదనుజజి ♦ త్రాపదప్రోత్థధారా
రాధూత్థప్రోదపత్రా ♦ ప్రరుచిరహృద్భుక ♦ గ్రాసరక్త్రాసధారా

## సర్వతోభద్రబంధము

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| వం | దే | న | దా | దా | న | దే | వం |
| దే | వ | రం | వ | వ | రం | వ | దే |
| న | రం | గ | కం | కం | గ | రం | న |
| దా | ప | కం | త | త | కం | ప | దా |
| దా | ప | కం | త | త | కం | ప | దా |
| న | రం | గ | కం | కం | గ | రం | న |
| దే | వ | రం | వ | వ | రం | వ | దే |
| వం | దే | న | దా | దా | న | దే | వం |

వందేనదా దానదేవం, దేవరం వవరం వదే
నరంగకంకంగరనం, దాపకంతతకం పదా.

## మాలికాబంధము. 1



అనంత నందనందనా సనాతనా జనార్దనా
వినాటరల్పరక్షరిమ్ల్గనాగనాథనాశనా.

వ. ఇది బంధకవిత్వం బిఁక గర్భకవిత్వంబు వివరించెద. 387

గర్భ

సీ. గాంగేయకౌశేయ • ఘనకందగీతసద్గర్భచంపకమాలి • కయును వరిష్ఠ
కందపద్యద్వయ • కమలవిలసితరుగ్వతికాగర్భిత • క్రౌంచపదము
గీతమత్తేభవి • క్రీడితాకందగర్భితసీసము నట షడ్వృత్తగర్భి
తోత్పలమాలిక • యును సుకల్పితకల్పవల్లియు సీసరూ • పద్విపదయు
స్రగ్విణీగర్భభు • జంగప్రయాతంబు కందగర్భితమణి • గణనికరము
[1]కలితచతుర్విధ • కందపద్యము సప్తవిధకందమును బంచ • విధసువృత్త
తే. మాదిగాఁ గలకొన్నిప • ద్యములు పెక్కు, సరవిఁ బద్యము లిమిడి దో • షములులేక
కాన వచ్చిన నవి యెల్ల • గర్భకవిత, ధరణి నొప్పారుచీరీతిఁ • దనరి కృష్ణ. 388

కందగీతగర్భచంపకమాల.

చ. నరహరి కేశవా వనజ • నాభ రమాధవ వంశహస్త బం
ధురసుగుణాకరా దురిత • దూర జనార్దన దోర్బలాఢ్య గి
[2]ర్వరగిరిశస్తుతా మురహ • రా సురపూజితముఖ్యపాద సుం
దరపురుషాగ్రణీ భుజగ • తల్ప శచీపతిపుత్త్రరక్షణా. ...

వ. ఇది భాషాపరిచ్ఛేదములోఁ దెలుపఁబడియె.

కందద్వయకమలవిలసితరుగ్వతీగర్భక్రౌంచపదము.

ద్వారవతీనా • థా సుమదారా తరుణధవళకర • ధరనుతనామా
మారమణీధా • మా సుకుమారా మరుదధిపతిరిపు • మదగిరిశంబా
సారసనేత్రా • సత్యవిచారా శరరుహభవముఖ • సకలసురేశా
నూరమలా తే • జోజితసూరా సురవరమణినిభ • సురుచిరదేహా. 389

వ. ఇది వర్ణపరిచ్ఛేదములోఁ దెలియఁజేయఁబడియె. 390

మత్తేభవిక్రీడితాగీతకందగర్భసీసము.

వినయసంపన్నర • విప్రభూతరమణీనాథా పయోజేక్ష • ణా నరాత్త
విభయదాకార హా • విష్ణ గాయతరిపుప్రాణానిలాహీశ్వ • రా రమేశ
విలయకాలానల • విక్రమప్రథిత సాల్వగ్రావవృధ్రశ్రీవా వరేణ్య
విలయశీలా యమ • వీర కౌస్తుభధరా చక్రి యశోదాత్మజా ముకుంద
తే. కరివరద పూతనాంతక • గరుడగమన, సత్యసహిత కామజనక • శంకరసఖ
కనకవసన సుందరదేహ • వనదిశయన, సనకమునివినుతచరణ • సరసిజనయఁగ. 391

వ. ఇది పరిప్రాసపరిచ్ఛేదములోఁ దెలుపఁబడియె. 392

1 కవలు (ఓ). 2 విఖ్యాతి (ఓ). 3 ర్ధర (ప).

వాణీపద్మాంబౌరతిదరధ్వనితాళమధురగర్భోత్పలమాలికావృత్తము.

ఉ. శారదశాపితత్రిసవ • చాపవిఖండన సామసన్నుతా
తారణదాసపోషధవ • తాపసమండన ధర్మతత్పరా
వారణభాసురత్రిభవ • త్రాపకఖండన వాసవానుజా
సారద వాసుదేవ భవ • పాపవిదండన భర్గపూజితా. 393

ఇది యీపద్యపరిచ్ఛేదముతుదను దెలిపెదము.

త్రికల్పవల్లి వృ.

కరధృతకరుహాం • కరిహితకరణం, కరుహాసఖరుచిం • గరుడఖగరథమ్
ఖరసునకరవిం • ఖరతరకరగం, గరళముఖరిపుం • గరధరకరతమ్. 394

ఇది సంధిపరిచ్ఛేదములోఁ దెలిపెదము.

మఱియుఁ, గల్పితకల్పవల్లీ భాస్కరవిలసితము.

అక్షరహారివిశి • చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదు • రద్విపరక్షా, రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా
పక్షగపతిరథ • పౌంద్రవిపక్షా, భక్షితదవశిఖి • బహుసవదీక్షా
నృక్షగసహచర • ఋక్షసదృక్షా, ఋక్షపదుహితృప • ఋషిజనపక్షా. 395

గర్భప్రథమకందము.

అక్షరహారివిశిచాంబురుహాక్షా యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదురద్విపరక్షా రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా. 396

గర్భద్వితీయకందము.

పక్షగపతిరథ పౌంద్రవిపక్షా భక్షితదవశిఖి • బహుసవదీక్షా
నృక్షగసహచర ఋక్షసదృక్షా ఋక్షపదుహితృప • ఋషిజనపక్షా. 397

గర్భద్విపద.

అక్షరహారివిశి • చాంబురుహాక్ష, యక్షపసఖనుత • యదుకులదక్ష
రక్షకసురవిదు • రద్విపరక్ష, రాక్షసవిదళన • ప్రరుచిరవక్ష
పక్షగపతిరథ, • పౌంద్రవిపక్ష, భక్షితదవశిఖి • బహుసవదీక్ష
నృక్షగసహచర • ఋక్షసదృక్ష, ఋక్షపదుహితృప • ఋషిజనపక్ష. 398

లాలిపాట.

అక్షరహారివిశి • చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదు • రద్విపరక్షా, రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా. లాలి

పక్షగపతిరథ ♦ పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖి ♦ బహుసవదీక్షా
వృక్షగసహచర ♦ ఋక్షసదృక్షా, ఋక్షపదుహితృప ♦ ఋషిజనపక్షా. లాలి. 399

అక్షరహరివిక ♦ చాంబురుహాక్షా, యక్షపసఖనుత ♦ యదుకులదక్షా
రక్షకసురవిదు ♦ రద్విపరక్షా, రాక్షసవిదళన ♦ ప్రరుచిరవక్షా. [1]గౌరీకల్యాణవైభవమే.
పక్షగపతిరథ ♦ పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖి ♦ బహుసవదీక్షా
వృక్షగసహచర ♦ ఋక్షసదృక్షా, ఋక్షపదుహితృప ♦ ఋషిజనపక్షా. గౌరీకల్యాణ

ధవళము.

రక్షకసురవిదురద్విప ♦ రక్షా రాక్షసవిదళన
పక్షగపతిరథ పౌండ్రవి ♦ పక్షా భక్షితదవశిఖి
వృక్షగసహచర ఋక్షస ♦ దృక్షా ఋక్షపదుహితృప. 401

[2]సువాల.

అక్షరహరివిక ♦ చాంబురుహాక్షా, యక్షపసఖనుత ♦ యదుకులదక్షా
రక్షకసురవిదు ♦ రద్విపరక్షా, రాక్షసవిదళన ♦ ప్రరుచిరవక్షా. సువ్వీ సువ్వాలలే. ౧
పక్షగపతిరథ ♦ పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖి ♦ బహుసవదీక్షా
వృక్షగసహచర ♦ ఋక్షసదృక్షా, ఋక్షపదుహితృప ♦ ఋషిజనపక్షా. సువ్వీ సువ్వాలలే.

అర్ధచంద్రికలు.

అక్షరహరివిక ♦ చాంబురుహాక్షుఁడా. ౧
యక్షపసఖనుత ♦ యదుకులదక్షుఁడా. ౨
రక్షకసురవిదు ♦ రద్విపరక్షుఁడా. ౩
రాక్షసవిదళన ♦ ప్రరుచిరవక్షుఁడా. ౪
పక్షగపతిరథ ♦ పౌండ్రవిపక్షుఁడా. ౫
భక్షితదవశిఖి ♦ బహుసవదీక్షుఁడా. ౬
వృక్షగసహచర ♦ ఋక్షసదృక్షుఁడు. ౭
ఋక్షపదుహితృప ♦ ఋషిజనపక్షుఁడా. ౮

1 'గౌరీకల్యాణాఖ్యభావకే' అని (ఓ. ప.) అలో వ్రాసియున్నది.
2 సువ్వాలే (భూ. ము.).

### [1]కందగర్భసీసరూపద్విపద.

మకరకుండలకర్ణ • మహితాభ్రవర్ణ శకటదానవవిపక్ష • కమలజాక్ష
శుభికాలసత్ఫాల • సుయశోవిశాల యభిరమతస్నిగ్ధ యా•పీతదుగ్ధ
శ్రితదేవతరుమూల • చేదీశకాల ధృతమణిధరగదారి • తపతికథిత
నివసితవైకుంఠ • నియుతాబ్జకంఠర వికళాదశుభనేత్ర • విజయమిత్ర
తే. సతతసనకాదిసన్నుత • చతురచరిత, యాదవకుల సత్యనిరత • యచ్యుత మధు
విదళన హరిశాశ్వతకృష్ణ•విమరవరద, భవవిరించినుతా యంచు • బ్రస్తుతింప. 405

### గర్భద్విపద.

మకరకుండలకర్ణ • మహితాభ్రవర్ణ
శకటదానవవిప•క్షకమలజాక్ష
శుభికాలసత్ఫాల • సుయశోవిశాల
యభిరమతస్నిగ్ధ • యాపీతదుగ్ధ
శ్రితదేవతరుమూల • చేదీశకాల
ధృతమణిదరగదా•రితపతికథిత
నివసితవైకుంఠ • నియుతాబ్జకంఠ
రవికళాదశుభనే•త్ర విజయమిత్ర. 406

### గర్భకందము.

సతతసనకాదిసన్నుత, చతురచరిత యాదవకుల • సత్యనిరత య
చ్యుత మధువిదళన హరి శాశ్వత కృష్ణ విమరవరద భ•వవిరించినుతా. 407

### స్రగ్విణీగర్భభుజంగప్రయాతము.

నమో దాశకా వేణు • నాదప్రవీణో, ద్యమా యాశుషేణా మ•హాయావనారీ
రమాధీశ దామోద•రా దేవదేవో, త్తమా శేశమిత్రాత్మ•యింద్రానుజాతే. 408

### గర్భస్రగ్విణీవృత్తము.

దాశకా వేణునా•దప్రవీణోద్యమా
యాశుషేణామహా•యావనారీరమా
ధీశ దామోదరా • దేవదేవోత్తమా
శేశమిత్రాత్మ యిం•ద్రానుజాతే నమో. 409

1 కందగర్భద్విపదరూపసీసము (షీ). 2 శాశ్వ్త్యనుయూయి-(పూ. ము.) ఇందును యతిభంగము. 3 ఈచరణమున (ప. ఓ.) అలోనిది పాఠము ఇందును యతి భంగము.

### గర్భద్వితీయకందము.

భూమీన వరదహరి గో, భూమానవవినుత సుగుణ ♦ బుధ మధునాశా
భీమా నవకృష్ణఘనా, భామానవహరి దరి యభ♦సకమలనా శ్రీ. 419

### గర్భతృతీయకందము.

మీనవరద హరిగోభూ, మానవవినుత సుగుణబుధ ♦ మధునాశా భీ
మా నవకృష్ణఘనా భా, మానవహరిదరియభవక♦మలనా శ్రీభూ. 420

### గర్భచతుర్థకందము.

నవరద హరిగోభూమా, నవవినుత సుగుణబుధమధు♦నాశా భీమా
నవకృష్ణఘనా భామా, నవహరిదరియభవకమల♦నా శ్రీభూమీ. 421

### అష్టవిధకందము.

రెండేసిగణంబులపై, నుండినగణ మాది గాఁగ ♦ నొనరఁగఁ జదువన్
ఖండితసౌంభకఘోటకి, తాండజ యష్టవిధకంద ♦ మనఁగాఁ బరఁగున్ 422

### ప్రథమకందము.

తన కిరుగెలనను కనలుచుఁ, గొన బయి గిలిపెడుకనుగొలు♦కులఁ దగుఁ బెలుచ
న్ఘనులను గలయం బెనఁకువఁ, గనుచుం గలుములఁ దనిపెను ♦ ఖలశృంఖల పైఁ. 423

### ద్వితీయకందము.

కనలుచుఁ గొనబయి గిలిపెడు, కనుగొలుకులఁ దగుఁ బెలుచను ♦ ఘనులను గలయం
బెనఁకువఁ గనుచుం గలుములఁ, దనిపెను ఖలశృంఖల మయి ♦ తన కిరుగెలనన్.

### తృతీయకందము.

గిలిపెడుకనుగొలుకులఁ దగుఁ, బెలుచ న్ఘనులను గలయను ♦ బెనఁకువఁ గనుచున్
గలుములఁ దనిపెను ఖలశృం,ఖల మయి తన కిరుగెలనను ♦ గనలుచుఁ గొన బై

### చతుర్థకందము.

కులఁదగు బెలుచ న్ఘనులను, గలయం బెనఁకువఁ గనుచును ♦ గలుములఁ దనిపెన్
ఖలశృంఖలమయి తనకిరు, గెలనను గనలుచు గొనబయి ♦ గిలిపెడుకనుకొల్. 426

### పంచమకందము.

ఘనులను గలయం బెనఁకువఁ, గనుచుం గలుములఁ దనిపెను ♦ ఖలశృంఖల పైఁ
తన కిరుగెలనను గనలుచుఁ, గొన బయి గిలిపెడు కనుకొలు♦కులఁ దగుఁ బెలుచ-

## షష్ఠకందము.

పెనఁకువఁ గనుచుం గలుములఁ, దనిపెను ఖలశ్రృంఖలమయి ♦ తన కిరుగేలనన్
గనలుచుఁ గొనబయి గిలిపెడు,కనుగొలుకులఁ దగుఁ బెలుచను♦ఘనులనుగలయన్.

## సప్తమకందము.

కలుములఁ దనిపెను ఖలశ్రృం, ఖలమయి తన కిరుగేలనను ♦ గనలుచుఁ గొన బై
గిలిపెడుకనుకొలుకులఁ దగుఁ, బెలుచ న్ఘనులను గలయను ♦ బెనఁకువఁ గనుచున్.

## అష్టమకందము.

ఖలశ్రృంఖలమయి తన కిరు, గేలనను గనలుచుఁ గొన బయి ♦ గిలిపెడుకనుగొ
ల్కులఁ దగుఁ బెలుచ న్ఘనులను, గలయం బెనఁకువఁగనుచును♦గలుములఁదనిపెన్.

## కందద్వయనీలోత్పలమాలామణిగణనికరగర్భసరసిజవృత్తము.

శ్రీవర్ధిష్ణుం బావనజీవు ♦ న్జితభృగుతనయుని ♦ సిరి గలుగుటకై
భావింతు న్సంభావితభావుం ♦ బ్రతియుగసముదిత♦బహుతనుమహితున్
దేవేంద్రాదిప్రస్తుతదేవు ♦ న్దితితనయతుహీన♦దినకరకిరణున్
ధీవిద్యాద్యోతు న్వసుదేవు ♦ న్ధృతిమదగుణయుతుఁ ♦ దృణితవిదురదున్. 481

## గర్భప్రథమకందము.

శ్రీవర్ధిష్ణుం బావన, జీవు న్జితభృగుతనయుని ♦ సిరి గలుగుటకై
భావింతు న్సంభావిత, భావుం బ్రతియుగసముదిత♦బహుతనుమహితున్. 482

## గర్భద్వితీయకందము.

దేవేంద్రాదిప్రస్తుత,దేవు న్దితితనయతుహీన♦దినకరకిరణున్
ధీవిద్యాద్యోతు న్వసు,దేవు న్ధృతిమదగుణయుతుఁ ♦ దృణితవిదురదున్. 483

## గర్భనీలోత్పలమాల.

శ్రీవర్ధిష్ణుం బావనజీవున్ ♦ భావింతు న్సంభావితభావున్
దేవేంద్రాదిప్రస్తుతదేవున్ ♦ ధీవిద్యాద్యోతు న్వసుదేవున్ 484

## గర్భమణిగణనికరము.

జితభృగుతనయుని ♦ సిరిగలుగుటకై, ప్రతియుగసముదిత♦బహుతనుమహితున్
దితితనయతుహిన♦దినకరకిరణున్, ధృతిమదగుణయుతుఁ ♦ దృణితవిదురదున్. 485

వాణీపద్మాంబారతిదరధ్వనితాళమధురగతిగర్భోత్పలమాలికావృత్తము.

శారదశాసితప్రసవ ♦ చాపవిఖండన సామసన్నుతా
తారణదాసపోషధవ ♦ తాపసమండన ధర్మతత్పరా
వారణభాసురప్రభవ ♦ ప్రాపకభండన వాసవానుజా
పారదవాసుదేవభవ ♦ పాపవిదండన భర్గపూజితా. 436

గర్భవాణీవృత్తము.

శాసితప్రసవ ♦ చాపఖండనా ♦ సామసన్నుతా
దాసపోషధవ ♦ తాపసమండన ♦ ధర్మతత్పరా
భాసురప్రభవ ♦ ప్రాపకభండన ♦ వాసవానుజా
వాసుదేవభవ ♦ పాపవిదండన ♦ భర్గపూజితా. 437

గర్భపద్మావృత్తము.

సవచాపవిఖండన ♦ సామసన్నుతా, ధవతాపసమండన ♦ ధర్మతత్పరా
భవప్రాపకభండన ♦ వాసవానుజా, భవపాపవిదండన ♦ భర్గపూజితా. 438

గర్భాంబావృత్తము.

చాపవిఖండన ♦ సామసన్నుతా, తాపసమండన ♦ ధర్మతత్పరా
ప్రాపకభండన ♦ వాసవానుజా, పాపవిదండన ♦ భర్గపూజితా. 439

గర్భరతీవృత్తము.

ఖండనసామసన్నుతా, మండనధర్మతత్పరా
భండనవాసవానుజా, దండన భర్గపూజితా. 440

గర్భదరధ్వనితాళము.

శాసితప్రసవ ♦ దాసపోషధవ
భాసురప్రభవ ♦ వాసుదేవభవ. 441

గర్భమధురగతిరగడ.

శాసితప్రసవ ♦ చాపవిఖండన, దాసపోషధవ ♦ తాపసమండన
భాసురప్రభవ ♦ ప్రాపకభండన, వాసుదేవభవ ♦ పాపవిదండన. 442

ఆశ్వాసాంతగద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర కామెపల్లిపురమందిరనందనందనచరణా
రవిందవందనాభిలాష మనీషాప్రాభవవేంగళార్యతనూభవవిద్యావిశేషగురాచార్య
కాకునూర్యప్పకవివర్యవిరచితం బైనయాంధ్రశబ్దచింతామణి యనువ్యాకరణశాస్త్రం

బునందు మూలసూత్రంబులును, ఛందఃప్రభావంబును, ఛందోవ్యాపక[1]సంప్రదాయంబును, ఛందస్స్వరూపంబును, నితిహాసాదిస్వరూపంబును, గద్యవచనంబులును, ప్రథమప్రత్యయోద్ధారణక్రమంబును, గణజననచ్ఛందంబులును, గురులఘువర్ణనిర్ణయంబును, సర్వగణలక్ష్యంబులును, గణాధిదేవతాఫలంబులును, అష్టగణలక్ష్యంబులును, దేవతానరాంకితనియమంబులును, నాయకగణకూటంబులును, గృత్యాదిగణద్వయకూటంబులును, ప్రశస్తకూటంబులును, దోషాదోషబాహుళ్యఫలంబులును, గణద్వయయోగఫలంబులును, గణనాథయోగఫలంబులును, షట్ప్రత్యయంబులును, బద్యలక్ష్యోపయోగిసంజ్ఞలును, షడ్వింశతిచ్ఛందోజాతసమవృత్తంబులును, ముఖ్యగౌణవృత్తంబులును, మాలికావృత్తవివేకంబును, జాత్యుపజాతులును, చిత్రబంధగర్భకవిత్వంబును గలచతుర్థాశ్వాసము సంపూర్ణము.

1 సాంప్రదాయకంబును (ప).

# పంచమాశ్వాసము.



కృష్ణాపూర్వతట
ప్రాకారప్రాంతకుతల♦పరిశోభితప
త్రాకరకేతవరనగర
నాకారివిదిక్త్రియోజ♦నస్థితభవనా.

క. అవధారు శబ్దశాసనుఁ, డవనిఁ గలియుగమున కాది ♦ నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పినయం, ధ్రవచోవ్యాకరణసూత్ర♦తతిఁ దెనుఁగింతున్. 2

ఆ. ఆంధ్రసంధు లెల్ల ♦ నష్టాదశార్యల, సుకవు లౌ నటంచుఁ ♦ జోద్య మంద
ఛత్రితాద్రినాథ ♦ శబ్దానుశాసనుఁ, డవనిఁ దేటపఱిచె ♦ నతిముదమున. 3

## సంధిపరిచ్ఛేదము.

మూ. సూ. తిఙ్మధ్యశేషషష్ఠీసుప్కర్మప్రవచనీయజవిభక్తిః,
కిఞ్చిత్ప్రశంసనాద్భుతసన్తాపయదాతదాకిమేవాం శ్చ. 1
క్త్వాకిలతూష్ణీమాద్యా నభిదధతికలా ద్రుతో న యేషాం స్యాత్,
అన్యే ద్రుతప్రకృతయో యే స్యుర్హ్యనుజీవితద్రుతా నిత్యమ్. 2
సర్వత్రాప్యత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః,
లుక్సంశ్లేషౌ నాది ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు. 3
సన్ధిర్నాచో చ్యనుతో వాతో నాదిషు విభక్తిషూతో వా,
నిత్య మనుత్తమపురుషక్రియాస్వితరత్ర పరిమితౌ సమస్తనామ్. 4
న స్యాత్తద్ధర్మోత శ్చే ర్వాస్యా ద్వర్తమానవిహితస్య,
తద్వన్తద్దాదిజస్య ప్రాయ స్తు స్యాత్కిమాదిక స్యేతః. ౫
అపిశబ్దేతో లుగ్వా స్యా దిచ్ఛ విభక్త్యన్తిమస్య జే రలిచ,
శబ్దాత్తచ్ఛబ్దాతో లుగ్ధారార్థే త ఉదపి రేఫ స్స్యాత్. ౬
సామానాధికరణ్యే షూదన్తానాం టుగాగమో చి స్యాత్,

ధాతుపదసమ్భవానాం విశేషణానా ముత స్తథాను మచి.
షష్ఠ్యా ఉతో చి ను మ్నే చాద్య స్యామ్రేడితేఽ న్త్యలోప శ్చ,
అహహమాదీనాం ద్విత్వం లోపో నమ ఆదికే విసర్గ శ్చ. 8
జో రద్భుతశబ్దార్థే పో శ్చ తదాద్యర్థవాచకే షూతః,
వికృతిపదే లా టో రప్యుపధా రే శ్చా విత శ్చలు గ్వా స్యాత్ 9
పదమధ్యనరలడానా ముత శ్చ పూర్వప్రయోగసిద్ధానామ్,
లోపో వా స్యా త్తేషా మిత శ్చ తద్వ త్త్రివిక్రమమ తేన. 10
కవిభల్లటైః క్రియాణాం నామ్నా ముల్లోప ఇష్యతే హ్యేషు,
ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయోపి కథ్యన్తే. 11
ఔపవిభక్తికసంజ్ఞా వర్ణా ష్టింట్యాదయో భవ న్తీహ,
రుల్వాదే ర్నామ్నాం స్యు స్తేహి విభక్తౌ సమానే చ. 12
ప్రథమావైభక్తికమో ర్లుక్ పూర్ణో వా పతిక్రియార్థే తు,
తస్య సమానే పుంపూ ను మ్వాతో హల్యథర్వణార్యమతాత్. 13
శత్రర్థే తూత శ్చో నో స్తస్య స్యా చ్చ పూర్ణబిన్దు రపి,
వాత్త్వాన్తదో ర్ద్విరుక్తస్య స్యాల్లు గ్వాక్యా న్తగతపదానాం చ. 14
పరుషా ద్రుతప్రకృతికా త్సరళా స్స్యు స్తద్ద్రుతం చ బిన్దుస్స్యాత్,
అవికారగ తే తస్మి న్నపి సరళా ఏవ స న్తి తే పరతః. 15
లు గ్వా న ప్రకృతిపదా త్పరత స్సరళే స్థిరే చ నస్య స్యాత్,
అలుకి చ సంశ్లేష స్స్యా ద్బిన్దుం ప్రవద న్తి తం క్వచి త్కేచిత్. 16
ప్రథమలు గపి ద్వియుల్వో ర్ద్విరుక్తస్య సర్వత్ర లు క్క్రమాన్నేషు,
హేమో క్తేః పరుషాణాం గసడదవా స్స్యుః పదాద్యవర్ణే. 17
గసడదవా స్స్యుః ప్రథమామాత్రా దాత్త్వాన్తదో ర్వినా పరుషాః,
న వికృతిశబ్దా త్పరత స్సాంసృతికానాం భవ న్తి గసడదవాః. 18

ఇతి సకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాన్ధ్రశబ్దచిన్తామణౌ
సన్ధిపరిచ్ఛేద స్తృతీయః.

వ. ఈశ్లోకంబులు పదునెనిమిదియును నలువదియెనిమిదిసూత్రంబు లయ్యె నవి యెల్ల
నిందు వివరించెద.

తే. హేమచంద్ర త్రివిక్రమ♦నాము లాదిఁ
ప్రాకృతము త్రోవఁ జూపి రా♦ప్రాకృతంబు
నందు భేదంబుగావున ♦ నాంధ్రమునకుఁ
గలుగులక్షణ మెఱుఁగఁగ ♦ వలయుఁ గవులు. 5

ఆ. తెలుఁగుబాస యెంత ♦ దెలిసి యుండిన దీనిఁ, జదువకున్నఁ గవిత ♦ చక్కఁగాదు
ఇంటిలోన హేమ ♦ మెంత గల్గిన నేమి, తొడవు సేయకున్నఁ ♦ దొడుగ రాదు.

క. పదసంధులు చెడ నడికినఁ, బదపద్యము లార్యసభలఁ ♦ బఱవడి హాస్యా
స్పదము లగుఁ గాన వైకృత, పదసంధివిధములు తేట♦పఱిచెద వరుసన్. 7

క. [1]వసుధ విసంధియును మహా, విసంధియుఁ గుసంధిదోష♦విధమును దుస్సం
ధిసమాఖ్యయు నను నాల్గును, బొసఁగింపకు సంధిదోష♦ము లటంచుఁ గవుల్. 8

తే. హరి ముసలికిని అనుజుండు ♦ అర్జునునకుఁ
జెలి యనుచు నిట్లు గుఱుసున్నై ♦ శ్వంగముపయి
స్వరములకు సంధి గలుగక ♦ పొగకేని
దానిని విసంధి యండ్రు స♦త్కవులు కృష్ణ. 9

తే. సాల్వభూమివరు న్నండ♦జధ్వజుండు
ధరణిఁ గూల్చె సురల్ యద్భు♦తంబు నొంద
ననుచుఁ బొల్లులవలపల ♦ నచ్చు లున్న
జరుగును మహావిసంధిదో♦షం బనంగ. 10

తే. మగువ యొకతె సారతెలనాకు♦మడుపు లీయఁ
బొలఁతొకతె తెలసవరంబు ♦ బూని విసరఁ
దొకతె చక్రితో నెత్త ♦ మాడె ననఁ గు
సంధి యగు నిట్లు గలయని♦సంధు లదుక. 11

క. ఎంచను దుస్సంధిసమాఖ్యం దిర మగు నంచు నిందు ♦ ననుచో నందు
న్నింద న్నని వై నచ్చులు, పొందు సముచ్చయవకార♦ములు కృతి నూఁదన్. 12

తే. తొలుత విసంధిదోషచ♦తుష్టయంబు, చెంద కుండఁగఁ గావ్యము♦ల్చెప్పవలయుఁ
గానఁ జైలి యుంగ సంధిల♦క్షణము లెల్ల, విన్నవించెద గోపాల ♦ విమలశీల. 13

క. పుష్పములు ప్రథమైకో క్తికిఁ, గడఁ గూర్చిన యది విభక్తి♦కం బనఁబడుఁ బా
ల్పడి యని చెందినను గ్రొప్పదు నవిభక్తికము నామ♦మును నవఁబరఁగున్. 14

1 ఎసఁగ (పూ. ము).

క. తరు వనఁ హరుఁ డనఁ బుర మనఁ, బరగ నివి విభక్తికములు ♦ బరవు [1]పురుడు సుం
దరి దుర మనునివి యెల్లను, నరసఖ యవిభక్తికములు ♦ నామములు నగుక్. 15

ఆ. [2]వెనుక నున్న పదము ♦ కొనయక్షరంబుతోఁ, బైపదంబు మొదలి ♦ ప్రాణమునకు
సూత్రమునను సంధి♦చొప్పడకున్న న,ప్పట్ల బుధులు ప్రకృతి♦భావ మండ్రు. 16

క. తొలఁగి చనుఁ దొలఁగ కుండును, గలుగును లే కుండు నొకటఁ ♦ గా కుండును ని
చ్చలు వచ్చును రాకుండును, జెలువార వికల్ప మనుచుఁ ♦ జెప్పెడుచోటన్. 17

క. మొదలను జెప్పినవిధమున, కొదవు వికల్పంబు లేక ♦ యొక్క తెలుఁగునన్
బదపడి నిలిచినదానిని, యదుగోత్రపవిత్ర నిత్య ♦ మందురు ధీరుల్. 18

తే. పుడమిఁ దొల్లింటిరాజుల ♦ వెడల నొత్తి, వారి సెళవులఁ దా ముండు♦వైరినృపుల
పగిది మును పున్న వ్రాలను ♦ బాఱఁ దోలి, తా మచట నిల్చు నాదేశ♦నామకములు.

తే. వెండికొండను సెలకొన్న ♦ వేల్పు కేని, చెంత నత్యంతమైత్రిమైఁ ♦ జేరి యుండు
యక్షుగతి శబ్దమునఁ గల్గు♦నక్షరంబు, పొంత నుక్తాగమము పొందుఁ ♦ బూనినిల్చు.

తే. పదములను మున్ను గల వ్రాల♦ తుదినిదాము,నతికికొనినిల్చులిపులు ప్ర♦త్యయములయ్యె
మున్ను పదములఁ గలవర్ణ♦ములునిలు పక,తొలఁగి చనుట లోపం బని♦పలుకఁబడును.

## ద్రుతప్రకృతికసంజ్ఞ.

మూ. సూ. తిజ్మధ్యశేషషష్ఠీసుస్కర్మప్రవచనీయజవిభక్తిః
కిష్ఛేత్వప్రిశంసనాద్యుభతనస్తాపయదాతదాకిమేవాశ్చ.
క్త్వాకిలతూష్ణీమాద్యా నభిదధతి కలా ద్రుతోన యేషాం స్యాత్,
అన్యే ద్రుతప్రకృతయో యే స్యుర్హ్యనుజీవిత ద్రుతా నిత్యమ్. 1

క. వలసినచోఁ దుది ద్రుతములు, తలచూపెడుశబ్దములు ద్రు♦తప్రకృతు లనన్
వెలయు నవి వోడమ కుండెడు, తెలుఁగుపదంబులు కళా ప్ర♦దేశము లయ్యెన్. 22

తే. ధాత ధాతను భూపతి ♦ ధరణిపతిని
జనకు జనకుని గనియెఁ గ♦న్గొనియె ననుచుఁ
గడ ద్రుతము లిట్లు లోపము ♦ గ్గాంచి వలయు
పట్లఁ గనుపట్టునవి ద్రుత♦ప్రకృతు లేక. 23

క. వికృతిపదంబులలోపల, నకారములు వలయుచోఁ గొ♦నలఁ బొడమ ద్రుత
ప్రకృతు లసంఖ్యంబులు గొం,కక యవి యెన్నంగ నలవి♦గా దహిపతికిన్. 24

1 పురుఁడు (ఓ.). 2 వెనక (ప. ఓ.).

తే. గూను నెమ్మేను మెడ నాను◆మీను పేను,[1]ద్రానువతిచేను బులిబోను◆మఱియు నిట్లు
భువి నకారంబుతోఁగూడఁ◆బుట్టుశబ్దములు ద్రుతప్రకృతులుగావు◆మునిశరణ్య.

తే. అన్న బంగరుపొన్న చా◆య యగు తెన్న
చెన్న పులిజున్న దొరపన్న◆జొన్న యెన్న
మొదలు గా జడ్డలు నకార◆ములకుఁ దుదిని
దనరుపదములు గావు ద్రు◆తప్రకృతులు. 26

ఆ. తన్న నిన్న నన్న ◆ విన్న మున్నామిన్న, చన్న కన్న వెన్న◆శబ్దములకు
జడ్డ లుండుఁ బోవుఁ◆జర్చింప నివి ద్రుతప్రకృతు లెపుడు గావు ◆ భక్తసులభ.

## కళాప్రదేశములు.

సీ. ఇనుఁడు గోత్రము గోవు జనః లని యిబ్భంగిఁ బలికెడు ప్రథమావి◆భక్తులందు
రాముఁ గూర్చి రణోగ్ర◆భీముఁ గూర్చి యటంచుఁ బలికెడుకర్మద్వి◆తీయలందుఁ
గృష్ణునకై సురో◆చిష్ణునకై యని తోడిఁబడ నుడుగుచ◆తుర్థులందు
బలునిబట్టి మురారిఁ ◆ బట్టిండి యని పలికెడుపంచమీవిభ◆క్తితుదలందుఁ
తే. బద్మబాంధవసుతయొక్క◆భద్రయొక్క
జాంబవతియొక్క యను శేష◆షష్ఠులందు
క్షితిసముచ్చయములఁ దక్క ◆ ద్రుతము గానఁ
బడదు [2]గావున నవిపల్కఁ◆బడుఁ గళలని. 28

సీ. సుగ్రీవుఁడే వాయు◆సూనుఁడే యనుచు నేవార్థము లైలుపువ్యా◆హారములును
నటియించెనఁట పాడె◆నట కూడెనఁట యను లలితకిలార్థాను◆లాపములును
వింటిమి కంటిమి ◆ వేఁడి రటంచు నీమాడ్కిని బలుకుతి◆ఙ్మధ్యములును
గాంచి విచారించి ◆ కరుణించి యనియెడుక్త్వాప్రత్యయాంతార్థ◆వాచకములు
తే. సుఱక మిన్నక సేయక◆యెఱుఁగక యను, నట్టితూష్ణీంపదార్థవా◆క్యములు నాది
శబ్దముండుటచేతను◆జనియె సుమ్ము, కనియెఁ గద యనునవియును◆గళలుకృష్ణ. 29

తే. వచ్చుచున్నాఁడు వచ్చుచు◆న్నాఁడు వాఁడు
మనఁ గలడటన్న తిఙ్మధ్య◆మంబు లెందుఁ
గాకయును బ్రథమలలోనఁ ◆ గలసి సరసి
జాతనేత్ర కళాప్రదే◆శంబు లగును. 30

సీ. కటకటా యక్కటా ◆ కట్ట యయ్యో యని పరితాపమునఁ బల్కు ◆ భాషణములు
[3]జార బళీ మజ్జ ◆ యయ్యారె యంచుఁ బ్రశంసించునంధ్రభా◆షాపదములు

1 మానుపతిచెను (పూ. ము). 2 గావునఁ బల్కఁగా (ప); గావున నవి(ఓ).
3 ఝూరె (ప).

నిది క్రొత్త యిది వింత • యిది లెస్స యద్దిరా యోహో యనుమహాద్భు • తోదితములు
నించుక గోరంత • యిను మంత చీమంత యావంత యనుకించి • దర్థములును
తే. హరిహరాయాత్మజసఖ యిప్పు • డప్పుడెప్పు, డని యొడుయ దాతదాద్య[1] శ • బ్దాన్వయములు
నెద్ది యెయ్యెది [2]యేటడి • యేమి యనుకి, మర్థములును గళాసంజ్ఞ • లంగజపిత. 31
తే. ఇంతియే కావు తెలుఁగున • నిట్టికళలు, మధునిషూదన వెదకిన • మఱియుఁ గలవు
వీనికొనల ద్రుతంబులు • గానఁబడవు, తాపసమనోనివేశ కా • మేపలీశ. 32

## సంధివివేకము.

క. [3]వెనుకటిశబ్దమునకుఁ దుదిఁ, దనరెడువర్ణమును బైప • దమునకు మొదలం
గనుపట్టునక్షరంబును, సనకస్తుత కూర్చి పలుక • సంధి యనఁ జనుఁ. 33
క. విను ప్రాణసంధులును వ్యం, జనసంధులు ననఁగ శబ్ద • సంధులు కృతులన్
దనరారు నిరువెలంగుల, గొనకొని తద్విధము లెఱిఁగి • కూర్పఁ దగు హరీ. 34
ఆ. మీఁదిశబ్దములకు • నాదివర్ణంబులు, స్వరము లైనఁ బ్రాణ • సంధు లయ్యె
హల్లు లయ్యెనేని • వ్యంజనాక్షరసంధు, లయ్యె వానితెలుఁగు • లరయవలయు. 35
తే. [4]హల్లు లైనహల్లు లెల్లను • బుట్టి పిదపఁ, బ్రాణములఁ గూడుకొని బహు • భంగు లైన
కతన హల్లులఁ గలతల • కట్లుగుడులు, మొదలుగానిన్ని యును స్వరం • బులునిజంబు. 36
ఆ. ఎచట సంధి గలుగు • నచటఁ బూర్వపదాంత, హల్లుతోడఁ గూడి • నట్టిస్వరము
లోపముగ నొనర్చి • యాహల్లుతో మీఁది, యక్షరంబు గూర్ప • నయ్యె సంధి. 37

## స్వరసంధిలక్షణము.

క. అరయ శకంధ్వాదిషు టేః, పరరూపం వాచ్య మనుచుఁ • బ్రక్రియలోనన్
వరరుచివాక్యముకలిమిని, బరరూపమె. వికృతిఁ గానఁ • బడు స్వరసంధిన్. 38

తే. కృష్ణుఁ డవ్యయుఁ డాద్యుఁ డి • భేంద్రవరదుఁ
డీశ్వరుం డుత్తముం డూర్జి • తేష్టఫలదుఁ
డేకపదుఁ డైంద్రసఖుఁ డో • షధీశుఁ డౌర్వ
శేయనుతుఁ డన సంధులు • సెలఁగు నిట్లు. 39

## ఆంధ్రపదాదియకారమునకు

**మూ. సూ. సర్వ త్రాజ్వ త్కార్యం జ్ఞేయం యస్య ద్రుత ప్రకృతికేభ్యః.**

1 శబ్దార్థములును (పూ. ము). 2 యెదియేది (పూ. ము). 3 వెనకటి (ప. ఓ). ...ల్లు (పూ. ము)

ఉ. ఆరయ వైకృతోక్తులఁ బ♦దాదులయందు మకార ముండ దా
తీరునఁ బల్కువ్రాఁత గణు♦తింపఁగ నచ్చగు దాని డాపలన్
నీరజనాభ నాంతములు ♦ నిల్చిన నచ్చటఁ బ్రాణసంధి చె
న్నార నితండు చైద్యవసు♦ధాధిపు నేపడఁగించె నేఁ డనన్. 40

వాక్యము. నాంతము లనఁగా ద్రుతప్రకృతుల పేరు. 41

క. శృంగాంత్యవక్రయుగముల, సాంగత్యము వాను నాంధ్ర♦సంస్కృతముల నా
దిం గలుగ దట్టివ్రాఁత ధ్వరం గలయు ద్రుతాంతములను ♦ బ్రాణములట్లన్. 42

క. మంగామురుపులు నాలుగు, సంగరములు మూఁడు నేడు ♦ నొడ్డాణంబుల్
పొంగుచు నొసంగి హరి యొక, యంగనను రమించె నన ను♦దాహరణంబుల్. 43

## ద్రుతప్రకృతిస్వరసంధిలక్షణము.

మూ. సూ. లుక్సంశ్లేషౌ వాచి ద్రుతస్య సర్వత్ర లుక్సమానేషు. 3

తే. అచ్చు పరమైన నాంతప♦దాంతమునకు, సంయుతమును లోపంబును ♦ జగతి లేవు
సంయుతం బయ్యెనేని దు♦స్సంధి యగును, లోపమైన గ్రామ్యం బగు♦లోకవినుత.

ఆ. చూచె నింతి ననెడు ♦ చోటఁ జూచె న్నింతి
ననిన సంధిదోష ♦ మయ్యెఁ గృతులఁ
బొడిచె నర్కుఁ డనెడు ♦ నెడఁ బొడిచెర్కుండు
ప్రాచి ననఁగ గ్రామ్య♦భాష యయ్యె. 45

క. ధరణి ద్రుతప్రకృతులపై, స్వరపూర్వపదములు గదిసి ♦ సంధి గలయుచో
నరకాసురదమన ద్రుతా, క్షరములు లోపములు గాక ♦ కడపల నిలుచున్. 46

క. అవిభక్తికతత్సమములు, భువి నటువలె నుండు నాంధ్ర♦ములు నచ్చులపైఁ
గనబడినను బ్రకృతిభావము, లవు శృంగాంతములు దక్క ♦ నహిపతిశయనా. 47

ఆ. హరి యొసంగు మోక్ష ♦ మాచక్రి యంగన
యందు భక్తి నిలుప ♦ నబ్బు సిరులు
నిక్క మనుచు దీని ♦ మొక్కంటి యెఱుఁగును
నలువ యెఱుఁగు గట్టు♦తులువ యెఱుఁగు. 48

తే. కుత్సనత యవిభక్తిక♦తత్సమాంధ్ర, శబ్దముల రెంటికిన్మీఁద ♦ స్వరము లడుగ
శితరు కృష్ణాద్రిరా జింద్ర♦జిత్తనంగఁ, బచ్చవిలుదాలు పెక్కుఁడు♦బంట నంగ. 49

## వ్యంజనసంధి.

క. పొల్లు లగు వ్రాలకవతలి, హల్లులు ద్విత్వంబు లగుచు ♦ నను రాంతక సం
ధిల్లును వ్యంజనసంధులు, తెల్లముగాఁ దద్విధంబు ♦ తెలియఁగ వలయున్ 50

తే. ప్రాణపరుషాదిసంజ్ఞలు ♦ పలికి వాని, యం దొకకొక్కరమునకు ల♦క్ష్యములు పలికి
దాని తెలుఁగున నాసంజ్ఞ ♦ దనరునట్టి, వ్రాల కెల్లను బట్టింప♦వలయు నెందు. 51

అకారాదిసంధులు.

మూ. సూ. సంధి ర్నాచో౽చ్యసత్వః. 4

తే. పొల్లు యగుపూర్వశబ్దాంత♦హల్లుమీఁద, బరపదాద్యచ్చు నిలిచెడుఁ ♦ బ్రాణసంధి
కొమ్ముపైఁదక్క నితరస్వ♦రమ్ముమీఁద, నచ్చు గదిసిన నచట లే ♦ దాంధ్రమునకు.

సీ. కడు లెస్స యగుపట్టు♦కమ్మిపుట్టం బన జాళువాయొఱపుప♦[1]చ్చడ మనంగ
సిరియన్నఁ బురణించు ♦ చిన్నినెమ్మో మన వలదు సుమీ యింత♦వైర మనఁగ
జన్నెయావులపాల♦చవి చెప్ప రా దన శేయెండ విరహంబు ♦ శేఁపు ననఁగ
పైయొప్పు చూపట్టెఁ ♦ బైయంట వెదకినఁ గలదొ యించుక లేదొ ♦ కా ననంగ
తే. ధనమొకో యింతులకుఁ జక్కఁ♦దన మనంగ
నలినము నివాసమౌ యెల♦నాగ హరికి
దేవి యన నిపదింటి పైఁ ♦ దెలుఁగులందు
స్వరము లెదిరినఁ బ్రకృతిభా♦వంబె నిలుచు. 53

క. ఒ ప్పగుపేరిద నొప్పుల, కుప్ప ననారతము నుంచు♦కొని గోవిందుం
డెప్పుడు భోగించు ననం, దప్పక కొమ్ముపయిసంధి♦దనరు రమేశా. 54

అదంతసంధి.

మూ. సూ. వాతః. 5

తే. నెట్టన వికల్పమునఁ దల♦కట్టునకును, స్వరము పై నిల్చునప్పుడు ♦ సంధి కలుగు
హరికి బలదేవుతల్లి పె♦ద్దమ్మ యనఁగ, నల్లపాండునిసతి మేన♦యత్త యనఁగ. 55

విభక్తిసంధి.

మూ. సూ. అనాదిష్టు విభక్తిష్వాతో వా. 6

తే. ప్రథమఁ దక్కంగ నితరవి♦భక్తులందు
దుదలఁ గొమ్ములు గలవిభ♦క్తులకు షష్ఠిఁ
బలుకు కాగుడికిని విక♦ల్పంబువలన
నిల ద్రుతప్రకృతిత్వంబు ♦ గలుగుచుండు. 56

సీ. నిన్ను నే నెఱుఁగంగ ♦ నే నెంతవాఁడను న న్నేలుకొనుము ఘృ♦ణాసముద్ర
సారె నీకొఱకు నం♦జలి మోడ్చి మ్రొక్కెద నిమ్ము నాకొఱ కైహి♦కమ్ము లెల్ల

1 ఇట్టిమాటలలో 'చ్చ' కు బదులుగా 'త్స' కొన్నియెడల వ్రాతప్రతులలోఁ గనఁబడుచున్నది.

నీకు సాత్త్రితులు వాణీనాథముఖ్యులు గణుతింప శాకేడు[1]•గడయు నీవె
నిలువఁ జేయుదువు నాకు • నీయందు నతిభక్తి స్వజనులం దర్శిలి•నిజము నీకు

తే. ద్రౌపదికి నక్షయాంబర•దాన మిచ్చి, సవ్యసాచికి యోధన•జయ మొసంగి
ప్రోచుపగిదిని మమ్మునె•ప్పుడును గావుమయ్య శ్రీకృష్ణ యానఁగ•లక్ష్యంబులయ్యె.

తే. రామఁ డధికుండు తారక•బ్రహ్మ మాత్ర, తోఘనురథేను వామేటి•యనుజు లహిత
భంజను లటంచుఁ బ్రథమావి•భక్తులందు, గొమ్ములకు సంధి వచ్చు ని•త్యముగాఁగ.

తే. కూర్చి విడిచి ద్వితీయఁ బ•ల్కునవి మూఁడు
నవతలివిభక్తిఁ దెలుపువా•క్యములు నాల్గు
వలనఁ గంటె లోపల నను•వచనములును
బదివిభక్తులు లో ద్రుత•ప్రకృతు లయ్యె. 59

సీ. తాటక నొకకోల • ధరణిపైఁ గూల్చెను మొక్కలపుసుబాహు•ను ఖండించె
మౌనుల నానంద•మగ్నులఁ గావించె వారిచే నందె దీ•వనలు పెక్కు
జనకునిచేత న•ర్చనములు గావించె ఘనతతో నధ్వరా•గారమునను
వరశక్తితోడ నీ•శ్వరువిల్లువిఱిచెను నరులకంటె నమర్త్య•వరులు పొగడ

తే. వెస విదేహునివలన సు•ర్వీతనూజ
మిథిలలోపల నుద్వాహ•విధిని జెంద
ద్యుమణికులుఁ డన నివి విభ•క్తులు పదియును
ధరణి ద్రుతప్రకృతికలు ని•త్యముగ నగును. 60

భూతార్థక్రియాసంధి.

మూ. సూ. నిత్య మనుత్తమపురుషక్రియా స్వితః.

తే. వసుధ నుత్తమపురుషైక•వచనమునను
దక్క భూతక్రియాపదాం•తములఁ గల్గు
నిత్తులకు మీఁద నచ్చులు • హత్తునపుడు
నిత్యముగ సంధులు ఘటించు • దైత్యదమన. 61

తే. పుడమి సూత్రోక్త ముత్తమ•పురుషఁ మనుచుఁ
దత్పురుషఁ మొల్లఁ గొన రాదు • తద్విహీన
మున్నిటిజ ధ్యములతోడ • నెన్నకతన
నిత్యముగఁ బ్రాణసంధి దా•నికి ఘటించు. 62

1 కేఁడుగడయు (ష). 2 లోన (ష).

వనిని దీవించిరఁట మునీ • శ్వరులు నిన్ను, రవిజు నేలితివఁట నీవు • రామచంద్ర
మీరు గట్టితిరఁట కపు • లార జలధి, వింటి మీవార్త మేమన • వెలయు నిట్లు. 63

క. విరచించెను శ్రీనాథుఁడు, ధరణిని శృంగారనైష • ధంబునఁ "గూర్చుం
డిరి యొండొరు"లని కానక, పరపురుష క్రియలఁ బ్రకృతి • భావముఁ గలదే. 64

వ. నైషధంబున గుడిమీఁద విసంధిగా శ్రీనాథుఁడు చెప్పినపద్యము. 65

మ. బలభిద్వహ్నిపరేతరాజవరుణు • ల్పర్యుత్సుకత్వంబు సం
ధిలఁ గూర్చుండిరి యొండొరుం గదిసి య • ర్థిం దత్ప్రదేశంబున
న్నలనాళీకమృణాళనాళలతికా • నవ్యప్రణాళీమిళ
ల్లలనాలాపకథాసుధానుభవలీ • లాలోలచేతస్కులై. 66

క. గరుడధ్వజ ప్రథమోత్తమ పురుషైకవచనము లెల్ల • భూతార్థమునన్
ధర నగును ద్రుతప్రకృతులు, భరియించె నుపేంద్రుఁ డేను • బ్రతికితి ననఁగన్.

## వర్తమానక్రియాసంధి.

వర్తమాన త్రిపురుష • వచనములకు, జరుగుస్వరసంధు లని శబ్ద • శాసనుండు
చెప్పఁడయ్యెఁ గొమ్ములసంధి • సిద్ధమగుటఁ, బ్రథమసూత్రంబున నకానఁ • బడుటఁ జేసి.

మ. చనుచున్నాఁ డదె సీరి గోపకులు ప • జ్జం జేరుచున్నా రహో
యనుచున్నా రఘుఁడైరి నీ వరుగు కా • ర్యం బే మన న్వీరలు
న్వినుచున్నా రెలుఁగింపుఁ డెద్దియును దా • నే చెప్పుచున్నా నిఁకన్
జనులారా చోరనియ మా వ్రజము ని • చ్చ ల్నిల్పుచున్నా మనన్. 69

## భావిక్రియాసంధి.

తే. భావిపదములలో ద్రుత • ప్రకృతి గాన, నోర్వఁ గల ననుత్తమో • త్తమోక్తి దక్కఁ
దక్కనవి శృంగములు తుదిఁ • దాల్చు కతన, స్వరపరము లైన నిత్యమై • సంధిఁ జెందు.

తే. కావఁ గలఁ డచ్యుతుఁడు మెచ్చఁ • గల రమరులు
తోడరఁ గల వర్కనందను • తోడ నీవు
మెలఁగఁ గల రావణుపిఱుంద • మీరు భూమి
కాంతులార మేము నాడఁ • గల మనంగ. 71

## పరిమాణసంధి.

మూ. సూ. పరిమితౌ సమస్త్రానాహ్, 8

సీ. కనిపెడు త్రెలెడు • కమిలెడు జేనెడు మూరెడు చేతెడు • బారె డనఁగఁ
జేటెడు పుడిసెడు • చేరెడు దోసెడు గంపెడు పుటికెడు • గాదె డనఁగఁ

జెంబెడు నుత్తెడు • చెరవెడు బింబెడు పఱచెడు కంచెడు • బొసె డనఁగఁ
బారెడు చిట్టెడు • పడెడు సోలెడు తవ్వెడామానికంచెడు • తూమె డనఁగఁ

తే. దక్కె డన వీసె డన నొక్క • చిక్కె డనఁగఁ
వాటె డన మోపె డనఁ బెద్ద • వామె డనఁగఁ
బరిమితార్థంబు తుది నిల్చు • పట్ల నిట్లు
ప్రాణముల నెల్లఁ దలఁచి వ • క్రములు బలయు. 72

## తద్ధర్మార్థక క్రియాసంధి.

మూ. సూ. న స్యా త్తద్ధర్మోక్తేః. 9

తే. ఉర్విఁ దద్ధర్మమునఁ బ్రథ • మోత్తమాఖ్య, పురుషముల నేకవచనముల్ • పోవవిడిచి
కడమ పదములు తిఙ్మధ్య • కములఁ గానఁ, గొమ్ములను బ్రాణసంధులు • గూర్పఁ టొప్పు.

క. కాంతు రజప్రభృతులు నిను, సంతతమును బ్రోతు వీవు • సనకాదుల వ
ర్ధింతు రభవుండు నీవును, బంతంబుల ఖలుల ననుచు • భావింతు మెదన్. 74

క. వదలక తద్ధర్మములను, బొదలెడు ప్రథమోత్తమాఖ్య • పురుషైకవచః
పదములు ద్రుతప్రకృతు లగుఁ, బదరును నతఁ డోర్తు నేను • బలుమఱు ననఁగన్.

## వర్తమానార్థ ద్రుత ప్రకృతులు.

మూ. సూ. చో ర్వా స్యా ద్వర్తమానవిహితస్య. 10

తే. పదపదార్థ మపేక్షింపఁ • బడినయట్టి, వర్తమానార్థమున వస్తు • వర్గశృంగ
కంబుతుదిఁ గల్గుపదము వి • కల్పమున ద్రుతప్రకృతి యగుఁ గైటభ • దర్పదళన.

క. కేరుచు నొయ్యన డగ్గరఁ, జేరుచు నురుముష్టిహతికిఁ • జిక్కక వేగం
దారు చమత్కృతిఁ గ్రమ్మఱ, దూరుచ ధోక్షజుఁడు మల్లుఁ • ద్రుంచె ననంగన్.

## తేదాదులు.

మూ. సూ. తద్వత్తదాదిజస్య. 11

క. తుదిగుడుల నదుకునది యిది, పొంద లగుపదముల వికల్ప • మున స్వరసంధు
ల్పదతే య డెప్పతె చెపుమా, యది యిది యని నమ్మఁ బలుక • నన లక్ష్యంబుల్.

## కిమాదులు.

మూ. సూ. ప్రాయ స్తు స్యా త్కిమాదిక స్యైతః. 12

క. కమలాక్షు డేమి యనఁ వాక్యము పొంద లగు వానిచుదలఁ • గలగుడులను బ్రా
ణము లదుకు వికల్పంబున, హిమగిరి డేమునిడు నేమి • యిచ్చె ననఁ గనన్. 79

అపిశబ్దసంధి.

మూ. సూ. అపిశబ్దే తో లుగ్వా స్యాత్. 13

క. ఏని యనుమాటకడపలఁ, గానంబడు నిత్తుమీఁదఁ ♦ గదిసినచోటన్
బ్రాణములు సంధి గాంచును, బూని వికల్పంబువలనఁ ♦ బుణ్యచరిత్రా. 60

తే. పలుకుచెలియేని నాప్రాణ♦భర్తయేని, వనజభవుఁడేని యహికుల♦స్వామియేని
నీమహత్త్వంబు వర్ణింప ♦ నేర్చు నెట్లు, నా నుదాహరణంబులు ♦ దానవారి. 81

క్త్వా ప్రత్యయాంతార్థసంధి.

ఆ. వారిజాతనేత్ర ♦ క్త్వాప్రత్యయాంతార్థ,ములు వచింతుఁ దెలుఁగు♦పలుకులకును
నైస్వరంబు లుండు♦పట్టులఁ బ్రకృతిభా,వంబు గాని సంధి ♦ వాటపడదు. 82

ఆ. కాంచి యాలకించి ♦ యెంచి యాలోకించి
యొరసి యాడి యోడి ♦ యొరగి యెఱిఁగి
యంటి యెచ్చి యిచ్చి యని ♦ యాడుకొని యెత్తి
యెనసి యేగి యాగి ♦ యనఁగ వచ్చు. 83

ఇకారాదేశవిభక్తులు.

మూ. సూ. ఇ చ్చ విభక్త్యన్తిమస్య. 14

క. లలి నాదేశము లగునిత్తులు సమసనములను జేత ♦ తోడ వలన లో
పల ననునివి మొద లగుపలు,కులతుదిఁ దలకట్టులకు వి♦కుంఠతనూజా. 84

ఆ. కృష్ణువలనిబలిమి ♦ కేశవుతోఁడిసఖ్యంబు శకటదాన♦వారిచేతి
ప్రోవు భాగవతుల♦లోపలిగణనయు, ధవళవాహనునకుఁ ♦ దక్కఁ గలదె. 85

అల్యాదేశము.

మూ. సూ. జే రలిచ. 15

ఆ. కడవిభక్తు లైన ♦ నుడుగుల కలి యను, నాగమంబు వచ్చు ♦ నంత్యములను
సమసనమున శేష♦తాయియందలిభక్తి, వొడమునతఁడె లోక♦పూజ్యుఁ డనఁగ.

ఆదిలోపము.

మూ. సూ. శబ్దా త్తచ్ఛబ్దాదేతో లుక్. 16

తే. శబ్దముతుదను నది యను ♦ శబ్ద మదుప్ప, నప్పు డది యనుపదమున ♦ శాది నుండు
నత్వము వికల్పమున లోప♦మగును గాన, నది ప్రకృతిభావమున నుండు♦నిందిరేశ

తే. పొసఁగు లోపప్రకృతిభావ♦ములను వరుస
బాపనది కోమిటిది మంచి♦కాఁపది యన

మహిని బాపనయదియుఁ గో♦మటియదియును
గాఁపయదియును ననఁగ భ♦క్తజనవరద. 88

### ఉదాదేశరేఫాగమములు.

మూ. సూ. దారార్థే త ఉ దపి రః. 17

తే. కొనలఁ దలకట్లు గలసురో♦క్తులకు మీఁదఁ
గర్మధారయసమసన♦కల్పనమున
నా లసుత్రిలింగదేశవా♦క్యంబు గూర్ప
మహి నుదాదేశరేఫాగ♦మములు వచ్చు. 89

ఆ. బుద్ధిమంతురాలు ♦ పుణ్యాత్మురాలు దయాసమగ్రురాలు ♦ దాసురాలు
వినుతశీలురాలు ♦ ఘనురాలు గంభీరురాలు విష్ణు పెద్ద♦రాణి యనఁగ. 90

### టుగాగమము.

మూ. సూ. సామానాధికరణ్యే షూదన్తానాం టుగాగమో౽చిస్యాత్.

క. శమితాఘ కర్మధారయ, సమసనమునఁ దుదిని గొమ్ము ♦ సంధిల్లెడుశ
బ్దములు వికృతిఁ బొల్లటకారము వెట్టుక సంధిఁ జెందుఁ ♦ బ్రాణముతోడన్. 91

ఆ. అరకజంపుటడవి ♦ నలకూర్పణఖముక్కు, మెఱుఁగుటంపమొనను♦దఱిగిపై చెం
జిగురుటాకు గోటఁ♦జిదిమినచాడ్పునఁ, గఱకుటసురలులుక ♦ గ్రహపకులుఁడు.

### విశేషణాంతద్రుతాగమము.

మూ. సూ. ధాతుపదసమ్భవానాం విశేషణానా ముత న్తథాన గచి. 19

తే. క్షితిని బైపదములకు వి♦శేషణంబు, లగుక్రియాపదములతుది ♦ నమరుళ్ళంగ
ములకు వచ్చు నాగమ మయి♦పొల్లద్రుతము, ప్రాణపర మైనఁ గర్మధా♦రయమునందు.

క. అనుటయు నతండు కవ్వడి, కనుఁగొనియొడునతఁడు మాద్రి♦కడపటికొడుకొ
మెనసందునతఁడు పడమటి, వెనుసనతఁ డర్కసుతుఁడు ♦ విరథుఁ డనంగన్. 94

### షష్ఠీసమాసద్రుతాగమము.

మూ. సూ. షష్ఠ్యా ఉతో చి ను మ్వే చ. 20

తే. కొమ్ముమీఁద షష్ఠీసమా♦సమ్మునందు, న చ్చెదురఁ బొల్లద్రుత మగు ♦ నాగమంబు
కొడుకునాలు నేనుఁగునోడ♦లొడవునొఱపు, రాజునానతి ధేనువు♦నోజ యనఁగ.

### ఆమ్రేడితసంధి.

మూ. సూ. ఆద్య స్యామ్రేడితే న్త్యలోప శ్చ. 21

తే. ఒక్కమాటయె రెండుమా ♦ ల్లుచ్చరింప, దానిపే రార్యు లామ్రేడి♦తంబటం డ్రు
పృథివిఁ దత్పదములలోనఁ♦బ్రథమపదముఁ,తుదిని సంధి ఘటించు నఁ♦చ్చెదిరినపుడు.

తే. అచ్చటచ్చట [1]నాడాడి ♦ వచ్చు నొక్క
డొక్కఁ డయ్యారయారె యో♦హోహో నందు
పట్టి యనఁగ నామ్రేడిత♦పదము లందు
మొదలిపదములతుద సంధి ♦ గదియుఁ గృష్ణ. 97

## అనుకారసంధులు.

మూ. సూ. అహామూదీనాం ద్విత్వం లోపో నమ ఆదికే విసర్గస్య.

సీ. అనుకరించెడుచోట ♦ నవ్యయాదులకొనఁ గలబొట్టుగవకు దీ♦ర్ఘంబులకును
వచ్చు లోపము కేశ♦వాయ తుభ్యం నమ యనఁగ రామోఘుసం♦హర్త యనఁగఁ
బూర్ణంబులకు నోష్ఠ♦ భూతానునాసికశృంగంబు జడ్డను ♦ జెంది నిలుచు
నంబుజాక్ష తవ దా♦సోహ మ్మనంగను బొల్లులకును ద్విత్వ♦ములు ఘటించు

ఆ. బండితోత్తములు కృ♦పాసముద్రో మురజి త్తటంచుఁ జదివి ♦ చెప్ప వినుచు
నసురవైరి విడిచి ♦ యన్యదైవతములఁ, గొలుచుమూఢమతులు♦గలరె యనఁగ. 98

వ. ఇవ్వి స్వరసంధు లనంబరఁగు నింక వ్యంజనసంధు లెట్టి వనిన. 99

## అద్భుతశబ్దసంధి.

మూ. సూ. బో రద్భుతశబ్దార్థే. 23

ఆ. అద్భుతార్థవాచ♦కాంధ్రశబ్దంబున, నడిమిబ్రాఁతకొమ్ము ♦ చెడును నిలుచు
హరి ధరించెఁ గేల ♦ నబ్రంపుగిరి యనఁ, బ్రావె నబ్బురంపు♦దవ మనంగ. 100

## పుకారసంధులు.

మూ. సూ. పో శ్చ తదాద్యర్థవాచకే షూతః. 24

తే. అప్పు డెప్పుడు కప్పురం♦బిప్పు డనుచుఁ, బలుకుచో వీనినడిమిబ్రాఁ♦తలకుఁ గలుగు
కొమ్ములుండును బోవును♦గొమ్మ కప్ర, మప్డు గా కెప్డుమేనఁ బూ♦యఁ గల దనఁగ.

## లుకారసంధులు.

మూ. సూ. వికృతిపదే లో టో రపి. 25

ఆ. అవని శృంగసహిత ♦ మగుతృతీయాంతస్థమునకు డాపలించి ♦ తెనుఁగులందుఁ
గలటకారశృంగ♦ములు పోవు నుండు ని, ట్లనిరొ నిట్టు లనియొ ♦ ననఁగఁ గృష్ణ.

1 వాడాడ (పూ. ము).

రేఫసంధి.

మూ. సూ. ఉపధారే శ్చా విత శ్చ లు గ్వా స్యాత్. 26

క. కడవర్ణమునకు దాపలి, కడరేఫముగుడును లుక్కు♦గాంచును దనకున్
గుడిని [1]చకారము లుండెడు, నెడల వికల్పమునఁ బన్న♦గేశ్వరతల్పా. 103

క. పేర్చిరి పేరిచి రరిఁ బరి, మార్చిరి పరిమారిచిరి గ్ర♦మంబున ధనముల్
గూర్చిరి గూరిచి రప్పు, దీర్చిరి తీరిచిరి నాఁగఁ♦దెల్లం బర్యోక్తిన్. 104

తే. మొదల రేఫాక్షరంబు నా♦పిదప దాని
జడ్డయును గూర్చి యొకటిగాఁ♦జదువుకొనుచు
ముందు జడ్డయు వెస రేఫ♦మునకు బదులు
గిలుక విభజించియు లిఖింతు♦రిలఁ గుమతులు. 105

క. అఱఁటులఁ బఱఁటులఁ బఱిపెల, గఱిఁటెల మొఱిఁటెలను 'గలఱ♦కారము లెల్లన్
ధర నెఱసున్నలు నగు న,య్యఱఁటులఁ బఱఁటులను ద్రుతము♦లగువలసినచోన్. 106

నరలడశ్శృంగసంధులు.

మూ. సూ. పదమధ్యనరలడానా మిత శ్చ, పూర్వప్రయోగసిద్ధా
నాం లోపో వా స్యాత్. 27

క. ధరఁ బదమధ్యనరలడా, క్షరములకొమ్ములు వికల్ప♦కంబున విద్యా
ధరసన్నుత లోపము లగుఁ, బురాతనకవిప్రయోగ♦ములఁ గొన్నింటన్. 107

ఆ. కొన్ప తూర్పు తెల్ప♦గాడ్పు కొనపు తూరు,పచ్చతెలఁపు గాడు♦పనుచు నిట్లు
కొమ్ము లడఁగు నుండుఁ♦గొన్నింటఁ దొల్లింటి, వారు కావ్యములను♦వాడుకలన.

క. [2]పద మూనుదుఁ బదరుదుఁ బొద,లుదుఁ బాడుదు ననుచు నిట్లు♦లోకంబున నొ
ప్పిదము లగుకొన్ని పదములఁ, గదలవు నడికొమ్ము లాది♦కవు లాడఁబడమిన్. 109

ఆ. విసఁడు చొరఁడు తలఁడు♦విడుఁ డనుపలుకులు
చిఱుఁతబొల్లమీఁద♦జెందియునికి
సరసిజాతనేత్ర♦నరలడాక్షరముల
కొమ్ములడఁచి సంధిఁ♦గూర్ప రాదు. 110

'త్రివిక్రమమతసంధులు.

మూ. సూ. తేషా మిత శ్చ తద్వ త్త్రివిక్రమమతేన. 28

1 చకారము. (పూ. ము). 2 ముద మూనుదు (ప).

ఆ. నడిమినరలడలకు • గుడు లేగు నుండును, ధరఁ ద్రివిక్రమునిమ•తమునఁ గొన్ని
పూన్కిఁ గూర్మి కల్కి•బుడ్పి పూనికి గూరి, మసదు కలికి బుడిపి•యనుచు నిట్లు.

చ. కొలఁదిగ మున్ను చెప్పెఁ జలి•కొండన్రసింహుఁడు వెల్ల యంచు నీ
వల నగసాలరుద్ర పను•వాఁడును మొల్క లటంచుఁ గూరిచెం
దెలియక కొండ జిట్లు వికృ•తిం బదమధ్యమునన్ లకారరే
ఫలఁ దలపై యకారమును • బాపుదు రార్యులు నవ్వునట్లుగన్. 112

వ. ఇందునకు వినుకొండలోను గుంటిపల్లిభాస్కరయగారిసముఖమందుఁ గందుకూరి రు
ద్రయగారు చెప్పినపద్యము. 113

చ. వెలగకు వెల్ల యంచు సర•విం జలికొండన్రసింహుఁ డాడఁగా
మొలకకు మొల్క యంచుఁ గవి•ముఖ్యుఁడు రుద్రప పల్కె దోసమే
భళిభళి మంచిమాటయె ప్ర•బంధము నా జలరాశి యందులో
పల నెరసు ల్గ్రహింతురె య•పారము లౌ మణు లెల్ల నుండఁగన్. 114

కవిభల్లటమతసంధులు.

సూ. కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు,
ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయోపి కథ్యన్తే. 29

తే. ధాతుపదములకడపటఁ • దనరు రేఫ, శృంగములకు లోపంబులు • చెల్లుచుండు
వాల్లు పైకొన్నచోఁ గవి • భల్లటార్య, మతమున వికల్పనంబునఁ•బతగగమన. 115

తే. సర్వగతుఁ డని వారి నెన్ను•దు ర్విబుధులు
పరమపురుషుని గాఁ దలం•తురు తపసులు
[1]శ్రుతిమయుం డని చెప్పుదు • ర్యోగిమునులు
బ్రహ్మ మనుచు నెఱుంగ రే • ర్దనుజవరులు. 116

సీ. భల్లటవిరచిత•పఙ్క్తిలో సూత్రంబువలనను బైవాల్లు • నిలుచునపుడు
ప్రథమైకవచనము • ల్పలికెడుచోటను సమసనములు గూర్చు•సమయమునను
దెనుఁగునామంబుల • కొనల నుండెడునరలడలకొమ్ములు వికల్పంబువలనఁ
గాంచును లోపము•ల్గన్నానెఁ గనుమానె గోర్నాటెఁ జెక్కిట • గోరు నాటె

తే. మరుఁడు విల్లూనె విలు పూనె • మధుఁడు జాతి
ననల పీడ్కొనిరొను పీడు•కొనిరొ ననగ
సాయపాన్వయవేంకట•కృష్ణపద తీ
కోమెపల్కృగ్రహారవ•గర్వధీశ. 117

---

1 శ్రుతిమయుండని చెప్పుదు ర్యో•గులుననెలని (పూ. ము).

తే. కాంతచన్గవ చనుగవ • కార్తెఱుపులు
కొఱు మెఱుపులు వాల్గంటి • కలికి వాలు
[1]గంటి చెడ్పాటు చెడుపాటు • గాంచె ననుచుఁ
దెలుఁగు సమసనముల నిట్లు • పలుక వచ్చు. 118

తే. చట్టుఱాతికిఁ జట్రాయి • గట్టుఱేని, పట్టి యనుచోట గట్ట్రేని • పట్టి యనుచు
సమసనములట కొరశృంగములు నడఁగు, నాదిశబ్దంబు సూత్రంబు • నందుఁ గలిమి.

## ఔపవిభక్తికములు.

మూ. సూ. ఔపవిభక్తికసంజ్ఞా వర్ణాష్టింష్ట్యాదయో భవన్తి
హ్య, రల్వాదే ర్నామ్నాం స్యు స్తే హి విభక్తౌ సమాసే చ.

సీ. అవిభక్తికము లగు • నాంధ్రనామములందుఁ బ్రథమావిభక్త్యేక • భాషణముల
కొన నుండురుల్వాదు • లను బాఱఁ దోలి విభక్తులందును సమా • సోక్తులందు
నవని నాదేశంబు • లగుచుఁ డింట్యాద్యక్షరంబులు నిలుచుప • దంబు లెల్ల
నౌపవిభక్తికా • హ్వయములై కృతులను బహువిభక్తులను జూ • పట్టుచుండు

తే. నిపుడు చెప్పినరుల్వాది • లిపులు కొన్ని, యందు నాదేశములు లేక • యప్పటట్లు
సమసనవిభక్తులను రెంట • నమరె నేని, యవియు నౌపవిభక్తికా • హ్వయము లయ్యె.

సీ. రలవర్ణములశృంగ • ములకును గుడులకు డాలకొమ్ములకును • టీలు వచ్చు
నీటికి [2]బాఁకపం • డిటికిఁ దోఁడేటి కంబటికిఁ గూటికి గుడి • పాటి కనఁగ
జడ్డలు గలనలా • క్షరశృంగములకును గొన్ని మాటలకు లా • గుడుసులకును
గట్టిబొట్టులకుడి • కడ డుకారములకుఁ బూర్ణయుక్తంబులై • పొందుఁ డీలు

తే. చంటి కింటికి గొంగు • ద్దంటి కఱఁటి
పంటికిఁ దుపాకిగుంటికి • రెంటి కనఁగ
*యిఱులకుఁ డిత్తు లగునూతి • కేటిమిత్తి
కనఁగ షష్ఠిని గొన్నింటి • కమరు నిట్లు. 121

1 గంటి చేడ్పాటు చేడుపాటు • గాంచెననుచ(వ్రా. ము); రెండును ఛందోభంగములని తెలియఁజేయుచిహ్నము కలదు. 2 డాక (వ. ఓ).

* నిటులకు (వ్రా. ము); 'నూయి' శబ్దము యొక్క 'యి' కారమునకు 'తి' రాగా 'నూతికి' అగును. 'మిఱు' శబ్దము యొక్క 'ఱు' కారమునకు 'త్తి' రాగా 'ఏటిమిత్తి' అగును. కాబట్టి 'యిఱులకు' అనియుండవలయును గాని 'నిటులకు' అనుట తప్పు.

సీ. పాలేటికాలువ ♦ పందిటిగుంజ తాఁబేటినో రంబటి ♦ పిండికుండ
కాటిపాపఁడు [1]జంటి ♦ గడ్డ యింటిమగండు గొడ్డంటినరుకుడు ♦ గుంటికోవి
ముంజేతికంకణం ♦ బులు చేఁతిసారకాయ కొత్తవీరుఁడు పెద్ద ♦ గొత్తిచెక్క
నాఁపజొన్నలు కటి ♦ వేఁపపూవులదండ లలపాఁపమేతరి ♦ యంపమూలకు
తే. [2]ఇనుపపెనమునఁ బోసిన ♦ మినుపదోసె
లనుపపప్పును జొక్కంపు ♦ [3]వెనుపనేయి
యనుచు నిట్లు సమాసంబు ♦ లందుఁ గొన్ని
పలుకులను నిల్చు నాపవి ♦ భక్తికములు. 122

## అనాపవిభక్తికములు.

సీ. దూఁడ [3]పేరుబిడారు ♦ తొలకరి పుల్లరి చాలుపాలు రవాలు ♦ జగిలి మొగలి
యీఁడు జోడును గీడు ♦ వెన్ను పన్నును [4]చెన్ను కల్లు జల్లును పొల్లు ♦ గాలి జాలి
చెండు దిండును దండు ♦ చేదోయి ప్రాయి వేయి పాము [5]వేదూదేదు ♦ గేదెముట్టి
గీము తొల్లిటిబాము ♦ మోము పున్నమనోము కొమ్మిమ్ము తలదిమ్ము ♦ అొమ్ము సొమ్ము
తే. మనుము మొదలగువికృతినా ♦ మంబు లొక్క
కొన్నితుదల రుల్వాదులఁ ♦ గూడుకొనియు
లలి విభక్తులను సమాస ♦ ములను రెంట
భువి ననాపవిభక్తికం ♦ బు లగుచుండు. 123

## మువిభక్తిలోపము.

మూ. సూ. ప్రథమాద్వైభక్తికమో ర్బిందు శ్చ మహా న్వతిక్రి
యార్థేతు. 31

తే. పడియొ ననుక్రియతుది నిల్పఁ ♦ బడియెడు నెడఁ
బ్రథమ యగుమాకు సమసన ♦ పదమునందుఁ
బెలుచ నాదేశ మగుఁ బూర్ణ ♦ బిందు వదియు
లోపమును జెందును వికల్ప ♦ రూపములను. 124
క. పదఁతి ప్రియంపడియె భయం, పడియె సుఖంపడియె సంభ్ర ♦ మంపడియెఁ బదం
పడియెఁ బ్రియపడియెఁగడుభయ,పడియెరమించి సుఖపడియె ♦ భ్రమపడియె ననఁగా.
తే. భ్రాంతిపడి చింతపడి యను ♦ పట్లఁ బెద్ద
లున్న గలుగదు కొనను మా ♦ సున్న యగుట

---

1 బోటికాళ్ళ (పూ. ము; ప.). 2 లినుప (పూ. ము). 3 పెను (పూ. ము).
వెన్న (ఓ). 5 రేమా (పూ. ము).

బలము పడియె మదేభము ♦ పడియె ననిన
జెడి చనదు మూ సమాసంబు ♦ నుడుగు గామి. 126

## పువర్ణాదేశము.

మూ. సూ. తస్య సమాసే పుంపూ. 32

క. ఆదివిభక్తిము కొరము, యాదవవర కర్తృథార♦యసమాసమునన్
మేదినిపైఁ జెందుఁ బువ, ర్ణాదేశం బది సబిందు ♦ వగు వలసినచోన్. 127

తే. పడఁతి యబ్రపుటూరు ల♦బ్రంపుటూరు, లతివచోద్యపుటూరు చో♦ద్యంపుటూరు
మగువసూక్ష్మపుఁగౌను సూ♦క్ష్మంపుఁగౌను, కలికిచొక్కపు మేను చొ♦క్కంపు మేను.

## అథర్వణమతసంధులు.

మూ. సూ. సమ్యోతో హల్యథర్వణాచార్యమతాత్. 33

తే. సమసనమున నామాంతశ్రం♦గములకెల్ల, హల్లు గదియ స్వార్థంబునఁ♦ బొల్లద్రుతము
వికృతి నాగమమై ద్రుత♦ప్రకృతిపగిదిఁ, గాంచు సంధి నథర్వణ♦కవిమతమున.

క. చనుగవపైఁ జనుంగవ యనఁ, దనరుఁ దలిరుజొంపమునకుఁ ♦ దలిరుంజొంపం
బన వచ్చు ననుఁగుచెలఁదికి, ననుఁగుఁజెలది యన శ్లిష్ట ♦ మగు స్థిరపరతన్. 130

## పదమధ్యద్రుతలోపబిందాదేశములు.

మూ. సూ. శత్రర్థేతూత శ్చో నో స్తస్యస్యా చ్చ పూర్ణబిన్దురపి.

ఆ. తెలుఁగువర్తమాన♦ములపష్ఠవర్ణంబు, కొమ్ముపిఱుఁద ద్రుతము♦కొమ్మమరిన
గొమ్ము లోప మగు ద్రు♦తమ్ము పూర్ణం బగు, క్షమను గొన్నిటను వి♦కల్పమునను.

క. చనుచును బూనుచు నెన్నుచు, ననుకొన్నిటఁ దక్క నంచు ♦ ననుచును వించున్
వినుచును గనుగొంచును గను, గొనుచును దించుఁ దిను చనఁగఁ♦గూడునుగృతులన్.

తే. ధాతుపదములనడుమను ♦ దటలపిఱుఁద
వెలయుద్రుతములు స్వరసమ♦న్వితము లగుచుఁ
దొలఁగి తమచోటఁ బూర్ణబిం♦దువులు [1]నిలుచుఁ
గొన్నిటను గనుగొందుఁ జే♦కొంటి ననఁగ. 133

## ప్రథమైకవచనద్రుతప్రకృతులు.

మూ. సూ. వాత్మాస్మదో ర్ద్రుతిస్య స్యా ల్లుక్ 35

క. శ్యామాంగ నేను దా నను, నేమాటలకొనద్రుతంబు ♦ లేగు నిలుచు హ
ల్లామీఁద నుండునప్పుడు, నే మనుదును నేను మనుదు ♦ నిక్కప ననఁగన్ 134

1 నిలుపు (పూ. ము).

తే. తాను నే ననుపలుకుల ♦ లోని ద్రుతము, లడఁగుచో మీఁదఁబరుషంబు♦లసురదమన
సరళలిపు లగుఁ దద్ద్విత్వా♦క్షరము లర్థ, బిందు లగుఁ దాఁజనంగ నేఁ♦[1]బిలిచితనఁగ.

### పదాంత ద్రుతలోపము.

ము. సూ. వాక్యాన్తగతపదానాం చ. 36

క. పస గలసీసాదికముల, వసుమతి నొక్కొక్కపదము ♦ వాక్య మనంగా
నెసఁగుఁ దదంత్యపదముతుదఁ, బొసఁగునకారంబు పొల్లు♦పోవు న్నిలుచున్. 136

తే. దానవారాతికేళికో♦ద్యానసీమ, నాకభూజంబుచెంతఁ గాం♦తాలలామ
ననఘగుణధామ సత్యభా♦మను బెరిమను, గలయు నిచ్చలు ననఁగ ల♦త్యంబులయ్యె.

### పదాంత ప్రాణలోపము.

క. నాంతపదాంత ద్రుతమున, కెంతయుఁ బ్రథమాబహూక్తి ♦ కే తెంచుత్కృతీ
యాంతస్థంబునకుం బ్రద్యాంతంబున స్వరము లోప ♦ మగుఁ గొన్నింటన్. 138

క. నలినాక్ష తెలుఁగుపద్యం,బులకడపల నుండునలల ♦ పొల్లులకు మహీ
స్థలి గుడుసులు శృంగములును, నిలుపరు చదువునెడ లాక్ష♦ణికు లెచ్చోటన్ 139

### ద్రుతప్రకృతికాంతబిందుసరళాదేశము.

ము. సూ. పరుషా ద్రుతప్రకృతికా త్సరళా స్స్యు స్తద్ద్విత్వం
చ బిన్దు స్సా న్యత్. 37

సీ. ధర ద్రుతప్రకృతిశ♦బ్దంబులపైఁ బరుషంబులు [2]సెడి సర♦ళంబు లగును
ద్రుతములు ఖండబిం♦దువు లగు నాపట్ల గాధేయముని వెంటఁ ♦ గదలి నడచెఁ
జరణపంకజధూళిఁ♦జట్టు నాతిగఁ జేసె వెసఁ డొక్క మనకుండ ♦ విల్లు విఱిచె
ధాత్రీతనూభవఁ ♦ దగ వివాహం బయ్యె గురువైభవంబునఁ ♦ బురికి వచ్చె

ఆ. నినకులేంద్రుఁ డనఁగ ♦ నివి యుదాహరణంబు, లిట్టిచిన్నిసున్న♦లెల్లఁ గుఱుచ
లిపులమీఁద నుండు♦నపుడు గొప్పలు నగుఁ, గడమవ్రాలమీఁదఁ♦గావు గాని. 140

ఆ. ముంగమురవు దాలి♦చెం గాంతయన నిట్లు, గొప్పసున్న లగును♦గుఱుచమీఁద
రాజె నగ్ని గాలి♦చేఁ జాల నన నిట్లు, నిడుదమీఁదఁ గావు ♦ నిండుబొట్లు. 141

### ద్రుతప్రకృత్యంతసరళాదేశము.

ము. సూ. అవికారగతే తస్మిన్నపి సరళా ఏవ సన్తి తే పరతః. 38

సీ. అవని ద్రుతప్రకృ♦త్యంత ద్రుతంబులు చెడి బిందువులు గాని♦యెడల గాని
వలపలిపరుషము♦ల్వరుసతో సరళంబు లవుఁగాని యచట బిం♦దువులు లేవ

---

1 బిలిచితి నన (వ). 2 నిజసరళంబు (పూ. ము; ఓ.).

తండ్రిపంపునను గాం•తారంబునకు నేఁగి సమదవిరాధుని•జావ మొత్తె
నలివతోడను దేవ•టాకుటింట వసించెఁ గనకమృగంబును • దునిమివైచె

తే. భామినిని బట్టుకొనిపోవు•పఙ్క్తికంఠు
నంతకునిఁ జేర్చెఁ బుత్రమి•త్రాన్వితముగ
నగరమునకు మహీజాత•నుఁ గొనివచ్చె
రాముఁ డర్కకులాంబుధి•సోముఁ డనఁగ.

## ద్రుతప్రకృతికాంత ద్రుతలోపము.

మూ. సూ. లు గ్వా ద్రుతప్రకృతికా త్పరత స్సరళే స్థిరే చ నస్య స్యాత్. 39

సీసమాలిక. సరళంబులును స్థిరా•క్షరచయంబును ద్రుతప్రకృతిశబ్దంబుల•పైని గదియు
నపుడు తదంత ద్రు•తాక్షరంబులు వికల్పమున లోపంబు లై • పరఁగుచుండు
జనియించె గరుడకే•తనుఁడు దేవకియందుఁ బెరిగెను గోపికి • బిడ్డఁ డనఁగ
నతినుతిఁ గాంచె జం•భారిముఖ్యులచేతఁ బూతనను జయించెఁ • బురిటిలోన
ననుపమస్థితి డెంద•మున భీతి నొందక చంపెను డింభుఁ డై • శకటదైత్యు
నడఁచె దుష్టాత్ముఁ దృ•ణావర్తు మెడఁ బట్టి తిగిచి త్రెప్పలైను • దిక్కు లద్రువ
గర్గుచే బహునామ•కములు గాంచెను నెఱపెను బాలలీలలఁ • బెక్కుగతులఁ
బొడచూపె ఖేచర•భూచరావళిఁ దల్లి కౌననంబునను ఖ•గాలి మెచ్చఁ
గదలె ఘోషాంగనా•సదనంబులకు వెన్న మ్రుచ్చిలియెను గంట•మ్రోఁగ కుండఁ
జేసె ఛిద్రంబులు • క్షీరభాండంబులఁ బలికెను ఛలవాక్య•ములు వనితలఁ
బడవైచె ఝంపాప్ర•భంజనుం డన మద్దు లరిగెను ఝిల్లీర•వాటవికిని
వదలక కాచె దే•వలు మీఱఁ గ్రేపుల గోపకులను తివిఁ • గూడి మాడి
తునిమెఁ ధక్కుకుఁ జర్మ•మునకు నో యన వత్సదనుజుని ధాకతోఁ • దలక కుండ
నిర్జించె ధీరుఁ డై • నిలిచి బకాసుర నసుని ధాత్రిని గూల్చె • నద్భుతముగఁ
గల్పించె నిరజ•గర్భుండు డాచిన వలను మీఱఁగ నూత్న•వత్సములను
గ్రీడించె ఫలితశా•ఖిచ్ఛాయలను మాలిఁ జుట్టెను ఫుల్లప్ర•సూనమాల
నవలీల భంజించె • నావులఁ గాయుచు గర్దభాసురుని ధే•కరశరీరుఁ
గాళియు మర్దించి • కాళింది వెడలించెఁ ద్రావెను మండెడు•దావవహ్ని
సరసి యాదర్శకేళి • సలుపుచుండంగఁ జేకొనియెను యువతుల•కోక లెల్ల
భుజియించె రుచికరం•బుగ విప్రవనితలచేతను రాజాన్న•జాత మెలమి
రక్షించె శిఖిభ•ర్త నుతింప నెల్లర హస్తంబునను లీల • నచల మెత్తి

శరమున వరుణకిం♦కరుఁ డెత్తికొనిపోవునందుని వెదకి పం♦తమునఁ దెచ్చెఁ
దాల్చె శయాంబుజా♦తంబున వేణువు పూరించెను శిరీష♦ములు చిగుర్పఁ
బాడె షడ్జస్వర♦ప్రభవగీతంబు విరాలిఁ బెట్టెను షట్ప♦దాలకలను
జలమున సుందరీ♦జనములఁ గికురించి చనియెను సూనవృ♦ష్టములనడుమఁ

తే. గరణ హేమాంబరంబుతోఁ♦గానవచ్చి, మాన మెల్లను హరియించి ♦ మరునికేళి
వారి నెల్లను దేల్చెను ♦ వరుసకొలఁది, నన ద్రుతప్రకృతుల కుదా♦హరణము లగు.

తే. ధేనుపాల తవర్గద్వి♦తీయ మొకఁడు, మొదలియనునాసికంబులు ♦ మూఁడులిపులు
నాంధ్రసంస్కృతశబ్దాదు♦లందు లేమిఁ, జేసి వానికి లక్ష్యము ♦ లెప్ప నైతి.144

## ద్రుతప్రకృతికాంతద్రుతశ్లేషము.

మూ. సూ. అలుకి చ సంశ్లేష స్స్యాత్. 40

క. లలి సరళస్థిరములఁడా, పలినాంతపదంబు లాదిఁ♦బలికెడుచో సం
ధులు గాంచును డతవర్గం, బులు నాఁటిటెంచెంతఁ దక్కఁ ♦ బొల్లు లయి హరీ.145

క. టతవర్గంబులు రెంటను, సతతము సరళాక్షరములు ♦ సమలిపులును ని
ర్జితమురనాంతపదాంత, ద్రుతములనుం గూడుకొనవు ♦ తుదిఁ గదిసినచోన్.146

## మాలినీవృత్తము.

నలువఁ గనినవేల్పు ♦ నంధవాహాదతల్పు
న్నలకలిభయహర్త ♦ జ్జాంబవత్యాత్మభర్త
న్నలినదళసమాక్షు ♦ న్బాణదైత్యేంద్రశిక్షుం
దలఁతు నన:గ జెందుం ♦ దన్నకోరంబు లెందున్. 147

## మహాస్రగ్ధర.

నవఁత ల్పాయుం దలంతు ♦ న్ఖగపతిగమను ♦ న్ఛత్రచిత్రధ్వజాంకు
న్నవకందర్పావతారు ♦ న్ఫణిపతిశయను ♦ న్ఘస్రనాథేందునేత్రు
న్నవరత్నాంచత్కిరీటు ♦ న్ఝషపదజనకు ♦ న్భర్మవస్త్రాపిధాను
న్నవనీతక్షీరచోరు ♦ న్నతజనసులభు ♦ న్మానిహృత్పద్మవాసున్ 148

## నరకవృష్ణిణీవృత్తము.

నరకభయసంహారు ♦ న్వాదవాగ్రేసరు
న్నరకదనుజాంతకు ♦ న్నాహినీశేయానుజు
న్నరముఖసురార్చితు ♦ న్లక్ష్మణావల్లభు
న్నరహరిఁ దలంచెద ♦ న్వాంఛితార్థప్రదున్ 149

స్రగ్విణీవృత్తము.

నీరజాతేక్షణున్ • శేషసింహాసనున్, నారదాదిస్తుతున్ • నష్టవిద్వేషులన్
నారకాపద్ధరున్ • నాగరాజేంద్రావనున్, నేరహస్యంబునన్ • నప్రమద్గతుం జేసెదన్.

ద్రుతప్రకృతికాంతబింద్వాదేశము.

మూ. సూ. బిన్దుం ప్రవదన్తి తం క్వచిత్కేచిత్. 41

తే. కడుఁ దృతీయచతుర్థవ•ర్గములు గలుగు, సరళములు సమలిపులును • బరము లైన
తనికి సాంతపదాంతద్రు•తంబుపొల్లు, బెఱికి రైయి నిత్యముగఁ బూర్ణ•బిందు వగును.

క. నన్నయమాత్రమునఁ గ్వచి, త్తన్న దొకటిఁ దక్క బొల్లు • కక్షరనియమం
బెన్నుట లే దాదికవుల్, గొన్ని తెలుఁగు లరసి తెలిసి•కొంటిని వీనిన్. 152

అవి యెయ్యవి యనినఁ దృతీయవర్గసరళంబునకు రాచమల్లువారిషట్స్కంధములోను ప్రయోగము చతుర్థవర్గసరళంబునకు రాఘవపాండవీయములోను భారతార్థము నందు పింగళిసూరపరాజు ప్రయోగము టవర్గద్వితీయమునకు త్రిశంకవోపాఖ్యానములోను కవిసింగరన్న ప్రయోగము. 153

క. డుంఠిశు భైరవుని సితి, కంతు విశాలాక్షి దండ•కరు జాహ్నవి వై
కుంఠపతి గుహుని లోలా,ర్కుం శేవలు మీఱ భూవ•రుఁడు పొడగనియెన్. 154

టవర్గచతుర్థంబునకు అథర్వణాచార్యులవిరాటపర్వమునందు:—

తే. ఢాంఢమితభేరికాధ్వాన•[1]మ్ముఁ ఢులీని, నాదమును మిన్ను ముట్ట న•నారతంబు
పెక్కుగంధర్వపతులు న•ల్దిక్కులందుఁ, గాచు సౌగంధికంబుఁ దేఁ•గలరె యొరులు.

తవర్గంబునందు ద్వితీయవర్ణము సంస్కృతాంధ్రశబ్దాదులందు లేదుగానఁ బ్రయోగంబు గలుగ నేరదు చతుర్థాక్షరంబునకు అనంతునిఛందము నందు:—

తే. పేర్చి పొల్లనకారంబు • బిందు వగుచు
మీఁద నున్నధకారంబు • నూఁది ప్రాస
బంధ మగుఁ గృష్ణుఁ డుదయించి•నం ధరిత్రి
యంతయును నిరుపద్రవం • బయ్యె ననఁగ. 156

క. ముందర్థ గజబమకారము, లొందిన సాంతములతుదల • నుండు ద్రుతములం
గ్రందుకొని వికల్పంబున, బిందువులుగఁ జేసి కృతులఁ • బెట్టుదు రొకచోన్.

సీ. అంగజకేళిఁ దే•ల్చెం గోపకాంతల నగము హస్తంబున • నగిమఁ దాల్చెఁ
[2]గుంజి భోజధరావ•రుం జముకడఁ జేర్చె నరుఁ బ్రోచె రణమున • నగ మెఱుంగ

1 ఢాంఢు వీని (పూ. ము.). 2 గెఁజి (పూ. ము.); గ్రుంజి (షీ.).

జాంబవంతుని గెలి♦చెం బంటుతనమున నతికేఁ జక్రంబున ♦ న్బాణుపాణు
లమ్మకుఁడలము లి♦చ్చెం మహీసుతుఁ జంపి నాఁటె భూతలమున ♦ న్నఘవతరువు
తే. దైవమాత్రంబె దేవకీ♦దేవిపట్టి, దేవదేవుఁడు శ్రీవాసు♦దేవుఁ డనఁగ
గజబమంబుల డాపలఁ ♦ గదియునట్టి, నాంతపదముల కెల్ల ల♦క్ష్యంబు లయ్యె. 158

## నమస్కారద్విత్వమైత్రము.

తే. తమకుఁ దాము ద్విత్వంబులై ♦ యమరునవియు
బిందువులు డాపలను వెలు♦గొందు నవియు
నొక్కరూ పయి పూర్వప్ర♦యోగసరణి
నములు ప్రాసంబులకు నిల్చుఁ ♦ దమకుఁ దాము. 159

క. మిన్నేఱు పాదమున ధా♦త న్నాభిని గుసుమశరు నె♦దం గాంచిననీ
సాన్నిధ్యము దొరకుటకై, సన్నుతి సేయుదురు నిన్ను ♦ సనకాదు లజా. 160

క. తమ్ములను మల్లికాకుసు,మమ్ముల మరువాదిపత్ర♦మాలికలను భ
క్తిమ్మురసంహారపూజలు, సమ్మదమున సలుపఁ గలుగు ♦ సకలార్థంబుల్ 161

## పదాంతనులుకారద్విత్వలోపములు.

### మూ. సూ. ప్రథమ లుగపి ద్విసుల్వోః. 42

క. సమయును వికల్పకంబున, శమితదనుజ తమకుఁ దాము ♦ జడ్డ లయి పదాం
తముల వెలింగెడినులువర్ణములను ప్రథమాక్షరములు ♦ రాజీవాక్షా. 162

తే. కన్ను మూసెను గను మూసెఁ ♦ జన్నదోయి
గబ్బిచనుదోయి మిన్నువాఁ♦క మినువాఁక
ముల్లు నాఁటెను ములు నాఁటెఁ ♦ బల్లుగంటి
తరుణి పలుగంటి కల్లుముం♦త కలుముంత. 163

## ద్రుతలోపసమాసములు.

### మూ. సూ. ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు. 43

తే. వనధితనయేశ యయినటు♦వంటి యనుచుఁ
బరపదవిశేషణము తేట♦పఱుచుకొనుచుఁ
దొలుతటిపదంబుకొన నుండు♦ ద్రుతము గూడియు
సమసనమునందుఁ జెందు లో♦పములు కృతులఁ. 164

క. కడపలి ద్రుతమును గూడియును, బోడ వడఁగినఁ బయిని బరుష♦ములు సరళము లౌఁ
జెడవు పెఱవాల్లు లెల్లను, సడలక స్థానఁబు లెల్ల ♦ సంధులు గాచుణ్. 165

తే. జగతిఁ జప్పనికూరకుఁ ♦ జప్పగూర, చనును జక్కనిచాయకుఁ ♦ జక్కజాయ
హెచ్చు[1]పచ్చనిటోపికిఁ ♦ బచ్చడోఁపి, గరిమఁ గమ్మనితావికిఁ ♦ గమ్మదావి. 166
ఆ. చల్లగాలి తీయ ♦ విల్లు నా సరళస్థి, రాక్షరములు తొల్లి ♦ టట్ల నిలుచుఁ
బంచబాణజనక ♦ పచ్చావు నల్లావు, లనుచు నచ్చు లెల్ల ♦ నదుకు నిట్లు. 167

## హేమాచార్యమతసంధులు.

మూ. సూ. హేమోక్తేః పరుషాణాం గసడదవాః స్యుః పదాత్ ద్వంద్వే. 44

క. సుమనఃస్తుత ద్వంద్వసమాసమునను హేమోక్తిని బర♦శబ్దాదిమవ
ర్ణము లగుపరుషాక్షరములు, తమరూపులు విడిచి గసడ♦దవ లగు వరుసన్. 168
ఆ. కసవుగట్టెలనఁగఁ ♦ గాలుసేతు లనంగ, నిక్కు డెక్కు లితఁడు ♦ నేరఁ డనఁగ
నొప్పుదప్పు లనఁగ ♦ నూరువల్లె లనంగ, జరుగు నిట్లు ద్వంద్వ♦సమసనమున. 169

## ప్రథమాంతగసడదవాదేశము.

మూ. సూ. గసడదవాః స్యుః ప్రథమామాత్రా దాత్మ్యాన్యదో ర్విపాపరుషాః. 45

సీ. శుకమునిస్తుత ద్రుత♦ప్రకృతు లౌ నేను దా నను రెండు దక్కంగ♦నవనిఁ గలుగు
ప్రథమావిభక్తుల ♦ పైని దత్తుల్యశబ్దములమీఁదను గను♦పట్టు నాంధ్ర
శబ్దాదిగతపరు♦షంబు లేనింటికిఁ గ్రమము దప్పక వచ్చు ♦ గసడదవలు
సిరి గలిగిననాఁడు ♦ పురుషుండు సెలరేఁగి నిక్కంబు డెక్కలు ♦ నెరపుఁ గాని
తే. ప్రియము దళు కొత్త నర్థికిఁ ♦ బెట్ట లేఁడు
కలిమి వోయిన నీగికిఁ ♦ గాంక్ష సేయు
నపుడు గలుగునె తనకుఁ గా ♦ సైన ననఁగ
నివి యుదాహరణము లయ్యె ♦ నెన్ని చూడ. 170

మూ. సూ. న వికృతిశబ్దా త్పరత స్సంస్కృతికానాం భవన్తి గసడదవాః. 46

సీ. పరమాత్మ ప్రథమావి♦భక్తులమీఁదను దత్సమానాంధ్ర శ♦బ్దములమీఁదఁ
గలసంస్కృతపదాది♦గతపరుషంబు లెల్లెడ నిజరూపము ♦ లేడక నిలుచు
గాదిలిజవరాలు ♦ కమలనివాసిని చిఱుతముద్దులపట్టి ♦ చిత్తజాతుఁ
డనుఁగుఁజుట్టంబు టం♦కాయుధమూస్తుండు మక్కువమఱఁది తా♦మరసపైరి

1 పచ్చనితోఁటకుఁ బచ్చదోఁట (పూ. ము); పచ్చనిటోఁపికిఁబచ్చడోఁపి (పే); పచ్చనిపోటికిఁ బచ్చబోటి (ప).

తే. నిక్కమర్మిలి మాము పా♦నీయరాశి, యరసి చూడంగ నెవ్వని ♦ కట్టివేల్పు
నాఁడు కరుణించి నాకు స్వ♦ప్నమున వచ్చి, తెనుఁగు గావింపు మనియెను♦దీనిననఁగ

కల్పితకల్పవల్లీసమానలక్షణసీసమాలిక.

[1]పంచదశవిధాంధ్ర♦పద్యగర్భితములై కరధృతకరుహాము♦ఖ్యంబు లగుచుఁ
బరఁగు ద్వితీయవి♦భక్త్యేకవచనాంతసంస్కృతభాషాష్ట♦సమసనములు
వాని కధ్యాహార్య ♦ మై నౌమి యనుధాతుపదము పైకొనునభి♦ప్రాయములకు
సమసనాంతస్థితా♦క్షరములపైఁ గలతలకట్టులను శృంగ♦ములు ఘటించి
బొట్టులవలపలఁ ♦ బొదలునగ్గాద్యక్షరము లెల్లఁ దత్సర♦ళములు చేసి
యాదివర్గద్వితీ♦యములదాపల నుండుపూర్ణంబులకుఁ బద్య♦ములకుఁ దుదిని
దనరుసున్నలును బో♦ల్లనకారములఁ జేసి పఠియింప నగునాంధ్ర♦పద్యవితతి
తరవాతఁ గందప♦ద్యముతోడఁ గులకమై తలచూపు దానికి ♦ ధాతుపదము
మదనవిలసితయు♦గ్మం బయ్యెఁ బదపదంబునకు సప్తాక్షరం♦బులుగఁ జదువ
నిపుడు చెప్పినవృత్త♦మే యంగవిధులచే మధుమతివృత్తనా♦మంబు గాంచుఁ
బాదపాదమునకుఁ ♦ బగునాల్గువర్ణము ల్గావింపఁ బ్రహరణ♦కలిత మయ్యెఁ
దొలుతటిసమసనం♦బుల ద్రుతప్రకృతులై పై నొక్కసమసన♦పదముఁ గూడి
[2]పంచదశాక్షరో♦దంచితపదములై మణిగణనికరస♦మాఖ్యఁ జెందు
నష్టమాత్రావృత్త♦యమళ మయ్యె ద్రుతాంతసమసనం బొక్కొక్క♦చరణమైన
నాంతసమాసద్వ♦యం బొక్కపాదమై రగడలలో మధు♦రగతియు నగుఁ
దలపోయ నిటుల వ్య♦త్యయలేఖనక్రమవిధులు షోడశలఘు♦వృత్త మం ద్రు
ద్విపదపాదం బయ్యె ♦ దీనికిఁ గడపలఁ జూపట్టు ద్రుత మర♦సున్నయైన
వెస ద్రుతాంతంబులై ♦ నసమాసములు నాల్గు హరిగతి కేకాంఘ్రి ♦ యై తనర్చు
వేమఱు కడపల ♦ వెలయు సమాసంబు మొదలుగాఁ దుదయును♦మొదలు గలయఁ
జదువువేళఁ దృతీయ♦సప్తమసమసనచరమబిందులు ద్రుతా♦క్షరములైనఁ
గనుపట్టు నెనిమిది ♦ కందపద్యంబులు గణయతిప్రాసము ♦ ల్కడమ గాక

తే. నిట్టిగర్భకవిత్వంబు ♦ లెఱిఁగి నీకుఁ, గవిత రచియించు వానిభా♦గ్యంబు వొగడ
నమరనేతకు ధాతకు ♦ నైనఁ దర మె, [3]సహ్యాభూ(జా)దక్షిణైకయో♦జననివేశ. 172

అవతారిక.

అథేదానీం కౌకునూర్యప్పకవివర్యః పంచదశాన్ధ్రపద్యగర్భితాష్టసమాసాక్ష
ప్రహారణకలితవృత్తేన సంగృహ్ణాతి.

1 పంచాదశ (ఓ. ప; పూ. ము). 2 పంచాశద (పూ. ము). 8 సహ్యామా (పూ. ము).

కరధృతకరుహం ♦ కరిహితకరణం, కరుహసఖరుచిం ♦ గరుడఖగరథమ్
ఖరసునకరవిం ♦ ఖరతరకరగం, గరళముఖరిపుం ♦ గరధరకరతమ్. 178

టీక. బాలానాం మందబుద్ధీనాం సుఖావబోధార్థ మేత ద్దష్టసమాసాంతర్గత శబ్దానాం క్రమే ణార్థం దర్శయతి ప్రపంచయతి-కరధృతకరుహం కం జలం కం శిరోఽంబునో రితి నానార్థాభిధానాత్-కే జలే రుహతి ప్రాదుర్భవతీతి - కరుహ మబ్జం శంఖ మితి యావత్-రుహబీజచర్మణః ప్రాదుర్భావ ఇతి ధాతుః కరో హస్తః బలిహస్తాంశవః కరా ఇత్యమరః-కరేణ ధృతం కరుహం శంఖం యేన తం కరధృతకరుహం శంఖ ధారిణ మిత్యర్థః యద్వా కరేణ హస్తేన ధృతం కరుహ మంబుజం యేన తం కరధృతక రుహం పద్మస్యాంభోరుహత్వేన కరుహత్వస్య వక్తుం శక్యత్వాత్ తథాచ హస్తధృ తాంభోరుహ మిత్యర్థః శంఖచక్రగదాపద్మధారిణం వనమాలిన మితి ధ్యానాత్త ర ప్రసిద్ధేః. 1

కరిహితకరణం కరో హస్తో స్యాస్తీతి కరీ మతంగజః కుంజరో వారణః కరీత్యమరః-కరిణో హితం మోక్షణం కరిహితం-కరిహితే కరణః సాధనభూతః-తం కరిహితకరణం- అత్ర కరణాధికరణయో రితి కరణార్థే ల్యుట్ నచాస్య ల్యు డన్తస్య పుంస్త్వం శంకనీయం నారాయణ ఇత్యాదౌ పుంస్త్వస్యాపి ప్రసిద్ధేః వి శిష్యం లోకాశ్రయత్వా ల్లింగస్యేతి జనపదాదిషు పూర్వై రభిహితత్వాత్ పురా కిల పాండ్యరా డిన్ద్రద్యుమ్నాఖ్యో రాజర్షి రగస్త్యశాపవశా ద్గజేన్ద్రతా మా పన్న స్సన్ కదాచి త్తృష్ణావశా ద్దుగ్ధోదధిమధ్యత్రికూటచలాగ్ర వారుణోద్యానాం తరసరోవరం సమాగత్య దేవలశాపాగతగ్రాహరూపిణా హూహూగంధర్వేణ గ్రస్తః ప్రాక్తన జన్మ తపోవిశేష విజ్ఞానసంపన్న స్సన్ పరమేశ్వర ముద్దిశ్య స్తోత్రం చకార వైకుంఠభవనస్థో వాసుదేవ స్తత్సమీపం ప్రాప్య మోక్షయామా సేతి సుప్రసిద్ధం భాగవతే. 2

కరుహసఖరుచిం కేజలే రుహన్తి కరుహాణ్యమ్భోజాని కరుహాణ్యంభోజాని కరుహాణాం నీరజానాం సఖా హితః కరుహసఖ స్సూర్యః అత్ర రాజాహ స్సఖిభ్య ష్టజితి టచ్ప్రత్యయః కరుహసఖస్య సూర్యస్య రుచి రివరుచి ర్యస్య తం కించ యథా భాస్వాన్ తమో నివర్తయన్ లోకం దీపయత్యేవం విష్ణు రప్యజ్ఞానరూపతమో నివర్తయన్ లోక దీపకత్వా త్తస్య భాస్కర తేజోవత్త్వం యుక్తం యద్వా కరుహా ణ్యుత్పలాని తేషా మపి జలరుహత్వస్య వక్తుం శక్యత్వాత్ కరుహాణా ముత్పలానాం సఖా హితః కరుహసఖ శ్చంద్రః కరుహసఖస్య భూషణమయచన్ద్రస్య రుచి ర్యస్య తం బాలభావే హరిణార్థ చన్ద్రకారణభూషణధారణస్య కర్ణామృతే షూక్తత్వాత్ యద్వా 'సూర్యకోటి

ప్రతీకాశం చన్ద్రకోటిసమప్రభ' మితి పద్మపురాణే భగవద్ధ్యానాంతరస్య సత్వా చ్చ అస్మిన్పక్షే కరుహాస ఖేత్యత్ర బహువచనతయా సమాసో జ్ఞేయః బహుత్వస్య త్రిత్వాదిసాధారణత్వాత్ అథవా కరుహాః ఇన్దీవరాణి తేషాం సఖా హృదయ భూతా తుల్యరూపిణీత్యర్థః-తాదృశీ రుచి ర్యస్య తం శైత్యం హి యత్నా ప్రకృతే శ్జల స్యేత్యాదివ ద్భిన్నలింగానా మపి విశేషణవిశేష్య భావ స్సమ్భవ్యతే. 3

గరుడ ఖగరథం-గరుడో గరుత్మాన్-గరుత్మా న్గరుడ స్తార్క్ష్య ఇత్యమరః గరుడ ఇతి ఖగః పక్షీ గరుడఖగః గరుడఖగ ఏవ రథో వాహనం యస్య తం యద్వా ఖేగ చ్ఛన్తి చర న్తీతి ఖగా ఇతి వ్యుత్పత్త్యా ఖగశబ్దస్య దేవతావాచకత్వస్యాపి వక్తుం శక్యత్వాత్ గరుడఖగో గరుడదేవః స ఏవ రథో యస్య తం అథవా గరుడ ఏవ ఖగరథో వ్యోమసంచారణపటూ రథో యస్య తం కించ-ఖగ స్సూర్యః శరార్క-విహాగాః ఖగా ఇత్యమరః సూర్యశబ్దస్య శ్రేష్ఠవాచకత్వస్యాపి వక్తుంశక్యత్వాత్ గరుడానాంపక్షిణాంశ్రేష్ఠః గరుడఖగః స ఏవ రథో యస్య తం.

ఖరఘనకరవిం-ఖరః ఖరాసురః ధేనుకవనవాసీగర్దభాసురః-అథవాదండకారణ్యనివాసో రావణజ్ఞాతిః ఖరాసురః స ఏవ ఘనః మేఘః ఘనజీమూతముదిరా ఇత్యమరః కః వాయుః మారుతే వేధసి బ్రధ్నే పుంసి క ఇత్యమరః కానాం వాయూనాం రవిః శ్రేష్ఠ శ్చణ్డమారుత ఇతి యావత్ ఖరఘనస్య కరవిః తం ఖరసమానఖరాసురస్య ప్రశయవాయుస్వరూపః అస్మిన్ పక్షే భాగవతరామాయణప్రసిద్ధి ర్ద్రష్టవ్యా. 5

ఖరతరకరగం ఖరతరా స్తీక్ష్ణతరాః తిగ్మం తీక్ష్ణం ఖరం తద్వదిత్యమరః, కరా అంశవో యస్య సః ఖరతరకర స్సూర్యః తంగచ్ఛతీతి ఖరతరకరగః తం ధ్యేయ స్సదాసవితృమణ్డలమధ్యవర్తీతి ధ్యానశ్లోకప్రసిద్ధత్వాత్ యద్వా ఖరతరో దుర్ధరః కరో యస్య సః ఖరతరకరః కుంజరః స ఇవ గచ్ఛతీతి ఖరతరకరగః తం మత్తమాతంగవిక్రమమితి రామాయణే బాలకాండ వాల్మీకివచనప్రసిద్ధేః - నచాత్ర విక్రమపదస్య పరాక్రమార్థపరతాశ్రయణీయా తద్వ్యాఖ్యానే తత్పదస్య క్రము పాదవిక్షేపణ ఇత్యస్మాద్ధాతో ర్గమనార్థకత్వ స్యోక్తత్వాత్.

గరళముఖరిపుం గరళం విషం ముఖే యస్య సః గరళముఖః కాళియః తస్య రిపుః శత్రుః తం కాళియమర్దన మిత్యర్థః అత్ర భగవాన్ యమునాహ్రాదస్థం కాళియాఖ్యం మహోరగం శిక్షితవా నితి పూర్వభాగవతప్రసిద్ధేః. 7

గరధరకరతం ధరతీతిధరః డుధాఞ్ ధారణపోషయో రితిధాతుః గరస్య కాలకూటస్య ధరో గరధరస్సదాశివః స ఏవ గరధరకః స్వార్థేక ప్రత్యయః తస్మిన్రతః

శ్రీతిమంతం నారాయణప్రియ మనంగమదాపహార మితి స్తోత్రాత్ యద్వా కశబ్ద స్య బ్రహ్మవాచకత్వాత్ గరధరశ్చకశ్చ గరధరకౌ తయోః రతం శ్రీతిమంతం య ద్యపి నారాయణస్య సర్వసమత్వ మేవ వక్తవ్యం తథాచ లౌకికసామ్యా త్పురాణ ప్రసిద్ధేశ్చ తద్వ దుక్తి రితి జ్ఞేయమ్ అత్ర నామిత్యాధ్యాహారేణ తథావిధం గో పాలం నామీత్యర్థః యద్వా గరధరకరక మిత్యత్ర గరేతి ధరేతి కరత మితి పద త్రయం ద్రష్టవ్యం తథాచ హేగర విష స్వరూపపాపిష్ఠేతి యావత్ కే బ్రహ్మణి రతం శ్రీతిమంతం పూర్వోక్తవిధం దేవం ధర హృది ధ్యాయస్వే త్యర్థః అత్ర కృ ష్ణస్య గరుడఖగరథ మితి విశేషణద్వయసామర్థ్యా త్తద్భజనేనాస్య పాపనోధో భవిష్యతీతి తథోక్తిరితి జ్ఞేయమ్. 8

వ. సప్తాక్షరైకపాదం బైన గర్భమదనవిలసితవృత్తద్వయము.

కరధృతకరుహలుఁ, గరిహితకరణుఁ, గరుహాసఖరుచిఁ, గరుడఖగరథుఁ. 176

గర్భద్వితీయమదనవిలసితవృత్తము.

ఖరఘనకరవిన్, ఖరతరకరగున్, గరళముఖరిపున్, గరధరకరతున్. 177

వ. కొందఱీరెండువృత్తములు మధుమతీవృత్త మందురు.

చతుర్దశాక్షరైకపాదం బైనగర్భప్రహరణకలితవృత్తము.

కరధృతకరుహలుఁ, గరిహితకరణుఁ, గరుహాసఖరుచిఁ, గరుడఖగరథుఁ
కరఘనకరవిఁ, ఖరతరకరగుఁ, గరళముఖరిపుఁ, గరధరకరతుఁ. 178

పంచదశాక్షరైకపాదం బైనగర్భమణిగణనికరవృత్తము.

కరధృతకరుహలుని, గరిహితకరణుఁ, గరుహాసఖరుచిని, గరుడఖగరథుఁ
ఖరఘనకరవిని, ఖరతరకరగుఁ, గరళముఖరిపుని, గరుడఖగరథుఁ. 179

అష్టాక్షరైకపాదం బైనయష్టమాత్రావృత్తద్వయము.

కరధృతకరుహలుని, గరిహితకరణుని, గరుహాసఖరుచిని, గరుడఖగరథుని. 180

గర్భద్వితీయాష్టమాత్రావృత్తము.

ఖరఘనకరవిని, ఖరతరకరగుని, గరళముఖరిపుని, గరధరకరతుని. 181

షోడశాక్షరైకపాదం బైనగర్భమధురగతిరగడ.

కరధృతకరుహలుని, గరిహితకరణుని, గరుహాసఖరుచిని, గరుడఖగరథుని
ఖరఘనకరవిని, ఖరతరకరగుని, గరళముఖరిపుని, గరధరకరతుని. 182

వ. కొందఱు దీనిని షోడశకలఘువృత్తము నందురు.

## పంచమాశ్వాసము.

### పంచదశాష్టైకపాదం బైనగర్భద్విపదము.

కరధృతకరుహుని, గరిహితకరణుఁ, గరుహాసఖరుచిని, గరుడఖగరథుఁ
ఖరఘనకరవిని, ఖరతరకరగుఁ, గరళిముఖరిపుని, గరధరకరతుఁ. 183

### ద్వాత్రింశదశాష్టైకపాదం బైనగర్భహరిణగతిరగడ.

కరధృతకరహుని ♦ గరిహితకరణుని, గరుహాసఖరుచిని ♦ గరుడఖగరథుఁ
ఖరఘనకరవిఁ ♦ ఖరతరకరగుఁ ♦ గరళిముఖరిపుని ♦ గరధరకరతుఁ. 184

### గర్భప్రథమకందము.

కరధృతకరుహుఁ గరిహిత, కరణుఁ గరుహాసఖరుచిని♦గరుడఖగరథుఁ
ఖరఘనకరవిఁ ఖరతర, కరతుఁ గరళిముఖరిపుని♦గరధరకరతుఁ. 185

### గర్భద్వితీయకందము.

గరధరకరతుఁ గరధృత, కరుహుఁ గరిహితకరణుని ♦ గరుహాసఖరుచిఁ
గరుడఖగరథుని ఖరఘన, కరవిఁ ఖరతరకరగుని ♦ గరళిముఖరిపుఁ. 186

### గర్భతృతీయకందము.

గరళిముఖరిపున్ గరధర, కరతుఁ గరధృతకరుహుని ♦ గరిహితకరణున్
గరుహాసఖరుచిఁ గరుడఖ, గరథుఁ ఖరఘనకరవిని ♦ ఖరతరకరగుఁ. 187

### గర్భచతుర్థకందము.

ఖరతరకరగుఁ గరళిము, ఖరిపున్ గరధరకరతునిఁ ♦ గరధృతకరుహున్
గరిహితకరణున్ గరుహాస, ఖరుచిన్ గరుడఖగరథుని ♦ ఖరఘనకరవిఁ. 188

### గర్భపంచమకందము.

ఖరఘనకరిహితఖరతర, కరగున్ గరళిముఖరిపునిఁ ♦ గరధరకరతున్
గరధృతకరుహున్ గరిహిత, కరణున్ గరుహాసఖరుచిని ♦ గరుడఖగరథుఁ. 189

### గర్భషష్ఠకందము.

గరుడఖగరథుఁ ఖరఘన, కరవిఁ ఖరతరకరగుని ♦ గరళిముఖరిపుఁ
గరధరకరతున్ గరధృత, కరుహున్ గరిహితకరణుని ♦ గరుహాసఖరుచిఁ. 190

### గర్భసప్తమకందము.

కరుహాసఖరుచిఁ గరుడఖ, గరథుఁ ఖరఘనకరవిని ♦ ఖరతరకరగుఁ
గరళిముఖరిపున్ గరధర,కరతున్ గరధృతకరహునిఁ ♦ గరిహితకరణుఁ 191

### గర్భాష్టమకందము.

కరిహితకరణున్ గరుహాస, ఖరుచిఁ గరుడఖగరథుని ♦ ఖరఘనకరవిఁ
ఖరతరకరగుఁ గరళిము, ఖరిపున్ గరధరకరతుని ♦ గరధృతకరుహుఁ. 192

## పదప్రకాశితకందము.

క. కామెపలినామపురిను, త్రాము సరోజాప్తకోటిధాము జలధర
శ్యాము యదుసోము దనుజవి, రాము వ్రజస్త్రీమనోభిరాముఁ దలంతున్. 198

## ఆశ్వాసాంతగద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భరద్వాజగోత్ర కామెపల్లి పురమందిర నందనందన చరణారవిందవందనాభిలాషమనీషాప్రాభవ వేంకటార్యతనూభవ విద్యావిశేషసురాచార్య కాకునూర్యప్పకవివర్యవిరచితం బైనయాంధ్రశబ్దచింతామణి యనువ్యాకరణశాస్త్రంబునం దష్టాదశార్యావృత్తంబులు నష్టచత్వారింశత్సూత్రంబులుం గలసంధిపరిచ్ఛేద మను పంచమాశ్వాసము.

అప్పకవీయము సంపూర్ణము.

చెన్నపురి : వావిళ్ల ప్రెస్సున ముద్రితము.—1922.

# శుద్ధపత్త్రము.

---

| పుట. | పంక్తి. | సాధువు. | అసాధువు. |
|---|---|---|---|
| 3 | 5 | దిద్దను | డిద్దను |
| 40 | 26 | 1 దెల్లమి...దెల్ల | 1 దెల్లము...మిదెల్ల |
| 42 | 11 | 2 అది | అది |
| 51 | 1 | తులా | తలా |
| 55 | 1 | లంతస్థలు | లంతస్థులు |
| 56 | 28 | విశ్రుత | విశ్రుతి |
| 66 | 22 | టవర్గాక్షర | టవరాక్షర |
| 72 | 16 | శస్స్వ్యాత్ | శస్స్వ్యత్ |
| 86 | 5 | డేలు | డేటు |
| 96 | 10 | దెలుఁగు | దెలుగుఁ |
| 106 | 19 | షష్ఠాష్ట | షష్టాష్ఠ |
| 112 | 2 | ననిరెూఁ | నవిరెూఁ |
| 120 | 17 | హైశ్య | హైశ్న |
| 122 | 17 | మంత్ర | మత్ర |
| 146 | 11 | ర్గాంగ | దాంగ |
| 152 | 27 | 8 స్నిష్ణదర్శి | 1 స్నిష్ణదర్శి |
| 172 | 24 | వాంఛితార్థ | వాంచితార్థ |
| 179 | 7 | నిల్చి | నిచ్చి |
| 180 | 5 | దేహ...మునివిను | దేహ...మునిను |
| 190 | 29 | గూర్ప | గూర్చి |
| 191 | 27 | 4 నిశీర్య | 4 విశీర్య |
| 219 | 4 | విచికిలిత | విచికలిత |
| 220 | 11 | UUUమUగ. | UUUUవ్యగ. |
| 221 | 17 | IUIజUUగగము. | IUIUUగగము. |
| 223 | 14 | IIIసIII సI Iగ. | IIIసIIIUగ. |

| పుట. | పంక్తి. | సాధువు. | అసాధువు. |
|---|---|---|---|
| 225 | 7 | ౯-౧౨౭ | ౭-౧౨౭ |
| 226 | 21 | ౧౦-౧౨౧౯ | ౧౦-౧౨౪౧ |
| 243 | 17 | ౧౯-౧౭౬౦౪౦ | ౧౯-౩౫౬౧౪ |
| ,, | 23 | ౧౯-౬౫౩౧౪ | ౧౯-౧౭౬౫౭ |
| 247 | 8 | [1]చినవాఁడు | [8]చినవాఁడు |
| 257 | 14 | డారిం | డారిఁ |
| 264 | 13 | జలజాప్తు | కలజాప్తు |
| 268 | 2 | నెన్నిదివిభ | నెన్నివిభ |
| 280 | 13 | దేవ | దేన |
| 304 | 13 | సాగనేని | సాగకేని |
| 305 | 1 | తరువన | తరువనఁ |
| 308 | 21 | గవసినను | గవసినను |
| ,, | 30 | తెల్లమిగాఁ | తెల్లసుగాఁ |
| 316 | 6 | రప్పలు | రప్ప |
| 317 | 11 | జలరాశి | జలరాశ |
| 323 | 26 | సంహారు | సంహారు |
| 326 | 1 | జక్కు | జగ్కు |

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 0 | 8 |
| శకుంతలాపరిణయము. కృష్ణకవికృతము | ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు, అత్యుత్తమప్రతి | ... | 4 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటి కృతము | ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక,<br>నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి | ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము | ... | 2 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు | ... | 3 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు<br>సరియైనపద్యము, కవనము మిక్కిలి సొంపు, పీఠిక అతివిపులము | ... | 5 | 8 |
| మొల్ల రామాయణము, చిన్నసైజున పెద్దఅక్షరములతో ముద్రించినారము | | 0 | 10 |
| అచ్చతెనుగు రామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన<br>ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది | (అచ్చగుచున్నది) | | |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | | | 10 |
| మార్కండేయపురాణము, మారనకృతము | | | 12 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశా_గారి వ్యాఖ్యానముతో<br>చిన్నసైజున మేలుకాకితములమీఁద స్ఫుటమైన అక్షరములతో<br>చక్కఁగ ముద్రించియున్నాము | ... | | |
| వసుచరిత్రవిమర్శనము, శ్రీచిన్నసీతారామస్వామిశాస్త్రికృతము. అత్య<br>ద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు | ... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు | ... | 3 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారివ్యాఖ్యానముతో మేలు<br>కాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము... | ... | 3 | 8 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, పీఠికవిపులము | | 2 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు | | 2 | 4 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | | 2 | 8 |

# ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1-కి | రు. | అ. |
|---|---|---|---|
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు | ... | 1 | 4 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర | ... | 1 | 8 |
| హరవిలాసము | ... | 0 | 12 |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము | ... | 0 | 8 |
| నరసభూపాలీయము | ... | 0 | 10 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవిది | ... | 0 | 8 |
| రంగారాయచరిత్ర, దిట్టకవి నారాయణకవిప్రణీతము | ... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు. రామభద్ర కవికృతము | ... | 1 | 4 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| శివలీలావిలాసము, ,, | ... | 0 | 6 |
| పారిజాతాపహరణము, సాధారణప్రతి | ... | 0 | 4 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | ... | 0 | 12 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము | ... | 1 | 4 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథప్రణీతము | ... | 2 | 4 |
| హంసవింశతి, నారాయణామాత్యప్రణీతము | ... | 0 | 14 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మది, చక్కనికూర్పు | ... | 1 | 6 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 2 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 1 | 4 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక. అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము. టీక, వివరణము మిక్కిలివిపులము. ఈవఱకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది | ... | 3 | 8 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | ... | 1 | 6 |
| నృసింహపురాణము: ఎఱ్ఱాప్రెగడ, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| వైశ్యపురాణము | ... | 1 | 4 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | ... | 1 | 8 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 0 | 14 |

ఇవి మొదలగు సంస్కృతాంధ్రగ్రంథములు అనేకములు మాయొద్ద దొరకును.